# ముటగుపోపయారాధ్యుల రచన
## పేమనారాధ్య చరిత్రముపై ప్రత్యేక పరిశీలన




డాక్టర్

# మల్లుగు పాపయారాధ్యుల రచనలు

## వేమనారాధ్య చరిత్రముపై ప్రత్యేక పరిశీలనము

కాకతీయ విశ్వవిద్యాలయము వారిచే
1988 లో పిహెచ్.డి. పట్టము పొందిన సిద్ధాంత వ్యాసము


"భాషాప్రవీణ"
డా॥ గోలి వేంకటరామయ్య
M. A; Ph. D.
తెలుగు ఉపన్యాసకులు
ప్రభుత్వ డిగ్రీ కళాశాల
సదాశివ పేట – 502 291 (ఆం. ప్ర.)



ఈ గ్రంథము :
తిరుపతి తిరుమల దేవస్థానం వారి
ఆర్థిక సహకారముతో ముద్రితము

Works of Mulugu Papayaradhya with a Special reference to Vemanaradhya Charitra.
By. Dr. Goli Venkata Ramayya

సర్వస్వామ్యములు - గ్రంథకర్తవి

ప్రథమ ముద్రణము - అంగిరస - వసంతము

ప్రతులు - వేయి

ప్రతివెల - రు. 80-00




ప్రతులకు : G. లలిత
H.No. 22-108/1, సరస్వతీనగర్,
P & T Colony, (P.o)
Hyd - 660. A.P.

ముఖచిత్రము : By రవీంద్రనాథ్, B.A.
రవీంద్రఆర్ట్స్
శీసదావపేట,

ముద్రణ : శ్రీ లలి ప్రింటర్స్
జాగర్లింగంపల్లి, కాచిగూడ,
Hyd - 27.

పరమ పూజ్యులు
పితామహి గోలి రామలక్ష్మమ్మ
పితామహుడు గోలి వీరావధానులు గార్లను
స్మరించుచు

పూజ్యులైన జననీ జనకులు
శ్రీమతి గోలి అన్నపూర్ణమ్మ
శ్రీ గోలి మల్లికార్జున శాస్త్రిగార్ల
పాద పద్మముల సన్నిధికి

అంకితము

## గ్రంథ ముద్రణకు ఆర్థికముగా తోడ్పడిన మహోదరులు

1. శివశ్రీ కందుకూరి శివానందమూర్తిగారు రు. 3000-00.
2. శ్రీ A.U.R. సోమయాజులుగారు రు. 500-00
3. శివశ్రీ ముళ్ళపూడి హనుమంతరావు B.A.B.L. గారు 100-00

## వీరి సహకారమునకు నా కృతజ్ఞతలు

# ఆరాధ్య చరిత్రకు అక్షరపూజ

18-19 శతాబ్దాల కవులలో ఒక విశిష్ట గౌరవాన్ని తెలుగు సాహిత్యంలో సంపాదించుకొన్న కవి ములుగు పాపయారాధ్యులు. కవిత్వానికి పాండిత్య ప్రకర్షయే పరమ గౌరవమని భావింపబడే ఆ కాలంలో, గర్భబంధ చిత్ర కవిత్వాలను వ్రాసినవాడే మహాకవి అని పరిగణింపబడే ఆ యుగంలో సరస కవిత్వాన్ని, సరళ కవిత్వాన్ని చేపట్టి రసికహృదయాలను రంజింప జేసిన ప్రసిద్ధకవి పాపయారాధ్యులు. తిరుపతి వేంకట కవులకు ముందే ఆశుధారామధురమైన ఒక అభినవ రుచిని అందింపగలిగే తెలుగు పద్యశైలిని పాపయారాధ్యులు తెలుగు కవితకు పరిచయం చేశారు. ప్రసిద్ధ పద్యగతులను ప్రతిఫలించుకొంటున్నా ప్రసన్నమైన ఒక నవీన చాటుధార పాపయారాధ్యుని పద్యాలలో పాదరసంలాగా ప్రసరిస్తూ ఉంటుంది. అది అటు కావ్యానికీ, ఇటు పురాణానికీ, అటు శతకానికీ, ఇటు సంస్తుతికీ సమంగా, శక్తిమంతంగా సరిపడి సహృదయ హృదయ రంజకంగా ఉండేది.

పాపయారాధ్యులు నివసించిన కాలం పాండిత్య చమత్కారాలకు ప్రథమ తాంబూలం అందుతున్న కాలం. దాన్ని సారళ్యం వైపు మళ్ళించటానికి ఆ యుగ స్వభావాన్ని కొంత తన కవిత్వంలో రంగరించుకోలేక పోలేదు. కాని, చమత్కారం చమత్కారంకోసమే కాక, కవితాపారవశ్యం కోసం కూడా వాడే ఒక సహజ మార్గాన్ని పాపయారాధ్యులు తమ కవితా ధారలో ప్రపంచించారు. మచ్చుకొక పద్యం.

"తల్లికిఁ దల్లియైన తన తల్లికిఁ దాసును దల్లియు ధరస్
దల్లులకెల్లఁ దల్లియయి తల్లి! ననున్ గరుణింపు మన్నచోఁ
దల్లులు గానసీని మరుతల్లిని సజ్జన కల్పవల్లి మా
తల్లిని సన్నుతింతు జనతాఫలదస్మితమల్లి నెంతయున్.

(దేవీభాగవతము 1.5)

'మాతల్లి'తో సహజశ్లేషలాగానే చమత్కారం, సరసత్వం ఈ కవిత్వంలో నీరక్షీర న్యాయంగా కలిసి ప్రవహిస్తూ ఉంటాయి.

19 వ శతాబ్దపు కవుల కున్న విశేషాలలో ఒకటి పాపయారాధ్యులలో పరమోదారంగా ప్రకాశిస్తుంది. ఆ కాలంలో కవులు ఇహ పరాలకూ, లౌకిక పారలౌకికాలకూ సంబంధించిన వస్తువులుగల కావ్యాలను రచించి ఉభయ కావ్యప్రౌఢిని పాటించే ప్రత్యేకతను ప్రదర్శిస్తూ ఉండేవారు. పాపయారాధ్యుల వారిలో అది పతాకస్థాయిని అందుకొన్నది. దానికితోడు ఈ కవికి రెండు పేర్లున్నాయి. ఒకటి— సంగమేశ్వరారాధ్యులు; రెండు— పాపయారాధ్యులు. ఈ రెండూ ఆ కవి సాధించిన ఉభయ ప్రవృత్తులకు ఉదాహరణలుగా నిలుస్తున్నాయి. 'అహల్యా సంక్రందన విలాసం' వంటి క్షీణ ప్రబంధ యుగ స్వభావంగల కావ్యాన్ని మొదట రచించిన సంగమేశ్వరారాధ్యులు క్రమంగా రక్తినుండి ముక్తివైపు పయనం ప్రారంభించి దేవీభాగవతాన్ని రచించి 'వేదాంత సంగ్రహం దాకా ప్రస్థానాన్ని సాగించాడు.

"త్వత్కారుణ్యము దుస్సె, దస్సె పలవంతల్. చూపులోపించె, స
వ్యక్తం బయ్యె దిగంతరాళము, భవిష్యద్భ్రాంతి లూటాడె; సం
వృక్తం బయ్యెను బుద్ధిమాంద్యము, భవత్ప్రేమంబు దిక్కంటి, నీ
ముక్తిద్వారము తల్పుదీయ గదె చాముండా! జగజ్జీవనీ!"

అని అంటూ ముక్తిద్వారాన్ని తెలుగు పద్యంతో తెరిపించాడు.

పాపయారాధ్యుల వారి పద్యానికి నాలుగు పాదాలు. ఒకటి రక్తి; రెండోది- సూక్తి ; మూడోది-భక్తి; నాల్గవది - ముక్తి. ఈ నాల్గింటిని చతుర్వర్గాల్లా కవిత్వానికి నేర్పించి నడిపించిన ప్రఖ్యాతి ఈ పండిత కవికి దక్కింది.

ప్రౌఢిచెదని రక్తి పాపయారాధ్యుల పద్యజీవితం. సరసహృదయానురంజనంలో చంద్రోపాలంభం చేసే పద్యం ఈకవి రక్తి కవితకు రత్నోదాహరణం.

"ఘనపరంపరలలో గనరాని నీకెట్లు
ద్విజరాజ నామంబు తేజరిల్లె
దినదిన క్షయముచే దిగ నశించెడి నీకుఁ
జైవాతృకత్వమే దేవుఁడిచ్చె,
తమ్ములఁమీద పాదము లెత్తెడి నీకు
సత్పురుషత్వ మేచాయ నలరె;
దోషాకరత్వంబు తొలఁగఁజాలని నీకు
విషపదావాప్తి యేవిధి ఘటించె

కరగతంబైన నీదు శంబర విలాస
మదియొ మారీచ నీచ చర్యాతిశయమొ
పొంది యావిద్య యెం దభ్యసించినావొ
తెనెఁబూసిన కత్తి వైతివి మృగాంక" (3 47)

సూక్తి చెప్పలేని కవి కలకాలం జనుల నాలకులపై నిలవటం కష్టం. ప్రజలలో కవిత ప్రవహించాలంటే కవి ప్రతిభలో సూక్తి నైపుణ్యం ప్రకాశించే ప్రజ్ఞ తప్పకుండా ప్రకాశించాలి. పాపయారాధ్యుల వాక్కుకు సూక్తి సహజసంపద. సూక్తిని కవితలో ప్రదర్శించే కవులలో కొందరు సారళ్యానికి ప్రాముఖ్య మిస్తారు. మరికొందరు చమత్కారానికి పట్టం కడతారు; మరికొందరు అర్థసంపదను అలంకరించి ప్రదర్శిస్తారు. ఈమూడింటిలో పాపయారాధ్యులవారు మొదటిపద్ధతిలో ముందు నిలుస్తారు. దేవీభాగవతంలో వ్యాసుడు శుకునికి గార్హస్థ్య ధర్మప్రాశస్త్యాన్ని గురించి చెపుతూ భార్యకరగ్రహణాన్ని సూక్తిమధురంగా ప్రతిపాదించినట్లు పాపయారాధ్యులు రచించారు.

"బందీ భవనము గాదిది
సందీని సుఖంబు నెలవు జాయాగ్రహణం
బెందేని భోగసిద్ధుల
కందిన సత్కామధేను వట్టిదిగాదే!" (దే.భా. 1. 604)

పాపయరాధ్యులు భార్యపట్ల చెప్పిన ఈ సూక్తిని తనకవిత్వం పట్ల

కూడా ప్రదర్శించి చూపారు. కవిత ఆయనకు కామధేనువు, అటు భోగ కావ్యాలకూ, ఇటు మోక్షసిద్ధి కావ్యాలకూ ఉభయతారకంగా ఉపయోగించింది.

తెలుగులో భక్తి కవిత్వం వ్రాసే కవులు ఒక రచనా రహస్యాన్ని తెలిసికొని ఉండాలి. నవవిధభక్తి మార్గాలను గానీ, పంచవిధ మార్గాలను గానీ ప్రదర్శిస్తున్నప్పుడు భక్తచిత్తవృత్తిని, భక్తి ప్రవృత్తిని గమనించి సజాతీయమైన రచనా శిల్పాన్ని సంపాదింపగలిగి ఉండాలి. అప్పుడు రససిద్ధి కలుగుతుంది. కొందరు కవులు ఒకే శైలిలో అవస్థలనన్నింటిని ప్రదర్శిస్తారు; మరికొందరు అవస్థకు అనుగుణమైన పద్యరచనా శిల్పాన్ని ప్రపంచిస్తారు. పాపయారాధ్యులు రెండవపద్ధతిని ప్రదర్శించి తన ప్రత్యేకతను నిలుపుకొన్నాడు. ఉదాహరణకు ఒకటి రెండు పద్యాలు.

ఆర్తితో శరణువేడుతున్న భక్తచిత్తవృత్తికి—

అమ్మా! మ్రొక్కెద నీ పదంబులకు సర్వార్థంబు లీ(జాలునీ
వమ్మాయన్ బెడ(బాపి జ్ఞాన మిడవమ్మా! దీన సంరక్షణం
బిమ్మై(జేయక తీరదమ్మ వినతోపేక్షల్ భవద్దృష్టి లే
వమ్మా! నమ్మితినమ్మ! కావవలెనమ్మా! నెమ్మదిన్ శాంకరీ!

దేవీభాగవతము. 3-103

శ్రీనాథ మహాకవిలాగా పాపయారాధ్యుల భక్తి కవితలో భాషా ప్రయోగాలు చేశారు. సంస్కృత భాషలో సీసపద్యం వ్రాయటం అటువంటి వాటిలో ఒకటి. ఇందులో భక్తి ఎంత ఉంటుందో ప్రయోగాసక్తికూడా అంత కలిసి ఉంటుంది.

"రాజే, పరస్మై, విరాజే, గిరీశాయ,
శాంతాయ కపదినే శాంతిదాయ
విష్ణవే, బ్రహ్మణే, విభవే, తపస్వినే,
దిగ్వాససేచ, నందిధ్వజాయ
పురుషాయ, మౌనయే, స్మరహరాయోగ్రాయ
పశుపతయేఽజాయ, పాశహాయ
భీమాయ, రుద్రాయ, పృథవే, మహేశాయ
చేశే, మనోభువేఽభీష్టదాయ

పాలినే, శూలినే, భక్తపాయ, భూత
పాయ, గిరిధన్వినే ఉగ్రాయ వర్మిణేచ
రూధినే ధృష్టవే అంతాయ వేధసేచ
త్రిపుర సంహారిణే, దేవ! తే నమో ఒస్తు"

(వేమనారాధ్య చరిత్రము-270)

భక్తి కవితలో ఆయుస్సూత్రంగా కనిపించే ఆర్తి, భగవద్రతి క్రమంగా జ్ఞానమగ్నమై నిర్వేదంగా, తత్త్వజిజ్ఞాసగా, ఆత్మరతిగా మారితే ఈ చివరి మెట్టుకు చేరుకొన్న ధన్యులుగా గోచరిస్తున్నారు. చాముండాస్తవము, భ్రామరీ స్తవము మొదలైన రచనలు చేసినప్పుడు ఆరాధ్యులవారి చిత్తపరిపాకం పరమార్థాన్ని పరామర్శించింది.

"అస్థూలాల్పకుటీ నిభంబగుచు మేనా స్రమమై చంచలా
వస్థాపన్నతనొంది, కుంది, చరమావస్థోచితం బయ్యె, న
మ్మా! స్థాపత్యుఁద నౌదుఁజేర్చుకొనుమమ్మా! రాఁగదమ్మా! మహా
ప్రస్థానావసరంబు డాసె దరిఁజేర్పన్ నీవె సూ, భ్రామరీ!"

పురుషార్థ చతుష్టయాన్ని పూర్ణంగా సాధించిన పూర్ణపురుషుడుగా గోచరిస్తాడు పాపయారాధ్యులు, పురుషార్థప్రవృత్తికి తగిన పద్యరచనా శిల్పాన్ని ప్రదర్శించిన ప్రజ్ఞావంతుడు పాపయారాధ్యులు. అందువల్లనే పందొమ్మిదవ శతాబ్ది కవులలో ఒక పరిపూర్ణతను స్వీయజీవితానికి, స్వీయ కవితా జీవితానికి కల్పించుకొన్న ఘనత ఆయనకు దక్కింది.

ఏ కవి అయినా తాను రచించిన కావ్యాలను, అందులోని కవితా విశేషాలతో కలిపి చెపుతున్నప్పుడు మనం శ్రద్ధతో గమనించాలి. ఉదాహరణకు శ్రీకృష్ణ దేవరాయలవారు ఆముక్తమాల్యదలోని అవతారికలో ఆంధ్ర విష్ణువు అన్నట్లుగా తన సంస్కృత కృతులను గురించి ఇలా వ్రాసుకొన్నాడు.

"పలికి తుత్ప్రేక్షోపమలు జాతి పెంపెక్క
రసికులౌనన మదాలస చరిత్ర
భావధ్వని వ్యంగ్య సేవధిగాఁగఁ జె
ప్పితిని సత్యావధూ ప్రీణనంబు

శ్రుతి పురాణోపసంహిత లేర్చి కూర్చితి
సకల కథాసార సంగ్రహంబు
శ్రోత్రపుచ్చటలు విచ్చగ రచించితి సూక్తి
నైషధీ జ్ఞానచింతామణి కృతి

మఱియు రసమంజరీ ముఖ్య మధురకావ్య
రచన మెప్పించికొంటి గీర్వాణ భాష
నంధ్రభాష యసాధ్యంబె యందు నాకు
కృతి వినిర్మింపు మిఁక మాకు బ్రియముగాఁగ." (అము. 1-13)

ఈ పద్యంలో పేర్కొన్న సంస్కృత కృతులలో ఒక్కొక్కటి ఒక్కొక రకమైన రచనకు ప్రసిద్ధి చెంది ఉన్నట్లు చెప్పబడి ఉంది. తెలుగు కావ్యంలో ఈ కావ్యాలన్నింటిలో కనపడే కవితా విశేషాలన్నీ కలిసి ఉంటా యని చెప్పక చెప్పినట్లయింది. అలాగే పాపయారాధ్యులు కూడా వేమనారాధ్య చరిత్రలో ఒక సీసపద్యం వ్రాసుకొన్నాడు.

"పదపదార్థ నిబంధ బంధురతబుగ ధరా
తల మెల్ల నెఱుఁగ 'శంతను చరిత్ర'
సరస శృంగారాను షంగముల్ రవణిఁజూ
పఁగ 'నహల్యావధూ వరిణయంబు'
ధీమజ్జనస్తవ్య ధీమజ్జనోన్మేష
కరముగా నలరు ఘూర్జర చరిత్ర'
లసదలంకార లాలన విశంకటముగాఁ
బరగు 'నింద్రాత్మజా పరిణయంబు'

శతక పూజాస్తవంబు లసంఖ్య సంఖ్య
మీర నీవు పొసంగించు మేలికావ్య
రచన మా కెల్ల సమ్మదార్ద్రితఁ బొనర్చె
సరసరుచిసాంద్ర! సంగమేశ్వర కవీంద్ర" (1.25)

ఈ పద్యంలో సూచింపబడిన పూర్వరచనాగుణాలన్నీ వేమనారాధ్య చరిత్రలో ప్రతిఫలిస్తున్నాయని కవి వ్యంగ్యంగా వ్యక్తంచేస్తున్నాడన్న మాట!

వేమనారాధ్య చరిత్రం పాపయారాధ్యుని రచనల్లో ఒక మైలురాయి' అహల్యా వధూ పరిణయం, ఇంద్రాత్మజా పరిణయం, శంతను చరిత్ర, ఘూర్జర చరిత్ర మొదలైన శృంగార కావ్యాలు ఒకయెత్తు; వేమనారాధ్య చరిత్రం మరియొక యెత్తు; దేవీభాగవతం, స్తుతులు మరొకయెత్తు, వేమనారాధ్య చరిత్ర పండితారాధ్య చరిత్ర లాంటిది ధర్మపీఠం దానిలోని అంగిరసమని డాక్టర్ గోలి వేంకట రామయ్యగారు చెపుతున్నారు. దేవీభాగవతాదులు భక్తి శాంతి రసాలకు ఆలవాలాలు. ప్రవృత్తి నుండి నివృత్తికి పరిణామం చెందుతున్న పాపయారాధ్యుల కవితా ప్రస్థానంలో వేమనారాధ్య చరిత్రము ఒక కీలకపాత్రను నిర్వహిస్తున్నది.

మల్లికార్జున పండితారాధ్యుని లాగా వేమనారాధ్యులు ఒక మహా పండితుడు ఆరాధ్య సంప్రదాయానికి అయువుపట్టుగా నిలిచిన మహాజ్ఞాని, ఆయన జీవిత చరిత్రం ఒక విలక్షణ కావ్యం. ఇటువంటి కావ్యాలను చరిత్ర కావ్యాలని పిలువ వచ్చుననీ, కన్నడ సాహిత్య ప్రక్రియలలో నుండి గ్రహించి తొలిసారి పాల్కురికి సోమనాథుడు తెలుగులో వినిర్మించాడనీ నేను ఇదివరలో వివరించి ఉన్నాను. (చూడండి : సాహిత్య చరిత్రలో చర్చనీయాంశాలు - జి. వి సుబ్రహ్మణ్యం - తెలుగు అకాడమీ ప్రచురణ - 1991. పుట - 36-39) వేమనారాధ్య చరిత్ర ఆకావ్యప్రక్రియకు సంబంధించింది ఆలక్షణాలను అన్వయించుకొందే పంథొమ్మిదవ శతాబ్దపు కావ్యరచనలలో దాని ప్రత్యేకత తెలుస్తుంది. చరిత్రకావ్యరచనా వికాసానికి పాపయారాధ్యులు తోడ్పడిన పద్దతి స్పష్టమౌతుంది. ఆరాధ్య వంశానికి అజరామరమైన కీర్తిని తెచ్చిపెట్టే కావ్యం వేమనారాధ్య చరిత్రం.

పాపయారాధ్యుల రచనలో చరిత్రకావ్యంగా గుర్తింపదగింది వేమనారాధ్య చరిత్రమే, ప్రక్రియలోనూ, ప్రవృత్తిలోనూ, ప్రయోగంలోనూ

తనదైన ప్రత్యేకతను సాధించుకొన్న ఈ కావ్యాన్ని గురించి ప్రత్యేకంగా పరిశోధించటానికి పూనుకొన్న మిత్రులు డాక్టర్ గోలి వేంకటరామయ్యగారు అభినందనీయులు. వీరు సంస్కృతాంధ్ర భాషలలో పండితులు. శాస్త్ర వ్యుత్పత్తి కలవారు, కవితా ప్రవృత్తి కలవారు; సంస్కృత సాహిత్యా చార్యులు; ఆంధ్రోపన్యాసకులు. వక్తలు, పరిశోధకులు, ఇట్టి పండితలక్షణాలుండ బట్టి పండిత చరిత్రనే పరిశోధనాంశంగా ఎన్నుకొన్నారు. అభిరుచికి తగిన పరిశోధనాంశం లభించటం వీరి అదృష్టం.

ఒక ప్రసిద్ధ కవి రచనలను గురించి గాని, వాటిలో ఒక ప్రత్యేక రచనను గురించి గాని పరిశోధన చేసేవారు సామాన్యంగా రెండుమూడు మార్గాలను ఎన్నుకొంటూ ఉంటారు. వాటినే టూకీగా చెప్పాలంటే-

(1) వివరణ మార్గం
(2) విశ్లేషణ మార్గం
(3) వివేచన మార్గం
(4) తత్త్వ నిరూపణ మార్గం
(5) సాహిత్యానుశీలన మార్గం

ఎన్నుకొన్న పరిశోధనాంశానికి సంబంధించిన విషయాలన్నింటినీ సేకరించి సిద్ధాంత వ్యాసాన్ని విజ్ఞానకోశంగా సంతరించే పద్ధతి వివరణ మార్గం, సేకరించిన అంశాలన్నింటిని ఒక సూత్రాన్ని అనుసరించి విశ్లేషించే పద్ధతికి ప్రాధాన్య మిచ్చేది విశ్లేషణ మార్గం, సజాతీయ విజాతీయ ప్రయోగాల తులనాత్మక పరిశీలనంతో పరిశోధనాంశాన్ని నిగ్గుతేల్చే పద్ధతి వివేచన మార్గం. పరిశోధనాంశంలోని వివిధాంగాలకు ఒక సమన్వయాన్నీ, తాత్త్విక దర్శనాన్ని సమకూర్చ గలిగినది తత్త్వ నిరూపణ మార్గం; సాహిత్య ప్రయోగంగా సర్వాంగపరిశీలనం చేసి విలువ కట్టే విధానం సాహిత్యానుశీలనమార్గం, ఈ మార్గ పంచకంలో డాక్టర్ గోలి వేంకట రామయ్యగారు మొదటిమార్గం ఎన్నుకొన్నారు. ఆ దృష్టితో చూస్తే ఈ సిద్ధాంతం సిద్ధాన్నంలాగా ఉంటుంది.

అయిదు ప్రకరణాల ఈ సిద్ధాంత వ్యాసం ఏ ప్రకరణానికి ఆ ప్రకరణం స్వయంసమగ్రంగా, విషయపుష్కలంగా ఉంటుంది. మొదటి ప్రకరణం కవిజీవిత విశేషాలు చెపుతుంది. అయితే అవిశేషాలతో నుండి మనం ఆయాకావ్యాలు వ్రాయటానికి తోడ్పడిన సన్నివేశాలను సంవిధానం చేసుకోవాలి. కొన్ని సూచనలు ఆయా ప్రకరణాలలో ఉన్నాయి. వాటిని అతికి చూచుకోవాలి. వివరణం వివేచన కంటె విజ్ఞానాన్ని ఎక్కువగా వరిస్తుంది 'శైవము - శివాద్వైత సిద్ధాంతము' అనే ద్వితీయ ప్రకరణంలో ఎన్నో వివరాలు మనకు తెలుస్తాయి. నిజానికిది శైవవిజ్ఞాన భాండారంలా మనకు సంతృప్తిని కలిగిస్తుంది. కాని, ఆభాండారం వేమనారాధ్య చరిత్రలో ఎలా నిక్షిప్తం చేయబడిందన్న విషయం మనకు వెంటనే చూపించదు. మనం వెదుక్కుంటే కొంత కనబడుతుంది. వివరణ పద్ధతిలో ఉన్న విశేషం అదే.

ములుగు పాపయారాధ్యుల రచనలపై సమీక్ష మూడవ ప్రకరణం. వస్తువు విస్తృతం అయ్యేసరికి పరిశీలన పరిమితమై పోతుంది. అయినా, డాక్టర్ గోలి వేంకటరామయ్యగారు ఆయా రచనలను గురించి తెలియదగిన ప్రధానాంశాల నన్నింటినీ క్రోడీకరించి ఒకచోట చేర్చారు. అందువలన పఠితకు ఆరాధ్యుల వారి రచనలను గురించిన విషయ సర్వస్వం అందుబాటులో ఉంచబడింది.

వేమనారాధ్య చరిత్రమీద విశేషకృషి చేయటం పరిశోధన పరమార్థం కాబట్టి రెండు ప్రకరణాలు అందుకు రచయిత కేటాయించి, ఔచిత్యం పాటించాడు. సర్వాంశ వివరణం ప్రకరణ జీవితం. మొత్తంమీద ఎన్నుకొన్న అంశానికి న్యాయం జరిగిందన్న సంతృప్తి సహృదయులకు కలిగేటట్లు సిద్ధాంత వ్యాసం నిర్మింపబడటం అభినందనీయం.

మిత్రులు డాక్టర్ గోలి వేంకటరామయ్యగారు సాహిత్యాంశాన్ని ఎన్నుకొన్నా తర్కసహమైన ఆలోచనతో రచన చేశారు. ఆధారంలేనిదే ఏ విషయాన్ని అధికారికంగా చెప్పరు; ఆకరం చూపించకుండా ఏ సత్యాన్ని ఊరక విడువరు. సూటిగా, స్పష్టంగా చెప్పటం వారి వాక్కుకు సహజాలంకారం, అది పరిశోధనకు కావలసిన ఆయుధం.

ఆ ప్రమిత్రులు ఆచార్య మాదిరాజు రంగారావుగారి పర్యవేక్షణలో సాగిన ఈ పరిశోధన, స్వయంగా సంస్కృతాంధ్రభాషా కోవిదులైన డాక్టర్ గోలి వేంకటరామయ్యగారు రచించిన ఈ రచన ప్రశంసనీయం కావటంలో ఆశ్చర్యం లేదు. అయితే, ఆ ప్రశంసకు నాకు అవకాశం కలిగించినందుకు డాక్టర్ వేంకటరామయ్యగారికి కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను. ఈ పరిశోధనకు మంచిగుర్తింపు రావాలని ఆశిస్తున్నాను. ఒక్క మాటలో చెప్పాలంటే ఇది ఆరాధ్య చరిత్రకు అక్షరపూజ!

హైదరాబాదు
14-5-1992

—జి వి. సుబ్రహ్మణ్యం

Dr. G V. Subrahmanyam
Profesor of Telugu & Dean
School of Humanities
University, of Hyderabad
Central University (P.o)
Hyderabad - 500134
Phone : 663275

# అభినందన

ఈనాడు పరిశోధకులు రెండు విధాలు. ఒక విధం సంప్రదాయ నిరతితో పాండిత్య బలంతో సాహిత్యాన్ని పరిశీలించేవారు. మరో విధం హేతు దృష్టితో ఆధునిక భావనతో సమాలోచన చేసేవారు. ఈ పరిశోధకుల్లో శ్రీ గోలి వేంకటరామయ్య గారు మొదటి కోవకు చెందినవారు. ఏ కాలంలో నైనా మొదటిది అంతశ్శక్తికి కారణభూతమైంది. వ్యక్తిత్వంలో బీజ భూత మైంది. ఇది లేకుండా దేనికి సంపూర్ణత సిద్ధించదు. ఇది లేకపోతే ఏదో కొఱత! ఏదో వెలితి! ఏదో శూన్యత్వం అనిపిస్తుంది.

శ్రీ ములుగు పాపయారాధ్యుల రచనలపై ఈ పరిశోధనా గ్రంథం సంప్రదాయ నిష్ఠతో తాత్త్వికమైన తేజస్సును దర్శించే ప్రయత్న ఫలం. పరిశోధన కవసరమైన ఇతరములన్నీ అనుషంగికాలు, శరీర పుష్టిని కలిగించేవి, ఆధార బలాన్ని సంతరింపజేసేవి. శివాద్వైత్వం భారతీయ సాహిత్య ధారలో ఎంతో ప్రశస్తిని పొందింది. కాళిదాసు శివాద్వైతి. తెలుగులో ఈ ధార సాహిత్యాన్ని ప్రేయోపార్శ్వంతో పాటు శ్రేయో పార్శ్వాన్ని ఎంతో ఉదాత్తంగా తీర్చింది. తత్త్వ ప్రపంచం తెలుగు సాహిత్యాన్ని నిత్యమైన దీప్తితో ప్రకాశమానం చేసిన మాట వాస్తవం. దీన్ని ఆవిష్కరించే ప్రయత్నం ఈ పరిశోధనా గ్రంథంలో జరిగింది. ఇంకా పరిశోధన కవసరమైన వస్తు సేకరణం. విశ్లేషణం, వివరణం మొదలైనవి పరిశోధనలో అపరిహరణీయాలు, శ్రమాకలితమైనవీ సమర్థవంతంగా నిర్వహింపబడినాయి.

ఈ పరిశోధకులు కేవలం పరిశోధనా విద్యార్థిగానే కాక, జీవితంలో ఈ నిత్యమైన దీప్తితో సుస్నిగ్ధులు కావడంతో పరిశోధన కేవలం అభిలాషా పరిమితం మాత్రమే కాక, అందు తత్పరతా గాఢత్వం కూడా సిద్ధించింది. ఈ రెండు మాటలతో పరిశోధకులను అభినందిస్తూ

—మాదిరాజు రంగారావు
ప్రొఫెసర్, తెలుగువిభాగము
కాకతీయ విశ్వవిద్యాలయము
వరంగల్ 506009 (ఆం ప్ర)

# శివాగమము

ప్రొఫెసర్ ముదిగొండ శివప్రసాద్ ఎం.ఏ.;పి.హెచ్.డి.
2-2-647/132-B, సెంట్రల్ ఎక్సైజ్ కాలనీ.
హైదరాబాద్ - 500014.

"శివస్య ఇదం శైవం" మంగళ కరునికి చెందిన మతము శైవము. ఇది అనాదిసిద్ధము. శివుడు వేద ప్రతిపాదితుడైన దైవము. కొలంబసు అమెరికాను కనుగొనక పూర్వము కొన్ని వేల సంవత్సరములకు ముందే శివోపాసన అక్కడ కలదనుట చారిత్రక సత్యము. రష్యాలోని అజార్ బైజాన్‌లో గాంధార శిల్ప శైలిలోని శివాలయము, నందీశ్వరుడు, నేటికిని అట్లేయుండుట ప్రత్యక్ష సత్యము.

బ్రహ్మశ్రీ గోలి వేంకటరామయ్యగారు మాన్యులు - అసామాన్యులు - అసాధారణ పరిశ్రమతో 'ములుగు పాపయారాధ్యుల వారి జీవితము - రచనలు' అను అంశముపై పరిశోధన చేసి, పిహెచ్‌డి పట్టమును పొందినారు. ఆ సిద్ధాంత వ్యాసము యొక్క ముద్రిత గ్రంథమే ఈ రూపముగా ఫలవంత మైనది. ఇందు వారు పాపయారాధ్యులవారి జీవితము కవితా వైభవములను పరిశోధించి, విశ్లేషించుటతో బాటు శైవము యొక్క ప్రాచీనత - శైవములోని అవాంతర భేదములు వంటి అంశముల నెన్నింటినో సప్రమాణముగా వివరించినారు. ఆరాధ్య శైవ సంప్రదాయములో జన్మించిన వారికికూడా తెలియని అంశములను శ్రీ గోలి వారు సునాయాసముగా కరతలామలకముగా పాఠకులకు అందించినారు. గోలివారుకదా; కావుననే ఈ రచనము వారికొక కందుక క్రీడవలె సాగినది.

పాల్కురికి సోమనాథుడు రచించిన గ్రంథములలో ప్రముఖమైనవి బసవ పురాణము, పండితారాధ్య చరిత్రము. ఈ రెండును రెండు సంప్రదాయ ములకు ప్రాతినిధ్యం వహించినవి. బసవేశ్వరుడు నూతన వీరశైవ మార్గము నందధి లింగాయత ధర్మమును ప్రాదుర్భావింపజేసినవాడు, మల్లికార్జున పండితా

రాధ్యుడు శ్రౌతశైవ మార్గానుయాయి. మొదటివి వర్ణాశ్రమ నియమ విరహితము. రెండవది సహితము, మొదటిది పంచాక్షరినే ప్రమాణముగా గైకొనినది. రెండవది గాయత్రిని కూడా స్వీకరించినది శివ శ్రీ ములుగు పాపయారాధ్యుల వారు నూటికి నూట ఏబది సంవత్సరములకు పూర్వము ఆంధ్ర దేశములో శ్రౌత శైవ - ఆరాధ్య - సంప్రదాయములో జన్మించిన మహామహిమాన్వితులైన శివయోగి. 'ముక్తి ద్వారము తల్పు తీయగదె చాముండా జగజ్జీవనీ' అని వారు రచించిన శతక పద్యములు నేటికిని తెలంగాణమున, ఆంధ్రప్రాంతమున శైవజనుల నాలుకలపై నిత్యమునడయాడుచుండుట నేనెఱుంగుదును

ద్వాదశారాధ్యులలో వేమనారాధ్యులవారు సుప్రసిద్ధులు. వారి జీవితమును రసవంతమైన కావ్యముగా పాపయారాధ్యులవారు తీర్చిదిద్దిరి. ఇందు దార్శనిక విషయమున కెంత ప్రాధాన్యము గలదో కవితాంశమునకును అంతే ప్రాముఖ్యము గలదు. ఇట్టి రసవంతమైన రచనపై ఇంతవరకును పరిశోధన జరుగలేదు. శ్రీ గోలి వేంకటరామయ్య గారే ఈ మహాయజ్ఞమును నిర్వహించి అవభృథ స్నానమును చేసినారు.

పాపయారాధ్యులవారు "సమయారాధ్యుడు పుష్కరాశ్రితతటిస్ సం ...తుడై" (సర. హృదం-3-209-173 పుట) అని చేసిన వర్ణనము ధూర్జటి కాళహస్తి మాహాత్మ్యములోని "ఉదయ గ్రావము పానవట్టము" వంటి ప్రాబంధిక వర్ణనములను స్ఫురింపజేయుచున్నది. పందొమ్మిదవ శతాబ్దమును క్షీణయుగముగా చిత్రించిన సాహిత్యచరిత్రకారులు ఇట్టి గ్రంథములను చూచి తమ దృక్పథమును మార్చుకొనవలసి యున్నది.

ఐదు ప్రకరణములతో శివుని పంచముఖములుగా విస్తరించిన ఈ పరిశోధనా వ్యాసము శ్రీ గోలి వెంకటరామయ్యగారి పరిశోధక మేధకు నికషోపలము. తెలుగు సాహితీ వైభవమునకు గగన హర్మ్యము-శైవ దర్శనమునకు ఆగమతుల్యము. వారి శివ సంకల్పమున పాపయారాధ్యులవారే ఆవహించి ఈరచన చేయించినాదని పించును వారికి సమస్త సన్మంగళములును కలుగుగాక!

# కృతజ్ఞతలు

నా పరిశోధనా కృషికి పారిజాతమై, చలువనీడలను సంతరింపజేసిన మహిత మందారము కాకతీయ విశ్వవిద్యాలయము.

నా పరిశోధనా వ్యాసంగమునకు విశ్వవిద్యాలయమున ప్రవేశము కల్పించిన డీన్ మహోదయులు ప్రొఫెసర్. యస్. లక్ష్మణమూర్తిగారు-

మొట్టమొదట తమ పర్యవేక్షణలో నా సాహిత్య పరిశోధనకు మార్గ దర్శకులైనవారు ప్రొఫెసర్ అమరేశం రాజేశ్వరశర్మగారు-

ప్రొఫెసర్ రాజేశ్వరశర్మగారు బదిలీకాగా నా పరిశోధన కృషిని పర్యవేక్షించుటకు తమ ఆమోద ప్రమోదములను దెలిపి, సంతత సునిశిత పరిశీలనముతో చక్కని పర్యవేక్షణములను ప్రసరింపజేసి, నా సాహిత్య పరిశోధనకు ఒక సమగ్ర రూపమును సమకూర్చినవారు ప్రొఫెసర్ మాదిరాజు రంగారావుగారు-

సముచిత సూచనలతో, సమయోచితముగా తోడ్పడిన డీన్ మహోదయులు ప్రొఫెసర్ కోవెల సుప్రసన్నాచార్యులవారు-

విశ్వవిద్యాలయ తెలుగువిభాగం-అధ్యక్షులుగా తమ యమూల్యములైన అభిప్రాయములను అందించి నన్ను ముందుకు నడిపించినవారు కీ॥ శే॥ ప్రొఫెసర్ కేతవరపు రామకోటి శాస్త్రిగారు-

నా పరిశోధన నిరంతరాయముగా కొనసాగుటకు పెక్కు విధముల సహకరించిన మహోదయులు కాకతీయ విశ్వ విద్యాలయ-అధికారులు-

"ఆరాధ్య చరిత్రము-అక్షరపూజ" అనుశీర్షికతో సాదరముగా తమ అమూల్యాభిప్రాయములను ప్రకటించినవారు ప్రొఫెసర్ డా॥ జి.వి. సుబ్రహ్మణ్యంగారు, శివాగమమును అందించిన వారు ప్రొఫెసర్ డా॥ ముదిగొండ శివప్రసాద్ గారు, అభినందనలు పలికిన వారు ప్రొఫెసర్ డా॥ మాదిరాజు రంగారావుగారు ఈ అందరికిని నా ప్రత్యేక కృతజ్ఞతలు.

నాలో పరిశోధనా కుతూహలమును ప్రోదిచేసి, ప్రత్యక్షముగా, పరోక్షముగా, ఉత్సాహ ప్రోత్సాహములను, అందించి, నాకు మనోబలమును చేకూర్చిన మిత్రులు నా శ్రేయోభిలాషులు-

శ్రీ బండారు సదాశివరావుగారు
శ్రీ డా॥ హరి శివకుమార (రీడర్) గారు
శ్రీ పి.వి. సత్యనారాయణ (ప్రిన్సిపల్) గారు
శ్రీ యస్. మదనమోహన్‌శర్మ (R J D కడప) గారు
శ్రీ యస్. రాములుగారు
శ్రీ డా॥ C. రామచంద్రప్రభుగారు,
శ్రీ బి. బాలయ్యగారు
శ్రీ దోర్బల విశ్వనాథశర్మగారు
శ్రీ డా॥ టి. రామకృష్ణమూర్తిగారు
శ్రీ సి. విజయరాఘవాచార్యుల వారు,
శ్రీ ఎల్. రాఘవరావుగారు
శ్రీ పంతంగి శివరామశర్మగారు
శ్రీ వెలుదండ రామేశ్వరరావుగారు
శివశ్రీ నిర్మల శంకర శాస్త్రిగారు
శివశ్రీ ముదిగొండ శంకర శాస్త్రిగారు
శివశ్రీ చాగంటి భాస్కరలింగ శాస్త్రిగారు,
శివశ్రీ శివదేవుని వీరభద్రయ్యగారు,
శివశ్రీ పులి పాక కేదారలింగంగారు
శివశ్రీ కొడిమెల రాజయ్యగారు
శివశ్రీ ముదిగొండ కొండయ్య ఆరాధ్యులవారు
శ్రీ కుప్పా దక్షిణామూర్తిగారు

ఈ పెద్దలందరికిని నా ధన్యవాదములు.

మద్రాసు ప్రభుత్వ ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారము వారికిని హైదరాబాదు, శ్రీ భావనారాయణ స్వామి గ్రంథాలయ అధికారులు శ్రీ పి వి. అప్పారావుగారికిని, నన్ను ధారావాదకు ఆహ్వానించి, సాదరముగా సహాయపడిన,

ధ్వారాడ కర్ణాటక విశ్వవిద్యాలయ, కన్నడ పీఠాధ్యక్షులు ప్రొఫెసర్ యస్.యం. వృషభేంద్రస్వామి వారికిని నా ప్రత్యేక ధన్యవాదములు

వేమనారాధ్య చరిత్ర వ్రాతప్రతిని తయారు చేయుటలో సహాయపడిన చిరంజీవి వి సత్యనారాయణకును చి. వి. నిత్యానందమునకును, నా శుభా కాంక్షలు.

పరిశోధనకు ఆర్థిక సహకారమిచ్చిన విశ్వవిద్యాలయముల గ్రాంట్స్ కమీషన్ (యు. జి. సి.) ఢిల్లీ అధికారులకు నా కృతజ్ఞతలు.

గ్రంథముద్రణకు ఆర్థికముగా తోడ్పడిన తిరుమల, తిరుపతి దేవస్థానం వారికిని, తెలుగు విశ్వవిద్యాలయము వారికిని, నా కృతజ్ఞతలు.

ముచ్చట గొల్పునట్లుగా ముఖచిత్రమును చిత్రించి యిచ్చిన చిరంజీవి రవీంద్రనాథ్‌కు నా శుభాకాంక్షలు.

గ్రంథమును అందముగా సకాలములో ముద్రించి యిచ్చిన "శబరి ప్రింటర్సు" వారికి నా ధన్యవాదములు.

తమ ఆశీస్సులతో నన్ను ముందుకు నడిపించిన శ్రీ గోలి రాజేశ్వర శర్మ అన్నగారికి నా కృతజ్ఞతాంజలి

ఎల్లవేళల, అన్ని విధములనాకు సహకరించిన మా శ్రీమతి లలితకు, మా కుమారుడు డా॥ రామమోహన్ M D (Phd.)కిని కోడలు శ్రీమతి వేంకట ధనలక్ష్మికిని, మా కుమారుడు చి॥ అరవిందనాథ్ M.Tecకును, కోడలు శ్రీమతి వేంకట శైలజకును, అల్లుడుగారు శ్రీ బి. కుటుంబశాస్త్రిM E గారికిని, మా కూతురు శ్రీమతి డా॥ శారద B A.M.S కును, చి॥ శ్యామ్ కును, చి॥ శ్రీవాణికిని, చి॥ రఘువీరకును, చి॥ ఉషశ్రీకిని, చి॥ వేంకట గిరిధర్‌కును నా ఆశీస్సులు, శుభాకాంక్షలు.

అంగిరస - వసంతము

1992 - మే -

గోలి వేంకటరామయ్య

శ్రీవాణీగిరిజా నిలయము

ఇ. నెం. 22-108-1, సరస్వతీనగర్,

P & T. కాలనీ (P.o.)

Hyd - 660 - (ఆం. ప్ర.)

# విషయసూచిక

## ప్రథమ ప్రకరణము



## రెండవ ప్రకరణము

## మూడవ ప్రకరణము



## నాల్గవ ప్రకరణము

## ఐదవ ప్రకరణము

# మొదటి ప్రకరణము

"కవిః కరోతి కావ్యాని
రసం జానాతి పండితః"

కావ్య నిర్మాణము చేయువాడు కవి. తద్రసానుభూతినందుచు ఆనం
దించువాడు సహృదయుడు.

అటు కవి లోకమునకును - ఇటు సహృదయ సమాజమునకును సేతు
వుగా వ్యవహరించువాడు విమర్శకుడు.

ఈ విమర్శకుని పాత్ర చాల సున్నితమైనది. సునిశితమైనది. బహు
ముఖమైనది.

కవి స్వతంత్రుడు. వస్తువు నెన్నుకొనుటలో గాని, ఒకవేళ నతడు
పురాగాథనే స్వీకరించినను, స్వీయాభిరుచుల ననుసరించి, దానికి కాలానుగుణ
ములైన మార్పులను చేర్పులను చేయుటలో గాని, వాని స్వాతంత్ర్యము కాదన
లేనిది.

కేవలము ఒక్క వస్తు సంవిధానమునందే గాక రచనా విధానము
నందును, భాషా ప్రయోగముల యందును, ఛందో వైవిధ్యములను ప్రవేశ
పెట్టుటలోను, ఆలంకారిక రీతులను ప్రసరింపజేయుటలోను, పాత్ర చిత్రణము
నందును, రస పరిపోషణముల యందును 'సర్వదా సర్వథా కవికి గల
స్వేచ్ఛ తిరుగులేనిది. ''నిరంకుశాః కవయః'' అనునది ఈ కవి స్వేచ్ఛకు
ప్రతీరిగా అద్దము పట్టుచున్న చక్కని నానుడి.

ఇట్టి స్థితిలో ఇక విమర్శకుని పాత్రను గూర్చి ఆలోచింతము. విమ
ర్శకుడు ముందుగా కవి యెన్నుకొనిన వస్తు స్వరూపమును గమనింపవలెను.

అది పురాణ గాథయైనచో అందు దొరలిన మార్పులను చేర్పులను ఎఱుంగ వలయును. ఆ వస్తు సంవిధానమును సమగ్ర రీతిలో సమీక్షింపవలెను. భాషా విశేషముల నరయ వలెను. ఛందఃప్రయోగ సారస్యములను ఆకళింపుకొన వలెను. అలంకార వైవిధ్యములను, వైశిష్ట్యములను పరిశీలింపవలెను. పాత్ర చిత్రణముల తీరులను సౌరులను దర్శింపవలెను. సందర్భోచితముగా నందందు ప్రతిపాదితములైన వివిధ రసస్వరూపములను చక్కగా గుర్తింపవలెను. ఈ యన్నింటిని విస్పష్టముగా వింగడించి, సమగ్రముగా వివరించి, వానిని సహృదయ హృదయాస్వాదయోగ్యములుగా నావిష్కరింపవలెను.

ఏవం విధ విమర్శక కృషిఫలితముగ కవియొక్క వివిధ కళాకౌశల ములు వెల్లడి యగును. కావ్యసౌందర్యములు కన్నులకు గట్టును. తద్రసాను భూతికి నోచుకొనిన సహృదయుల హృదయములు పులకితములై పారవశ్య ములను భజించును.

ప్రతిజ్ఞా[1] పూర్వకముగ విమర్శలను (వ్యాఖ్యానములను) వెలయించిన నిశిత విమర్శక శిరోమణి మల్లినాథ సూరి. మల్లినాథుని నిశిత విమర్శా (వ్యాఖ్యాన) నికషోపలములపై నిగ్గుదేలి కవిలోక విరాజితములైనవి కాళిదాస కావ్యాలు.

కాళిదాస కావ్యవిమర్శకుడై (వ్యాఖ్యాతయై) యశోవిరాజితుడైనవాడు మల్లినాథుడు. మల్లినాథుని సునిశిత సుమధుర విమర్శలతో (వ్యాఖ్యానము లతో) అజరామరములైనవి కాళిదాస కావ్యాలు.

కవి- విమర్శకుల యొక్క, కావ్య-వ్యాఖ్యానముల యొక్క పరస్ప రాశ్రయ పరమ లాభములట్టివి.

---

1. నామూలం లిఖ్యతేకించిత్: అమూలకముగా కొంచెమైనను వ్రాయను. నానపేక్షితముచ్యతే।అనవసరముగా ఒక్కముక్కను గూడ పల్కను. మల్లినాథ ప్రతిజ్ఞ.

ఆ మల్లినాథుని మార్గములో పెక్కుమంది విమర్శకులు (వ్యాఖ్యాతలు) యథాశక్తి కృతశ్రములై సహృదయ లోకమునకు సరస కావ్యానందములను పంచియిచ్చిరి. ఆరీతి నాదర్శముగాగొని ఆ పరంపరలో భాగముగ రూపాంతరముగ కొనసాగుచున్నట్టివే ఈనాటి సాహిత్య పరిశోధనములన్నియును.

స్వతంత్ర భారత జాతీయ పతాకచ్ఛాయలలో విశ్వవిద్యాలయముల అలంబనములతో, మహోపాధ్యాయుల మధురార్ద్ర పర్యవేక్షణములతో తెలుగు విభాగములందు నేడు జరుగుచున్న భాషా సాహిత్య పరిశోధనములు కోకొల్లలు.

ఆ పరిశోధనా రంగమున రూపుదిద్దుకొన్నట్టిదే ఈ సిద్ధాన్తవ్యాసము—

"పాపయారాధ్యుల రచనలు-వేమనారాధ్య చరిత్రముపై ప్రత్యేక పరిశీలనము" అన్న శీర్షికపై కొనసాగిన రచనమిది.

ఇది ఐదు ప్రకరణములుగా విభజింపబడినది.

మొదటి ప్రకరణమున — కవి జీవిత విశేషములు.
రెండవ ప్రకరణమున — శైవము - శివాద్వైత సిద్ధాన్తము.
మూడవ ప్రకరణమున — అహల్యా సంక్రందన విలాసము, మున్నగు రచనలపై సాహిత్య విమర్శ.
నాల్గవ ప్రకరణమున — వేమనారాధ్య చరిత్రముపై ప్రత్యేక పరిశీలనము.
ఐదవ ప్రకరణమున — రచనా శిల్పము
అనునవి సమీక్షింపబడినవి.

ముందుగా నిక కవి జీవిత విశేషములను ముచ్చటింతము.

# వంశము

మహాకవి యగు పాపయారాధ్యుడు కౌండిన్యస గోత్రుడు. తల్లి భ్రమరాంబ. తండ్రి వీరనారాధ్యుడు. పితామహుడు సంగమేశ్వరా రాధ్యుడు. పితామహి అక్కమాంబ.

ఈయన మాతామహుడు శ్రీపతి పండితారాధ్యుల శంభులింగదేశికుడు. ఈతడు వివిధ శాస్త్రపారంగతుడు. పాపయారాధ్యునకు విద్యాగురువు. ఆరాధ్యశైవ పీఠాధిపత్యమును నెరపిన మహామహుడు.[1]

ఈ పాపయారాధ్యుడు లింగమాంబను పెండ్లియాడెను. ఆమె విశ్వాత్ముల బసవారాధ్యుల తనయ. ఆమె తల్లి బుచ్చమాంబ. ఆ లింగమాంబ సుబ్బమ - అంబారాధ్యుల మనుమరాలు. వియ్యమ - వీరభద్రారాధ్యుల ముని మనుమరాలు.[2]

ఆ లింగమాంబా పాపయారాధ్యులకు కలిగిన కుమారులు నలుగురు. కుమార్తెలు ఇద్దఱు. వారందఱును సంతాన లాభముల నందిరి.[3]

ఈ కవి తన వంశచరిత్రమును వేమనారాధ్య చరిత్రమునందు విపులముగా వర్ణించెను. కనుక దానిని బట్టి వేమనారాధ్యుడు మొదలుకొని పాపయారాధ్యుని వఱకు కొనసాగిన తద్వంశ క్రమమును వివరింతును.

ముక్తి సామ్రాజ్యాభిషిక్తుడును ఈశ్వరేశ్వరుడునగు శ్రీభ్రమరాంబా మల్లికార్జునస్వామి యనుగ్రహమున శ్రీ వీరభద్రుని యపరావతారమై[4]యీ లోకమున నవతరించిన పుణ్యపురుషుడు శ్రీ వేమనారాధ్యుడు.

---

1. వేమనారాధ్య చరిత్రము, 1-158, 143, 145, 9, 157.
2. వే. ఆ. చ. 1-174.
3. దేవీ భాగవత పీఠిక. పుట. 1,2.
4. వే. ఆ. చ. 1-51.

సంతానార్థమై తపంబొనర్చిన విజయశర్మ దంపతులకు వారి పురాకృత సుకృతఫలముగా కుమారుడై లభించిన సర్వేశ్వర వరప్రసాదమతడు.1 కౌండిన్య గోత్రమునకు వన్నెయు వాసియు దెచ్చిన కారణజన్ముడతడు.2 అతడు చతుర్వేదసారమును జిహ్వాగ్రమున నిల్పుకొని సర్వజ్ఞుడై యలరారెను.

ఈ వేమనారాధ్యుడే ములుగు పాపయారాధ్యుల వంశమునకు మూలపురుడు.3

ఈ వ్యోమా (వేమనా) రాధ్యునకు క్రమముగా పుత్రులై యొప్పిన నందయ్య, పర్వతయ్య, మల్లనార్యుడు- అనువారు నిగ్రహానుగ్రహసమర్థులై భక్తుల ధర్మార్థ కామమోక్షములను పండించిన మహా మహితాత్ములు.4 ఇట్లు పరంపరగా వర్ధిల్లిన యీసద్వంశమున, పిదప పేర్కొనదగినవాడు విశ్వనాథ గురుడు. ఇతడు బాల్యముననే ''పరశివాద్వైతము''ను పుక్కిటఁ బట్టెను. బొమ్మలాటలనాడే తోడిబుడుతలకు హితబోధల నొనర్చెను. బడి చదువులనాడే మహాభాష్యవేత్తలను ప్రతిఘటించెను. తనచేతి భసిత స్పర్శచే భక్తులకు ముక్తిని ప్రసాదించెను.5

ఇతడు తన యనుజుడగు "ఇమ్మడయ్య"ను సర్వసమర్థుని గావించిన పిమ్మట, శ్రీగిరికేగి, దివ్యముని సేవితమైన విమానము నెక్కి దివ్యలోకమున కేగెను.

ఈ ఇమ్మడయ్య వేదశాస్త్ర పురాణములనెల్ల ఉగ్గు పాలతో రంగరించుకొని, "విమత గజకేసరి"గా "అభినవ వ్యోమారాధ్యులు"గా వాసికెక్కెను.6

ఎనమదల దేవగృహములపై పారశీకులు దాడికి రాగా ఆ దొరల సద్దగించి, శపథ పూర్వకముగా సందిచే చణకములను భక్షింపజేసి, దుష్టులను

1. వే. ఆ. చ. 1-52. 2. వే. ఆ. చ. 1-54.
3. వే. ఆ. చ. 1-27. 4. వే. ఆ. చ. 1-56.
4. వే. ఆ. చ. 1-63. 6. వే. ఆ. చ. 1-66.

వికల పఱచిన మహిమాన్వితుడితడు[1] గురు పట్టభద్రుడుగా గూడ వాసికెక్కిన వాడు.

ఈ ఇమ్మరయ్య కుమారుడే శ్రీ గిరయ్య. అతడు మిగుల పరమార్థ జీవనుడై, ఆచార్యవర్యుడై, అల్లమ ప్రభుతుల్యుడుగా ప్రసిద్ధి గాంచెను.[2]

ఈ శ్రీ గిరయ్యకు కలిగిన ముగ్గురు పుత్త్రులలో పెద్దవాడు అన్నమయ్య. రెండవవాడు వీరయ్య. లింగాలయ్య మూడవవాడు.

అన్నమయ్య తన సోదరులలో అగ్రజుడగుటయేగాక శివార్చనము నందును, అన్నదానము నందును అగ్రగణ్యుడై యలరారెను. అన్నమయ్య మాహేశ్వరార్చన మనిదం పూర్వము. ఆ ప్రమథాధిపతియే ప్రచ్ఛన్న వేష మున స్వయముగ నాతని పూజల నందునని ప్రతీతి. అందఱును అన్నమయ్యను "ఆనందనాథుఁడు" అనియే పిలుచుచుండెడివారట. "అభినవ బసవేశు"డని ఖ్యాతి గన్నవాడతడు.[3]

బ్రహ్మచర్య వ్రతనిష్ఠాగరిష్ఠుడైన ఆ అన్నమయ్యకు దైవానుగ్రమున లభించిన కుమారుడు రామలింగయ్య.[4] ఇతడు వీరభద్ర పురాగ్రహార నివాసి. ఇది రాయదత్తమట. ఏ రాయదత్తమో? తెలియరాదు.

తనను ఆశ్రయించి సేవించినవారికి అభీష్టము లొసంగుచు ఈ రామ లింగయ్య శివుని యపరావతారముగ వాసిగాంచెను. ఇతడు దక్షిణ కైలాసాది క్షేత్రములందు ఆగమాచార్యుడై[5] దేశికుడై "సర్వేశ్వరః శివః, సర్వే సురాః కింకరాః" అని దీక్షోపదేశముల నొసంగెను. పొదిలెపురమున శివసన్నిధి యందలి సందిచే తృణాశనము చేయించిన మహిమోపేతుడితడు.[6]

---

1. వే. ఆ. చ. 1-67,68.
2. వే. ఆ. చ. 1-74.
3. వే. ఆ. చ. 1-87.
4. వే. ఆ. చ. 1-97.
5. వే. ఆ. చ. 1-93.
6. వే. ఆ. చ. 1-94.

ఈ రామలింగయ్యకు పుత్త్రులు మువ్వురు. 1. వీరయ్య, 2. రాచయ్య, 3. అన్నమయ్య. ఈ ముగ్గురును గురుస్థానముల నలంకరించి, పరిపూతజీవనులై ప్రఖ్యాతినందిరి.

పుట్టుకచే అన్నదమ్ములలో మధ్యముడయ్యును తన సుగుణ గణ సంపత్తిచే ఉత్తముడుగా వాసిగాంచినవాడు రాచయ్య. ఇతడు విజయపురమున నివసించెను.

ఆ రాచయ్య కుమారులు సంగమయ్య, నాగయ్య, వీరిరువురును సత్త్రశాలలను నిర్వహించి, పొందిన ప్రజాదరణ మపూర్వము.

ఆ సంగయ్య కుమారుడగు అగస్త్యలింగము ఆరాధ్యశిరోమణిగా వాసికెక్కి, వీరయ్య యను సుతుని గాంచెను.

ఆ రాచయ్యగారి రెండవ కుమారుడగు నాగయ్యయొక్క నందనుడు ఉమామహేశము.

ఇక రాచయ్య తమ్ముడగు అన్నమయ్యకు కలిగిన కొడుకులు సంగమయ్య, బుచ్చయ్య. వీరిలో సంగమయ్య కుదయించినవాడు వీరనారాధ్యుడు. అతడు వీరవ్రతాచార పరాయణుడు. ఆయనకు అన్నమయ్య, బుచ్చయ్య యను సుతులు కలిగిరి. వారిలో బుచ్చయ్య ఆగమ పురాణ సంహితాభ్యాసములలో వ్యాసవాల్మీకులకు సహాధ్యాయిగా వాసికెక్కినవాడట. ఆ బుచ్చయ్య కుమారుడు లింగనారాధ్యుడు. ఆ లింగనారాధ్యుని సూనులు అన్నమయ్య వీరయ్యలు.

రాచయ్య, అన్నమయ్యల యొక్క అన్నయగు వీరనారాధ్యునకు వీరభద్రయ్య యనియు వ్యవహార నామము కలదట. అతడు పాఠశాలలను గట్టించి, భోజన సదుపాయములను సమకూర్చి, విద్యార్థులకు వేదశాస్త్ర పురాణాది విద్యలను అహర్నిశలు నూరిపోసిన అధ్యాపక శిరోమణి. ఆయనకు కల్గినవారు సంగమేశ్వరుడు, శ్రీశైలపతి. వారు సిద్ధ పంచాక్షరీ సిద్ధులై ప్రశస్తికెక్కిరి.

వారిలో శ్రీశైలపతి తనను ఆశ్రయించిన శిష్యకోటిని తీర్చిదిద్దెను. అతడు తన భార్యయగు పాపమాంబికయందు పాపయ్య, మల్లికార్జునుడు, సంగయ్య యను సుతత్రయమును పొందెను.

ఆ ముప్పురిలో పాపయ్య తన యర్థాంగియగు భాగీరథియందు అయ్యవారు, శరభయ్యయను కొడుకులను గాంచెను. ఈయన్నదమ్ముల అన్యోన్యానురాగముల పూర్వములట. వీరిలో అగ్రజుడగు అయ్యవారికి లింగమాంబయందు కల్గిన కుమారులు ముగ్గురు. వారు అప్పయ్య, వీరనార్యుడు, రామలింగము అనువారు.

ఆ అయ్యవారి తమ్ముడగు శరభయ్య జోగమ్మను పెండ్లి యాడెను. తనయన్న యొక్క తృతీయ సుతుడగు రామలింగమును నిజ కుమారునిగా స్వీకరించెను. అతడు మంత్ర విద్యలో మహామహుడయ్యెను.

అయ్యవారియొక్క పెద్ద కుమారుడగు అప్పయ్య అసంఖ్యాకముగా వీరశైవ గణార్చనలు గావించి, మిక్కిలివాసిగాంచి, పట్టినదెల్ల బంగారము గావించుచు శైవ నిష్ఠాగరిష్ఠుడై విలసిల్లెను. అతని తమ్ముడగు వీరనారాధ్యునకు చినప్పయ్య యనియు నామాంతరముగలదు. అతడు చండికానుగ్రహమునకు పాత్రుడైనవాడు. అతడు వీరయ్యయను కుమారుని పొందెను.

శ్రీశైలపతి యొక్క రెండవసుతుడగు మల్లికార్జునుడు అంబికా దేవిని జేపట్టి, సంతానవంతుడై, పితౄణమును దీర్చుకొనెను. ఆ మల్లికార్జుననకు తమ్ముడగు సంగమేశుడు (సంగయ్య) సర్వమంగళయను నామెను పెండ్లియాడి, జోగయ్యయను సుతుని గని, కృతార్థుడయ్యెను.

వీరభద్రారాధ్యులనియు నామాంతరముగల వీరనారాధ్యులవారి పెద్ద కుమారుడైన సంగమేశ్వరా రాధ్యుడు మహాకవి ములుగు పాపయారాధ్యులకు పితామహుడు. అతడు వేదవేదాంగ పారంగతుడు, పంచాక్షరీజప పర్యాయ

ణుడు. జితేంద్రియుడు. "శైవ పంచక"1 బోధనావధాని. అక్కమాంబను అర్ధాంగినిగా జేసికొన్నవాడు. ఆ దంపతులకు వీరయ్య, రామలింగయ్య, చంద్రమౌళి, మల్లికార్జునుడు అను నల్వురు కొడుకులు గలిగిరి. వారిలో పెద్ద వాడగు వీరన (వీరయ్య) శ్రీపతి పండిత శంభులింగ దేశికుల పుత్రియగు భ్రమరాంబను, రెండవ వాడగు రామలింగయ్య శివలెంక వంశ సంజాతయగు వియ్యమాంబను, మూడవ వాడగు చంద్రమౌళి పండితారాధ్య వంశసంభవ యగు వియ్యమాంబను, నాల్గవవాడగు మల్లికార్జునుడు వియ్యమ్మను వివాహ మాడిరి.

ఆ నలుగురును వేదశాస్త్రాది వివిధ విద్యావిశారదులు. అంతియగాక విద్యలలో శిష్యులను ఉద్దండులనుగా నొనర్చిన మహోపాధ్యాయులు.

వారిలో జన్మచే తోబుట్టువులలో అగ్రజుడగుటయేగాక తన సుగుణగణ సంపద చేతను అగ్రగణ్యుడైనవాడు వీరనారాధ్యుడు. అతడు శైవసిద్ధాన్త సుధలను గ్రోలినవాడు. నిగ్రహానుగ్రహ సమర్థుడు. భైరవాఘోరాది మంత్ర సంపన్నుడు. భక్తికేదారములను పండించిన భవ్య కృషీవలుడు. పరమార్థ సిద్ధినందినవాడు. ఈ వీరనారాధ్యునకు భ్రమరాంబయందు దుదయించినవారు 1) సంగమేశ్వరుడు, (పాపయారాధ్యుడు) 2) సాళ్వపతి, 3) శంభులింగము 4) రాజలింగశాస్త్రి, 5) బసవయ్య. వీరందఱును ఆంధ్ర గీర్వాణ భాషా విశారదులే.

భ్రమరాంబా వీరనారాధ్యుల సంతానములో పెద్దవాడగు సంగమేశ్వరు నకు పాపయారాధ్యుడనియు నామాంతరము గలదు. తల్లిదండ్రులు నామ కరణ మొనర్చినది సంగమేశ్వరుడనియు, ఈయన పితామహి యగు అక్క మాంబ తన భర్త పేరును, మనుమని పేరు సంగమేశ్వరుడగుటచే, సంప్ర

---

1. స్కాంద పురాణములోని — 1) శంకర సంహిత 2) అనుభవ సూత్ర ములు (శివానుభవ సూత్రములు) 3) విశేషార్థ ప్రకాశిక 4) శైవ సిద్ధాన్త శిఖామణి 5) వాతూలాగమము- అను ఐదింటికిని "శైవ పంచ కము" అని వ్యవహార ప్రసిద్ధి.

డాయము ననుసరించి, తన భర్త పేరుతో గాక, మనుమనిని "పాప" "పాప" అని పిలుచుచు వచ్చెననియు, పితామహి పిలుపుచే లోకవ్యవహారమున స్థిర పడి, పాపయారాధ్యుడు అను నామాంతరముగూడ ఏర్పడి, అదియును రూఢమై పోయెననియు, ఆ విధముగ ఈయనకు నామద్వయము సంభవించెననియు' కవి, పండితులు పేర్కొనుచున్నారు.1

ఈ కవియును ఆయా సందర్భములలో తన్ను గూర్చి యీ రెండు పేర్లతోడను వ్యవహరించెను.2

సోదరులలో పెద్దవాడగు పాపయారాధ్యుడు (సంగమేశ్వరుడు) విశ్వా త్ముల బసవారాధ్యుల పుత్త్రికయగు లింగమాంబను, రెండవవాడగు సాళ్వ పతి ఇవటూరి చంద్రశేఖరారాధ్యుల కూతురగు సుబ్బమాంబను, మూడవ వాడగు శంభులింగము శ్రీపతి పండిత వంశజయగు మల్లమ్మను, నాల్గవ వాడగు రాజలింగశాస్త్రి శివలెంక వంశసంభవయగు పార్వతిని, ఐదవవాడగు బసవయ్య శ్రీపతి పండితారాధ్య వంశసంభూతయగు వియ్యమ్మను, పరిణయ మాడి, గృహస్థాశ్రమ సుఖలాభములను పడించుకొని, పుత్త్రపౌత్త్ర పరం పరాభివృద్ధి గాంచిరి. ఈ సోదరులలో రెండవవాడగు సాళ్వపతి తన పిన తండ్రియగు రామలింగారాధ్యులకు దత్తపుత్త్రుడయ్యెను.

ఈ పాపయారాధ్యుని సోదరులందఱును మంచి విద్యావంతులు. సాళ్వపతి ఆంధ్ర గీర్వాణ భాషలలో అందె వేసినవాడు.3 జాతక సిద్ధాన

1. సరసహృదయానురంజనము - పీఠిక - పుట. 2. ఈ దేవీభాగవతము ఉపోద్ఘాతము - పుట. 13.
2. i) సరసరుచి సాంద్రసంగమేశ్వర కవీంద్ర! వే.ఆ.చ. 1-25.
   ii) రసన నసుముల్లు పాపయారాధ్యచంద్రుడు. వే.ఆ.చ. 1-172.
   iii) ముల్లు పాపయారాధ్య నామ విభ్రాజితుడను - వే.ఆ.చ. 1-174.
   iv) సంగమేశ్వరాధ్య విరచితంబగు శ్రీ మద్వేమనారాధ్య చరిత్రం బను మహాప్రబంధంబునందు - వే.ఆ.చ, ఆశ్వాసాంత గద్యలు.
3. వే. ఆ. చ. 1-160.

గమములలో సిద్ధహస్తుడు. రాజలింగశాస్త్రి తర్క వేదాంత శాస్త్రములలో పారంగతుడు. పురాణేతిహాసములను పుక్కిటబట్టినవాడు. రాజసమ్మానముల నందినవాడు.[1] శంభులింగము తత్త్వశాస్త్ర పరిజ్ఞాత.[2] బసవయ్య శైవోత్సవ ప్రతిష్ఠా విధానముల నుద్దండ పండితుడు. అందఱును శివపూజా ధురంధరులే.

పాపయారాధ్యునకు లింగమాంబ యందుదయించిన నలుగురి కొడుకులలో పెద్దవాడు జోగయ్యశాస్త్రి. తరువాతి వారు వియ్యన్న, బసవయ్య, కోటయ్యలు. ఇద్దఱు కుమార్తెలతో జ్యేష్ఠురాలైన శాంభవి పండితారాధ్య వంశ పురుషునకు పత్నికాగా, రెండవ యామెయగు సావిత్రి శివలెంక వంశమువారి కోడలైనది.

జోగయ్య కుమారుడు మల్లన. వాని తనయుడు వీరభద్రుడు. ఆతని సుతుడు మల్లికార్జునుడు. రెండవవాడగు వియ్యన్నయొక్క తనయుడు వీరభద్రుడు. నాల్గవవాడగు కోటయ్యశాస్త్రికి ఐదుగురు పుత్త్రులుదయించిరి. వరుసగా వారి పేర్లు - 1) శరభయ్య, 2) బసవయ్య, 3) సుబ్రహ్మణ్యము, 4) పాపయ్య, 5) మార్కండేయులు.

ఈ యైదుగురిలో శరభయ్యకు రామలింగయ్య సుతుండయ్యెను. ఆయన కుమారుడు విశ్వేశ్వరయ్య. ఆతని తనయుడు శరభ సుబ్రహ్మణ్యము. రెండవవాడగు బసవయ్యకు బుట్టినవాడు కోటిలింగము.

నాల్గవవాడగు పాపయ్యకు బసవయ్య, చంద్రమౌళి అను సుతులుదయించిరి. ఐదవవాడు మార్కండేయుని కుమారుడు సుబ్బారాయుడు.

ఈ విధముగ సంతాన పరంపరతో వర్ధిల్లినది పాపయారాధ్యుల వంశము.

---

1. వే. ఆ. చ. 1-167. 2. వే. ఆ. చ. 1-164.
3. వే. ఆ. చ. 1-169.

## వంశవృక్షము

శ్రీశైల మల్లికార్జునస్వామి — పరమేశ్వర దత్తపుత్రుని పెంచిన దంపతులు విజయశర్మ - సౌభాగ్యవతి

(శ్రీశైల లింగగర్భ సంభూతుడు) వేమనారాధ్యుఁడు (12వ శతాబ్దివాడు)
ఈయన భార్య విజయలక్ష్మి - భానుదేవుని కూతురు

- నందయ్య
- పర్వతయ్య
- మల్లనార్యుడు

ఈ విధముగపరం పరగ వర్థిల్లిన యీ వంశములో తరువాతి వారు.

విశ్వనాథుడు - ఇమ్మడయ్య

- శ్రీ గిరయ్య
  - అన్నమయ్య (ఆనందనాథుఁడు)
    - రామలింగయ్య
      - వీరయ్య (వీరభద్రయ్య)
      - భాచయ్య
      - అన్నమయ్య
  - వీరయ్య
  - లింగాలయ్య



య్య (వీరభద్రయ్య)
రాచయ్య
అన్నమయ్య
గమేశ్వరుడు
క్కమాంబ)
శ్రీశైలపతి
(పాపమ్మ)
సంగయ్య
నాగయ్య
అగస్త్యలింగము
ఉమామహేశము
వీరయ్య
సంగమయ్య
బుచ్చయ్య
పాపయ్య
(భాగీరథి)
మల్లికార్జునుడు
(అంబికాదేవి)
సంగయ్య
(సర్వమంగళ)
వీరనార్యుడు
అన్నమయ్య
బుచ్చయ్య
అయ్యవారు
(లింగమాంబ)
శరభయ్య
(జోగమ్మ)
లింగనార్యుడు
అప్పయ్య
వీరనార్యుడు
(చినప్పయ్య)
రామలింగము
(ఈతడు శరభయ్య జోగమ్మలకు దత్తపుత్రుడు)
అన్నమయ్య
వీరయ్య
వీరయ్య
య్య
నాదాధ్యుడు)
ర్య భ్రమరాంబిక)
రామలింగయ్య
(భార్య వియ్యమ్మ)
చంద్రమౌళి
(వియ్యమ్మ)
మల్లికార్జునుడు
(వియ్యమ్మ)
గమేశ్వరుడు)
పయారాధ్యుడు
సాంబపతి
(సుబ్బమాంబ)
శంభులింగము
(మల్లమ్మ)
రాజలింగశాస్త్రి
(పార్వతి)
బసవయ్య
(వియ్యమ్మ)



పాపయారాధ్యుడు-లింగమాంబిక
జోగయ్యశాస్త్రి
వియ్యన్నసుకవి
బసవయ్య శాస్త్రి
కోటయ్య శాస్త్రి
శాంభవి
సావిత్రి
మల్లన్న
వీరభద్రుడు
మల్లికార్జునుడు
శరభయ్య
బసవయ్య
సుబ్రహ్మణ్యము
పాపయ్య
మార్కండేయులు
రామలింము
కోటిలింగము
బసవయ్య
చంద్రమౌళి
సుబ్బారాయుడు
విశ్వేశ్వరశాస్త్రి
శరభ సుబ్రహ్మణ్యము

# నివాసము

మహాకవి ములుగు పాపయారాధ్యుడు తన నివాస గ్రామము నేకృతి యందును ప్రస్తావింపలేదు. వీరి యింటిపేరు "ములుగు" అని పేర్కొనబడి యున్నందున వీరి వంశము వారొకప్పుడు ములుగు గ్రామ నివాసులై యున్నట్లు భావింపవలసియున్నది. కాని పాపయారాధ్యుడు "వేమనారాధ్య చరిత్రము" నందలి యవతారికలో వేమనారాధ్యుని (12వ శతాబ్ది) నుండి తన తరము వఱకు (19వ శతాబ్ది పూర్వార్థము వఱకు) గల తన వంశజుల యితివృత్త ములను సుదీర్ఘముగ వర్ణించెను.[1] 125 పద్యగద్యములలో వర్ణితమైన యీవంశో దంతములో నెచ్చటను ఈ ములుగు గ్రామమును గూర్చి, యుగ్గడింప లేదు. కాని కవి తన వంశ పురుషులనుగూర్చి వర్ణించుచు సందర్భానుసారముగ "ఎనమదల" "వీరభద్ర పురము" "పొదిలె" విజయపురము" అను గ్రామనామ ములను ప్రస్తావించెను.

ఎనమదల పురప్రచలితుడు ఇమ్మడయ్య.[2] రామలింగయ్య "వీరభద్ర పురాగ్రహార" నివాసి.[3] ఈ రామలింగ దేశికుడే "పొదిలె" పురీవరమున నందిచే తృణభక్షణము చేయించిన మహిమోపేతుడు.[4] సకల దిక్కుల శిష్యసంచారముల నొనర్చిన "రాచయ్య" గారు "విజయ పురంబున" నిల్చి రాజులచే పూజలనందిరి.[5]

పొదిలెలో మహిమలను ప్రకటించుట, విజయపురములో రాజపూజల నందుట, శిష్యసంచారమున జరిగినవని భావించినచో అవి వీరి నివాస గ్రామ ములు కాజాలవు. ఇక మిగిలిన ఎనమదల, వీరభద్రపురము వీరి (ఈ వంశ జుల) గ్రామనామములై యుండవచ్చును. కాని వానిలో దేనిని గూడ కవి తన నివాస గ్రామముగా చెప్పలేదు.

---

1. వే. అ. చ. 1.50 to 175.
2. వే. అ. చ. 1.67.
3. వే. అ. చ. 1.91.
4. వే. అ. చ. 1.94.
5. వే. అ. చ. 1.102.

వరంగల్ జిల్లాలోను, మెదక్ జిల్లాలోను, "ములుగు" పేరుతో గ్రామములు గలవు. వరంగల్ జిల్లాలోని ములుగు గ్రామము కొంతవఅకు సుప్రసిద్ధమైనది. నేటి కవి పండిత పరిశోధకులలో పెక్కుమంది నోటిమాటగా వరంగల్ జిల్లాలోని ములుగు గ్రామమే పాపయారాధ్యుల నివాస భూమియై యుండవచ్చునని చెప్పుచున్నారు. కాని వారును అందులకు తగిన యాధారములను చూపలేక పోవుచున్నారు.

ప్రబలమైన నిదర్శనములు లభింపనప్పుడు, కవి స్వయముగ చెప్పికొననప్పుడు "ఈ ములుగు గ్రామమే" పాపయారాధ్యుల నివాస ప్రదేశమని నిర్ణయించుటకు సావకాశము లేదు.

ఆధునిక విద్యాది లాభముల కొఱకును, ఉద్యోగాది సుఖజీవన సౌకర్యములకును, ఒకరిని జూచి మఱియొకరు గ్రామములను వీడి పట్టణములకు పరుగులు తీయుచున్న కాలమిది. ఈ కారణముగ ఆయా గ్రామములలో ఆయా వంశములవారు వాసనకు గూడ మిగులుట లేదు. ఇట్టి కాలములో ఇతర చారిత్రకాధారములు లేనప్పుడు ప్రాచీనుల నివాస గ్రామములను "ఇదమిత్థమని" నిర్ణయించుట కష్టము.

కాని "అమరావతి సంస్థానము"తో పాపయారాధ్యుల జీవితము ముప్పిరిగొనియున్నది. కనుక నీయంశము నా దృష్టితో గూడ పరిశీలింపవలసియున్నది.

శ్రీ కోడాలి లక్ష్మీనారాయణగారు తమ చారిత్రక గ్రంథములో ("శ్రీ రాజా వాసిరెడ్డి వేంకటాద్రినాయడు" అను గ్రంథములో) చింతపల్లియే లక్ష్మీపురమే) పాపయారాధ్యులకును వారి పూర్వులకును నివాస భూమియని పేర్కొనిరి[1]

వాసిరెడ్డి వేంకటాద్రినాయుని పాలనము మొదటి పదుమూడు, పదునాలుగు సంవత్సరములు చింతపల్లి (లక్ష్మీపురము)లోనే కొనసాగినది. ఇప్పటికిని ఆ చింతపల్లిలో ములుగు గృహనామమువారు గలరు.

1. శ్రీ రా. వా. వేం. నాయుడు - పుట. 68.

శ్రీ ముదిగొండ బసవయ్యశాస్త్రిగారు ఆంధ్రపత్రిక సంవత్సరాది (1926, దుర్మతి) సంచికలో[1] ములుగు పాపయారాధ్యులను గూర్చి వ్రాయుచు, పాపయారాధ్యుని నివాసము మొదట చింతపల్లియే యనియు, పిదప రాజాశ్రయము ననుసరించి, యది యమరావతికి మాఱినదనియు తెల్పిరి. శ్రీ కొమ్మనమంచి జోగయ్యశర్మగారును ఈ కవి స్వగ్రామము "చింత పల్లి" యనియే పేర్కొనిరి.[2]

రాజా వాసిరెడ్డి వేంకటాద్రినాయనికిని పాపయారాధ్యునకును బాల్యము నుండియు మైత్రియున్నట్లు ప్రసిద్ధి. వేంకటాద్రినాయడు తన సంస్థాన పాలనమును చేపట్టిన నాటినుండియు (1783వ సంవత్సరము నుండియు) పాపయారాధ్యుడచట ఆస్థాన కవిగా, విద్వాంసుడుగా ఉండి, రాజగౌరవముల నందుచు వచ్చెను. వేంకటాద్రినాయడు మొదట తన సంస్థానాధిపత్యమును చింత పల్లిలో ప్రారంభించి, కొంత కాలమునకు అమరావతికి మార్చెను. కనుక పాపయారాధ్యుని నివాసము (స్వగ్రామము) మొదట చింతపల్లి (దీనికే లక్ష్మీ పురము అనియు నామాంతరము)యే యనియు, రాజాశ్రయము ననుసరించి కొంత కాలమునకు పిమ్మట అది అమరావతికి మాఱినదనియు భావింపవలసి యున్నది.

కాని పాపయా రాధ్యుని ద్వితీయ పుత్త్రుడగు వియ్యన్నసుకవి "వేముల పల్లి" "రాజేశ్వరుని" పేర నొకమకుటముంచి, సీసములలో శతకమును రచించియుండెను.[3]

---

1. ఈ రచన 1965 ఆంధ్రపత్రి స్వర్ణోత్సవ సంచికలో పునర్ముద్రితము. ఈ సంచిక ప్రతిని నాకు పంపి తోడ్పడినవారు శ్రీ P.V.R. అప్పా రావుగారు, గ్రంథాలయ నిర్వాహకులు, శ్రీ భావనారాయణస్వామి గ్రంథాలయము, పొన్నూరు.
2. విజ్ఞాన సర్వస్వము. 4వ సంపుటము. తెలుగు సంస్కృతి. ౨.
1. "సాంబ! వేముల పల్లెపురావలంబ!, రత్న గర్భాశతాంగ! శ్రీ రాజ లింగ! ఇది వియ్యన్నసుకవివ్రాసిన" రాజేశ్వర (సీస) శతకమునకు మకుటము. 1907లో బెజవాడ దుర్గాముద్రా క్షరశాలయందిది ముద్రితము.

అంతేగాక నాకు లభించిన వేమనా రాధ్య చరిత్ర వ్రాతప్రతిని వ్రాసిన వారు-ఈ వేముల పల్లి అగ్రహార నివాసులగు శ్రీములుగు సుబ్రహ్మణ్యారాధ్య శాస్త్రి గారు.1

బండారువారి ప్రాపున ఈ వేముల పల్లి అగ్రహారమునకు చేరి, పెక్కు ఆరాధ్య బ్రాహ్మణ కుటుంబములు జీవించినట్లు ప్రతీతి. ఈ అగ్రహారము అమరావతికి సమీపముననే గలదు.

కనుక వియ్యన్నసుకవి తరమున అనగా పావయా రాధ్యుని వార్ధక్య దశయందు ఈ మహాకవి నివాసము వేములపల్లి యగ్రహారమునకు మారి యున్నదేమో! యని సందేహింపవలసి వచ్చుచున్నది..

## కాలము

ఆంధ్ర గీర్వాణ భాషలలో ఆనందోపదేశములకు మూలములగు రసవద్రచనలు చేసిన మహాకవులు పెక్కుమందిగలరు. కాని వారిలో చాల మంది కవులు తమతమ జననాది కాలములను గూర్చిగాని, నివాస ప్రదేశము లను గుఱించిగాని పేర్కొనిన వారు మిక్కిలి తక్కువ. ఒకవేళ వారు నిజ జనన, నివాసాది ప్రస్తావనలు చేసినను భవిష్యత్తరముల వారు స్పష్టముగా నిర్ణయించు కొనుటకు వీలుగా వానిని నిర్దిష్టముగా చెప్పినవారు ఎంతో అరుదు. సంస్కృత కవులకు సంబంధించినంత వఱకు ఇది పరమ సత్యము.

తెలుఁగు కవులుగూడ ఈ విషయమున ఈ దారిలోనే సాగినను వారి కంటె వీరు కొంచెము మెఱుగు. ఐనను ఆయా తెలుగు కవుల రచనాంశముల నాధారముగా గొని తత్తత్కవి జనన, నివాసాది జీవిత విశేషములను స్పష్టముగా నిర్ణయించుట కష్టమనియే చెప్పవచ్చును. ఈ సత్య సూత్రమునకు ములుగు పాపయారాధ్యుల కాలనిర్ణయ విషయముగూడ అపవాదము గాదు.

---

1. వేమనారాధ్య చరిత్ర వ్రాతప్రతి చివరిపుటలో, వ్రాసినవారి చిరునామా ములుగు సుబ్రహ్మణ్యశాస్త్రి, వేములపల్లి అగ్రహారము. నందిగామ తాలూకా అనికలదు.

పెక్కు ప్రౌఢప్రబంధములను నిర్మించినను అందెందును పాపయా-
్యుడు తన జన్మకాలమును గూర్చిగాని, నివాసాదికమును గురించిగాని
లేదు.

ఇట్టి పరిస్థితులలో తత్కవి కాలాది కమును గూర్చి నిర్ణయించుట
ను ప్రశ్నయుదయించుట సహజము.

ఈతడు అమరావతి సంస్థానమున ఆస్థాన కవిగా, విద్వాంసుడు
న్నవాడు.[1] కావున తదాస్థాన పాలకుల జీవితములతో ఈపాపయారాధ్యుల
ము గూడ చాలవఱకు ప్రక్కప్రక్కనే సాగినది. ఆ వాసిరెడ్డి ప్రభువులతో
నకు బలమైన చెలిమియు గలదు.[2] కనుక ముందు సంగ్రహముగా
ావతి సంస్థానాధి పతులైన వాసిరెడ్డి వారి చరిత్రను పరిశీలింతము.

## వాసిరెడ్డి (అమరావతి) సంస్థాన ప్రభువుల సంగ్రహ చరిత్ర

వాసిరెడ్డి వంశ (అమరావతి సంస్థాన) ప్రభువులతో పాపయా రాధ్యు
సాహిత్యరంగమున ప్రత్యక్ష సంబధముగలవారు ముగ్గురు. (1) వాసి
ంకటాద్రి నాయడు. (2) వాసిరెడ్డి చంద్రమౌళి. (3) వాసిరెడ్డి
ధబాబు.

### రెడ్డి వేంకటాద్రి నాయడు

27-4-1761న అనగావృష నామసంవత్సర చైత్ర బహుళ. అష్టమి
ారము నాడు జగ్గన్న (జగ్గభూపాలుడు) అచ్చమాంబ అను దంపతులకు

---

పదఘటనా ధురంధరులు పండితులెందఱు లేరు మత్సభన్ విదిత
కవిత్వ తత్వ వినివేశిత చిత్తులు మీరలౌటచే.. దేవీభాగవతము-1-105.

మాకుల శీలములెఱిఁగిన, మీకున్ మాకున్ గలట్టి మిత్రత. దేవీ
భాగవతము1-99.

వాసిరెడ్డి కులాబ్జ వనజాప్తులగు రాజసింహుల సన్నిధి జెలిమి గాంచి.
దేవీభాగవతము-1-100

జన్మించెను.[1] ఈయన తలిదండ్రులు 1765లో మృతిచెందిరి. ఇతడు తన పెదతండ్రి రామన్న రక్షణలో పెరిగి పెద్దవాడయ్యెను.[2] 1778 మేనెలలో వైశాఖమాసమున వెఱ్ఱెమాంబను ఇతడు పెండ్లియాడెను. ఆమెయందు రాజ్యలక్ష్మియను పుత్రికను పొందెను. మగసంతానము లేనందున నితడు పార్వతమ్మయను వనితను రెండువ భార్యగా స్వీకరించెను.[3] పెదతండ్రి రామన్న మరణానంతరము ఈతడు 1783లో పట్టాభిషిక్తుడై చింతపల్లి కోటకు ప్రభువయ్యెను.[4]

పెదతండ్రి రామన్న కుమారుడగు నాగన్న (వరపు పాపయ్య) యు. పినతండ్రియగువేంకటాద్రి కుమారుడగుచంద్రమౌళియు రాజ్యభాగములకొఱకు ఈ జగ్గన్న కుమారుడగు వేంకటాద్రి భూపతిని వ్యతిరేకింపగా ఆ యిరువురిని ఇతడు చింతపల్లి కోటలో నిర్బంధించెను.[5] కుంఫిణీ వారి ప్రమేయముతో ఈ యిద్దఱిని చింతపల్లి కోట నిర్బంధమునుండి వేంకటాద్రిప్రభువు 1794 లో విడుదల చేసెను.అంతేగాక ఆంగ్లేయుల ఆదేశముల ననుసరించి ఆ యుభయులకును ఇతడు భృతిని కూడ[6] చెల్లింపవలసి వచ్చెను.

పరిపాలన విషయమున ఏర్పడిన చిక్కులేగాక తన యేకైక దుహిత మృతిచెందుట, పుత్రసంతతి లేకుండుట మొదలగు కారణమువలన మన

---

1. రాజా వాసిరెడ్డి వేంకటాద్రినాయడు - పుట. 70.
2. రా. వా. వేం. నా. పుట. 71.
3. రా. వా. వేం. నా. పుట. 75,76.
4. రా. వా. వేం. నా. పుటలు. 80,81.
5. రా. వా. వేం. నా. పుట. 84. of G. Mackenzic (Krishna District Manual) "The first step of this nephew, Venkatadri was to imprison his unele's sons, Naga. nna alais Papayya and Chandramouli.
6. రా. వా. వేం. నా. పుట. 101.




శ్శాంతి లేకుండుటచే చిత్తశాంతికై యితడు తిరుపతి మొదలగు క్షేత్రయాత్రలు సేవించి వచ్చెను.1

క్షేత్రయాత్రల యనంతరము వేంకటాద్రినాయుడు మరల చింతపల్లి కోటలో ప్రవేశింపక కొంతకాలము గుంటూరులో నివసించి, అమరావతిని సర్వాంగ సుందరముగ (1795 నుండి 1797 జనవరి వరకు) నిర్మాణము చేయించి, 1797 ఫిబ్రవరిలో సపరివారముగా ఆయన అమరావతిలో ప్రవేశించెను. నాటి నుండియు ఆ అమరావతిని రాజధానిగ జేసికొని తన పరిపాలనను కొనసాగించెను.2

నాయనికి దాయాదులతో వైరమును సన్నగిల్లి సామరస్యములు సమకూరినవి. అతడు 1798లో చంద్రమౌళి కుమారుడైన జగన్నాథబాబును తన మొదటి భార్యయగు వెత్తిమాంబతో గూడి దత్తపుత్రునిగా స్వీకరించెను.3 1803లో ఈ జగన్నాథబాబునకు అచ్చమ్మ, రంగమ్మ అను ఇరువురు బాలికలతో వివాహమొనర్చెను.4 రెండవ భార్యయగు పార్వతమ్మ కోరికపై నాగన్న వరపు పాపయ్య రెండవ కుమారుడగు రామనాథబాబును 1807లో ఆ పార్వతమ్మతో గూడి వేంకటాద్రి ప్రభువు దత్తపుత్రునిగా స్వీకరించెను.5 ఈ రామనాథబాబు 1800 జూన్‌లో రౌద్రి జ్యేష్ఠ మాసమున జన్మించెను.6

వేంకటాద్రినాయుడు తన యవసాన దశలో తన రాజ్యమును తన ఇరువురు దత్తకుమారులకును విభజించి యిచ్చి, 16-9-1816న స్వర్గస్థుడయ్యెను.

---

1. రా. వా. వేం. నా. పుట. 105.
2. రా. వా. వేం. నా. పుట. 128.
3. రా. వా. వేం. నా. పుట. 140.
4. రా. వా. వేం. నా. పుట. 141.
5. రా. వా. వేం. నా. పుట. 140.
6. రా. వా. వేం. నా. పుట. 141.

## వాసిరెడ్డి చంద్రమౌళి

చింతలపాటి సంస్థాన ప్రభువగు ఈ వాసిరెడ్డి చంద్రమౌళిభూపతి[1] యొక్క జనన మరణముల తేదీలు తెలియవచ్చుట లేదు.

వాసిరెడ్డి నాగన్న ప్రభువునకు తనయులు ముప్వురు. 1. రామన్న, 2. జగ్గన్న, 3. వేంకటాద్రినాయుడు. ఈ ముగ్గురికిని సంతానముగలదు. వీరిలో మొదటివాడగు రామన్న కొడుకు నాగన్న వరపు పాపయ్య. రెండవ వాడగు జగ్గన్న కుమారుడు వేంకటాద్రినాయడు (అమరావతి సంస్థాన ప్రభువు). మూడవ వాడగు వేంకటాద్రినాయని కుమారుడు చంద్రమౌళి.

జగ్గభూపాలుని సుతుడగు వేంకటాద్రినాయుడు 1783లో చింతపల్లి (లక్ష్మీపురము) కోటకు ప్రభువైన పిమ్మట, ఆయనకు పినతండ్రి సుతుడగు ఈ చంద్రమౌళి నాగన్నవరపు పాపయ్య చేరి, రాజ్యభాగ లాభములకై వేంకటాద్రినాయనికి వ్యతిరేకముగా ప్రవర్తించిరి. ఆ కారణముగా చంద్రమౌళియు, ఆ నాగన్నయును వేంకటాద్రి ప్రభువులచే 1794లో చింతపల్లి కోటయందు నిర్బంధింపబడిరి.[2] కుంఫిణీవారి ప్రమేయముతో ఆ సంవత్సరమే అనగా 1794లోనే ఈ చంద్రమౌళియు, ఆ నాగన్నవరపు పాపయ్యయును వేంకటాద్రినాయని (చింతపల్లి కోట) నిర్బంధమునుండి విడుదల చేయబడిరి.[3]

3-7-1794నను, 13-7-1894నను ఈ చంద్రమౌళి పెట్టుకొనిన "అర్జీ"లను పరిశీలించి, కుంఫిణీ యధికారులు ఆయనహక్కును గుర్తించి, చంద్రమౌళికిని, నాగన్నకును నెలకు వందరూపాయల భృతిని వేంకటాద్రి

---

1. రా. వా. వేం. నా. పుట. 85.
2. రా. వా. వేం. నా. పుట. 84.
3. రా. వా. వేం. నా. పుట. 101.

నాయడు ఇచ్చునట్లు 31-8-1794, 2-9-1794 తేదీలలో ఉత్తరువులను జారీ చేసిరి.1

నాయని భయముచేత "దివి"లోనే యుండుటకు తనను అనుమతింపవలసి నదిగా చంద్రమౌళి 20-2-1796లో అధికారులను గోరెను. అందులకు కుంఫిణీ వారనుమతించిరి.2 ఆ విధముగా ఈతడు 1796లో స్వతంత్ర ప్రభువయ్యెను.

ఏకైక దుహిత మృతివలనను,తదితర కల్లోలముల కారణముననుమన శ్శాంతిని కోల్పోయిన వేంకటాద్రినాయడు తిరుపతి మొదలగు పుణ్యక్షేత్ర ములను సేవించి వచ్చి, అమరావతిని రాజధానిగ జేసికొని, యందు స్థిరపడిన పిమ్మట పరిస్థితులలో మార్పులు వచ్చెను. జ్ఞాతివైరములు తగ్గిపోయెను. పాలి వారిలో ఆత్మీయత లంకురించెను.

ఈ చంద్రమౌళి నృపునకు ఇద్దఱు తనయులు. పెద్దవాడు పద్మనాభ రామన. రెంటవవాడు జగన్నాథబాబు. ఈతడు తన రెండవ కుమారుడగు జగన్నాథబాబును వెత్తెమాంటకును వేంకటాద్రి నాయనికిని దత్తపుత్త్రునిగా నొసంగెను.3 ఈ చంద్రమౌళి ప్రభువే ములుగు పాపయారాధ్యుల "అహల్యా సంక్రందనము"నకు కృతిపతి.

## జగన్నాథబాబు (1797-1725)

ఈ జగన్నాథబాబు వాసిరెడ్డి చంద్రమౌళిభూపతియొక్క రెండవ సుతుడు. ఈయనకు అగ్రసోదరుడు (అన్న) పద్మనాభరామన.

---

1. రా. వా. వేం. నా. పుట. 101. & Claim of Chandramouli 3-7-1794, 13-7-1794, 31-8-1794, 2-9-1794, V.N. Pays allowance Rs. 100 for month.
2. రా. వా. వేం. నా. పుట. 104.
3. రా. వా. వేం. నా. పుట. 140.

ఈ జగన్నాథబాబు 1797లో జన్మించెను.[1] ఈతడు తన జనకునకు పెదతండ్రి కుమారుడును, అమరావతి సంస్థానమునకు ప్రభువును అగు రాజా వాసిరెడ్డి వేంకటాద్రినాయనికిని, ఆయన పెద్ద భార్యయగు వెన్నమాంబకును (వెన్నమాంబయొక్క సంతానముగా వేంకటాద్రినాయనిచే) 1798లో దత్త పుత్త్రుడుగా స్వీకరింపబడెను.[2] 1803లో ఈయనకు అచ్చమ్మ, రంగమ్మ యను నిద్దఱు బాలికలతో వివాహమయ్యెను.

వేంకటాద్రినాయడు తన రెండవ భార్యయగు పార్వతమ్మకు తనయునిగా రామనాథబాబును దత్తత చేసికొనుటచే ఈ జగన్నాథబాబునకు ఒక (దత్తు) తమ్ముడును తోడయ్యెను. ఈ విధముగా అమరావతి సంస్థానమునకు భాగస్వాములు ఇరువు రేర్పడిరి. తన యవసానదశను గమనించిన వేంకటాద్రినాయడు 23-8-1816న తన యిద్దఱు దత్తపుత్త్రులకును రాజ్యమును (తన పాలనములోని ప్రాంతమును) వీలునామా ద్వారా విభజించి యిచ్చి 16-9-1816లో నతడు దివంగతుడయ్యెను.[3]

ఇతడు తండ్రి మరణానంతరము తన సంస్థానాధిపత్యమును నిర్వహించెను. ఈతడు తన పెద్ద భార్యయగు అచ్చమాంబతో గూడి, ములుగు పాపయారాధ్యుల నభ్యర్థించి, దేవీభాగవతమును తెనుగున ననువదింపుడని కోరెను.[4] ఈయన ప్రేరణచే నాతడాకృతిని రచించి విశ్వేశ్వరాంకితము గావించెను.

ఈతడు తన సంస్థాన పరిపాలనమును చేపట్టిన నాటినుండియు రాజ్యాధికార విషయమున రామనాథబాబుతో నీయనకు వ్యావహారిక వాద

---

1. రా. వా. వేం. నా. పుట. 141.
2. రా. వా. వేం. నా, పుట. 140.
3. రా. వా. వేం. నా. పుటలు. 223, 224.
4. దేవీభాగవతము పుట. 14,15 (1-98 to 6).

వివాదములు జరుగుచునే వచ్చినవి. ఈతడు 28-2-1825న స్వర్గస్థుడయ్యెను.[1]

కుశలవ రామమంత్రి మనుమలైన చినవేంకటప్పయ్య, కాళిదాసుల యుక్తవయస్సుల వైభవములు గూడ పాపయారాధ్యునిచే సరసహృదయాను రంజనములో వర్ణింపబడినవి. కనుక పాపయారాధ్యుడు అంతపఱకును జీవించి యున్నాడనుట స్పష్టము :—

## కవికాల నిర్ణయము — 1756—1852

ములుగు పాపయారాధ్యుల జీవిత కాలమును నిర్ణయించుటలో తోడ్పడు చున్న ఆధారములు :—

1. కవియొక్క ముద్రిత గ్రంథ పీఠికలు. 2. కవి రచనల అవతారికలు. 3. కవి రచనల ఆశ్వాసాంత గద్యలు. 4. కృతిపతుల కాలములు. 5. కృతిప్రేరకుల కాలములు. 6. కవి పోషకుల కాలములు. 7. చరిత్ర కారుల ప్రస్తావనలు. 8. పండితాభిప్రాయములు. 9. ఇతరములు—

ములుగు పాపయారాధ్యుల కృతులలో ఇప్పటికి మూడు మాత్రమే ముద్రితములైనవి. 1924లో (రక్తాక్షి వైశాఖ శుద్ధ విదియనాడు) 1. సర్వమధురము, 1926లో (2) సరసహృదయానురంజనము, 1942లో (3) దేవీభాగవతము ముద్రింపబడి, బహుళ ప్రచారమునందినవి.

శ్రీ తాడేపల్లి వేంకటప్పయ్యశాస్త్రిగారు "సర్వమధురము"నకు "ఉపోద్ఘాతము"ను వ్రాయుచు "ఇక్కవి శతవత్సరమ్ములు జీవించియున్నట్లు తెలియుచున్నది" అనియనిరి. వీరి మాటలకు విలువ ఇయ్యవలసియున్నది. ఎందుల

1. రా. వా. వేం. నా. పుట. 265 & K.D.M. (Krishua District Manual) P. 315 on Feb 28th 1825 the elder brother Jaganatha Babu died."

కనగా ములుగు పాపయారాధ్యులగు ప్రత్యక్ష శిష్యులను బండ్లమూడి రామస్వామిశాస్త్రి (శ్రీ రామచంద్రప్రబంధకర్త) మొదలగు వారితో వేంకటప్పయ్యశాస్త్రిగారు స్వయముగా సంభాషించి పాపయారాధ్యులను గూర్చి తెలిసికొనినట్లు ఆయుపోద్ఘాతములోనే వారు పేర్కొనిరి.[1]

కాని వీరుకవి కాలమును గూర్చి "ఇప్పటినుండి-ఇప్పటి వఱకు" అని స్పష్టముగా పేర్కొనలేదు. ఐనను వారి వాక్యముల సారాంశమును బట్టి కవి జీవితకాలము 1756-1856గా వారుభావించినట్లు కనబడును. ములుగు పాపయారాధ్యుల తమ్మునకు ముని మనుమడనని చెప్పికొనిన శ్రీములుగు వీరభద్ర శాస్త్రిగారు "ఆంధ్రా భ్యుదయము" అను సాహిత్య పత్రికలో ఈ కవి కాలమును 1756—1852" అని తెలిపిరి.[2] వీరే 1926లో ముద్రితమైన "సరసహృదయాను రంజనము" నకు వ్రాసిన విజ్ఞప్తి[3]లో ఈ కవికాలమును "1756—1852"గా పేర్కొనిరి.

ఆ గ్రంథమునకు పీఠిక వ్రాసిన "శతావధాని" శ్రీ సంపన్ముదుంబ సింగరాచార్యుల వారును శ్రీ వీరభద్రశాస్త్రి గారొనర్చిన కాల నిర్ణయమునకు సమ్మతించిరి.[4]

శ్రీ కొడాలి లక్ష్మీనారాయణగారు "రాజావాసిరెడ్డి వేంకటాద్రి నాయుడు" అనుచరిత్ర గ్రంథములో ఈకవికాలమును" "1756-1846"గా భావించిరి.[5] ఈకవి 1846లో మృతిచెందినట్లు శ్రీ కొడాలివారు భావించుటకు సర్వమధుర పీఠికలోని శ్రీ వేంకటప్పయ్య శాస్త్రిగారి ఒక వాక్యము కారణముగా వచ్చును.

---

1. సర్వమధురము - ఉపోద్ఘాతము - పుట. 2.
2. ఆంధ్రాభ్యుదయము-సంపుటి. 1. సంచిక 2&3. ఈసంచిక 1922లో వరంగల్ కేంద్రముగా నడిచినది.
3. స. హృ. రం.-విజ్ఞప్తి. పుట. 1.
4. స. హృ. రం. పీఠిక. పుట. 3.
5. రా. వా. వేం. నా. పుట. 5.

ఆపీఠికలో "వేంకటాద్రి నాయడు మరణించిన పిమ్మట ఈకవి ముప్పది సంవత్సరములకు పైగా జీవించియున్నట్లు" తెలుపబడినది. నాయని వారి మృతి 1816లో జరిగినది. దానికి "30" కలిపి, బహుశా 1846 అని వీరు తలంచియుండ వచ్చును. కాని ఆపీఠికలోనేగల మఱొక వాక్యమును (శత సంవత్సర జీవియను వాక్యమును) దీసికొన్నచో 1756+100 = 1856 అని పేర్కొనుట జరిగియుండెడిదే. అదియును గాక ముద్రణ ప్రమాదము వలన ఇందు 1856కు బదులుగా 1846గా అచ్చువేయుట జరిగినదో యేమో!

శ్రీ వీరభద్ర శాస్త్రిగారు సరసహృదయాను రంజన విజ్ఞప్తిలో వాసిరెడ్డి వేంకటాద్రి నాయని మరణానంతరము పాపయారాధ్యుల వారు 36 (ముప్పది యాఱు) సంవత్సరములు జీవించియున్నట్లు పేర్కొనిరి.

దేవీ భాగవతపీఠికలో శతావధాని, విద్వాన్ భమిడిపాటి అప్పయ్యశాస్త్రి ఈకవి జీవితకాలమును (వయస్సును) ఇట్లు ఒక పద్యములో తెలిపిరి.

కం॥ పదునెనిమిది వందలయేఁ
బదిరెండవహాయణమాన భవ్యదినము దె
బ్బదినాల్గు వత్సరమ్ముల
యదనగు వయసునను శివునియందునఁజేరెన్॥[1]

మరణ సంవత్సరము 1852 అను విషయమున శ్రీ వీరభద్రశాస్త్రి గారికిని వీరికిని తేడాలేదు. మొత్తము వయస్సు వీరభద్ర శాస్త్రిగారి నిర్ణయము ప్రకారము 96 (తొంబది యాఱు) కాగా వీరు డెబ్బది నాల్గు అని తెల్పిరి. పైపద్యములో "తొం, బదియాఱు వత్సరమ్ముల, యదనగువయసు నను" అన్నను, ఛందోభంగము లేదు. అంతేగాక "అదనగువయసు" అనునపుడు సుమారుగా నూఱు సంవత్సరములని భావించుటయు లోకమున పరిపాటి "శతమానమ్ భవతి" అనిగదా! ఆశీర్వచనము. మఱియు జీవితము నూఱేండ్ల పంటఅనిగదా! పెద్దలమాట. కావున "అదనగువయసు" అన్నదానిని బట్టి

1. దేవీభాగవత పీఠిక. పుట. 1.

ఆపద్యమున" తొంబదియారు వత్సరమ్ముల" అనియే రచనా లిఖితరూపమున నుండి యుండవచ్చును. ముద్రణలో మార్పులు వాటిల్లియుండ నగును.

వీరు పేర్కొన్నదియు 96 సంవత్సరముల వయస్సని భావించినచో వీరభద్ర శాస్త్రిగారి యభిప్రాయముతో వీరును ఏకీభవించు చున్నట్లు తలంప వచ్చును.

పాపయారాధ్యులను గూర్చియు, వారికుటుంబ సభ్యులను గూర్చియు ఆ పీఠికలో భమిడి పాటివారు వివరించిరి. వానిని పాపయారాధ్యుల చతుర్థ పుత్త్రిడగు కోటయ్య శాస్త్రిగారియొక్క మనుమడైన ములుగు రామలింగ శాస్త్రిగారివలన తెనాలిలో తెలిసికొనినట్లు వారు పేర్కొనిరి.1 శ్రీ రామలింగ శాస్త్రిగారితో జరిగిన సంభాషణము వలన శ్రీ భమిడిపాటివారు పాపయా రాధ్యుల కాలవయో విశేషములనుగూడ దెలిసికొని యుందురు.

1813 ప్రాంతములో ఈకవి రచించిన2 వేమనారాధ్య చరిత్రము నందు, ఈ కవియును, ఈయన తమ్మడగు సాళ్వపతియును మనుమలను కలిగియున్నట్లు ప్రస్తావింప బడినది.3

మనుమలను (పౌత్త్రిలను) కలిగియుండు వయస్సును ఇంచుమించు "55 - 60" సంవత్సరముల మధ్య వయస్సుగా భావింపనగును

---

1. దే. భాగ. పీఠిక. పుట. 3.
2. ఈప్రకరణమునందే, రచనల కాలములను, వాని యానుపూర్విని చర్చించు సందర్భమున - ఈ వేమానారాధ్యచరిత్ర రచిత కాలమును గూర్చి చర్చింప బడినది.
3. i) వే.ఆ.చ. 1-174 * భాసిల్లు లింగమాంబా వధూటిని బెండ్లి, యాడి గాంచితితనయ ప్రజంబు, వారుగాంచిరి పుత్త్రిల..
   ii) వే. ఆ. చ. 1-160- పుత్త్రి, పౌత్త్రి సమూహ భూషితుండు, పర శివధరుండు శ్రీ సాళ్వపతిగురుండు.

ఈదృష్టితో ఆలోచించి నప్పుడు పాపయారాధ్యుడు వేమనారాధ్య చరిత్రమును తన 57వ యేట రచించియున్నట్లూహింప వచ్చును. 1813లో 57 తగ్గించిన 1756 అగును. కావున వేమనారాధ్య చరిత్ర రచనాకాలమును అనుసరించి చూచినచో పాపయారాధ్యుడు జన్మించిన సంవత్సరమును 1756గా భావించుట సముచితమేయని తోచును.

ఈ కవి ములుగు వీరభద్రశాస్త్రిగారికి పెదముత్తాత.[1] కనుక ప్రతి సంవత్సరము తాతముత్తాతల యొక్క వార్షికారాధనలకు ఆయన అచటికి చేరు చుండుటయు సాధారణవిషయము. ఆసందర్భములందు అచటికి వచ్చిన బంధు మిత్రులతో, పండిత, పరిశోధకులతో కలియుట, సంభాషించుటలద్వారాను, ముఖ్యముగా ఆ వంశమున సుప్రసిద్ధుడైన మహాకవి ములుగు పాపయా రాధ్యులనుగూర్చి జ్ఞానవయో వృద్ధులైన వారిసరస సల్లాపములు వినియుండుట వలనను, శ్రీ వీరభద్రశాస్త్రిగారు పాపయారాధ్యుల కాలాది కములనుగూర్చి, బాగుగా ఎఱిగియుండిరనియే విశ్వసింపదగి యున్నది.

ఈ వీరభద్రశాస్త్రిగారి నిర్ణయమును శతావధాని శ్రీసంపన్ముడుంబ సింగరాచార్యుల వారును బలపఱచుట చేతను, శతావధాని శ్రీ భమిడిపాటి అప్పయ్యశాస్త్రిగారును ఇట్టి యూహనే ప్రకటించుట వలనను, శ్రీ కొండాలివారు తమ చరిత్ర గ్రంథములో దీనికి సమీచీనముగా నూహించి యుండిన కారణమునను, మనుమలు కలిగినవయస్సులో (1812–1813. సం॥లలో) రచింపబడిన వేమనారాధ్య చరిత్ర రచనాకాలమునుబట్టి చూచినను ములుగు పాపయారాధ్యుల జన్మసంవత్సరము 1756 అగుటకే వీలున్నది.

ఆర్లే 1816లో దివంగతుడైన రాజావాసిరెడ్డి వేంకటాద్రినాయని యనంతరము సుమారు 36 సంవత్సరములు ఈకవి జీవించినాడనుటను బట్టి ఈతడు 1852లో శివైక్యము చెందెననుటయు సమంజసమే.

---

4. స. హ్యా. రం. విజ్ఞప్తి. పుట. 1.

అంతేగాక సరసహృదయానురంజనమున కృతిపతి వంశావతార వర్ణనమును బట్టియు ఈకవి 1852 వఱకు జీవించినాడనుటయే సముచితముగా కన్పించుచున్నది. ఈకవి తన సరసహృదయానురంజనమును పొత్తూరి కాళిదాసు తమ్ముడగు కుశలవ రామమంత్రికి నంకితమిచ్చెను. ఈ కాళిదాసు, కుశలవ రామమంత్రి అను ఇరువురును వాసిరెడ్డి వారి సంస్థానమున మంత్రులు.[1]

వేంకటాద్రి నాయుడు కాళిదాసును స్వయముగా పిలిపించుకొని ఆయనకు తన యాస్థానమున సర్వాధికారములతో మంత్రి (ప్రధాని) పదవిని అప్పగించెను.[2]

ఈ కాళిదాసు తన 15వ యేటనే మంత్రియైనట్లు శ్రీ కొడాలివారు పేర్కొనిరి.[2] ఈతని తమ్ముడగు కుశలవ రామమంత్రి "సరస హృదయానురంజనము" నకు కృతిపతి. కృతీశ్వర వంశవర్ణనలో కుశలవ రామమంత్రి మనుమలుగూడ యుక్తవయస్కులైనట్లు వర్ణించుటజరిగినది. దీనినిబట్టి కవి తనకంటె చిన్నవాడైన కుశలవ రామమంత్రియొక్క మనుమలు యుక్తవయస్సులవారైన తరువాత మృతిచెందెననుట తథ్యము. దీనిననుసరించియు పాపయారాధ్యుడు 1852 ప్రాంతముదాక జీవించియున్నట్లు విశ్వసింప వచ్చును కనుక పైన పేర్కొనబడిన పెక్కుసాక్ష్యాధారములను బట్టి ములుగు పాపయారాధ్యునికాలము 1756-1852 అనుట సముచితము.

---

1. రా. వా. వేం. నా. పుట. 232

2. సరసహృదయానురంజనము. 1-129, 130, 131. (అవతారిక.) పుట. 20.

# రచనలు

పాపయారాధ్యుడు తనరచనలను గూర్చి వేమనా రాధ్యచరిత్రలో ప్రస్తావించెను.

సీ॥ పదపదార్థ నిబంధ బంధు రంబుగధరా,
తలమెల్ల నెఱుఁగ "శంతను చరిత్ర"
సరసశృంగారాను షంగముల్ రవణిఁజా,
పగ "నహల్యావధూ పరిణయంబు"
ధీమజ్జన స్వవ్యధీమజ్జనోన్మేష,
కరముగా నలరు "ఘూర్జర చరిత్ర"
లసదలంకార లాలసవిశంకటముగాఁ
బరగు "నింద్రాత్మజా పరిణయంబు"

గీ॥ శతకపూజా స్తవంబుల సంఖ్య సంఖ్య మీరనీవు పొసంగించు మేలికావ్య
రచన మాకెల్ల సమ్ముదార్ధ్రితఁబొనర్చెఁ సరసరుచిసాంద్ర!
సంగమేశ్వరకవీంద్ర! వే॥అ॥చ॥ 1-25

దీనినిబట్టి వేమనారాధ్య చరిత్రము వ్రాయునాటికీకవి వరుసగ శంతను చరిత్రము, అహల్యాసంక్రందన విలాసము (ఈ సీసమున "అహల్యా వధూ పరిణయము" అని యున్నను ఆ ప్రబంధము నందవతారిక మొదలుకొని అశ్వాసాంత గద్యముల వఱకును అన్ని సందర్భములలోను దీనిని "అహల్యా సంక్రందన విలాసము" అను నామముతోడనే కవి పేర్కొనెను.) ఘూర్జర చరిత్రము, "ఇంద్రాత్మజా పరిణయము" కొన్ని శతకములు, పూజా స్తవములు, రచించియున్నట్లు స్పష్టమగుచున్నది. కాని వానిలో ఒక్క "అహల్యా సంక్రందన విలాసము", దప్ప తక్కిన ప్రబంధములు అలభ్యములు, ఆ అహల్యా సంక్రందన విలాసము గూడ ఇంతవఱకును అముద్రితము. దాని వ్రాతప్రతి "ఒక్కటి" మాత్రము మద్రాసు, ప్రభుత్వ ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమున ప్రస్తుతము అందుబాటులో గలదు. అందును లేవ (చివరి)

ఆశ్వాసములో తుదిభాగము (8 పత్రములు) కొంత ఖిలమైపోయినది. ఇక శతకములును, పూజాస్తవములునుగూడ సంపూర్ణముగా లభించుటలేదు. ప్రతి శతకము నందును కొన్ని కొన్ని పద్యములు మాత్రమే లభ్యములగుచున్నవి. అవి మాత్రము 1907లో ముద్రితములు.

అహల్యాసంక్రందనవిలాసము వాసిరెడ్డి చంద్రమౌళిభూపతికి అంకితమీయ బడినది. ఈతడు వాసిరెడ్డి వేంకటాద్రి నాయనికి పినతండ్రి కుమారుడు. ఈ చంద్రమౌళి తనకువచ్చిన చిక్కులనుండి బయటపడి 1796లో స్వతంత్ర ప్రభువై "చింతపల్లి" అనుదానిని కేంద్రముగా జేసికొని, తనపాలనను నెరపెను.

ములుగు పాపయార్యుడు వాసిరెడ్డి ప్రభువులందఱికిని మిత్రుడు గాన చంద్రమౌళి నృపతి స్వతంత్ర ప్రభువైన అయానంద సమయమున ఈ "అహల్యా సంక్రందన విలాసము"ను ఆయన కంకితమిచ్చి యుండును. కాన ఇది 1796లో రచింపబడి యుండునని తలచుటయుక్తి యుక్తము.

అలభ్య కృతులను గూర్చి వివరించుటకెట్టి సమాచారము గూడ లేదు గాన మిన్నకుండుటమే జరిగినది.

తరువాతి రచన "శ్రీమద్వేమ నారాధ్యచరిత్రము" ఇప్పటికిని ఇది అముద్రితమే. దీని యొకటి రెండు ప్రతులు ప్రస్తుతమునకు ఆరాధ్య సంప్రదాయజ్ఞుల గృహములందు భద్రముగా నున్నట్లు తెలియుచున్నది. స్పష్టముగా ఎవరి కడ నున్నదియు ఎవ్వరును తెలుపలకుండిరి.

ములుగు వీరభద్రశాస్త్రిగారు 10 (పది) సంవత్సరములపాటు మిక్కిలి శ్రమపడి, వేమనారాధ్య చరిత్రమును, (వ్రాతప్రతిని) అహల్యా సంక్రందన విలాసమును (వ్రాతప్రతిని)తదితరములను కొన్నింటిని సంపాదించినట్లు సరస హృదయానురంజన విజ్ఞప్తిలో దెల్పిరి. కాని వారు సేకరించిన ఆ ప్రతులే మైనవో తెలియదు. ప్రస్తుతము వారు కైలాసవాసులు. వారి బంధువులను

వరంగల్‌లో విచారించితిని. కాని వారు దాని అచూకీనైనను చెప్పలేకపోయిరి. పెక్కు శ్రమలకోర్చి, ప్రాణమొక యెత్తుగా ఆయా పండితులు సంపాదించి, పదిలపఱచుకొనిన అమూల్య గ్రంథములన్నియును వారు కన్నుమూసిన మఱు క్షణముననే కనుమఱుగై పోవుచుండుట ఆశ్చర్యమును కలిగింపదుగాని, వేదనను గూర్చును.

ఈ వేమనారాధ్య చరిత్ర ప్రతిని సంపాదించుటకై, పెక్కు ప్రదేశము లలో సంచరించితిని. శతాధికారాధ్య బ్రాహ్మణ గృహముల విచారించితిని. దకు దీని అచూకీని తెలిపినవారు శివశ్రీ ములుగు పండితయ్యగారు. (వీరిని కాసిగూడ, సికిందరాబాదులో కలిసికొంటిని. అప్పటికి వీరు చాల వయో వృద్ధులు.)1 వీరందించిన సమాచారము మేరకు ఈమని వెళ్ళి, శివశ్రీ ముది గొండ కొండయ్య ఆరాధ్యుల వారిని కలిసికొని నా యవస్థను వారికి వివరించి తిని. వారు దయతో "దుగ్గిరాలలో పండితారాధ్యుల పండయ్యగారి యింట యున్న "వేమనారాధ్య చరిత్ర" (వ్రాత)ప్రతిని తెప్పించి, నాకందజేసిరి."2

ఈ వేమనారాధ్య చరిత్రమునందు కవి తన వంశ చరిత్రమును సుదీర్ఘ ముగా వర్ణించెను. అందు వేమనారాధ్యులనుండి తన తరమువారి వఱకును విపులముగా వివరించెను. అప్పటికి తనకును, తన తమ్ముడగు సాంబపతికిని మనుమలు (పౌత్రులు) కలిగియున్నట్లు తెలిపెను. పుత్రపౌత్రులతో గూడి యున్న ఈ కవి వయస్సు సుమారు 55-60 సం॥ల మధ్య నుండియుండును. శక 1756 లో జన్మించిన యీ కవి తన 55-60 సం॥ల మధ్య వయస్సున నగా 1813 లో దీనిని విరచించినట్లు తలంచుట సమిచితమగును. ఈ రచనలో కవి అటనట "సంగమేశ్వర" "పాపయ్య" అను తన నామద్వయ మును ప్రస్తావించెను.

1. ప్రస్తుతము వీరు (శివశ్రీ ములుగు పండితయ్యగారు) లింగైక్యము చెందియున్నారు.
2. ఈ విషయమున తోడ్పడిన శివశ్రీ ములుగు పండితయ్య గారికిని, శివశ్రీ ముదిగొండ కొండయ్య ఆరాధ్యుల వారికిని నేనెంతయు కృతజ్ఞుడను.

అహల్యా సంక్రందన విలాసమునందువలె వేమనారాధ్య చరిత్రము నందును, సరస హృదయానురంజనము నందును, అశ్వాసాంత గద్యములలో కవి తన ప్రతిభాపాటవములను చాటుకొనుట జరిగినది. కాని సరసహృదయానురంజనములో కవి తన నామ ప్రస్తావన సందర్భములలో పాపయారాధ్య నామమునే పేర్కొనెను. కనుక ఈ సరస హృదయానురంజనము వేమనారాధ్య చరిత్రమునకు అనంతర రచనయే. కావున దీనిని కవి 1816లో రచియించి యుండవోపును.

దీని తరువాతి రచన సర్వమధురము. ఇది "అచ్చతెనుగు కృతి" ఇందలి ఆశ్వాసాంత పద్యములలో కవి తన ప్రతిభ నేమాత్రము ప్రస్తావింపక తన పేరు పాపయారాధ్యుడని (పాపయారదున్ అని) మాత్రము తెలిపెను. కనుక ప్రతిభను ప్రకటించుకొను మోజు తగ్గి, పరిణతి కలిగిన పిమ్మట చేసిన రచన యిది. కావున ఇది సరసహృదయానురంజనమునకు తరువాత చేయబడిన రచనయే. అందువలన ఇంచుమించు ఇది 1818 లో నిర్మింపబడి నట్లూహించుట సముచిత మనిపించును.

ఇక ఈ కవి కృత తెలుగు ప్రబంధములలో మిగిలినది "దేవీ భాగవతము". దీనిని కవి వాసిరెడ్డి వేంకటాద్రినాయని ప్రథమ దత్తపుత్రుడైన "జగన్నాథబాబు" ప్రేరణచే రచించి, కాశీవిశ్వేశ్వరాంకితము గావించెను. ఇందు ఆయా సందర్భములలో తన నామ ప్రస్తావనమునందు పాపయారాధ్య నామమునే పేర్కొనెను. అశ్వాసాంత గద్యములలో ప్రతిభలను ప్రకటించు కొనలేదు. ఆ గద్యలలో కవి తన శివాద్వైత భావనను దెలిపెను.

ఈ జగన్నాథబాబు 1825 లో (28-2-1825 న) స్వర్గస్థు డయ్యెను.[1] వేంకటాద్రి నాయడు 1816 లో దివంగతుడయ్యెను. తండ్రి మరణానంతరము

1. రా. వా. వేం. నా. పుట 2—65 K. D. M. Page 315. "On Feb. 25th, 1825 the elder brother Jagannatha Babu died (కృష్ణా జిల్లా మాన్యువల్).

నితడు స్వతంత్ర ప్రభువై కవిని దేవీ భాగవత రచనకు ప్రోత్సహించెను. కాబట్టి దేవీ భాగవతము 1816-1825 సం॥ల మధ్య అనగా దాదాపు 1820లో రచియింపబడినట్లు తలంచుట సహేతుకము గావచ్చును.

ఇక నక్షత్ర మాలికను గూర్చి - ఇది పద్య సంఖ్యను బట్టి చిన్నదిట్టి కాని "ముక్తి ద్వారము తల్పు తీయ (గదె చాముండా! జగజ్జీవనీ!" అను మకుటముతో సాగిన 28 పద్యములు గల మహాప్రౌఢ రచన యిది. అన్ని పద్యములును "క్త" ప్రాసముతో నడిచినవి.

శా॥ త్వత్కారుణ్యముడుస్సె, దస్సెవలవంతల్, చూపులోపించె, స
వ్యక్తంబయ్యె దిగంతరాళము, భవిష్యద్భ్రాంతులూటాడె, సం
పృక్తంబయ్యెను బుద్ధిమాంద్యము, భవత్ప్రేమంబు దిక్కంటి, నీ
ముక్తిద్వారము తల్పుదీయ(గదె చాముండా! జగజ్జీవనీ!

అను పద్యమునుబట్టి, తారుణ్యము సడలి, చూపు లోపించి, బుద్ధి మాంద్య మేర్పడిన దశలో కవి దీనిని రచించినట్లు తెల్లమగుచున్నది. ఈ రచనకును వేంకటాద్రి నాయనికిని సంబంధించి యొక యైతిహ్యము గలదు. ఈ ప్రకరణముననే దాని వివరణము చేయబడినది. కవి యొక్క వార్ధక్య ప్రారంభ దశతో నాయని యవసాన దశ1ను సమన్వయించినచో ఇది 1815 లో రచితమై యుండవచ్చును.

సంస్కృత రచనలలో ''ఆర్యాశతీ శివస్తోత్రము'' మొట్టమొదటిదని భావింపవచ్చును. దానినెవ్వరికైనను అంకిత మిచ్చినదియు లేనిదియు తెలియదు. ఇది ప్రస్తుత మలభ్యము. దీనిని కవి తన 20 ఏండ్ల ప్రాయమున అనగా 1776 ప్రాంతమున రచియించి యుండనగును. దీని తరువాతి రచన "ఏకాదశీ వ్రత చంపువు'' ఇది అముద్రితము. అలభ్యము. దీనిని కవి వాసిరెడ్డి వేంకటాద్రి నాయని కంకిత మిచ్చినట్లు ముదిగొండ బసవయ్యగారు తెలిపిరి.2

---

1. వేంకటాద్రినాయడు 16-9-1816 న దివంగతుడయ్యెను.
2. దుర్మతి సంవత్సరాది (1921) సంచిక (ఆంధ్రపత్రిక) మఱియు 1965 స్వర్ణోత్సవ సంచిక.

కాని కొమ్మనమంచి జోగయ్యశర్మగారు విజ్ఞానసర్వస్వములో ఈ విషయమును గూర్చి వ్రాయుచు ఏకాదశీ వ్రతచంపువును నాయనివారి కంకిత మీయలేదని తెలిపిరి.[1] గ్రంథము లభ్యమగుచో ఇందలి వాస్తవ విషయమును నిర్ణయింప వీలగును. కాని కవి దీనిని నాయనివారి కాలముననే ముఖ్యముగా వారు పట్టాభిషిక్తులైన సంవత్సరమునందే (1783 లోనే) వ్రాసియుండ వచ్చును.

కల్యాణ చంపూ (సంస్కృత) ప్రబంధము ఐదు (5) స్తబకములుగా వ్రాయబడినది. ప్రతి స్తబకాంతమునను గద్యము కలదు. ''ఇతి పాపయారాధ్య విరచితే, కల్యాణ చంపూ ప్రబంధే, పంచమః స్తబకః సమాప్తః''. శుభం భూయాత్. అని గ్రంథాంతమున గలదు. ఈ గద్యకు పిమ్మట

శ్లో॥ దిగ్వధూకర్ణ కల్హార చూళీ కేళిం తనోతుసా
వేమారాధ్యకులీనా యా పాపయారాధ్య భారతీ॥

అను శ్లోకము గలదు. పై గద్యయందును, ఈ శ్లోకమునందును తన పేరును. పాపయారాధ్య అని చెప్పికొనుటచే, కవి తనకు పాపయారాధ్య నామము స్థిర పడిన తరువాత దీనిని రచించినట్లు భావింపవలసి యున్నది. కనుక ఈ చంపూ (సంస్కృత) ప్రబంధమును సుమారుగా "1816 – 1820" మధ్య కాలమున వ్రాసియున్నట్లూహించుట సమంజసముగా తోచును.

ఇక సంస్కృత రచనలలో మిగిలినది వేదాంత సారసంగ్రహము. ఇది యిప్పటికిని అచ్చు కాలేదు. దీని ప్రతి యొకటి మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమున గ్రంథ (తమిళ) లిపిలో గలదు.[2] పేరునకు తగినట్లుగనే సంగ్రహ రచన. 15 పుటలలో కొనసాగినది. ఈ గ్రంథాంతమున "ఇతి

1. విజ్ఞాన సర్వస్వము ౩వ భాగము పుట. 918. (తెలుగుభాషా సమితి).
2. S.R. 913, R 2232 కాగితం ప్రతి. మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారము.

శ్రీవేమనారాధ్య వంశోద్భవ పాపయారాధ్య విరచితోఽయం వేదాంతసార సంగ్రహః సమాప్తః" అను గద్యము గలదు. ఇందును పాపయారాధ్య నామమునే ప్రస్తావించెను. కనుక ఇదియును 1716 తరువాతనే రచింపబడినట్లు తలంపవలయును.

పాపయారాధ్యునకు శతాధిక గ్రంథకర్తగా పేరున్నను కొన్ని (15) పేర్లు మాత్రమే తెలియవచ్చుచున్నవి. వానిలో నిక మిగిలినది "శశికళ". కవి తన యవసాన దశలో దీనిని వ్రాసినట్లు కనబడును. ఈతడు 1852లో కైలాసవాసి యయ్యెనని భావింపబడుచున్నందున దీనిని 1830 — 1840 ప్రాంతంలో వ్రాసియుండునని యూహింపనగును.

## గ్రంథముల - ఆనుపూర్విని నిర్ణయించుటలో గ్రంథాంత గద్యముల పాత్ర

1) ఇది శ్రీమదుభయ భాషారసజ్ఞ, రసజ్ఞాగ్ర నృత్యన్నాటకాలంకార గ్రంథ+ఆంధ్ర ప్రబంధ బంధుర కవితా నిబంధన శ్రీమద్వేమనారాధ్య వంశ పయః పారావార రాకాసుధాకర "శ్రీ సంగమేశ్వరారాధ్య" విరచితంబగు "అహల్యా సంక్రందన విలాసంబ"ను మహాప్రబంధంబునందు సర్వంబును పంచమాశ్వాసము — (ఇందు సంగమేశ్వర నామము మాత్రమే పేర్కొనబడినది).

2) ఇది శ్రీమదుభయ భాషా రసజ్ఞ, రసజ్ఞాగ్ర నృత్యన్నాటకాలంకార గ్రంథ+ఆంధ్ర ప్రబంధుర కవితా నిబంధన శివానుభవసూత్ర సంధాన సంధానిరర్గళ మానసావధాన శ్రీమద్వేమనారాధ్య వంశ పయః పారావారరాకా సుధాకర శ్రీ వీరనారాధ్యార్ధాంగలక్ష్మీ శోభావిభాసుర భ్రమరాంబికా శుక్తి ముక్తాఫల శ్రీ సంగమేశ్వరారాధ్య విరచితంబగు శ్రీ మద్వేమనారాధ్య చరిత్రంబను మహా ప్రబంధంబునందు.... అవతారికలో నామద్వయము ప్రకటితము.

(3) ఇది శ్రీమదుభయ భాషా రసజ్ఞాగ్రగణ్య నాటకాలంకార గ్రంథాంధ్రప్రబంధ బంధురకవితా నిబంధన శ్రీమద్వేమనారాధ్యములుగు వంశ పయః పారావార రాకాసుధాకర శ్రీ పాపయారాధ్య విరచితంబగు "సరసహృదయానురంజనంబ"ను మహాప్రబంధంబునందు......

ఇందు పాపయారాధ్య నామము మాత్రమే ప్రయోగింపబడినది.

(4) ఇది యపరంజి సౌమ్ముపయి... ....ముల్లు పాపయా రదులొనరించు "సర్వమధురంబు"న మూఁడవ విన్నపంబగున్॥

ఇందు పాపయారాధ్య నామము మాత్రమే ప్రయోగింపబడినది.

(5) ఇది శ్రీ పరమశివాద్వైత భావనాసాధ్యముల్లు సదన్వయ సిద్ధ సారస్వతవిద్యా సాన్నిధ్య వేమనారాధ్య వంశార్ణవ కళానిధాన పాపయారాధ్యాభిధానప్రణీతంబైన దేవీభాగవతమను మహాపురాణంబునందు ... ఇందు పాపయారాధ్య నామమే పేర్కొనబడినది.

6) ఇతి శ్రీమత్ సంస్కృతాంధ్ర కవితా సాహిత్యగాన విద్యావైభవ ప్రాభవేన వేమనారాధ్యాభిజనాబ్ధి శుభ్రాంశునిభేన పాపయారాధ్యాభిధాన శాస్త్రిణా జపమాలికా పరిమాణకృత పద్యమాలికేయం సమాప్తమగమత్.

ఇందును పాపయారాధ్యనామము మాత్రమే—

7) ఇతి పాపయారాధ్య విరచితే కల్యాణచంపూప్రబంధే పంచమః స్తబకః సమాప్తః॥ ఇందును పాపయారాధ్య నామము మాత్రమే॥

8) ఇతి శ్రీవేమనారాధ్య వంశోద్భవ పాపయారాధ్య విరచితోఽయం "వేదాంత సార సంగ్రహః" సమాప్తః— ఇందును పాపయారాధ్య నామము మాత్రమే.

గద్య భూమికా సమీక్ష

1) మొదటి మూడు గ్రంథముల గద్యలలోను కవి తనపాండిత్య ప్రకర్షను ప్రత్యేకముగా పేర్కొనెను,

2) నాల్గవ గ్రంథమునుండి అనగా సర్వమధురమునుండి వైదుష్య వైభవములను ప్రకటింపలేదు.

3) అహల్యా సంక్రందన విలాసమున ఒక్క సంగమేశ్వర నామమునే ప్రకటించెను.

4) వేమనారాధ్య చరిత్రలో "సంగమేశ్వర" "పాపయారాధ్య" అను రెండు పేర్లను ప్రయోగించెను.

5) సరసహృదయానురంజనమునుండి "పాపయారాధ్య" అను పేరును మాత్రమే ప్రకటించెను.

i) కొంతకాలమువఱకు - సంగమేశ్వరా రాధ్యుడుగా

ii) వేమనారాధ్య చరిత్రమును రచించు కాలమున సంగమేశ్వరారాధ్య పాపయారాధ్య - నామద్వయముతోడను

iii) ఆ పిమ్మట కేవలము పాపయారాధ్య నామముతోడను, మాత్రమే కవివ్యవహరింపబడుచు వచ్చినట్లు గన్పట్టును.

పూర్వ పూర్వగ్రంథాంత గద్యములలో పాండిత్య ప్రకర్షను ప్రకటించుట, రానురాను క్రమముగా ఆ ప్రకర్షారీతిని మానుట, అట్లే మొదట సంగమేశ్వర నామమును, మధ్యలో కొంతకాలము "సంగమేశ్వర" "పాపయారాధ్య" అను నామద్వయమును, అనంతరము పాపయారాధ్య నామమును మాత్రమే పేర్కొనుట అను అంశములను జాగ్రత్తగా పరిశీలించి, ఆయా కృతులు రచింపబడిన పూర్వాపరక్రమమును, వాని కాలములను నిర్ణయించుట జరిగినది.

## విద్యా వైభవములు

పాపయారాధ్యుడు జన్మించిన ములుగు వంశము వేదాగమములకు వేదిక.[1] శాస్త్ర సాహిత్యములకు సన్నిధి.[2] పురాణేతిహాస విజ్ఞానములకుపుట్టిల్లు.[3]

1) వే.ఆ.చ. 1.118. 2) వే.ఆ.చ. 1.143, 150. 3) వే.ఆ.చ. 1.167.

శారభా ఘోరాది మంత్రోపాసనలకు మనికి పట్టు.[1] ఒక్కమాటలో చెప్పవలె నన్న ఆ వంశము నిఖిల విద్యానికేతనము.

అట్టి విద్వద్వంశమున పుట్టినవాడు పాపయారాధ్యుడు. దీనికి తోడు ఈయన మాతామహుడు షడ్దర్శనములపారము ముట్టి, సాహిత్య నిధియై, వాసి కెక్కినవాడు.[2] కావున మాతృవాదసత్వ గూడ ఈయన విద్యాలాభములకు దోహదకారియే యైనది.

ఈతడు తన బిరుదములలో "అభినవ కాళిదాసు" అను దానిని చెప్పి కొనినాడు.[3] దీనినిబట్టి యీతడు ఆ కాళిదాస మహాకవి రచనలను ఆమూలా గ్రముగా అధ్యయనము చేసినాడని భావింపవచ్చును. కవి స్తుతిలో నితడు భారవి, హేమచంద్ర, కవిభల్లట, బిల్హణ, కాళిదాస మయూర, మురారి, చోళ, నిచుళోద్భటుల నామములను పేర్కొనెను. దీని ననుసరించి యీ కవివతంసుల రచనల నన్నింటిని ఇతడు సమగ్రముగా చదివియుండును.

ఈతడు తన పితామహుడైన సంగమేశ్వరారాధ్యుల కడగాని, తండ్రి యగు వీరనారాధ్యుల యొద్దగాని, అధ్యయనము చేసినట్లు స్వయముగా ప్రస్తా వింపకున్నను వారి దగ్గరకూడ నితడధ్యయనము చేసియుండును. ఆ యుభ యులును వివిధ విద్యావిశారదులే. ముఖ్యముగా తాతయగు సంగమేశ్వరుడు శైవపంచక బోధనావధాని.

"శంభులింగార్య దేశికస్వామిఁ గొలుతు" అని వేమనారాధ్య చరిత్రము నందును (1-9) సరసహృదయానురంజనము నందును (1-11) ఈతడు గురుస్తుతి యొనర్చినాడు. దీనినిబట్టి ఈయన విద్యాగురువు పండితారాధ్యుల శంభులింగదేశికులు అనుటస్పష్టము. అంతేగాక శంభులింగార్యదేశిక" "స్వామి" గొలుతు - అను ప్రయోగమున "స్వామి" అనుటను బట్టి,

1) వే అ.చ. 1-136. 2) వే అ.చ. 1.9. 3) వే.అ.చ. 1.172.

పాపయారాధ్యునకు "శివదీక్ష" యిచ్చిన (లింగధారణముచేయించిన) గురువు గూడ ఈతడేయని తోచుచున్నది.1

పాపయారాధ్యుడు తన విద్యావిశేషములను గూర్చి అవతారికా పద్యములలో, గ్రంథాంత గద్యములలో చాలవఱకు స్వయముగనే పేర్కొనెను. అయన శిష్య ప్రశిష్యులతో, పుత్త్రపౌత్త్రులతో, కలిసి మసలిన కవిపండితుల ప్రస్తావనల వలనను కొన్ని విషయములు తెలియవచ్చుచున్నవి.

పాపయారాధ్యుడు వ్యాకరణ శాస్త్రమును భాష్యాంతము బాగుగా అధ్యయనము చేసెను. తర్క శాస్త్రమును ఆపోశనము పట్టెను. అలంకారశాస్త్రమును కరతలామలక మొనర్చుకొనెను. ఆంధ్ర గీర్వాణ సాహిత్యములను సమగ్రముగ పఠించెను 2 జ్యోతిష శాస్త్రపండితుడయ్యెను.3 గాన కళాకుశలుడయ్యెను4 వైద్య విద్యా నిష్ణాతుడయ్యెను5 చదరంగము మొదలగు క్రీడలలో గూడ నీతుడు నేర్పరి.6 ఈ కవి రచనలలో యోగశాస్త్ర ప్రస్తావనలును,

---

1. దీక్షాగురువును- స్వామీ! భట్టారకా! ఆచార్యా! దేవా! శ్రీగురూ! అను నామములతోడనే సంబోధింపవలయునని చంద్రజ్ఞానోత్తరాగమము నుడువుచున్నది.

శ్లో॥ స్వామి, భట్టారకాచార్య, దేవ, శ్రీగురు, నామభిః,
వాచ్యస్సదా గురుశ్శిష్యైః, జాతుచిన్నాన్య నామభిః
చం.జ్ఞా. ఆగమము 2-40. పుట. 23.

2. వే.అ.చ. 1-173. సరసశేఖర, తర్క, శాబ్దికాలంకార, సాహిత్య, సామ్రాజ్య చక్రవర్తి, ఆంధ్ర సంస్కృత సత్ప్రబంధ బంధుర కల్పనానల్పకవితా వితానఘనుడు.

3. అ.సం. విలాసము 1-16 - ఘనదైవజ్ఞ కళా విచక్షణుడు.

4. భ్రామరీస్తవ (శశికళ) గద్య - ఇతి శ్రీమత్సంస్కృతాంధ్ర కవితా సాహిత్య గాన విద్యా వైభవ ప్రాభవేన ... పాపయారాధ్యాభిధాన శాస్త్రిణా జపమాలికా పరిమాణ కృత పద్యమాలికేయం సమాప్తి మగమత్—

5&6. దేవీభాగవత పీఠిక—ప్రశంసలు—పుట. 15

వివరణలును గలవు.[1] వానిని బట్టి గమనించినచో నీకవి నిత్యయోగాభ్యాస నిరతుడుగా గోచరించును. ఈ క్రింది పద్యమును బాగుగా పరికించినచో నీకవి విద్యా వైభవములెల్ల నవగతము కాగలవు.

సీ॥ భాష్యముల్ సిద్ధాన్త పారంపరులు నిగ,
మంబులాగమములామ్నాయములును
ధర్మశాస్త్రములు విద్యారణ్యము పనిష.
ద్వ్యాఖ్యానముల్ శ్రుతుల్ దశశతములు
సంగ్రహంబులు శైవశాస్త్రముల్ విజ్ఞాన,
సాధనంబులు వ్యాససంహితలును,
సూత్రవిధానముల్ జ్యోతిర్వివక్షలు,
ముక్తి మార్గములు ముముక్షు విధులు.

గీ॥ మొదలుగా గల్గు గ్రంథ సమూహములను,
నిందుగావళ్ళ తండోపతండములుగ
శిష్యజనములు మోచిరా స్థిరయశుండు,
కదలి చనియెను విభవంబు గడలుకొనఁగ॥

వే. ఆ. చ. 3-57

ఈ పద్యము వేమనారాధ్యుడు సపరివారముగా కావలినుండి మధురకు బయలు దేఱినప్పుడు చేసిన ప్రయాణ వర్ణములోనిది—.

పై పద్య వర్ణితాంశములను బట్టి చూచినచో కవి వివిధమత భాష్యములను కూలంకషముగా పఠించినట్లు తోచును. ఆతడు సర్వమత సిద్ధాంతముల తారతమ్యములను శోధించియుండును. నిగమాగముల నిగ్గు దేల్చి వాని సారములను పిండియుండును. ధర్మశాస్త్రములను పరిశోధించియుండును.

1. ఆ. సం. విలాసము. 5వ అశ్వాసము. గౌతముముని కోడి కూతవిని, నదికేగిన సందర్భమున యోగశాస్త్ర ప్రస్తావన కలదు. వే. ఆ. చ. 8-176 to 197 దీర్ఘ వివరణము.

విద్యారణ్యమును, ఉపనిషత్తులను వాని వ్యాఖ్యానములను సవిమర్శకముగా పఠించి, తద్విశేషములను తలస్పర్శగా గ్రహించి యుండును. శైవశాస్త్రముల నెల్ల జిహ్వాగ్రమున నిల్పుకొని యుండును. అందువలననే గాబోలు. కవి తనను గూర్చి వివరించుచు వేమనారాధ్య చరిత్రమున (1-172).

"సురగురుత్వమటుంచి, నరగురుత్వముసేయ
జగతి డిగ్గిన బృహస్పతి" యనంగ,

అనియును, సరసహృదయానురంజనమున (1-21).

మ॥ వరపుంభావ సరస్వతీ . . . . . గ్రంథ క
ల్పరతోత్సాహివి, పాపయార్యసుకవీ! ప్రత్యక్ష శోభాకరవీ!

అనియును, చెప్పికొనెను. ఇంకను గ్రంథాంత గద్యములలోను తన విద్యా వైభవములను పేర్కొనెను. ఆయా ప్రస్తావనలనన్నింటిని సమన్వయించి చూచినచో పాపయారాధ్యుడు వివిధ విద్యావిశారదుడై, బుద్ధికి బృహస్పతిగా, చదువుల సరస్వతిగా వాసి కెక్కినటుల గన్పట్టును.

## ఆస్థాన సభలలో "నివాళు లందిన పాపయారాధ్య భారతి"

రాజా వాసిరెడ్డి వేంకటాద్రినాయడు 1783 నుండి 1796 వఱకు చింత పల్లిని కేంద్రముగా జేసికొని, తన సంస్థానాధిపత్యమును నిర్వహించెను. 1797లో ఇతడు సుప్రసిద్ధులగు శిల్పాచార్యులచే సర్వాంగసుందరముగ అమరావతి నగర నిర్మాణము చేయించెను. అందు నందనోద్యానవనమ్మును, సుధర్మ యను రాజసభను వినిర్మింపజేసెను.

ఈ వేంకటాద్రినాయడు తన రాజసభా భవనమున కెదురుగా నొక విద్యాభవనమును నిర్మింపజేసినాడనియు, అది శ్రీకృష్ణదేవరాయల భువన విజయ సభా భవనమును స్ఫురింపజేయునట్టిది యనియు, రాయలవలె ఈత డందు కవితా గోష్ఠులను నిర్వహించుచుండెడి వాడనియు శ్రీ కొడాలి లక్ష్మీ నారాయణగారు తెలిపిరి.

1. ధా.వా.వేం.నా, పుట 152,

వాసిరెడ్డి వేంకటాద్రి నాయని సభలో తొమ్మండుగురు కవులు ఉండెడి వారనియు, వారిలో ముఖ్యుడు పాపయారాధ్య దగ్రపూజ్యుడనియు, తమకు తెలియవచ్చినట్లు శ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు దేవీభాగవత—ఉపోద్ఘాతములో ఉగ్గడించిరి.1 ఆ నవరత్న కవులలో పాపయారాధ్యుడు, బుచ్చివెంకు, అను ఇరువురి నామములు మాత్రమే తమకు తెలియునని శ్రీ శాస్త్రిగారందు వివరించిరి. ఇంకను దిట్టకవి రామచంద్ర కవి,2 వట్టెము విరూపాక్షశాస్త్రి3 అను వారును, ఆ యాస్థాన కవులేయని శ్రీ కొడాలి వారు వ్రాసిరి. మఱియును చతుశ్శాస్త్ర పారంగతుడైన వావిలాల వేంకటశాస్త్రి, సహస్రావధాన కుశలుడగు శ్రీ రాఘవాచార్యులు, తర్క—వేదాంతాది శాస్త్రపండితుడు మల్లాది రామకృష్ణ చయనులు, ఈ యాస్థానకవి, పండిత కోటిలోని వారేయని కొక్కొండ సత్యవతిగారు తమ వ్యాస ప్రభాసలో తెల్పిరి.4

ఇంకను, ఈ యమరావతి సంస్థానమును అలరింపజేసిన కవి పండిత శిరోమణుల పేర్లు తెలియవలసి యున్నవి. వేంకటాద్రి నాయని కాలమునందే గాక, జగన్నాథ భూపతి పాలమునందును తదాస్థానమున పెక్కుమంది కవులున్నట్లు తెలియుచున్నది.5 ఈ నవరత్న కవులలో పాపయారాధ్యుడు నాయకమణిగా వాసికెక్కినట్లు ప్రసిద్ధి—

పాపయారాధ్యుడు బాల్యమునుండియు వాసిరెడ్డి వేంకటాద్రి నాయడు మొదలగు వారితో చెలిమితో మసలెను. ఈయన యొక్క విద్యాబుద్ధి వైభవములు, మధుర కవితారీతులు, సర్వమత సిద్ధాన్త సామరస్య ధోరణులు, ఆధీతి బోధాచరణ ప్రచార సహితమైన శివాద్వైత సిద్ధాన్త జీవన సరళి, వేంకటాద్రి నాయనిని మిక్కిలి ముగ్ధుని నొనర్చెను.

కవి, పండిత గోష్ఠులలో పాల్గొనుటయన్న పాపయారాధ్యులకు పరమానన్దము. వేంకటాద్రి నాయని "సుకవి విజయ" సభావేదికచే ఒక వెలుగు

1. దేవీభాగవతము - ఉపోద్ఘాతము. పుట. 3.
2. రా.వా.వేం.నా. పుటలు. 69 to 152. 3. రా.వా.వేం.నా. పుట.151.
4. వ్యాసప్రభాస. పుటలు - 109, 110. 5. దేవి భాగవతము 1.105.

దివ్యేగా విలసిల్లినది పాపయారాధ్య కవితా భారతి. విద్యా వైభవములను, అసాధారణ ప్రతిభాపాటవములను ప్రకటించి, అమరావతి సంస్థాన కీర్తి ప్రతిష్ఠలను అజరామర మొనర్చినందువలననే యతడు వేంకటాద్రినాయని యాస్థానమున గురు పీఠమున సుప్రతిష్ఠితుడై యలరారెను.[1]

ఇంకను ఈకవి వాసిరెడ్డి చంద్రమౌళి నృపతి సంస్థానమునందును తన కవితా ప్రాభవములచే సహృదయులకు రసానందములగూర్చి ప్రభువుల కీర్తి పతాకను రెపరెపలాడించెను.[2] జగన్నాథబాబు పాలనమునందును చూడ ముచ్చటగా, వీనులవిందుగా విద్వద్గోష్ఠులను నిర్వహించి, ఆబాలగోపాలమును ఆనందాబ్ధిలో నోలలాడించిన ఖ్యాతి పాపయారాధ్యునకే దక్కినది.[3] అంతే గాక సరసహృదయానురంజనమున, అవతారికయందు "చాతురీ విబుధరంజ నుడింతియేగాదు, సద్భక్తి విబుధరంజనుడితండు"[4]

*. . . . . . పండితులున్, కవులున్, పురోహితుల్
గంధిలవృత్తి తన్నలమగా, ధరబొంగొని, రామనాథరా
ట్సింధురవైరి, యేలెను విశిష్టజనాళి కభీష్ట వైఖరిన్॥[5]

అనుచు రామనాథబాబును వర్ణించియుండుటచే, రామనాథభూపతి సంస్థాన సభలయందును ఈ మహాకవియే యగ్రాసనాధిపతియై తేజరిల్లి నట్లూహింప నగును.

అట్లే వేంకటాద్రినాయని ప్రధానమంత్రియగు పొత్తూరి కాళిదాసును గూర్చి వర్ణించుచు—

*. . . కాళిదాసుం, డొప్పెన్ గవిజననిధానమోయితఁడనఁగన్॥[6]

*సరససాహిత్యానుషంగ సత్కవిబృంద
మనయమ్ము నునయమ్మునభినుతింప

1. సరసహృదయానురంజనము - విజ్ఞప్తి. పుట - 1.
2. అ. సం. విలాసము. 1-16,17,18.
3. దేవీభాగవతము — 1-98,100,101,105.
4. స.హృ.రంజనము 1-164. 5. స. హృ. రం. 1-164.
6. స. హృ. రం. 1-77.

కవి జనోల్లాసుడైనట్టి కాళిదాసు-1

*ఒకవేళఁ గవిజన ప్రకట ప్రబంధముల్,
పరవుచో భోజుడై యొరవునెరవు,
ఒకవేళఁ బండిత ప్రకరగోష్ఠులు సేయు,
చో విక్రమార్కుని సొంపునింపు
. . . . . బళిరె యక్కాళిదాసు జన్మ-.2

మొదలగు నంశములను బ్రస్తావించెను. దీనినిబట్టి కాళిదాసు మంత్రియొక్క కవి పండిత గోష్ఠుల అధ్యక్ష పీఠముగూడ, పాపయారాధ్యులనే వరించి, వారి దివ్యసారస్వతమూర్తికి చక్కని నివాళి పట్టినట్లు తలంపవచ్చును.

ఆ రీతిగనే కుశలవ రామమంత్రిని గూర్చి ప్రస్తావించుచు.

*కవి జనతాధారునకున్ (స. హృ. రం. 1-177).

*విద్వద్వ్రతంసముల్ వివిధ ధర్మాధర్మ
విధులొక్క వైపున విస్తరింప,
కవితానిబంధనా కర్కశ ప్రాచుర్య
కవులొక్కయోరగా గ్రంథు గొనఁగ,
మణిగణోజ్జ్వలమౌ సభామంటపమ్మున
రక్తి కొలువుండి కుశలవ రామమంత్రి (స.హృ.రం. 1-177)

విబుధులును, కవులును, గురువులును, పురోహితులును, తనను గొలుచు చుండగా ఆ మంత్రి విరాజిల్లెను— (స.హృ.రం. 1-19).

ఆ సభకు పాపయారాధ్యుని సగౌరవముగ రప్పించి, ఆ కుశలవ రామ మంత్రి ఆయనను బహుధా కీర్తించెను.

ఓ కవీ! నీవు విద్వజ్జనలాలితుడవు. పుంభావ సరస్వతివి- అనుచు కొని యాడెను. కావున పాపయారాధ్యుని భాషావైదుష్యాలు, వాఙ్మాధుర్యాలు, కవితా సారస్యాలు, కుశలవ రామమంత్రి సభా సదస్యులను గూడ ముగ్ధుల నొనర్చి యుండెననుట యెంతేని సత్యము.

---

1. స. హృ. రం. 1-79. 2. స. హృ. రం. 1-81.

ఈ కవి యింకను విజయనగరాది రాజసంస్థాన విద్వత్సభల యందు విజయ, గౌరవ, పురస్కారము పందినట్లు జనశ్రుతి కలదు.1

## జీవన విధానము

పావయారాధ్యుడు ఉషఃకాలమునందే మేల్కొని, కాలకృత్యములను దీర్చుకొని, యోగాభ్యాస కార్యక్రమముల నిర్వర్తించెడివాడు.2 పిదప స్నానాదికములను ముగించుకొని లింగనిమజ్జన మొనర్చి, నిష్ఠానియమ విలసితుడై, షట్స్థలజ్ఞానానుసంధానముతో, సకాలమున కాలత్రయ శివపూజలను ఒనర్చెడి వాడు.

నిత్యము షడక్షరిని3 జపించుటయేగాక యతడు అనువంశికముగా వచ్చుచున్న విశిష్టోపాసనలను గూడ చేయుచుండెడి వాడని తోచును. ఈయన తండ్రి శారభమంత్ర జపతపస్సారుడు (వే.ఆ.చ. 1-146) భైరవ + అఘోరాది బహు మంత్రశక్తులను పాసించి, సిద్ధినందినవాడు. (వే.ఆ.చ. 1-154) వేమనాధ్య చరిత్రమున దైవస్తుతిలో కవి వీరభద్రుని (1-3) భద్రకాళిని(1-4) శరభ సాళువస్వామిని (1-5) శరభకాళికను (1-6) నుతించెను. దీనినిబట్టి యతడు వీరభద్రోపాసకుడును, శరభ సాళువోపాసకుడును, ఐయున్నట్లు గన్పట్టును. అందువలననే గాబోలు ఈతడు వేమనారాధ్య చరిత్రమునందు

---

1. ములుగు పాపయారాధ్య మహాకవి విజయనగర రాజ సంస్థానమున కవి, పండిత విజయము పొందినట్లు— శివశ్రీములుగు పండితయ్యగారు తెలిపిరి.

2. అ. సం. విలాసములో గౌతముడు నదీ తీరమున (స్నానమునకు వెళ్ళి నప్పుడు) యోగాభ్యాసము చేసినట్లు వర్ణించుట, కవిజీవన విధానమునకు ప్రతిఫలనమే.

3. ఓం + నమశ్శివాయ = షడక్షరి—ఓం = సూక్ష్మ పంచాక్షరి; నమః శ్శివాయ = స్థూల పంచాక్షరి; మొత్తము షడక్షరి.)

శరభసాళువ మహిమలకు[1] పని చెప్పెను. భైరవ ప్రయోగములకు[2] తావి ద్చెను.

ఏతత్కవి కృతదేవి భాగవతమునుబట్టి గమనించినచో నీతడు దేవ్యు పాసకుడై యుండుటయు తథ్యమని పించును.

ఈయనకు గురువైన శ్రీపతి పండితారాధ్యుల శంభులింగ లింగదేశి కుడు పండితారాధ్య పీఠమునకు అధిపతియై యలరారగా (వే.అ.చ. 1-9) ఈతడు వేమనారాధ్య సింహాసనమునకు అధ్యక్షుడై విరాజిల్లెను.[3] ఈయన పరమశివాద్వైత పండితుడయ్యును, ఆరాధ్య సంప్రదాయ జీవనుడయ్యును, షణ్మత సిద్ధాన్త సామరస్యమున కాలంబనమైనవాడు.[4] ఈయన ప్రతిరచనయు కవియొక్క మతసామరస్య రీతిని వేభంగుల ప్రకటించుచున్నది.

ఇతడు అధ్యయన+అధ్యాపనములను నిరంతరము నిర్వహించిన వాడు. వివిధ లక్షణ గ్రంథములను, సాహిత్య గ్రంథములను పెక్కుమంది శిష్యులకు నూరిపోసినవాడు.[5] ఈయన శిష్యులలో శ్రీరామచంపూ ప్రబంధ నిర్మాతయగు శ్రీ బంధ్లమూడి రామస్వామి శాస్త్రి, శ్రీ చిపుకుల మహాదేవ శాస్త్రి మున్నగువారు ప్రముఖులు.[6]

---

1. వే.అ.చ. 7-118. 2. వే.అ.చ. 9-321.
3. దే.భా 1-100 పుట. 15. 4. దే.భా. 1-100 పుట. 15.
5. "వివిధ లక్షణ శిక్షావివేక దక్షులగు ప్రసిద్ధులు ముల్లు పాపయ్య శాస్త్రిలు- 1-100, పుట. 15. "పంచెన్ శిష్యులకెల్ల సత్కృప గీర్వాణాంధ్ర సాహిత్యముల్ —By. ముదిగొండ జ్వాలాపతిలింగశాస్త్రి శతావధాని దే.భా. "మహాకవి స్మృతి - పుట. 15.
6. స.హృ.రం. పీఠిక. పుట. 2. మఱియు సర్వమధురము, ఉపోద్ఘాతమును పుట. 2. సర్వమధురమునకు ఉపోద్ఘాతమును వ్రాసిన శ్రీ తాదేపల్లి వేంకటప్పశాస్త్రిగారుపై రామస్వామి శాస్త్రి ప్రభృతులతో స్వయముగ సంభాషించిరట.

ఈ కవి తన "కల్యాణ చంపూ ప్రబంధము"ను తన శిష్యులందఱికిని (100 మందికి) పాఠ్యగ్రంథముగ బోధించినట్లు ప్రతీతి.[1] శాస్త్ర చర్చలనినను, కవితాగోష్ఠులన్నను, ఈయనకు పరమ ప్రీతి. ఈతడు పూర్వకవుల ప్రతిభలను ప్రకటించుచు, సరస కవిత్వ ప్రచారమునకై, రాజ సభలనలంకరించి, రాణకెక్కినవాడు.[2] వివిధ పురాణార్థ విజ్ఞాన వైభవాలను హృదయమున పదిలపఱచుకొని, చతుర్విధ పురుషార్థ సాధకములైన పురాణేతిహాస కథా సుధలను ప్రతిదిన గోష్ఠులలో ప్రవచించినవాడు.[3] ఈతడు పెక్కు విద్వత్సభల (రాజ సభల)లో పాల్గొని, పండిత మండలిని మించి, పాండిత్య పటిమలను ప్రదర్శించెను. తన భవ్య కవితాస్ఫూర్తిచే కవీశ్వరుల నెందఱినో జయించెను.[4]

ఈకవి తన పాండిత్య ప్రతిభలచే నొక పండితుని జయించి, పసిడి చీపురును, బంగారు చేటను విజయచిహ్నముగా స్వీకరించెనట.[5]

ఈయన నిజ సంగీత కళాకౌశలములను స్వయముగ ప్రస్తావించియుండెను.[6] ఆయా సందర్భములలో సంగీత గోష్ఠులనుగూడ తరచుగా వర్ణించెను.[7] ఈ రెండింటిని సమన్వయించి, చూచినచో, ఆయా సంగీతసభలలో నీతడు గానమొనర్చియుండునని భావింపవచ్చును. ఈయన వీణావాదనము నందును ఆరితేరినవాడుగా గన్పించును.

---

1. ఆంధ్రపత్రిక, స్వర్ణోత్సవ సంచిక. 1965, పుట. 2. బసవయ్యశాస్త్రి గారి వ్యాసము.
2. దే.భా. 1-100. పుట. 15. 3. దే.భా. 1-109, 12, పుటలు. 16, 3.
4. దే.భా. 1-101, పుట. 15. మరియు నించెన్ సర్వ సుధీజయములన్ నిండంగనాస్థానముల్ - దే.భా. ము.పా. ప్రశంస. 15.
5. పసిడిచీపురు, చేట, పండితుచే గొన్నకథ సీదుపాండిత్యఘనత దెల్పు దే.భా.ము.పా. ప్రశంస. పుట. 15- ఈ ప్రశంస-శతావధాని.జ్వాలాపతి లింగశాస్త్రిగారు చేసినది.
6. సంస్కృతాంధ్ర కవితా సాహిత్య గానవిద్యా ప్రాభవేన, పాపయారాధ్యాభిధాన శాస్త్రిణా..
7. ఇది "భ్రామరీస్తవ" గద్యములోనిది..

సరసహృదయాను రంజనమునకు కృతిపతియగు పొత్తూరి కుశలవ రామమంత్రికి తాను బంధువుడననియు, గురువుననియు నీతడు నుడివెను. కాళి దాసుమంత్రి (వేంకటాద్రి నాయని ప్రధానమంత్రి) తనకు ప్రభువువలన క్రొత్త వృత్తులనిప్పించెనని యీతడు తెల్పెను.[1]

అర్థిక లాభములకై గాక యశోగౌరవములకై యీతడు ఆయా సంస్థానములందు నిలిచినట్లును, సభల నలంకరించినట్లును ప్రసిద్ధి.[2]

## ముక్తి ద్వారము తలుపులు తీయించిన ముముక్షువు

పాపయారాధ్యుడు పలు స్తవములను రచించెను. వానిలో "తారావళి" మిక్కిలి అమోఘమైనది. "ముక్తిద్వారము తల్పుతీయగదె చాముండీ! జగజ్జీవనీ! అను" "చాముండీ స్తవ" "మకుటము" నేటికిని ప్రతి ఆరాధ్య బ్రాహ్మణ కుటుంబమునందును ప్రతిధ్వనించుచునేయున్నది. ఈతారావళియే పాపయారాధ్యుని కీర్తికిరీటమునకు కలికి తురాయి తొడిగి, ఆయన కవితా భారతికి లోకముచే నివాళి పట్టించినది. దీనికిని, ఈకవి జీవితమునకును సంబంధించిన ఒక ప్రసిద్ధమైన ఐతిహ్యముగలదు.

మహాయోగి వరేణ్యుడును, పరదేవతోపాసనా పరతంత్రుడును ఐన పాపయారాధ్యుడు[3] ఒకనాటి సాయంకాలము కృష్ణాతీరమున సంధ్యావందనమును ముగించుకొని, దైవ దర్శనార్థమై దేవియాలయమునకు చేరెను. ఈలోపలనే అర్చకులు అగుడితలుపులుమూసి, వెళ్ళిపోయిరి. పరిస్థితిని గమనించిన పాపయారాధ్యుడు "ముక్తిద్వారము తల్పుతీయగదె చాముండీ! జగజ్జీవనీ!" అను మకుటముతో 27+1 = 28 పద్యములతో నొకస్తోత్రమును(తారావళిని) అప్పటికప్పుడు అక్కడికక్కడనే ఆశువుగా చెప్పెను. భక్తసులభయైన దేవి,

1. స. హృ. రం. 1-166.
2. "గోరంతయును ప్రభుఁగోరకుండుటసేసి, త్యాగధర్మ సుశీలతల సుఁదెల్పు.. దే.భా.ముపా. ప్రశంస.పు.ట. 15.
3. సర్వమధురము-ఉపోద్ఘాతము-పుట.2.



ఆ స్తుతికి సంతసింపగా వెంటనే తలుపులు తెఱచుకొనినవి. పాపయారాధ్యుడు దేవిని దర్శించి, ప్రణతులు చెల్లించి, యింటికి చేరెను.

ఈవిషయములను గమనించిన అర్చకులు ఆసంగతులను వేంకటాద్రి నాయనికి విశదపఱచిరి. మఱునాటి ఉదయమునకే ఆస్తుతి విషయము పదుగురి నోళ్ళలోబడి, పండితులదాకా ప్రాకినది.

ఈర్ష్యాళువులైన పండితులు కొందఱు "ముక్తిద్వారము తల్పుల" మాట అటుంచి, ఈగుడి తలుపులు తెఱచుకొనుట మాత్రము సంభవమా? అని ఆస్తుతిని గూర్చి చులకనగా పలికిరి అందఱికిని దెలిసివచ్చుటకై మఱునాడు పాపయారాధ్యుడు గుడికివచ్చు వేళకు వేంకటాద్రినాయడు అర్చకులచే దేవి ఆలయద్వారములు మూయించియుంచెను. క్రిందటి దినమందు వలెనే ఆకవి తన తారావళితో దేవిని స్తుతించెను. వెంటనే గుడి తలుపులు తెఱచుకొనగా, నాయనివారితో గూడ, అందఱును జూచి, పాపయారాధ్యుని మహిమలకు జేజేలు పల్కిరి.

ప్రతిభామూర్తియైన ఆ మహాకవిని వేంకటాద్రినాయడు వేభంగుల శ్లాఘించి, సముచిత గౌరవ సత్కారములతో సంభావించెను. పండితులెల్లరును వినమ్రులై అయ్యారాధ్య వతంసుని అంఘ్రులకు అంజలి ఘటించిరి.

ఈ మహితోదంతమును సర్వమధురమునందలి ఉపోద్ఘాతములో శ్రీ తాదేపల్లి వేంకటప్పయ్యశాస్త్రిగారును,[1] దేవీ భాగవతముయొక్క ఉపోద్ఘాతములో శ్రీచెళ్ళపిళ్ల వేంకటశాస్త్రిగారును[3] ప్రగాఢ విశ్వాసముతో ప్రస్తావించిరి. ఇట్టి గాథలను కొందఱు నమ్ముటకు సిద్ధపడరు. కాని ఆధ్యాత్మిక క్షేత్రమున మహిమాదికములు సహజములు. పలుసందర్భములలో అవి అనుభవైక వేద్యములు.

---

1. సర్వమధురము-ఉపోద్ఘాతము-పుట.2.
2. దేవీభాగవతము-ఉపోద్ఘాతము-పుటలు. 13-14.

అన్ని విషయములందును ప్రత్యక్ష ప్రమాణమే ముఖ్యమన్నచో కుదురదుగనుక తదితరములైన అనుమానాది ప్రమాణములను ఆదరించుటయు, ఆశ్రయించుటయు లోకసామాన్య విషయము.

సంగ్రహముగా సమీక్షించినచో, నిత్యయోగాభ్యాస నిరతితో, ప్రతిదినము త్రికాలములయందును పరమశివపూజలతో, షడక్షరీ జపవిధానములతో, శారభ, భైరవా ఘోరాది ప్రత్యేకోపాసనలతో,సంతత సాహిత్య, శాస్త్రాధ్యయనాధ్యాపనములతో, సహృదయ హృదయంగమములైన రసవత్ప్రబంధ నిర్మాణములతో, సరస సాహిత్య సంగీత, గోష్ఠులతో, వివిధ పురాణేతిహాస కథాసుధా ప్రసారములతో, హితమహితముగా సాగిన మహాకవి పాపయారాధ్య జీవన విధానము ప్రశంసార్హమైయున్నది.

—: o :—

# రెండవ ప్రకరణము

ములుగు పాపయారాధ్యుడు శైవసంప్రదాయ కుటుంబమునకు చెందిన వాడు. అతడు వేమనారాధ్య వంశజుడు. శ్రౌత శైవ దీక్షాపరిపూత జీవనుడు. లింగధారియై, శివపూజాధురంధరుడై, శివజ్ఞాన సిద్ధినందినవాడు. నిగమాగమ శాస్త్రవిజ్ఞాన విలసితుడు. మీదు మిక్కిలి పరమశివాద్వైత పండితుడు.

అతడు "ఉత్తరశైవ" (ఆరాధ్యశైవ) సముద్ధరణమునకై వేమనా రాధ్య చరిత్రమును వ్రాసెను. వివిధ రూపములలో ఆరాధ్య (శ్రౌత) శైవము యొక్క ధర్మములు, ఆచార వ్యవహారములు, వేమనారాధ్య చరిత్రమునందు కథాత్మకముగా, అద్భుతముగా చిత్రింపబడినవి. కనుక వేమనారాధ్య చరిత్రము యొక్క అవగాహనమునకును, అందు పాపయారాధ్యుడు పొందు పఱచిన శైవసంప్రదాయ పరిజ్ఞానమునకును, ముందుగా శైవమును గూర్చియు, దాని వివిధ శాఖలను గూర్చియు, ఆరాధ్య శైవస్వరూప స్వభావములను గుఱించియు, శివాద్వైత సిద్ధాంత పరమార్థములను గుఱించియు, తెలిసికొనుట ఆవశ్యకమైయున్నది.

## మతములు - ప్రమాణములు

"జన్తూనాం నరజన్మ దుర్లభమ్"1 అను సూక్తి సమస్త జీవకోటిలో మానవజన్మ యౌన్నత్యమును విస్పష్టమొనర్చుచున్నది. బుద్ధి బలముతో సదసద్వివేచనగలిగి, సముచిత రీతిని ప్రవర్తించుట మానుషజన్మకుగల విశిష్టత. సామాన్యముగా "ఇహ—పర" సుఖములు సంస్కారవంతులైన మానవుల జీవనమున సమప్రాధాన్యమును వహించుచుండును. కొందఱు ఐహిక ములకే ప్రాముఖ్యము నిచ్చుటయు, మఱికొందఱు ఇహపరములకు రెంటింటి

1. వివేక చూడామణి. పుట.3

కిని సమానముగా అసక్తిని జూపుటయు, పుంःకృత సుకృతపరిపాక విశేష మున కొద్దిమంది మాత్రము పారలౌకిక విషయములందు మాత్రమే శ్రద్ధ గలిగియుండుటయు లోకసహజము. ఈ మూడు వర్గముల వారినే లోకజ్ఞులు క్రమముగా, సామాన్యులుగా, మాన్యులుగా, పుణ్యపురుషులుగా పేర్కొన వచ్చును.

అవిచ్ఛిన్నముగా, పరంపరగా సాగివచ్చుచున్న మానవాళి జీవన సరళిని, గమనించినమనీషులు ధర్మార్థ కామమోక్షములను చతుర్విధ పురుషార్థ ములను మనుష్యకోటికి ముఖ్యధ్యేయములుగా వక్కాణించిరి. ధర్మాచరణము అర్థార్జనము, కామానుభవము, మోక్షసాధనము - అనునవి మానవ జీవితమున క్రమ ప్రాధాన్యము వహింపవలసియున్నవి. ధర్మార్థ కామ మోక్షములలో మొదటి మూడింటికిని, అనగా ధర్మార్థకామములకు "త్రివర్గము" అనువ్యవహారము సుప్రసిద్ధము. ఈ త్రివర్గము ఇహపర సుఖములకు రెండిం టికిని వర్తించుచుండుననియు, నాల్గవది యగు మోక్షము మాత్రము కేవలము అలౌకిక విషయమనియు విజ్ఞులు పేర్కొనిరి.

రాగద్వేషరహితముగా, స్వ-పర స్పర్శలేని రీతితో, ప్రశాంత చిత్త ముతో, సునిశితబుద్ధితో పరిశీలించినచో సర్వమానవాళికిని సరియైన శ్రేయో మార్గమును జూపు "వెలుగు దివ్వెలు" "వేదములు". ఈ వేదములు లోక కల్యాణదాయకములైన ధర్మమార్గములకు మూలములు.[1] సర్వమానవ శ్రేయోదాయకమైన ధర్మము నాచరించుటయు, ధర్మోపేతమైన మార్గమున అర్థము నార్జించుటయు, ఈ ధర్మార్థముల పరిధికి లోబడి కామానుభవము లను, కొనసాగించుటయు, సర్వదా ప్రతివ్యక్తికిని ముఖ్యకర్తవ్యము. క్రమ విధానముతో ఈ త్రివర్గ సాధనతో జీవితములను పండించుకొని విరక్తమైన మానవకోటి మోక్ష ప్రాప్తికి అఱ్ఱులుచాచుట యుక్త విషయము. ఈ మోక్ష ప్రాప్తికై యెన్నుకొనబడిన సాధన మార్గములే మతములు.

1. వేదోధర్మమూలమ్. మనుస్మృతి.

మోక్షైక లక్ష్యముతో ప్రచలితములైన భారతీయ మతములలో చాల వఱకు ఆయా దైవపారమ్యములను నొక్కివక్కాణించుచు, ఆయా దైవ నామముల తోడనే వ్యవహృతములై, సుప్రసిద్ధములైనట్టివే.

శివపారమ్యముతో శైవము, విష్ణువుయొక్క యౌత్కృష్ట్యముతో వైష్ణవము, శక్తిప్రాధాన్యముతో శాక్తము, సూర్య ప్రాథమ్యముతో సౌరము, గణపతిని మూలముగా గొని గాణాపత్యము, స్కందుడు (కుమారస్వామి) పరమ దైవముగా స్కాందము మొదలగునవి దైవనామములతో ప్రవర్తిల్లిన మతములు.

బౌద్ధాది మతములు - ఆయా ప్రవర్తకుల పేర్లతో వాసికెక్కిన మతములు. ఈ శైవాది మతవాహినులే లోకమును మోక్షసాగరమును జేర్చుటకై ప్రవహితమార్గమున సాగుచు, కాలక్రమమున, సగుణ, నిర్గుణ పరబ్రహ్మ సిద్ధాన్త రాద్ధాంతముల కారణముననను, జ్ఞాన, భక్తి, కర్మ + ఆది సిద్ధాన్తముల మూలముననను, అద్వైతము, విశిష్టాద్వైతము శివాద్వైతము, ద్వైతము మొదలగు పేర్లతో సుప్రసిద్ధములై రూఢి కెక్కినవి. యుగయుగాలుగా పరిఢవిల్లుచు వచ్చి, అతి ప్రాచీనములైన ఈ శైవాది (ఆస్తిక) మతములన్నియును, వేదప్రామాణ్యమును అంగీకరించినట్టివే.

ఆయా మతానుయాయులలో కొందఱు ఆగమములను ప్రమాణములుగా స్వీకరింపగా మఱికొందఱు స్మృతులను ప్రమాణములుగా అంగీకరించిరి. సగుణబ్రహ్మోపాసకులైన శైవ, వైష్ణవ, శాక్తాదిమతములవారు ఆచరణములో వేదములకంటెను ఆగమముల యెడలనే ఇంచుక అధిక ప్రమాణబుద్ధిని, ఆదరాభిమానములను, చూపుచు వచ్చిరి. ఆమూలాగ్రముగా, సారభూతముగా సమీక్షించినచో ఈ శైవ వైష్ణవాది మతములుగాని, ఆ అద్వైత, శివాద్వైత, విశిష్టాద్వైత, ద్వైతాది మతములుగాని, సందర్భాను సారముగ, తమ తమ సిద్ధాన్త విషయములకు ప్రోద్బలకములుగా నున్న భాగములను, వేదములనుండియు, ఆగమముల నుండియు, స్మృతుల నుండియు, పురాణములనుండియు, ప్రమాణములుగా గ్రహించి నట్టివే.

Actually header: 

# శైవము

భారతదేశమున పరిఢవిల్లిన మతములలో శైవము మిక్కిలి ప్రాచీన మైనది. శివుడే పరమదైవమనియు, బ్రహ్మ, విష్ణువు ఇంద్రుడు మొదలగు దేవత లెల్లరును ఆ పరమశివుని భక్తులే యనియు ఈ మతముయొక్క పరమ సిద్ధాన్తము. శివుడే సర్వాధికుడనియు1 ఆయనకంటె అధికుడుగాని, ఆయనతో సమానుడుగాని యైన దేవుడు మఱియొకడు లేడనియు,2 వేదాగమ, పురాణేతి హాస ప్రమాణములతో ఇది ప్రతిపాదించును.

శివుడే పరబ్రహ్మము. అతడు ప్రణవ స్వరూపుడు. లింగరూపియు నతడే. అతడు కేవలుడు. త్రిగుణాతీతుడు. అనంత కల్యాణ గుణసంపన్నుడు. సచ్చిదానంద విగ్రహుడు. పరాత్పరుడు. సృష్టి, స్థితి, సంహార, నిగ్రహా నుగ్రహాసమర్థుడు. నిత్యపరి పూర్ణుడు. పురాణ పురుషుడు. సనాతనుడు. నిరం జనుడు. జగత్కారణుడు. సర్వజ్ఞుడు. పరమేశ్వరుడు అతడు మహాదేవుడు.

ఈ శివ పారమ్యమును వేదములు, ఉపనిషత్తులు, ఆగములు, పురాణ ములు, మున్నగునవి ఘంటా ఘోషముగ ప్రకటించుచున్నవి.

## "వేదములు"

ఈశానః సర్వవిద్యానామ్, ఈశ్వరః సర్వభూతానాం, బ్రహ్మాధిపతిః బ్రహ్మణోఽధిపతిః, బ్రహ్మశివోమే అస్తు సదాశివోమ్ — శ్రుతి.

సర్వవిద్యలకును, సర్వభూతములకును, సర్వదేవతలకును శివుడే యధిపతి యని పైశ్రుతిపల్కుచున్నది.

"ఏకోహిరుద్రో నద్వితీయాయతస్థే."

రుద్రుడొక్కడే అద్వితీయుడు—అని యీశ్రుతి తెలుపుచున్నది.

1. విశ్వాధికోరుద్రో మహర్షిః.
2. నతత్సమశ్చాప్యధికశ్చ దృశ్యతే॥ శ్వేతాశ్వతరోపనిషత్తు.

"తత్పురుషాయ విద్మహే మహాదేవాయధీమహి. తన్నోరుద్రః ప్రచోదయాత్"- -అను శ్రుతి మహాదేవుడైన రుద్రుని (శివుని) పారమ్యమును, పరమ పురుషత్వమును, వివరించుచున్నది.

## ఉపనిషత్తులు

"శివ ఏవ కేవలః" — శ్వేతాశ్వతర — ఉపనిషత్తు. శివుడే కేవలుండు.

"ప్రపంచోపశమం శాంతం శివమద్వైతం చతుర్థం మన్యంతే స ఆత్మా సవిజ్ఞేయః— మాండూక్యోపనిషత్తు. 7-12.

శివుడద్వితీయుడు— అతడే తురీయుడు. (త్రిమూర్తులకు నతీతుడు) అతడే పరమాత్ముడు. అతడే తెలిసికొనదగినవాడు.

"జ్ఞాత్వాశివం, సర్వభూతేషు గూఢం"— శ్వే. ఉప. 4-6.

సర్వభూత జాతములందు నిగూఢముగ, అంతర్యామిగనున్న శివుని తెలిసికొనిముక్తినందెదరు—.

"జ్ఞాత్వా శివం, శాంతి మత్యంతమేతి" — శ్వే. ఉప. 4-14.

శివునెఱింగి, జ్ఞాని యత్యంత శాంతిని బొందును.

"తమీశ్వరాణాం పరమం మహేశ్వరం.

"తందేవతానాం పరమంచ దైవతం" శ్వేత-ఉప. 6-7.

ఆ శివుడే ఈశ్వరులకు మహేశ్వరుడు. దేవతలకు మహాదేవుడు.

"నతస్య కశ్చిత్ పతిరస్తిలోకే" — శ్వేత. ఉప. 6-9.

ఆ శివునకు అధిపతి మఱియొకడు లేడు. అతడే సర్వాధిపతి.

ఇంకను "అధర్వ శిరము," "స్కందోపనిషత్తు," "రుద్ర హృదయోపనిషత్తు," "వరాహోపనిషత్తు," కైవల్యోప నిషత్తు," "నిరాలంబో పనిషత్తు," "అధర్వ శిఖోపనిషత్తు," "బ్రహ్మబిందూప నిషత్తు," "పంచజాబాలోప

నిషత్తులు" మొదలగు బహూపనిషత్తులు శివపారమ్యమును ప్రకటించు చున్నవి.1

## ''పురాణములు''

అష్టాదశ పురాణములలో పది పురాణములు కేవలము శివపరములై యున్నట్లు స్కాంద పురాణము తెల్పుచున్నది.

"కథ్యతే దశభిర్విప్రాః పురాణైః పరమేశ్వరః" -స్కాంద.పురా1-13.

పరమేశ్వరుడైన శివుడు పది పురాణములచే చెప్పబడుచున్నాడు.

"ప్రణవోహి పరబ్రహ్మ, ప్రణవః పరమం పదం

ప్రణవోవాచకస్తస్య, శివస్య పరమాత్మనః" - శివపురాణము. శివుని పరబ్రహ్మముగ, ప్రణవ స్వరూపునిగ శివపురాణము తెలుపుచున్నది.

"నకించన శివాదన్యం, నకించన శివాత్ పరం

శివాతిరిక్తం నహిచ, సర్వం శివమయం జగత్॥" స్కాంద. పురా. శివునకన్యమైనది లేదు. శివునికంటె పరమైనది లేదు. సర్వము శివమయము-అని స్కాందము నుడువుచున్నది.

"అసంప్రథమ మేవాహం, వర్తామిచ సురేశ్వరాః

భవిష్యామిచ లోకేఽస్మిన్ మత్తో నాన్యశ్చ కశ్చన - శివగీత.

భూత భవిష్యద్వర్తమానముల యందు (సర్వకాలముల యందును) నిత్యుడైనవాడు (శాశ్వతుడు) ఆ శివుడు మాత్రమే - అని శివగీత.

ఈవిధముగ పురాణములు, శివగీతయును శివాధిక్యమును వివరించు చున్నవి.

---

1. శ్రీ అనుభవానందస్వామి కృత "సర్వ సిద్ధాన్త సౌరభము"న (9 వ ఖండము పుటలు - 133 to 156.) శివాధిక్యమును పెక్కు ఉపనిషత్తులు ప్రకటించిన తీరు మిక్కిలి విపులముగా గలదు. శైవకల్పద్రుమ,

## ఆగమములు

"సర్వేషామేవ తత్త్వానాం మూలం శివఇతి స్మృతః"-వాతూలాగమము.
సర్వతత్త్వములకును మూలమైనవాడు శివుడు.
"శివం పరాత్పరం సూక్ష్మం నిత్యం సర్వగ మవ్యయం"-శివాగమము
శివుడు పరాత్పరుడు, సూక్ష్మ నిత్యస్వరూపుడు. సర్వవ్యాపి.
"ఇట్లు—"అష్టావింశతి" - అగమములును[1] శివుని పరాత్పరత్వమును ముక్త కంఠముతో చాటుచున్నవి.

ఇట్లే భారతేతిహాసమునందును, జగద్గురు శ్రీశంకరాచార్యాది తత్త్వవేత్తల వాణిలోను, కాళిదాసాది మహాకవుల ప్రస్తుతులయందును ఆ సర్వేశ్వరుని సర్వాధిక్య స్థితి పలురీతుల ప్రస్తావింపబడినది.

"నాస్తి శర్వసమోదేవో, నాస్తిశర్వ సమాగతిః
నాస్తి శర్వసమోదానే, నాస్తిశర్వ సమోరణే॥" భారతము.[2]

శివునితో సమానుడగు దేవుడు లేదు. అతడెల్లరకును దిక్కైనవాడు. అతడు సర్వప్రదుడు (అయనవంటి దాతలేదు). ఆయనయొక్క రణకౌశలము అనన్యము.—

---

1. "అష్టావింశతి" — అగమములు.

*కామికం, యోగజం, చింత్యం, కారణం, త్వజితం, తథా
దీప్తం, సూక్ష్మం, సహస్రంచ, అంశుమత్, సుప్రభేదకం,

*విజయం, చైవ నిశ్వాసం, స్వాయంభువ, మథానలం,
వీరంచ, రౌరవం, చైవ మాకుటం, విమలం, తథా

*చంద్రజ్ఞానం, చ బింబం, చ ప్రోద్గీతం, లలితం, తథా
సిద్ధ, సంతాన, శర్వోక్తం, పారమేశ్వర, మేవచ
కిరణం, వాతులం త్వేతా స్త్వష్టా వింశతి సంహితాః॥

2. ఇది వీరశైవ సిద్ధాన్త శిఖామణి నుండి ఉధృతము - పుట. 110

*సహస్రం వర్తన్తే జగతి విబుధాః క్షుద్రఫలదాః
నమన్యే స్వప్నేవా తదనుసరణం తత్కృతఫలం,
హరిబ్రహ్మాదీనామపి నికట భాజామసులభం,
చిరంయాచే శంభో! శివ! తవపదాంభోజయుగళం॥
(శ్రీ శంకరాచార్యకృత—శివానందలహరి)

ఓ పరమేశ్వరా! ఈ జగత్తులో సహస్రాధిక దేవతలున్నను శాశ్వత (మోక్ష) ఫలములను ప్రసాదించువాడవు నీవే సుమా! కనుక నీ పాదపద్మములే నాకు శరణ్యములు.

*యాసృష్టిః స్రష్టురాద్యావహతి, విధిహుతం, యాహవిర్యాచహోత్రీ
యేద్వేకాలం విధత్తః శ్రుతివిషయగుణా యాస్థితావ్యాప్య విశ్వం
యామాహుస్సర్వభూత ప్రకృతి రితియయాప్రాణినః ప్రాణవంతః
ప్రత్యక్షాభిః ప్రపన్నస్తనుభిరవతువస్తాభిరష్టాభిరీశః॥
కాళిదాసకృత—అభిజ్ఞాన శాకుంతలము (1—1)

అష్టతనూ విలాసములతో ప్రత్యక్ష విశ్వస్వరూపుడైన ఆ పరమేశ్వరుడు సంరక్షించుగాక—

ఈ విధముగా వేదాది సమస్త వాఙ్మయము శివపారమ్యమును బహుముఖముల ప్రకటించుచున్నది.

## లింగము—శివస్వరూపము

చరాచరాత్మకమైన యీ విశ్వమంతయును శివలింగమునందే (ప్రళయమున) లయించుచున్నది. సర్గస్థితియందు అందుండియే బహిర్గతమగుచున్నది. ప్రణవస్వరూపమైన యీ లింగమే సర్వకారణమై విలసిల్లుచున్నది.1

1. *లీయతే గమ్యతే యత్రలింగే విశ్వం చరాచరం
ఓంకార ఏవలింగంస్యాత్ సర్వకారణ కారణమ్॥
వీరశైవ సిద్ధాన్త శిరోమణి. పుట, 127.

సృష్టి స్థితిలయములకు కారణభూతమైన లింగమే పరబ్రహ్మము. శివుదే లింగస్వరూపుడు.[1] శివ-శక్తులయొక్క సమైక్య రూపమే శివలింగము.[2]

బ్రహ్మవిష్ణ్వాది దేవతలును, వేదములును ప్రలయమున ఆ లింగము సందే లయించుచు అందుండియే సృష్టి సమయమున బహిర్గతమగుచుండును. లీనంగమయతి బహిః ప్రాపయతీతిలింగం. అందువలన ఆ లింగము కేవలము పరబ్రహ్మ (శివ) స్వరూపమే.[3]

ఆ శివలింగ గర్భమునందే యీ సమస్త చరాచర ప్రపంచము గుప్తమై యున్నది. ఆ లింగమునకు భిన్నముగా (లింగ బాహ్యమున) మరెద్దియును లేదు. కనుక ఆ శివలింగమును పూజింపవలెను.[4]

## శైవము — వ్యాప్తి

వేదాగమ పురాణేతిహాసాది వివిధ భారతీయ వాఙ్మయములందును శివ స్వరూప స్వభావ మహిమాదికములు బహుధా ప్రపంచితములైనవి. అందు చిదచిద్రూపమైన యీ సమస్త జగత్తునకు ఆ శివతత్త్వమే మూలముగా

---

1. *లీయతే యత్రభూతాని, నిర్గచ్ఛన్తి యతః పునః
తేనలింగం పరం వ్యోమనిష్కలః పరమః శివః॥
సూతసంహిత— వీరశైవ సిద్ధాన్త శిరోమణి- పుట. 117.

2. *శివ శక్త్యోశ్చ చిహ్నస్య మేలనం లింగముచ్యతే॥
(శివ పురాణాంతర్గత—విశ్వేశ్వర సంహిత-)శ్రీ వీ.శై.సి.శి.పుట. 118.

3. *బ్రహ్మవిష్ణ్వాదయోదేవాః సర్వవేదాదయుస్తథా
లీయన్తే యత్రగచ్ఛన్తే తల్లింగం బ్రహ్మకేవలమ్॥
సిద్ధాన్త శిఖామణి— శ్రీ వీ.శై.సి.శి. పుట. 122.

4. *లింగ గర్భే జగత్ సర్వం త్రైలోక్యం సచరాచరం
లింగ బాహ్యాత్ పరంనాస్తి, తస్మాల్లింగం ప్రపూజయేత్॥
వీరాగమము — శ్రీ వీ.శై.సి.శి. పుట. 120.

నున్నట్లు వర్ణితమైనది. సృష్టి అనాది. దాని ప్రారంభ మెప్పటినుండి జరిగినదో చెప్పుటయసాధ్యము. ఆ సృష్టికి ఆద్యమైన శివ తత్త్వము యొక్క కాలమును (ప్రాచీనత్వమును) గూర్చి యిక చెప్పవలసినదేముండును. కనుక సృష్ట్యాది నుండియు, ఉపాసకలోకమున ఇది ప్రచలితమగుచు వచ్చుచున్నట్లు భావింప నగును.

భారతదేశమునందు ఈశైవముయొక్క వ్యాప్తిని గూర్చి ప్రత్యేకముగా ప్రస్తావింపనవసరము లేదు. ఆసేతుహిమాచలము, అడుగడుగునను సుప్రతిష్ఠిత ములై భక్తులననుగ్రహించుచున్న శివ స్వరూప (లింగ)ములే యందులకు నిదర్శనములు. కాశ్మీరమునుండి కన్యాకుమారి వఱకుగల శైవ క్షేత్రముల వైభవ ప్రాభవములే ఈశైవ వ్యాప్తియొక్క తేజోవీధులకు జయ పతాకలు.

భారత దేశమునందు సువ్యవస్థితములై చిరస్థిర కీర్తులకాలవాలములైన ద్వాదశ జ్యోతిర్లింగములును,[1] ఆక్షేత్రములును, ఈశైవ సంప్రదాయము యొక్క అధీతి, బోధాచరణ, ప్రచారములకు అక్షయ తీర్థములు. కావున నాటికేగాక నేటికిని శైవ సంప్రదాయమునకు భారతదేశము భద్రభూమియనుట సుస్పష్టము. కనుక ఇక భారతదేశమున వెల్లివిరిసిన వివిధ శైవ మతశాఖలను గూర్చి, పరిశీలింతము.

## పాశుపతము

అతి ప్రాచీన శైవమత శాఖలలో ఈ పాశుపత మొక ప్రముఖ స్థానము కలిగియున్నది.[2] "ఈ పాశుపతమతమే" ప్రథమశైవ సిద్ధాన్తమై సర్వే

1 *సౌరాష్ట్రే సోమనాథంచ, శ్రీశైలే మల్లికార్జునం, ఉజ్జయిన్యాం మహాకాళం, ఓంకారే పరమేశ్వరం, కేదారం హిమవత్పృష్ఠే, ఢాకిన్యాం భీమశంకరం, వారాణస్యాంచ విశ్వేశం, త్ర్యంబకం గౌతమీతటే, వైద్యనాథం చితాభూమౌ, నాగేశందారుకావనే, సేతుబంధేచ రామేశం, ఘుశ్మేశంచ శివాలయే. శివపురాణము, కోటిరుద్రసంహిత.

2. ఆద్యం శైవం పరిఖ్యాతం, అన్యత్ పాశుపతంమునే! తృతీయం కాళవదనం, చతుర్థంచ కపాలికం - వామన పురాణము. (కాశహస్తిశ విలాసము. పుట. 61.)

తర శైవశాఖలకు ప్రాతిపదికయైనది.[1] శివుడే "లకుల"మను దండమునుండి "లకులేశుడు"గా అవతరించి, కుశిక, గార్గ్య, కౌరుష్య, మైత్రేయ, అను స్థితన శిష్య చతుష్టయముతో ఈ పాశుపత సిద్ధాన్తములను వ్యాప్తిలోనికి తెచ్చినట్లు పేర్కొనబడుచున్నది.[2]

పతంజలి మహాభాష్యమునందును, మహాభారతము నందును, ఈ పాశుపతమును గూర్చి చెప్పబడినది.[3] వాయుపురాణమునందును (23 వ, అధ్యా.) లింగపురాణమునందును (21 వ అధ్యా.) లకులీశుని గూర్చియు, ఆతని నలుగురు శిష్యులను గూర్చియు వివరణములు గలవు. వీనియన్నింటిని బట్టి ఈపాశుపతశాఖ మిక్కిలి ప్రాచీన కాలమునందే యేర్పడినట్లు భావింపబడుచున్నది.[4]

ఈ లకులీశ పాశుపత శాఖ 1. కారణము, 2. కార్యము, 3. విధి, 4. యోగము, 5. దుఃఖాంతము, అను ఐదు పదార్థములను అంగీకరించును.

1. కారణము :—పశుపతియే యిట సమస్త సృష్టి, స్థితి, సంహార,- అనుగ్రహకారి కారణము. ఈ పశుపతి నిరతిశయ దృక్క్రియా శక్తిమంతుడు. ఇతడు నిత్యపాలకుడు.

2. కార్యము :— కార్యము సదా అస్వతంత్రము. ఈ కార్య విషయమున ఇతర వేదాంత మత సిద్ధాన్తములతో ఈ పాశుపత శాఖ ఏకీభవింపదు. ఇతర సిద్ధాన్తములలో కారణమువలన గల్గినది కార్యము. కాని ఈ సంప్రదాయమున ఇతరుల మీద ఆధారపడి యుండునది ప్రతిదియును కార్యమే. జీవాత్మ పరమాత్మ నాధారముగా గల్గియుండునది గాన నిదియు" అధేయత్వ సామ్యమున" కార్యమని పేర్కొనబడినది. పాశబద్ధుడైన జీవాత్మయే ఈ సిద్ధాన్తమున పశువనబడును.

---

1. సర్వసిద్ధాన్త సౌరభము. 9 వ సంపుటము - పుట. 235.
2. సర్వసిద్ధాన్త సౌరభము. 9 వ సంపుటము - పుట. 230, 231, 233, 234.
3. విజ్ఞాన సర్వస్వము. (7 వ సంపుటము) - పుట. 580.
4. విజ్ఞాన సర్వస్వము. (7 వ సంపుటము) - పుట. 580.

3. విధి :— ధర్మాధర్మ సాధక వ్యాపారము విధి.

4. యోగము :— చిత్తమును (మనస్సును) ఈశ్వరుని యందు లగ్నము చేయుటయే యోగము.[1] అది ద్వివిధము. (1) క్రియాపరము (2) క్రియారహితము. మొదటిది జపధ్యానాది రూపమైనది క్రియా పరము. రెండవది ఈ సాధనా బంధములేని సంవిద్రూపము.

5. దుఃఖాంతము :- దుఃఖ నివృత్తియే దుఃఖాంతము అది దుఃఖము యొక్క యత్యంత నివృత్తియు, పారమైశ్వర్య ప్రాప్తియు, అని ద్వివిధము. ఈ పారమైశ్వర్య ప్రాప్తి దర్శన, శ్రవణ, మనన, విజ్ఞాన, సర్వజ్ఞత్వముల ద్వారా సాధ్యము.

లకులీశ ప్రవర్తితమై, తదనంతర గురువులచే ప్రచలితమై, క్రమ వ్యాప్తినందిన పాశుపత శైవ సిద్ధాన్తము యొక్క సంగ్రహ స్వరూపమిది.

## కాశ్మీర శైవము

శైవమునకు సంబంధించిన ప్రాచీన శాఖలలో "కాశ్మీర శైవము" ఒకటి. దీనికి శైవాద్వైతము, ప్రత్యభిజ్ఞా సంప్రదాయము స్పందవాదము, ఆభాసవాదము, త్రికదర్శనము అను నామాంతరములు గలవు. "కాశ్మీర శైవము" అను పేరును బట్టియే దీని ప్రాదుర్భావవ్యాప్తి ప్రభావములకు, కాశ్మీర ప్రాంతము, తత్పరిసరాలు, ఆలంబన వేదికలని చెప్పనగును. శివానుగ్రహలబ్ధమైన యీసిద్ధాన్తమును దుర్వాసో మహర్షి ఆ ప్రదేశమున ప్రచారము చేసినట్లు ప్రసిద్ధి.

త్రిక సంప్రదాయము పేరుతో దీనిని ప్రవర్తింప జేసినవాడు వసుగుప్తుడు. కల్లటునివలన "స్పంద సిద్ధాన్తము" అని దీనికి ప్రసిద్ధి యేర్పడినది. ప్రత్యభిజ్ఞా సంప్రదాయము" గనిది వాసికెక్కుటకు సోమానందుడు కారకుడు.

---

1. చిత్తద్వారేణాత్మేశ్వర్య సంబంధోయోగః - మాధవ నిర్వచనము. సర్వ సిద్ధాన్త సౌరభము. 9 వ సంపుటము - పుట. 286.

ఈ ప్రత్యభిజ్ఞా సంప్రదాయము యొక్క ఔన్నత్యమును తారాస్థాయికి చేర్చి, దాని వైభవ పతాకను రెపరెపలాడించిన మహా మహేశ్వరుడు అభినవ గుప్తుడు.

అభినవగుప్త రచితములైన "ఈశ్వర ప్రత్యభిజ్ఞా దర్శిని" ప్రభృతి గ్రంథములు ఈ సంప్రదాయము యొక్క గౌరవ ప్రాభవములకు మూల కందములై విజ్ఞాన సర్వస్వములుగా వాసికెక్కినవి.

పరమేశ్వరుడు విశ్వమయుడు. ఈ విశ్వమంతయు పరమేశ్వరుని కంటె భిన్నముగాదు. పరమశివుడు విశ్వము నున్మీలిత మొనరించును. ఈ విశ్వమంతయు సూక్ష్మముగ ఉండనేయున్నది. ఇది స్ఫురణమున ప్రకట మగుచున్నది.

చిచ్ఛక్తి, ఆనందశక్తి, ఇచ్ఛాశక్తి, జ్ఞానశక్తి, క్రియాశక్తి అను పంచ విధశక్తులతో గూడి, పరమశివుడు విశేషరూపమున గోచరించుచుండును. శైవాద్వైతమను పేరుతో ప్రసిద్ధికెక్కిన యీ త్రికదర్శనము అద్వైతమున పర్యవసించును. కాని ఉపనిషద్బ్రహ్మ వాదమునకును, ఈ శైవాద్వైత వాదమునకును కొంత భేదముగలదు.

1. బ్రహ్మ వాదములో నిర్వికారమైన బ్రహ్మమునకు కర్తృత్వము లేదు. ఈ శైవాద్వైతవాదములో పరమశివునందు కర్తృత్వము గలదు.

2. ఈ శివాద్వైతమున విశ్వోత్తీర్ణమైన "ఆత్మ" సృష్టి, స్థితి, సంహార, నిగ్రహానుగ్రహరూప పంచకృత్యములను నెరపును.

పరమేశ్వరునకును ఈ విశ్వమునకునుగల సంబంధము దర్పణ ప్రతిబింబము వంటిది. లోకములో బింబము ననుసరించి, ప్రతిబింబముండును. ఈ దర్శనము నందట్లుగాదు. ఇందు విశ్వాత్మకమైన ప్రతిబింబము స్వతస్సిద్ధ ముగ నున్నది. ఈ విధముగు ప్రతిబింబ సిద్ధాన్తము నంగీకరించుటవలననే దీనికి "ఆభాసవాదము" అనియు పేరు వచ్చినది.

ఈ విశ్వమంతయు శక్తిస్ఫురణము. ఇది యసత్యము గాదు. ఈ ప్రత్యభిజ్ఞాదర్శనమునందు ముప్పదియాఱు (36) తత్త్వములున్నవి. ఈ దర్శనములో కేవలజ్ఞానముగాని, కేవలభక్తిగాని ముఖ్యముగా లేదు. ఇందు ఆ యుభయమునకును సామంజస్యము గలదు. శంకరుని అద్వైతములో చరమావస్థలో భక్తిలేదు. ద్వైతవాదములోని "భక్తి" జ్ఞానమూలకము గాదు. అద్వైత జ్ఞానరూపమైన సాధ్యభక్తి ఈ స్పందవాదములో గలదు. మోక్షమనునది ఆవరణ భంగము వలన కలుగు జ్ఞానశక్తి సమున్మేషము—.

తెలిసిన వస్తువునే తెలిసికొనుట ప్రత్యభిజ్ఞ. గురూపదేశ ప్రభావమున "నేనే శివుడను" అని గుర్తించుటయే యిందలి ప్రత్యభిజ్ఞ. ఇదియే శివతత్త్వలాభము. దీనినే మోక్షమందురు. ఈ దర్శనము జీవన్ముక్తిని సమ్మతించును.

ఈ త్రికసిద్ధాన్తమున జీవుడే శివుడను అద్వైత భావమున్నను మాయాశక్తి అజ్ఞానమనియు, భ్రాంతి యనియుగాక శివశక్తియై పరిణామావస్థలో ప్రపంచమగును. ఈ విశ్వముగాని, పశువాచకుడగు జీవునియొక్క జీవత్వముగాని భ్రాంతి రూపములుగాక శక్తి పరిణామములే యగును.

వివర్తవాద మిచట అంగీకార్యము గాదు. కేవల శివుడే జీవజగత్తులుగ పరిణమించుటను అంగీకరింపదు గాన ఇది పరిణామవాదము గూడ కాదు.

సంగ్రహముగా కాశ్మీరశైవ సిద్ధాన్తము యొక్క స్వరూపమిది.*

## కాపాలికము

శైవాంతర్గత శాఖలలో ఈ కాపాలిక మొకటి. ఈ సంప్రదాయము వారిని "కాపాలికులు" అనియందురు. వీరు వామాచారపరులు. ఆనందగిరి

* ఈ కాశ్మీరశైవ (త్రిక) సిద్ధాన్త విషయముల వివరణమునకు విజ్ఞాన సర్వస్వము (7వ సంపుటము) నందలి శ్రీ జ.మా. శర్మగారి వ్యాసము, శ్రీ అనుభవానందస్వామి వారిచే రచితమైన సర్వసిద్ధాన్త సౌరభము (9వ సంపుటము) ఆధారములు— వారికి నా కృతజ్ఞతలు.

రచితమైన శంకర విజయమునందును, విద్యారణ్య విరచితమైన శంకర విజయమునందును, భవభూతి రచితమైన మాలతీ మాధవమునందును, ప్రబోధ చంద్రోదయమునందును. ఈ కాపాలికుల వేషభాషలు, ఆచారవ్యవహారములు విపులముగా వర్ణింపబడినవి.1

ఈ మతమునకు "అఘోర మతము" అనియును, ఈ సంప్రదాయము వారికి "అఘోర పంథులు" అనియును, నామాంతరములు గలవు. వీరి యాచార వ్యవహారము లన్నియును లోకరీతికి భిన్నముగా మిక్కిలి ఘోరముగా నుండుటచే దానిపట్ల లోకమున గౌరవమేర్పడుటకై అ పేర్లు సమాదరింపబడినట్లు - అభిజ్ఞులయూహ. పూర్వకాలమునందు వీరికి అబూ పర్వతము, గిరినార్, బుద్ధగయ కాశి, శ్రీశైలము మొదలగుచోట్ల మఠములున్నను, ఇప్పుదవి యెచ్చటను కానవచ్చుట లేదు. ఇప్పటికిని బీహారు రాష్ట్రమున వీరి యునికి గలదని చెప్పుదురు.

ఈ కాపాలికులు భైరవేశ్వరుని, తత్పత్నియగు చండికను ఘోర రూపములలో ఆరాధింతురు, వీరు దేవతలకు నరబలులను గూడ ఇత్తురు. వీరి వేదాంతదర్శనమునకు "మాహేశ్వర దర్శనము" అని పేరు. దీని ప్రవర్తకుడు సోమసిద్ధాంతుడు. వీరిది భేదాఽభేద సిద్ధాన్తము. మెడలో మనుష్యకపాలములను ధరించుట, వివస్త్రులై మసలుట, శ్మశాన భస్మమును శరీరమందంతటను, పూసికొనుట, శవములను తినుట, మొదలగునవి వీరి యాచారములలో ముఖ్యములు.

జగద్గురువులైన ఆదిశంకరాచార్యులవారు తమ దిగ్విజయ యాత్రలో భాగముగ కర్ణాటక (దేశ) రాష్ట్రమునకు వెళ్ళినప్పుడు కాపాలిక సంప్రదాయమును ఖండించి, విజయమంది, వారిని వైదిక మార్గానుయాయులను గావించినట్లు శ్రీశంకర విజయము నుడువుచున్నది.

---

1. విజ్ఞాన సర్వస్వము - 7 వ సంపుటము - పుట. 350.

2. వర్ణాశ్రమ ధర్మరహితము. స్వతంత్ర వీరశైవము[1].

మఠముల నిది మూడు విధములు.

1. సామాన్య వీరశైవము, 2. విశేషవీరశైవము, 3. నిరాభారివీరశైవము.

శివభక్తి సామ్రాజ్య పరిరక్షణమునకును, తత్పరి వ్యాప్తికిని ప్రాణార్పణ సాహస బుద్ధితో, వీరునివలె ఉక్కు క్రమశిక్షణతో, చెక్కుచెదరని గుండె బలముతో, ఏమాత్రము నియమముల సడలనీయక తనువు చాలించువఱకు శివసేవ లొనర్చుటయే వీరశైవులయేకైక లక్ష్యము. అ విధముగా పరమశివుని యనుగ్రహములకు పాత్రులై, శివసాయుజ్యమును బొందుటయే వారి పరమాదర్శము.

## ఆరాధ్య శైవము

ఆరాధ్య శైవము వైదిక ధర్మములకు వేదిక. ఆగమ నియమములకు ఆట పట్టు. చిన్మయ దీక్షకు కర్మభూమి. శివాద్వైత సిద్ధాన్తమునకు జంగమ రూపము. శివసాయుజ్య ఫలప్రాప్తికి నిర్దిష్ట మార్గము.

అట్టి "ఆరాధ్య" (శ్రౌత) శైవమును గూర్చియు, తదభివృద్ధికై పాటు పడిన మహామహులను గుఱించియు కొంత పరిశీలింతము.

ఆరాధ్య (శ్రౌత) శైవసంప్రదాయములకు చిరాయురభివృద్ధులను గూర్చుటకై, అహరహము తహతహ పాటుతో, తదేక దీక్షతో కృషి యొనర్చుచు, లక్ష్య సాధనలో తమ జీవిత సర్వస్వములను పరమశివుని పాదాల చెంత ధారవోసిన పూజ్య శివాచార్యులెందరో గలరు. వారిలో ముఖ్యులైన

1. వీరశైవం ప్రవక్ష్యామి విదితం శ్రుతి, తంత్రయోః
శ్రౌతం స్వతంత్రమితి తద్ద్వివిధం పరికీర్తితం॥
*వర్ణాశ్రమీయ ధర్మాఢ్యం, శ్రౌతమిత్యభిధీయతే
తదీయ ధర్మరహితం స్వతంత్రమితి కథ్యతే॥
చం.జ్ఞా. ఉత్తరాగమము. పటలము. 10 శ్లో॥ 38,39.

కొందఱిని గూర్చి క్లుప్తముగా ముచ్చటించుకొని, పిదప ఆరాధ్య (శ్రౌత) శైవమును గూర్చి యాలోచింతము.

## ద్వాదశారాధ్యులు

నిగమాగమోభయ వేదాంత ప్రతిపాదితమైన శ్రౌత (ఆరాధ్య) శైవమును సువ్యవస్థిత మొనర్చి, దాని పరివ్యాప్తికై పాటుపడిన మహాపురుషులలో "ద్వాదశారాధ్యు"లుగా వాసికెక్కిన యీ పండ్రెండు గురువు[1] ప్రముఖులు.

1. <u>సిద్ధ త్రయము.</u>

   1) రేవణసిద్ధుడు. 2) మరులసిద్ధుడు 3) ఏకోరామసిద్ధుడు.

2. <u>ఆచార్య త్రయము.</u>

   1) శ్వేతాచార్యుడు. 2) లకులీశాచార్యుడు. 3) నీలకంఠాచార్యుడు.

3. <u>ఆరాధ్య త్రయము.</u>

   1) ఉద్భటారాధ్యుడు. 2) కోటిపల్ల్యారాధ్యుడు (విశ్వారాధ్యుడు) 3) వేమనారాధ్యుడు.

4. <u>పండిత త్రయము.</u>

   1) శ్రీపతి పండితుడు. 2) మంచన పండితుడు. 3) మల్లికార్జున పండితుడు.

సంగ్రహముగా ఈ మహా పురుషులను గూర్చి :—

---

1. *రేవణో మరులశ్చైకోరామ సిద్ధాస్త్రయ స్స్మృతాః,
శ్వేతాచార్యో, లాకులీశో, నీలకంఠో జగద్గురుః,
ఉద్భటః కోటిపల్లిశ్చ వేమారాధ్యాః ప్రకీర్తితాః
శ్రీపతిర్మంచనశ్చైవ మల్లికార్జున పండితః॥
నీలకంఠాచార్య కృత బ్రహ్మసూత్ర భాష్య పీఠిక. పుట. 4.

రేవణసిద్ధుడు :— ఇతడు కొలను పాకసోమేశ్వరలింగ సముద్భవుడు. ఆత్రేయ సగోత్రుడు. జగద్గురు (ఆది) శంకరాచార్యులకు చంద్రమౌళీశ్వర లింగము నొసగినవాడు. ఈతడగస్త్య మహర్షికి "శివతత్త్వము" నుపదేశించె నందురు. "సిద్ధాన్త శిఖామణి"యను గ్రంథము నతడు రచించెను. విశ్వకర్మ భూపాలుని కుమారుడగు చంద్రకేతువును పునరుజ్జీవితునొనర్చిన మహిమో పేతుడితడు. ఈయన భార్య దుర్గాదేవి. త్ర్యంబకేశ్వరాదులు ఈయన పుత్త్రులు.

మరుల సిద్ధుడు :— ఇతడు భారద్వాజస గోత్రుడు. గోకర్ణమునందు తపమొనర్చిన వాడు. ఇతని భార్య శివజ్ఞానాంబిక. శైవసిద్ధాన్త ప్రచార మొన ర్చినవాడు.

ఏకోరామ సిద్ధుడు :— ఈతడు రామనాథపురలింగ సంజాతుడు. అప్రాకృతదేహ ధారియని ప్రతీతి. ఇతనికి ఘంటా కర్ణుడనియు నామాంత రము. హిమవత్పర్వత ప్రాంత నివాసి యితడు. కాశీ క్షేత్ర నివాసియైన హరీత పుత్త్రిడగు విశ్వేశ్వరుడితని తండ్రి. ఇతని కుమారుడు బల్లినాథుడు.

శ్వేతార్యుడు :— ఇతడు సర్వవేదాంత తత్త్వదర్శి. పదవాక్య ప్రమా ణజ్ఞుడు. ఇతడు మిక్కిలి ప్రాచీనుడు. శివయోగాచార్యులలో అగ్రగణ్యుడు. శివాద్వైత సిద్ధాన్తమునే బ్రహ్మసూత్రములు ప్రతిపాదించుచున్నవని ప్రబో ధించినవాడు. ప్రస్థానత్రయ భాష్యకర్తయగు నీలకంఠాచార్యునకు ఇతడు దేశికుడు.

లకులీశాచార్యుడు :— ఈయనకు నకులీశుడనియు నామాంతరము. వామహస్తమున దబ్బపండును, దక్షిణ హస్తమున "లకులీ" దండమును ధరించియుండువాడు. కుశికుడు, గర్గుడు, మిత్రుడు, కౌరుష్యుడు, అను నల్వు రును ఈయన శిష్యులు.

నీలకంఠాచార్యుడు :— శ్రీకంఠుడనియు,[1] విద్యా కంఠుడనియు ఈయనకు నామాంతరములు గలవు. ఇతడు భారద్వాజసగోత్రుడు. కాశేశ్వర

---

1. నీలకంఠోవివృణుతే శ్రీకంఠోప సమాహ్వయః
   బోధాయనోక్తి మాలంబ్య బ్రహ్మసూత్రం యథా కృతి
   శ్రీకంఠ సూత్ర భాష్యము. పుట. 13. శ్లో. 7.

లింగ సముద్భూతుడితడు. విశ్వేశ్వరారాధ్యుని తపఃఫలముగ అయనకు పుత్రుడైనవాడు. తల్లి గౌరీదేవి. ఈతడు వీరభద్రాచార్య తనూజ యగు సర్వ మంగళాదేవిని పెండ్లియాడెను. ఇతడు వారణాసియందు శ్వేతాచార్యునకు శిష్యుడై గురుని యనుగ్రహముతో శాంభవదీక్షను స్వీకరించెను. గురువునుండి శారభ, అఘోర, పాశుపత మంత్రోపదేశములను పొంది, వానిని సిద్ధింప జేసికొనెను. శివపరముగ బ్రహ్మసూత్ర భాష్యమును, గీతాభాష్యమును, ఉప నిషద్భాష్యమును రచించి శివాద్వైత సిద్ధాన్తమును సువ్యవస్థిత మొనర్చెను.

శ్లో॥ దుర్వాద దర్వీకర నీలకంఠః, తపఃక్రియాతర్పిత నీలకంఠః,
శాస్త్రార్థ వాదేకృత సింహకంఠః, జీయాత్ ససాక్షాద్భువి నీలకంఠః॥

అను శ్లోకము ఈ నీలకంఠుని శాస్త్రవాద కౌశలములకు తపఃక్రియా సాఫల్యములకు, వేదశాస్త్ర విజ్ఞానాలకు అక్షరాకృతి.

ఉద్భటారాధ్యుడు :— ఇతడు కాశీవిశ్వేశ్వరలింగ సంజాతుడు. అన్న పూర్ణా విశ్వేశ్వరులు ఈయన జననీ జనకులు. ఇతడు భారద్వాజస గోత్రుడు. సుందరియను నామాంతరముగల లీలావతి యీతని యర్ధాంగి. ఇతడు ఘూర్జర దేశవాసి. వల్లకీ పురాధీశుడైన ముంజభోజ భూపతికితడు గురువు. ఇతడు కాశ్మీర రాజగు జయాపీడుని సభలో విద్యాధికారిగా నుండెను.[1] ఇతడు తన శవధూమస్పర్శమహిమచే ఏడువందల మంది గంధర్వులకు శాప విముక్తిని ప్రసాదించినట్లు పాల్కురికి సోమనాథాదులు పేర్కొనిరి.[2]

విశ్వారాధ్యుడు (కోటి పల్యారాధ్యుడు)

ఇతడు కోటిపల్లి క్షేత్ర నివాసి. అందువలన ఈయనను "కోటిపల్యా రాధ్యుడు" అనియు నందురు. క్రీ॥శ॥ 12వ శతాబ్దివాడు. కాశ్యప సగోత్రుడు

---

1. విద్వాన్ దీనార లక్షేణ ప్రత్యహం కృతవేతనః
భట్టోఽభూదుద్భటస్తత్ర జయాపీడ సభాపతిః॥
నీలకంఠ భాష్య పీఠిక. పుట. 9

2. (i) సోమన కృత "బసవ పురాణము. 7 వ అ. పుట. 518
(ii) తెనాలి రామలింగ కవి రచిత "ఉద్భటారాధ్య చరిత్రము" పుట. 178. 3-252 to 255.
(iii) శివభక్త విజయకథావళి - పుట. 228.

చతుర్వేద సారాది గ్రంథకర్త. ఈయన తలిదండ్రులు భవానీ సోమేశ్వరులు. ఈయన పాలకుర్తి గ్రామనివాసి యని యందురు. ఇతడు మల్లికార్జున పండితునకు "దీక్షా గురువు."

వేమనారాధ్యుడు :— ఇతడు బెలిదేవి (బెలిదీవి/వెలిదీవి) గ్రామనివాసి. తండ్రి మల్లికార్జునుడు. త్రిపురాంతకేశ్వరుడీయన గురువు. ఈతడు శ్రీశైల మల్లికార్జున లింగ సంభవుడు. విష్ణుదేవభూపాలుడు బెలిదేవి గ్రామమును ఈయనకగ్రహారముగ సమర్పించెను. ఈయన భార్య విజయలక్ష్మి* ఇతడు కౌండిన్య గోత్రుడు. ఇతడు 12వ శతాబ్దివాడు. మల్లికార్జున పండితునకును బసవనకును సమకాలికుడు. మహామహిమోపేతుడు. తెలుగునాట శైవప్రవృద్ధికి కృషి చేసినవాడు. పెంచిన తలిదండ్రులు, సౌభాగ్యవతి, విజయశర్మ.

శ్రీపతి పండితుడు :— ఇతడు శ్రీకరభాష్యకర్త. ఈతని తండ్రి మల్లికార్జునుడు. తల్లి భ్రమరాంబాదేవి. శ్రీశైలక్షేత్రనివాసి. క్రీ॥శ॥ 11వ శతాబ్ది వాడు. ఈతడు విజయవాడయందు తనయుత్తరీయపు కొంగున నిప్పులను మూటగట్టి మహిమలను ప్రకటించినట్లు ప్రతీతి.

మంచన పండితుడు :— ఇతడు సాంఖ్యాయన సగోత్రుడు. ఈయన యింటి పేరు శివలెంక. 11వ శతాబ్దికి చెందినవాడు. ఇతడు శ్రీశైలమున తపమొనర్చెను.

మల్లికార్జున పండితుడు :— ఇతడు ద్రాక్షారామక్షేత్ర నివాసి. తల్లి గౌరాంబ. తండ్రి భీమనపండితుడు చాతుర్వర్ణ్యముల వారికిని గురుపీఠము నలంకరించి, "త్రిలోకగురు" బిరుదమును వహించినవాడు. శివతత్త్వసార

---

* వేమనారాధ్యుని భార్య పేరు "విజయలక్ష్మి"యని ములుగు పాపయారాధ్యుడు "వేమనారాధ్య చరిత్ర"లో పేర్కొనెను. కాని ముదిగొండ వీరేశలింగశాస్త్రిగారు శ్రీ కంఠభాష్య పీఠికలో వేమనారాధ్యుని భార్య "శర్వాణి" అని తెలిపిరి,

ప్రభృతి గ్రంథకర్త. 12వ శతాబ్దికి చెందినవాడు. చందవోలు రాజసభలో మతవాద విజయములనందినవాడు. ఈయనకు సంబంధించిన శాసనము చందవోలులో కలదు.[1]

ఈ ద్వాదశారాధ్యులెల్లరును అచంచల దీక్షా సాధనలతో పరమశివుని యనుగ్రహమునకు పాత్రులైరి. వారు శివజ్ఞానమును తమ గుండెలలో నింపుకొనిరి. శివతత్త్వమును లోకమునకు వేళంగులచాటిరి. అందులకై కావ్యముల నిర్మించిరి. భాష్యములను పలికిరి. నలుమూలల సంచరించి శివబోధముల నొనర్చిరి. వేదాగమాది ప్రమాణములతో పరమశివుని పారమ్యమును ప్రకటించి, ఆరాధ్య శైవమును సర్వారాధ్య మొనర్చుటకు తమ శక్తియుక్తులను ధారవోసిరి. మహామహిమోపేతములగు వారి సేవలు ప్రాతఃస్మరణీయములు.

## ఆగమములు-అష్టవిధశైవములు

వేదములకువలె పరమేశ్వర ప్రసాదితములైన[2] "ఆగమములు"ను పరమ ప్రమాణములు. వివిధ కర్మలను గూర్చియు, ధర్మములను గుఱించియు అవి వేర్వేఱుగా పలు విషయములను ప్రస్తావించినవి. శివ స్వరూపమును

---

1. ఈ ద్వాదశారాధ్యుల సంగ్రహ చరిత్ర వివరణమునకు - శ్రీ భాష్యపీఠిక, సర్వసిద్ధాన్త సౌరభము (9వ భాగము). ముదిగొండ నాగవీరయ్యశాస్త్రిగారి శివభక్తి విజయ కథావళి అనునవి యాధారములు. ఆ రచయితల కెంతయు కృతజ్ఞుడను.
2. 1) ఆగమానాంతు సర్వేషాం స్వతః ప్రామాణ్యముచ్యతే
కామికాద్యా వాతులాంతాః శివేనోక్తాః శివాగమాః॥
శ్రీ కంఠభాష్యము- శ్రీ పీ.శై.సి. శిరోమణి నుండి - పుట. 11.
2) అష్టాదశ పురాణానాం కర్తాసత్యవతీ సుతః
కామికాది ప్రభేదానాం యథాదేవో మహేశ్వరః॥
సూత సంహిత. శ్రీ పీ.శై.సి. శిరోమణి నుండి- పుట. 11.

మచ్చటించినవి. శివధర్మములను వెల్లడించినవి. శివారాధనా విధానములను తెల్లమొనర్చినవి. ఆచార విభేదములను బట్టియు, ఆరాధన విధానవైవిధ్యముల ననుసరించియు వేఱుగా పేరు వడిన వివిధ శైవశాఖలను గూర్చియు వివరించినవి.

ఆ యాగమములలో "చంద్రజ్ఞానోత్తరాగమము" తెలిపిన "అష్టవిధ శైవశాఖల"ను గూర్చి సూక్ష్మముగా తెలిసికొని, ఆరాధ్య (మార్గ) శైవమును గుఱించి విపులముగా పరిశీలింతము.

చంద్రజ్ఞానాగమము ఎనిమిది విధములగు శైవభేదములను పేర్కొనుచున్నది.

1) అనాదిశైవము. 2) ఆదిశైవము. 3) పూర్వశైవము. 4) మిశ్రశైవము. 5) శుద్ధశైవము. 6) మార్గశైవము (ఆరాధ్యశైవము). 7) సామాన్యశైవము. 8) వీరశైవము.[1,2]

---

1. అధునా తే ప్రవక్ష్యామి శైవభేద మనుత్తమమ్,
అనాది శైవం ప్రథమం, ఆదిశైవం ద్వితీయకం,
పూర్వశైవం తృతీయంస్యాత్, మిశ్రశైవం చతుర్థకం,
శుద్ధశైవం పంచమంస్యాత్, షష్ఠంవై మార్గశైవకం,
సామాన్యం సప్తమంజ్ఞేయం, వీరశైవమథాష్టకం॥
చం.జ్ఞా. పుట. 138 - శ్లో. 4,5,6.

2. మార్గశైవం ప్రవక్ష్యామి, ముక్తిసన్నిధి మార్గకం
నిగమాగమాంత గదిత దీక్షాత్రయ పరిగ్రహః,
షట్స్థలజ్ఞాన సంపత్తిః, షట్కాల శివపూజనమ్
ఏకవింశతి సాహస్రయుత షట్చత సంఖ్యయా
షడక్షరీ జపోనిత్యం, లింగాంగైక్య విభావనమ్,
ధర్మోఽయం మార్గశైవానాం, ఈశ్వరేశ ప్రకీర్తితః॥
చంద్రజ్ఞానోత్తర ఆగమము. పుట. 143. శ్లో॥ 31, 32. 33.

శివుడును, ప్రమథగణములును, "అనాది శైవులు." కౌశికాది మహర్షులు "ఆదిశైవులు" శివద్విజులు "పూర్వశైవులు." పంచాయతన విధానమున శివారాధన మొనర్చువారు "మిశ్రశైవులు." భస్మరుద్రాక్షధారణముతో పురాణోక్త దీక్షను గైకొని, శివలింగమును మాత్రమే పూజించుచు, శివాధిక్య బుద్ధితో మసలువారు "శుద్ధశైవులు."

వేధా, మను, క్రియా దీక్షలను గైకొని, షట్స్థలజ్ఞాన సంపత్తి గలిగి, షట్కాల శివపూజల నొనర్చుచు, లింగాంగ సామరస్యముతో నిగమాగమ ప్రమాణ బుద్ధిగలిగి, శివమార్గమున జీవించువారు "మార్గశైవులు." వీరే "ఆరాధ్యశైవులు."

శాక్తమతము మొదలుకొని,పంచమతములవారును,"సామాన్యశైవులు." ఇష్టలింగము నష్టమైనను, శైవవ్రతములకు లోపము సంభవించినను, ప్రాణములను తృణప్రాయముగా పరిత్యజించువారు "వీరశైవులు."

ఈ వీరశైవమే వర్ణాశ్రమ ధర్మములతో గూడినచో శ్రౌతవీరశైవమనియు, వర్ణాశ్రమ ధర్మములు లేనిచో, స్వతంత్ర వీరశైవమనియు చెప్పబడినది.[1] భక్త్యుత్సాహ మధికముగా నుండుటచే నిది వీరశైవమనియు, వీరవ్రతమనియు,[2] చెప్పబడుచున్నది.

ఈ వీరశైవము 1) సామాన్య వీరశైవము 2) విశేష వీరశైవము 3) నిరాభారి వీరశైవము- అని మూడు విధములు.[3]

శ్రౌత(వైదిక) వీరశైవమునను్న నిరాభారిశిఖా, యజ్ఞోపవీతములను, దండమును, కాషాయవస్త్రములను ధరించును. శీతబాధా నివృత్తికై (కంథను)

1. చం. జ్ఞా. పటలము. 10. శ్లో. 37, 38.
2. చం. జ్ఞా. పటలము. 10. శ్లో. 41.
3. సామాన్యంచ, విశేషశ్చ, నిరాభారీతిచ త్రిధా..

చం. జ్ఞా. శ్లో. 42. పుట. 145.

బొంతను, కమండలమును, భస్మరుద్రాక్షములను కౌపీనమును ధరించును.1 అతడు నిష్కాముడును, లింగాంగైక్య సంధానముగలవాడును భిక్షాహారమును భుజించువాడును, భయరహితుడును, భూతదయ గలవాడును, మౌనవ్రతి యునై యొప్పుచుండును.2 అతడు సంసార సుఖములను త్యజించి, శివ ధ్యానైక పరాయణుడై యుండును. అతడు తురీయాశ్రమమును స్వీకరించిన వాడై యొప్పును.3 సన్యాసాశ్రమమును స్వీకరించిన వీరశైవుడే నిరాభారి.

నిరాభారాశ్రమమును మఱియొక నిరాభారాశ్రమస్థుని నుండియే స్వీక రింపవలయును. నిరాభారాశ్రమస్థుడు లభింపనిచో శివాలయమున శివసన్నిధి యందుగాని, బిల్వవృక్ష మూలమునగాని, ఈ యాశ్రమ స్వీకారము చేయ వలయును.4 ఈతడు సూక్ష్మ పంచాక్షరమైన ఓంకారమును జపించుచున్నను స్థూలపంచాక్షరమును విడువరాదు.5

---

1. శిఖాయజ్ఞోప వీతాఢ్యః, దండకాషాయ చేలవాన్।
వైదికే వీరశైవేతు నిరాభారీతి సస్మృతః,
స్వేష్టలింగావియోగస్తు సమాన ఉభయోస్మృతః
చం. జ్ఞా. పుట. 147. శ్లో. 53.
*కంథాక మండలుధరోభూతి రుద్రాక్ష సంయుతః
దండకౌపీన ధారీచ నిరాభారీతి గీయతే॥ శ్లో. 55
2. నిస్పృహో నిజలింగైక్యో భిక్షాశీ భయవర్జితః
మౌనీ భూతదయాయుక్తో నిరాభార ఇతి స్మృతః॥ శ్లో. 54.
3. సర్వసంసార సౌఖ్యాని త్యక్త్వాచిత్తం శివేలయేత్
తురీయాశ్రమ సేవీతు నిరాభారీతిచోచ్యతే॥ శ్లో. 51.
4. నిరాభారాశ్రమస్థస్య సంభవేతస్య సన్నిధే,
గ్రాహ్యోఽయ మాశ్రమస్తస్య ముఖాద్ధి ప్రణవోఽపిచ॥
*అసంభవే తాదృశస్య శివాగారేఽథ వాపునః
బిల్వమూలే పరిగ్రాహ్యో భవతీశ్వర శాసనాత్॥
5. ప్రణవేజప్య మానేఽపి సూక్ష్మపంచాక్షరాత్మని,
స్థూల పంచాక్షర శ్చైవోసవర్జ్యోయతిభిస్సహ॥
చం. జ్ఞా. పుటలు 147 మఱియు 148. శ్లో. 56,57,58.

## చతుర్విధసన్న్యాసులు

1) కుటీచకులు 2) బహూదకులు
2) హంసాశ్రమస్థులు 4) పరమహంసలు

పుత్త్రుల గృహంబుల భిక్షల గ్రహించుచు, లింగ, శిఖా, యజ్ఞోపవీత ములను, కమండలువును ధరించి, శివపూజాధ్యానపరులై యుండువారు కుటీచకులు

త్రిదండమును, కమండలువును, శివలింగ, శిఖాసూత్రములను ధరించి, సదాచారులగు శైవుల యిండ్లలో భిక్షలను స్వీకరించుచు శివపూజా జప తత్పరులై యుండువారు బహూదకులు.

ఏకదండమును, శిఖాయజ్ఞోపవీత లింగములను, కమండలువును, ధరించి, శివపూజాధ్యానంబు లొనర్చుచు, గ్రామము లందొక్కొక్క రోజును, నగరముల యందైదేసి రోజులును, లేక యెనిమిదేసి రోజులును వసించుచు, సంచరించువారు హంసాశ్రమస్థులు

కంథను, (బొంతను) కౌపీనమును, కమండలువును, లింగమును ధరించి, శిఖాయజ్ఞోపవీతములను వదలి, పాడుపడిన గుడిసెలయందు నిలుచుచు, ద్వంద్వదోషముల నన్నింటిని సహించి, చరించుచుండువారు పరమహంసులు. విరాగులే యీ యాశ్రమమున కర్హులు.[1]

హృద్రోగ్యాది కారణముగ ఆతురుడై సహాడు నిర్విధిగ (విధి నియమముల కొఱకు ఆగకుండ పడక) సన్న్యసింపనగును. అట్టి సన్న్యాసమును "ఆతుర సన్న్యాసము అని అందురు.

1. శైవ సర్వస్వముస—ప్రమాణ పరిచ్ఛేదము- పుట. 174.

కుటీచక, బహూదకులు "శిఖిసన్న్యాసులు" గను, హంస పరమహంసలు, "ముండి", "జటీ" నామకులుగను వ్యవహరింపబడుదురు.1

## ఆరాధ్య (శ్రౌత) శైవము

ఈ యారాధ్య శైవమునకే "శ్రౌతశైవము", "ఉత్తరశైవము", "మార్గ శైవము" మొదలగు నామాంతరములు గలవు.

శ్రుతులనగా వేదములు. వేదోక్తములైన కర్మల నాచరించుచు, శివారాధన మొనర్చునదిగాన దీనికి "శ్రౌతశైవము" అను పేరు స్థిరపడినది. ఈ శ్రౌతశైవము రెండు విధములు.

1) పూర్వశైవము. 2) ఉత్తరశైవము.

పూర్వశైవము నిగమాగములను ప్రమాణములుగా నాదరించును. భస్మ రుద్రాక్షధారణములను నిర్వహించును. మంత్రోపదేశములను పాటించును. శివలింగార్చనము నొనర్చును.2

ఉత్తరశైవము వేదములయందువలె శివాగమముల యెడలను సమప్రామాణ్య బుద్ధిని ప్రసరింపజేయును. ఆ వేద శివాగమోక్తములైన కర్మల నాచరించుచు, భస్మరుద్రాక్షలతోబాటు, ఇష్టలింగధారణమునుగూడ విహితముగ స్వీకరించెను.

---

1. కుటీచక, బహూదకౌ శిఖినః॥ హంస, పరమహంసౌ జటీముండినః॥
సిద్ధాన్త కిరణాలు - పుట. 54.
2. నిగమాగమ ప్రామాణ్య పూర్వక, తదుక్త కర్మాచరణవత్త్వేసతి, భస్మరుద్రాక్షధారణ మంత్రోపదేశ లింగార్చనాకలి తత్వం, పూర్వశైవ లక్షణమ్॥ లింగధారణ చంద్రిక. పీఠిక. పుట. 17.

ఇది శివపూజను షట్ స్థలాత్మకముగ నిర్వహించును. మృతుల దేహములకు సమాధి (ఖనన) క్రియలను నెరపును.[1]

ఉత్తరమనగా శ్రేష్ఠము. పూర్వశైవముకంటె కొన్ని ఉత్తర (శ్రేష్ఠ) లక్షణములు కలిగియున్నందున ఇదియుత్తర శైవముగా వాసికెక్కినది. ముక్తికి సన్నిధి మార్గముగాన దీనికి "మార్గశైవము" అనుపేరు పేర్కొనబడినది.[2] లింగధారణ కారణముగ పూర్వశైవముకంటె ఈ యుత్తర శైవమొక వైశిష్ట్యమును సంతరించుకొనినది. కనుక నీయుత్తర శైవమునకు "లింగధారణము" ప్రాణప్రదమైనది. అందువలన లింగధారణ ప్రభావమును, ప్రశస్తిని గూర్చి కొంత ముచ్చటించుకొనవలసియున్నది.

## లింగధారణము

"అమృతస్య దేవధారణో భూయాసం" (తైత్తిరీయము)

"సర్వలింగగ్గ్ స్థాపయతి" పాణి మంత్రం పవిత్రం" మొదలగు శ్రుతులు లింగధారణమును విధించుచున్నట్లు లింగధారణాది గ్రంథములు పేర్కొనుచున్నవి. లింగము సర్వ పవిత్రమైనది. దానినెల్లపుడును ధరింపవలయును.[3]

---

1. "వేదానురోధి శివోక్త సకలాగమ ప్రామాణ్య విశిష్టత్వేసతి, వేదాగమోక్త కర్మాచారవత్త్వేసతి, భస్మరుద్రాక్ష స్వేష్ట లింగధారణ, షట్ స్థలాత్మక శివపూజా పరాయణత్వేసతి, దేహావసాన సమనంతర సంప్రాప్త కేవల సమాధి ధర్మవత్త్వం ఉత్తరశైవ లక్షణం"— లింగ ధారణ చంద్రిక. పీఠిక - పుట. 17.
2. "మార్గశైవం ప్రవక్ష్యామి ముక్తిసన్నిధి మార్గకమ్"
   చంద్రజ్ఞానాగమము. పటలము. 10. పుట. 143.
3. పవిత్రాణాం పవిత్రత్వాత్ పవిత్రమితి కథ్యతే
   తస్మాద్ధార్యం సదాలింగం పాణిమంత్రేతి మంత్రతః
   సిద్ధాన్తాగమము - శ్రీ. వీ. శై. సి. శిరోమణి. పుట. 126, 127.

జీవులను లింగము పవిత్ర మొనర్చును. కనుక దానిని సర్వకాలముల యందును ధరింపవలయును.[1] ముఖమున మంత్రజపము, హృదయమున ధ్యానము, మస్తకమున లింగధారణము, శిఖావిలసనము, భస్మరుద్రాక్షరణము. అనునవి బ్రాహ్మణుని ముఖ్యలక్షణములుగా గౌతమస్మృతి తెలుపుచున్నది.[2]

బ్రహ్మ విష్ణువు మొదలగు దేవతలును, గౌతమాది మహర్షులును, ఎల్ల వేళల తమ యుత్తమాంగముల యందు లింగమును ధరించుచుందురని. లింగ పురాణము పేర్కొనుచున్నది.[3]

పైన పేర్కొన్న విషయముల ననుసరించి, లింగధారణ మొక పవిత్ర కార్యమనియు, శివానుగ్రహమునకు అది మూలమనియు భావింపబడుచున్నది.

## శాంభవదీక్ష

ఆరాధ్య (శ్రౌత) శైవమునకు శాంభవదీక్ష మూలమైయున్నది. దీక్షా పూర్వకముగ లింగమును ధరించుటను "లింగధారణదీక్ష" అనియందురు. దీనినే శాంభవదీక్ష, పాశుపతదీక్ష, అత్యాశ్రమము, శిరోవ్రతము, చీర్ణవ్రతము, విరజాదీక్ష, చిన్మయదీక్ష, మున్నగు నామములతో పేర్కొందురు.[4]

---

1. పవిత్ర కరణాత్ పుంసాం పవిత్రమితి కథ్యతే
అతః సర్వేషుకాలేషు ధారయేల్లింగ ముత్తమమ్.
శ్రీపీ.శై.సి.శి. పుట. 128—. లింగపురాణము-21 అధ్యా.పుట. 105.
2. ముఖేమంత్రో హృది ధ్యానమ్ మస్తకేలింగధారణమ్,
శిఖారుద్రాక్ష భస్మాని, ఇతి బ్రాహ్మణ లక్షణమ్—గౌతమస్మృతి,
శ్రీ.పీ.శై.సి.శి. పుట. 135.
3. బ్రహ్మ విష్ణ్వా దయో దేవాః, మునయో గౌతమాదయః
ధారయంతి సదాలింగం, ఉత్తమాంగే విశేషతః ॥
లింగపురాణము - అధ్యా. 21,—. శ్రీ.పీ.శై.సి.శి. పుట. 134.
4. *అత్యాశ్రమం, పాశుపతం, శాంభవం, తచ్ఛిరోవ్రతమ్,
ఇతీదం నామభిః పుణ్యైః నిగమాంతేషుగీయతే॥
కారణోత్తరాగమము. పుట. 10.
*కృత్వాతు విరజాదీక్షాం, భూతిరుద్రాక్ష ధారణమ్,
జపస్తు వేద సారాఖ్యం, శివనామ సహస్రకమ్, శివగీత.

పునర్జన్మ రాహిత్యమునకై, అమృతత్వసిద్ధికై, ఈ శాంభవవ్రతమును (పాశుపతదీక్షను) ముముక్షువు లాచరింపవలయున్నది- అని అథర్వ శిరోపనిషత్తు నుడువుచున్నది.1

పాపపటలిని రూపుమాపి, శివజ్ఞానమును ప్రసాదించునది గావున, దీనికి "దీక్ష" అని పేరు.2 ఈ దీక్ష, "శ్రౌతము" — "అశ్రౌతము" — అని ద్వివిధము. ఆరాధ్య సంప్రదాయమునకు సంబంధించినది శ్రౌతదీక్ష. ఈ శాంభవదీక్షా స్వరూపమును, గూర్చి ఆగమములిట్లు వివరించుచున్నవి.

1) వేధాదీక్ష,మను (మంత్ర) దీక్ష, క్రియాదీక్ష, అను దీక్షాత్రయ మిందు స్వీకరింపబడును. ఈదీక్షాత్రయమును "మహాదీక్ష"గా వ్యవహరింతురు 2) ఇందు కర్మజ్ఞానములకు (కర్మకాండమునకును, జ్ఞానకాండమునకును) సమప్రాధాన్యముగలదు. 3) ఈదీక్ష షట్స్థల జ్ఞానవిలసితము 4) ఇది దశావధాన విధానములతో నొప్పుచుండును. 5) ఇది "అష్టావరణముల"తో గూడినది 6) ఇది వేదశాస్త్ర మార్గములను (ధర్మములను) పాటించును. అనగా వర్ణాశ్రమ ధర్మములతో గూడినది. 7) శివానుగ్రహమునకు కారణమైనది. 8) ఆగమోక్తములైన విధుల నాచరించునది.

వేధాదీక్ష : శిష్యుని శిరమున హస్తమునుంచి, గురుడనుగ్రహ దృష్టితో చూచునదియే "వేధాదీక్ష"3

---

1. వ్రతమేతచ్ఛాంభవమ్, వ్రతమేతత్పాశుపతమ్
తత్సమాచరేత్ ముముక్షు రపునర్భవాయ — అథర్వ శిరస్సు—
2. దీయతేహి శివజ్ఞానమ్, క్షీయతే పాపపంజరం,
తస్మాత్ "దీక్షైవ" మోక్షస్య కారణం ప్రోచ్యతే బుధైః॥
శైవాగమములు—వాని విశిష్టత—పుట—28
3. హస్తమస్తక సంయోగాత్ దృష్టేర్వేధేతి గీయతే"
గురుణోదీరితాకర్ణే సాహిమంత్రాత్మికా భవేత్—
శిష్యపాణితలే దత్తాయా దీక్షాస్యాత్క్రియాభవేత్.
కారణోత్తరాగమము—పుట. 3.

మను (మంత్ర) దీక్ష : గురువు శిష్యుని చెవియందు మంత్రము నుపదేశించుటను "మను (మంత్ర) దీక్ష" యని యందురు.

క్రియాదీక్ష : గురువు శిష్యుని హస్తమునందు లింగము నుంచుటయే "క్రియాదీక్ష"—

కర్మజ్ఞాన (కాండ)ముల ప్రాధాన్యము : ఈ సంప్రదాయమున కర్మజ్ఞానములకు రెంటికిని సమప్రాధాన్యము గలదు.

జ్ఞాన రహితమగు కర్మమున కర్థములేదు. కర్మాచరణములేని జ్ఞానమసంపూర్ణము. జీవనయానమున పక్షికి రెండు రెక్కలును ప్రధానములేయైనట్లు పరమార్థ సాధనమున కర్మజ్ఞానములు ఉభయములును ముఖ్యములే. దీనినే విహంగ పక్ష న్యాయమని యందురు.[1]

ఈ సందర్భమును పంగ్వంధ న్యాయమున సమర్థించుటయు కలదు.

అగ్ని దగ్ధమగుచున్న గృహమున ఒక కుంటివాడును, ఒక గ్రుడ్డివాడును కలరు. నడిచిపోలేక కుంటివాడు దగ్ధముకానుండెను. చూపులేనందున వెళ్ళజాలక గ్రుడ్డివాడును కాలిపోనుండెను. పరస్పర సహకారముతో (కుంటివానిని గ్రుడ్డివాడు తన వీపుపై నెక్కించుకొనగా, కుంటివాని సూచనములతో గ్రుడ్డివాడు ముందునకు నడచి, సాగిపోగా) వారు ఆ ప్రమాదమునుండి విముక్తులైరి.

అట్లే, పంగ్వంధన్యాయమున[2] కర్మజ్ఞానములు సమప్రాధాన్యమున సమాదరణీయములైనప్పుడే మోక్షము ప్రాప్తించును.

---

1. జ్ఞానం ప్రధానం నతుకర్మహీనం, కర్మ ప్రధానం నతు జ్ఞానహీనం,
తస్మాద్ద్వయోరేవభవేత్ప్రసిద్ధిః, నహ్యేక పక్షోవిహగః ప్రయాతి.
లింగధారణ దీపిక—పుట. 8

2. అపశ్యన్నంధకోదగ్ధః. పశ్యన్ దహతి పంగులః
అంధపంగువదన్యోఽన్య సాపేక్షే జ్ఞానకర్మణీ॥
లింగధారణ దీపిక—(చంద్రిక) పీఠిక. పుట. 8.

అందువలననే షట్స్థలాత్మకమైన శివపూజా విధానమున మొదటి మూడంగములను కర్మాంగములనియు, తరువాతి మూడంగములను జ్ఞానాంగములనియు, సంప్రదాయజ్ఞులు పేర్కొనిరి.

## షట్స్థలములు

శివపూజా విషయమున ఉపాసకుడాచరించు షడ్విధ ప్రక్రియలను షట్స్థలములనియందురు. 1. భక్తస్థలము. 2. మహేశ్వరస్థలము 3. ప్రసాదిస్థలము. 4. ప్రాణలింగి స్థలము. 5. శరణస్థలము. 6. ఐక్యస్థలము.

ఈ షట్ స్థలములను క్రమము వీడక పాటించుచు ఉపాసకుడు తన శివపూజను కొనసాగింపవలెను. ఇవి యోగశాస్త్ర పరిస్పర్శతో గూడిన విధానములుగాగన్పట్టును. యోగశాస్త్రము నందలి, ఆధార-స్వాధిష్ఠాన, మణిపూరక—అనాహత—విశుద్ధ—ఆజ్ఞాచక్రంబులకును — ఈషట్ స్థలోపాసనారీతులకును మిక్కిలి సన్నిహిత సంబంధమున్నట్లుతోచును.

భక్త స్థలములోనున్న యుపాసకుడు క్రమముగా తన యుపాసనలను (పూజా ప్రక్రియలను) మహేశ్వరాది స్థలములలో కొనసాగించుచు, ఐక్యస్థలోపాసనతో శివైక్య స్థితిని, తదానందమును పొందును.

నిత్యసాధనలో శివాద్వైతానందము నందించుచు, అభ్యాస బలమున క్రమక్రమముగా ఉపాసకునకు శివసాయుజ్యరూపమోక్షానందమును చిరస్థిరముగావించు—ఈషట్ స్థలములు ఆరాధ్య సంప్రదాయమున కాయువుపట్టులు.

## "అష్టావరణములు"

ఆరాధ్యశైవ సంప్రదాయపరులకు ఈ అష్టావరణములు ప్రాణతుల్యములు. అంతేగాదు. అవివారి నిత్యజీవన విధానమున అవిభాజ్యము.

1. గురువు, 2. లింగము (లింగ ధారణము), 3. జంగముడు (జంగమసేవ), 4. తీర్థము, 5. ప్రసాదము, 6. భస్మము (భస్మధారణము),

7. రుద్రాక్ష (రుద్రాక్షధారణము) 8. మంత్రము (మంత్రజపము) అనునవి "అష్టావరణములు"గా పేర్కొనబడుచున్నవి.[1]

సంసార సంబంధమగు దోషపరంపరను భక్తులదరి జేరనీయక వారికి రక్షక కవచములుగా (ఆవరణములుగా) ఉండునవిగాన వీనికి "ఆవరణములు" అని సార్థక వ్యవహారము స్థిరపడినట్లు చెప్పుదురు.

## "గురువు"

ఈ యష్టావరణములలో గురువుయొక్క స్థానము సర్వశ్రేష్ఠము, ప్రప్రథమము.

నగురోరధికం నగురోరధికం
శివశాసనతః శివశాసనతః

అనునది యీ యారాధ్యశైవ సంప్రదాయమునకు పరమాదర్శము. మోక్ష ప్రాప్తికి శివదీక్షమూలము.[2] ఆదీక్షననుగ్రహించువాడు గురువు.[3]

---

1. గురుర్లింగం జంగమశ్చ, తీర్థంచైవ ప్రసాదకః, భస్మరుద్రాక్షమంత్రా శ్చేత్యష్టావరణ సంజ్ఞికాః॥ చం: జ్ఞా. పటలము. 2. శ్లో. 2

2. మత్ప్రసాదేననవినా ముక్తిః సంసృతి బంధనాత్
మమజ్ఞానేననవినా మత్ప్రసాదో భవిష్యతి
మద్జ్ఞానం నభవత్యేవహ్యనక్షదీయాయావినా
తస్మాదియం మహాదీక్షామోక్షదా నిశ్చితాఖలు॥
కారణోత్తరము. పటలము.2. శ్లో॥11,12.పు.26

3. మోక్షస్యదీక్షా సంప్రాప్త్యై గురుస్స్యాన్మూల కారణమ్—
చం. జ్ఞా. పుట 16 (2-5.)

వాస్తవముగా గురువు శివతుల్యుడు. గురువునకును శివునకును రూపమున భేదమున్నను నిజముగా వారభిన్నులు.1 అగ్నిసంపర్కముతో బంగారమునకు మాలిన్యము తొలగినట్లు గురుసంస్పర్శతో శిష్యునకు పాపములు దూరమగును.2

ఉదాత్తలక్షణములు గలవాడు మాత్రమే గురుస్థానమున కర్హుడగును అతడు వేదశాస్త్ర రహస్యవేదియు, సత్ సంప్రదాయజ్ఞుడును, ఉత్తమ వంశసంజాతుడును, లోభమోహాది వర్జితుడును, ఆత్మజ్ఞాన సంపన్నుడును, విజితేంద్రియుడును, ధార్మికుడును, సత్యవాదియు, శివధ్యానపరుడును, లింగాంగ సంయోగము గలవాడును, శివాద్వైతసాధకుడును, షట్స్థలజ్ఞానవేత్తయు, ఐయుండవలెను3

---

1. యోగురుస్సశివః ప్రోక్తః యశ్శివస్స గురుస్స్మృతః
గురుర్వా శివ ఏవాథ విద్యాకారేణ సంస్థితాః॥
చం. జ్ఞా. పుట. 16 (2.7)

2. యథేహ వహ్ని సంపర్కాన్మలంత్యజతి కాంచనం
తథైవ గురుసంపర్కాత్ పాపం త్యజతిమానవః॥
చం. జ్ఞా. పుట. 17 (2.14)

3. * గురుశ్చ గుణవాన్ ప్రాజ్ఞః, పరమానంద భాసకః
తత్త్వ విచ్ఛివ సంయుక్తో, ముక్తిదోనతుదాపరః
శైవసిద్ధాన్త తత్వజ్ఞః ప్రతిష్ఠామన్త్ర పారగః
మోక్షదః కరుణోపేతో, వీతరాగో విమత్సరః॥
* క్రియాదీక్షాన పర్యంతం, శివతత్త్వ వినిశ్చయః
సంప్రదాయగతజ్ఞానో, లోభదంభ వివర్జితః॥
లింగాంగస్థల భేదజ్ఞః, షట్ స్థలజ్ఞాన తత్పరః
దీక్షా కర్మాదికుశలః, షడధ్వజ్ఞాన వత్సలః॥
శివస్యచ గురోర్భక్తః శిష్యైరాహితమానసః
శివాస్యనాసక్త చిత్తః, శివధ్యానైక తత్పరః॥
చం. జ్ఞా. - పుట. 24, 25 (2-48 to 52)

గురుయాత్ర, దేవయాత్ర, తీర్థయాత్ర, అను మూడు యాత్రల యందును గురుయాత్రయే అధిక ఫలదాయకమ్ము.4

ఈ సంప్రదాయమున గురువు గృహస్థుడు గానేయుండవలయును. వాన ప్రస్థులను, యతీశ్వరులను, గురువులను జేసికొనుట సమ్మతముగాదు.5

శివునికంటెను గురువునకే ప్రాధాన్య మిచ్చుట యీసంప్రదాయమున విశేషము. శిష్యుడు గురుపూజ యొనర్చిన పిమ్మటనే శివపూజ చేసికొనవలెను. శివుడు కోపించినచో గురుడు రక్షింపగలడు. కాని గురువే కోపించినచో నిక రక్షించు వారుండరు.1 దీనిని బట్టి గురుస్థానము సర్వోన్నతమై యొప్పుచున్నది. కనుక శిష్యుడు సర్వోత్తముడైన గురువు నాశ్రయించి, వానిని భక్తి శ్రద్ధలతో సేవించి. తదనుగ్రహముతో శివదీక్షను గైకొని, గురూపదిష్ట మార్గమున నడుచుకొనుచు గురుపాద తీర్థ, ప్రసాదములను స్వీకరించినచో, తత్ప్రభావమున శిష్యుని భవబంధములు తొలగును. పిదప నతడు మోక్షము పొందగలడు.2

గురు సంబోధనమునందు స్వామీ! భట్టారకా! ఆచార్యా! దేవా! శ్రీగురూ! అను పదములు మాత్రమే ప్రయుక్తములు కాదగును. "ఆచార్య

---

4. గురుయాత్రా, దేవయాత్రా, తీర్థయాత్రేతి చ త్రిధా
అసాం త్రివిధయాత్రాణాం, గురుయాత్రా ఫలాధికా॥

చం. జ్ఞా. 2-28.

5. గురుః గృహస్థ ఏవస్యాత్ న కదాచిద్యతిర్భవేత్
వానప్రస్థయతీనాంతు గురుత్వం నిష్ఫలం భవేత్॥ చం. జ్ఞా. 253.

1. శివేరుష్టే గురుస్త్రాతా గురౌ రుష్టే న్నిజ సద్గురౌ,
త్రాతా శివస్త దేతస్మాత్ గురుపూజా రతోభవేత్ చం. జ్ఞా. 2-80.

2. గురుప్రసాద పాత్రం యస్సహిమోక్షాయ కల్పతే
నముక్తి మూలమన్యద్ధి విహాయ గురుసత్కృపాం॥ చం. జ్ఞా. 2-99.

దేవోభవ" అను (తైత్తిరీయ) ఉపనిషద్వచనము గూడ "గురు" దివ్యత్వమును ఘంటాఘోషముగ చాటుచున్నది. "గురుస్సాక్షాత్ పరంబ్రహ్మ తస్మై శ్రీ గురవేనమః" అనువచనముగూడ ఈ సందర్భమున స్మరింపబడినట్లో ఏతత్సంప్రదాయ పరమార్థము సులోధముకాగలదు. సర్వసంప్రదాయములకును "గురోరనుగ్రహేణైవ పుమాన్ పూర్ణః ప్రజాయతే" అనువాక్యము స్కామాదరణీయమే కాగలదు.

## లింగము (లింగధారణము)

అష్టావరణములలో ఈ "లింగము" ద్వితీయమైనను, ఆరాధ్య సంప్రదాయమున అద్వితీయమైనది. ప్రాణప్రదమైనది. చరా చరాత్మకమైన యీ సమస్త విశ్వము బ్రహ్మస్వరూపము. ఆ బ్రహ్మము లింగస్వరూపము. సనాతనము. సచ్చిదానంద లక్షణాత్మకము.1 బ్రహ్మాదిదేవతలును, వేదములు మున్నగునవియును, ఈ లింగమునుండియే యవతరించుటయు, ఈ లింగమునందే లయమగుటయు, జరుగుచున్నందున ఈ లింగము కేవలబ్రహ్మమే.2 దీనిని ధరించినవారిని ఇది సర్వదా సర్వథాపవిత్ర మొనర్చును గాన ఈలింగమును సర్వకాల సర్వావస్థలయందును ధరింపవలయును.3

---

1. "సర్వం ఖల్విదం బ్రహ్మ" లింగం తద్బ్రహ్మ సంజ్ఞితం,
"తల్లింగం బ్రహ్మశాశ్వతం" "లింగం బ్రహ్మ సనాతనమ్."
శ్రుతివచనములు శ్రీ. పి. శై. సి. శి - పుట. 123.

2. బ్రహ్మవిష్ణ్వాదయో దేవా స్సర్వేవేదాదయస్తథా,
లీయన్తే యత్ర గమ్యన్తే తల్లింగం బ్రహ్మకేవలమ్॥
సిద్ధాన్త శిఖామణి

3. పవిత్ర కరణాత్ పుంసాం పవిత్రమితి కథ్యతే,
అతస్సర్వేషు కాలేషు ధారయేల్లింగ ముత్తమమ్॥
గచ్ఛన్ తిష్ఠన్ స్వపన్ జాగ్రదున్మిషన్నిమిషన్నపి,
శుచిర్వాప్య శుచిర్వాపి లింగం సర్వత్ర ధారయేత్॥
లింగపురాణము 21 వ, అధ్యాయము.

లింగము బిందు, నాదాత్మకము. కనుక అది జగత్కారణము. అందు వలన భవపాశ నివృత్తికై యీ లింగమును పూజింపవలయును.[1] బిందువనగా శక్తి. నాదమనగా శివుడు. శివశక్త్యాత్మకమైనది జగత్తు.[2] ఉపాసనా విధి యందు ఈ మహాలింగమును 1) ఇష్టలింగము 2) ప్రాణలింగము 3) భావ లింగము. అని ఆగమములు మూడు విధముగా పేర్కొనుచున్నవి.[3]

స్థూల శరీరముచే ఇష్టలింగమును, సూక్ష్మశరీరముచే ప్రాణలింగ మును, కారణ శరీరముచే భావలింగమును ధరింపవలెను.[4] గురుదత్తమైన యీ లింగత్రయమును ధరించుటవలన తను త్రయము నాశ్రయించు కొని యున్న మలత్రయము (ఆణవమలము, మాయామలము, కార్మికములము, అనుపాశత్రయము) నిర్మూలనమగును.[5] ఇష్టలింగమును పూజించుటవలనను,

---

1. బిందునాత్మకం లింగం, జగత్కారణ ముచ్యతే,
తస్మాజ్జన్మ నివృత్త్యర్థం, శివలింగం ప్రపూజయేత్॥

2. బిందుశ్శక్తిః, శివోనాదః, శివశక్త్యాత్మకం జగత్॥
చం. జ్ఞా. శివ పటము - పుట. 37, శ్లో. 14

3. మహాలింగం త్రిధాజాతం సుజనాను జిఘృక్షయా
ప్రథమం భావలింగంతు, ద్వితీయం ప్రాణలింగకం
తృతీయ మిష్టలింగం స్యాదిత్యేవం త్రివిధం మతం॥
చం. జ్ఞా. శివ పటలము - పుట. 39 శ్లో. 26, 27.

4. ఇష్టం స్థూల తనోర్ధార్యం, ప్రాణం సూక్ష్మతనోః స్మృతం
భావాఖ్యం కారణస్యైవం, తనుత్రయ గతం త్రయం.
చం. జ్ఞా. - పుట. 43. శ్లో. 50; (చ. జ్ఞా. పేజీ. 45, శ్లో. 51, 52.

5. ఆణవం, మాయికంచైవ, కార్మికంచ యథాక్రమం
మలత్రయమనాదీదం, తనుత్రయగతం భవేత్॥
తనుత్రయ గతానాది, మలత్రయమిదం గురుః,
దీక్షాత్రయేణ నిర్దగ్ధ్వా, లింగత్రయముపాదిశేత్॥

ప్రాణలింగమును ధ్యానించుటచేతను, భావలింగమును శివైక్యభావనతో భావించుటతోడను శివోపాసకుడు మృత్యుపాశమును జయించి, అమృతత్వమును భజించును.[1]

## జంగముడు (జంగము సేవ)

పరబ్రహ్మ స్వరూపమైన శివలింగము యొక్క త్రివిధరూపములలో (గురు, లింగ, జంగములలో) జంగమ రూపమొకటి.[2] జంగమ డనగా శివుడే. శివుడే జంగమ రూపుడు.[3] శివునియొక్క జంగమ, స్థావరాత్మకమైన రూపద్వయములో ఇతడు "చరరూపుడు" ఈ జంగమునకే, మహేశ్వరుడు, చరుడు, భక్తుడు, శైవుడు, శివయోగి, మున్నగు నామాంతరములు గలవు.[4] ఈ జంగములలో బ్రహ్మచారికంటె గృహస్థుడును, ఆయనకంటె నిరాభారియు (దారాది పరిత్యాగమొనర్చినవాడు) అధికులు. (అధికపూజ్యులు).[5]

---

1. పూజయన్నిష్టలింగంతు, నిధ్యాయన్ ప్రాణలింగకం,
భావయన్భావలింగంవై, మృత్యుపాశాంశ్చినత్తి సః॥ శ్లో. 58.

2. ఏకమూర్తే స్త్రయోభాగాః గురుర్లింగంతు జంగమః,
అగమోక్తి. శ్రీ.పి.శై.సి.శి - పుట. 234.

3. జంగమ రూపశ్శివః, శివః ఏవ జంగమ రూపః ఋగ్వేదోపనిషత్తు
కణ్వశాఖ. శ్రీ పి సి శి - పుట. 285.

4. మాహేశ్వరశ్చరో భక్తశ్శైవో జంగమ ఇత్యపి.
సహజస్యాభిధానాని భవంతీశ్వర శాసనాత్
చ. జ్ఞా. - పుట. 49. శ్లో. 8.

5. బ్రహ్మచారీ, గృహీచైవ, నిరాభారీతి తేత్రయః
యధోత్తరం విశిష్యన్తే పూజానీయాయథావిధి.
చం. జ్ఞా. పుట. 49. శ్లో. 9.

సకల తీర్థములయందు స్నానమొనర్చుట కంటెను, సర్వ యజ్ఞములు సలుపుటకంటెను, సమస్త దేవతలను ఆరాధించుటకంటెను, ఈ జంగమును పూజించుట అధిక ఫలప్రదము.1

## తీర్థము :

తీర్థమనగా గురుచరేశ్వర పాదస్పర్శచే పవిత్రమైన జలాదికము. దీనినే పాదతీర్థమనియు నందురు. ఈ పాదతీర్థము మూడు విధములు. చర పాద (జంగమ పాద) తీర్థము, గురుపాద తీర్థము, శివ (లింగ) పాదతీర్థము. చరపాదోదకమును జ్ఞానపాదోదకమనియు, గురుపాదోదకమును శిక్షాపాదోదక మనియు, శివపాదోదకమును దీక్షాపాదోదకమనియు వ్యవహరించుట కలదు.2

గురుచరేశ్వర పాదతీర్థములు మూడును లభించినప్పుడు, ముందు మాహేశ్వర (జంగమ/చర) పాదోదకమును, పిదప గురుపాదోదకమును, అనంతరము శివ(లింగ) పాదోదకమును, సేవింపవలయును. చరుడు లేనప్పుడు గురు, శివ(లింగ) పాదోదకములను క్రమముగా పుచ్చుకొనవలెను. అప్పుడు గురుపాదోదకమునందే చరపాదతీర్థభావనను గూడ చేసి, ఆ తీర్థ మును సేవింపవలెను. గురుచరులు లభింపనప్పుడు శివ(లింగ) పాదతీర్థము నందే త్రివిధ పాదతీర్థ భావములను స్మరించి, ఆ తీర్థమును సేవింపవలెను.

## ప్రసాదము

గురుచరేశ్వలకు సమర్పితమైన పదార్థమును ప్రసాదమనియందురు. శివప్రసాదము "శుద్ధ" మనియు, గురు ప్రసాదము "సిద్ధ" మనియు, చర ప్రసాదము "ప్రసిద్ధ" మనియు, వ్యవహరింపబడుచుండును. ఈ త్రివిధ

---

1. సర్వతీర్థాభిషేకాచ్చ, సర్వయజ్ఞ విధానతః,
   సర్వేదేవారాధనాచ్చ, భక్తపూజాగరీయసీ॥
   చ. జ్ఞా. పుట - 55. శ్లో. 38.

2. పాదతీర్థం త్రిధాశంభోర్గురు జంగమయో రపి,
   దీక్షా, శిక్షా, జ్ఞానమతి, త్రిసంజ్ఞం తద్భవత్యహో॥
   చం. జ్ఞా. పుట - 58, శ్లో. 5.

ప్రసాదములు లభ్యమైనపుడు వరుసగా చర, గురు, శివప్రసాదములను స్వీకరింపవలెను. చరుడు లభింపనప్పుడు గురు, శివ ప్రసాదములను క్రమముగా తీసికొనవలెను. అప్పుడు గురుప్రసాదమునందు చరప్రసాద భావనను గూడ చేయవలెను. చర గురులు లభింపనప్పుడు శివ(లింగ) ప్రసాదమునందే గురు చరేశ్వర ప్రసాదభావనము చేసి, ఆ ప్రసాదమును గ్రహింపవలెను.

ఇష్టలింగమునకు (శివునకు) నివేదింపక ఏ పదార్థమును లింగధారి సేవింపరాదు.[1]

ఈ ప్రసాదము "ఋతము" "బ్రహ్మము" "సత్యము" "అమృతము" అను పేర్లతోడను వ్యవహరింపబడుచున్నది.[2]

## భస్మము (భస్మధారణము)

శివోపాసకులకు భస్మధారణము ప్రాణసమానమైనది. శివుని భస్మోద్ధూళిత విగ్రహుఁడని వ్యవహరించుట సుప్రసిద్ధము. ఆ మహాదేవుడు భస్మస్వరూపుడు.[3] శివుడు భస్మజ్యోతి స్స్వరూపుడు.[4]

---

1. పత్రం, పుష్పం, ఫలం, తోయం, అన్నపానాద్యమౌషధం
అసమర్ప్య నభుంజీత భగవన్తం సదాశివం॥

చం. జ్ఞా. పుట - 63. శ్లో. 24.

2. ఋతం, సత్యం, పరంబ్రహ్మ ఒమృత మిత్యపిగీయతే,
ప్రసాదస్తస్యమహిమా కేన వా వర్ణ్యతే కథమ్॥

చం. జ్ఞా. పుట - 65. శ్లో. 35.

3. మహాదేవో మహాభస్మ : సూత సంహిత శ్రీ. పి.శై.సి.శి. పుట - 7.

4. సవిషభస్మ జ్యోతిః : జాబాలోపనిషత్తు శ్రీ.పి.శై.సి.శి. పుట - 6.
భస్మజ్యోతిర్భవత్యేవ శివాఖ్యం నహి సంశయః॥

మానవ పురాణము శ్రీ.పి.శై.సి.శి. పుట - 6.

ఈ భస్మమునకు విభూతి, భసితము, భస్మము, క్షారము, రక్ష, మున్నగు నామములు గలవు.

లౌకికాగ్నివలనను, వేదాగ్నితోడను, శివాగ్ని నుండియు నీ భస్మమును సిద్ధ మొనర్చుకొనవచ్చును. అఘోరమంత్రమున బిల్వకాష్ఠమున తరిచినచో పుట్టు అగ్నియే శివాగ్ని.[1] సిద్ధ మొనర్పబడిన తీరుతెన్నుల విభేదములనుబట్టి యిది (ఈ భస్మము) నాలుగు విధములు. 1) కల్పము 2) అనుకల్పము 3) ఉపకల్పము 4) అకల్పకము.[2]

ఈ భస్మమును త్రిపుండ్రములుగా. (తిర్యక్ పుండ్రములుగా) ధరించుట యాచారము. ఈ త్రిపుండ్రమునందలి ప్రథమరేఖ గార్హపత్యాగ్ని యనియు, ద్వితీయరేఖ దక్షిణాగ్ని యనియు, తృతీయరేఖ ఆహవనీయాగ్ని యనియు కాలాగ్ని రుద్రోపనిషత్తు తెలుపుచున్నది.[3]

ఈ భస్మధారణము మూడు విధములు.[4] 1) ఉద్ధూళనము 2) అవకుంఠనము 3) త్రిపుండ్రము. ఆ పాదమస్తకము వొది భస్మమునలదుకొనుట ఉద్ధూళనము. తడి (సజల) భస్మమును శరీరమునందంతటను, అలదుకొనుట

---

1. అఘోరేణాత్మమంత్రేణ బిల్వకాష్ఠప్రఘర్షయేత్
శైవసిద్ధాన్తదర్శిని పుట - 17

2. భస్మోత్పాదన ముద్దిష్టం చతుర్ధా తంత్రవేదిభిః,
కల్పంచైవాను కల్పంచాప్యు పకల్పమ కల్పకమ్॥ సిద్ధాన్త శిఖామణి.

3. ప్రథమా రేఖాగార్హపత్యశ్చ, ద్వితీయా రేఖా దక్షిణాగ్నిః,
తృతీయా రేఖానాహవనీయః
కాలాగ్ని రుద్రఉపనిషత్తు శై.సి.ద. పుట - 7.

4. ఉద్ధూళనం తతఃకార్యం, అవకుంఠన మేవచ
త్రిపుండ్రం చేతి విఖ్యాతం, త్రివిధం భస్మధారణం॥
చం. జ్ఞా. పుట - 74. శ్లో. 45.

అవకుంఠనము. ఫాలము మొదలగు ప్రదేశములందు త్రిరేఖా రూపమున ధరించుట "త్రిపుండ్రము" అని చంద్రాగమము వివరించుచున్నది.1

పృథివ్యప్తేజో వాయ్వాకాశములును, వాఙ్మనశ్చక్షు రాదికమును, భస్మ స్వరూపములేయని యథర్వవేదము ప్రస్తావించుచున్నది 2

ఇతః పూర్వము పేర్కొనబడిన యుద్ధూళనమునకే "ఆగ్నేయ స్నానము"3 అనియు వ్యవహార ప్రసిద్ధికలదు. స్నాన పంచకములో నీయాగ్నేయస్నాన మత్యుత్తమని పేర్కొనబడుచున్నది. కావున భస్మధారణ ప్రభావము, ప్రశస్తి యత్యంత మహిమోపేతములుగా నలరారుచున్నవి.

---

1. సమ్మన్త్ర్య నిర్మలం భస్మ తేనలింపేత్ సుసంయుతః
సర్వాంగమాపాద శిఖముద్ధూళన మిదంస్మృతం
భస్మనామంత్రితేనైవ సజలేనాను లేపనం
అవకుంఠన మాఖ్యాతం త్రిపుండ్రమథ కీర్త్యతే॥
చం. జ్ఞా. పుట - 74. శ్లో. 46, 47.

2. అగ్నిరితి భస్మ, జలమితి భస్మ, స్థలమితి భస్మ, వ్యోమేతి భస్మ సర్వగ్ం హవా ఇదగ్ం భస్మ. వాఙ్మన ఏతాని చక్షూగ్ంషి భస్మాని
అధర్వవేదము : శ్రీ శై.సి. ద. పుట.5.

3. * దివ్యవారుణాగ్నేయ వాయవ్యములును
బ్రాహ్మమును నను నీస్నాన పంచకంబు
నందు నుత్తమమని కాదెయభవుడాది
లీల నొనరించె భసితముద్ధూళనంబు.
శైవాచార సంగ్రహము. ప్ర.ఆశ్వా.పుట.11. పద్యము. 50.

* సలిలస్నానము వారుణాఖ్యమున, భస్మస్నానమాగ్నేయమై
చెలువొందున్నిల సాతపంబయిన వృష్టిన్ దివ్య సంజ్ఞంబు గా
సిలు వాయవ్యపనంగ గోఖుర రజస్సేకంబునన్, బ్రాహ్మ మిం
పలరున్ మానస మంత్రయోగమున బ్రఖ్యాతంబు లీస్నానముల్,
శైవాచారం సంగ్రహము. ప్ర. ఆశ్వా. 49. పుట. 10.

ఈస్నాన పంచకమును గూర్చి క్రియాసారము, లింగపురాణము, శివ ధర్మోత్తరము మొదలగు వానియందు మిక్కిలి విపుల వివరణములు గలవు.

## రుద్రాక్ష (రుద్రాక్షధారణము)

రుద్రుని (శివుని) అక్షులనుండి పడిన జల బిందువుల వలన మొలచిన వృక్షమే రుద్రాక్ష వృక్షము. దాని ఫలమే రుద్రాక్ష (ఫలము).[1] రుద్రాక్ష ధారణముచే జీవభావము నుండి శివైక్యభావము సిద్ధించును. రుద్రాక్షములు ధరించుటవలన సమస్త పాపములును రూపుమాయును.[2] రుద్రాక్షములతో జపించుటవలన అనంతఫలము లభించును.[3] రుద్రాక్ష ధరించినవారు సాక్షాత్తుగా రుద్రస్వరూపులే—[4].

## మంత్రము (పంచాక్షరి/షడక్షరి)

మననము చేయుటవలన రక్షించునదిగాన దీనికి "మన్త్రము" అని పేరు ఏర్పడినది. (మననాత్ త్రాయత ఇతి మంత్రః.)

సప్తకోటి మహామంత్రములలో ఈ పంచాక్షరి యుత్తమోత్తమమైనది.[5] విద్యలలో శ్రుతులు త్కృష్టములైనవి. వానిలో రుద్రాధ్యాయము (నమకము) మహిమోపేతమైనది. అందును పంచాక్షరి మహత్తరమైనది. అందును "శివ" యను నక్షరద్వయ ప్రభావము వర్ణనాతీతము.[6]

---

1. ఉభాభ్యాంచారు పక్షాభ్యాం పతితా జలబిందవః
   తత్రాశ్రు బిందవో జాతా మహారుద్రాక్ష సంజ్ఞికాః.
   చం. జ్ఞా. శ్లో. 5. పుట. 81.
2. రుద్రాక్షధారణాదేవ రుద్రైక్య పథగామినీ
   రుద్రాక్ష ధారణాదేవ ముచ్యతే సర్వపాతకైః—.
   శ్రీ. పీ. శై. సి. శి. పుటలు. 245&246.

3&4. చం. జ్ఞా. శ్లో.50, 48. పుట. 90. (7 వ పటలము.)

5. సప్తకోటి మహామంత్రాః పంచాక్షర పురస్సరాః
   మంత్రాణాం పరమోమంత్రః, "శివ" ఇత్యక్షరద్వయం
   పద్మపురాణము శై.సి.ద. పుట - 64
6. విద్యాసు శ్రుతిరుత్కృష్టా రుద్రైకాదశినీ స్మృతా,
   తత్ర పంచాక్షరీ తస్యాం, శివ ఇత్యక్షరద్వయం॥ శై.సి.ద.పుట-64.

ఈపంచాక్షరి మహామంత్రమునకు 1.మూలవిద్య. 2.శివము 3.సూత్రము 4.పంచాక్షరము. మున్నగు నామములు గలవు.[1]

"నమశ్శివాయ" అను ఐదక్షరములకును "పంచాక్షరి"యని వ్యవహార ప్రసిద్ధి. దీనికి ముందు "ఓమ్"ను (ఓంకారమును) చేర్చినచో దానిని షడక్షరి యని యందురు.[2] (ఓమ్ నమశ్శివాయ = షడక్షరి).

"ఓమ్ నమశ్శివాయ" అను షడక్షరిని" ఓమ్+నమశ్శివాయ అని రెండుగా విభజించినచో-అకార, ఉకార, మకార, బిందు, (కలా) నాదములతో గూడిన "ఓమ్" (ఓంకారము)ను సూక్ష్మ పంచాక్షరియనియు, నమశ్శివాయ యనుదానిని స్థూలపంచాక్షరి యనియు వ్యవహరింతురు.[3]

ఇష్టలింగమునకు ఎడమచేతిని పీఠముగా నొనర్చి, (ఇష్టలింగమును ఎడమచేతియందు ధరించి) ఆయిష్టలింగమును జూచుచు ఈ పంచాక్షరిని జపించినచో అ జపమువలన కలుగు ఫలమనంతము.[4]

---

1. మూలవిద్యా, శివంచైవ, సూత్రం, పంచాక్షర స్తథా
నామాన్యస్య విజానీయాత్, శైవం తద్ధృదయం మతం
చం. జ్ఞా. 8-20 పుట. 95.

2. ఆదౌనమః ప్రయోక్తవ్యం, శివాయేతి తతఃకృతం
సైషా పంచాక్షరీ విద్యా సర్వశ్రుతి శిరోగతా,
ఇయంప్రణవపూర్వా షడక్షరీత్యపి గీయతే,,
చం. జ్ఞా. పుటలు. 92, 93, శ్లో: 5, 9.

3. అ, ఉ, మాశ్చైవ నాదశ్చకలేత్యంశ పంచకం
మిళిత్వాప్రణవో జ్ఞేసూక్ష్మ పంచాక్షరాత్మకః
తథా నమశ్శివాయేతి స్థూలపంచాక్షరో భవేత్
ప్రతిపాద్యే మహత్త్వేఽపి నానయోర్విద్యతేభిదా॥
చం. జ్ఞా. పుట. 102, 103. శ్లో॥ 64, 65, 66.

4. యదీష్టలింగం సంపశ్యన్ వామహస్త స్థితం, పరం,
జపతే తత్ఫలం వక్తుం నమయాశక్యతేద్విజ!
చం. జ్ఞా. పుట. 106 శ్లో. 81.

ఉదాత్తానుదాత్తాది స్వరములతో ఇతరులకు వినబడునట్లుచ్చరించుచు చేయు జపమును "వాచిక" మనియందురు. నాలుకనుమాత్రము కదలించుచు, ఇతరులకు వినబడకుండునట్లు చేయు జపమును "ఉపాంశువు" అనియందురు. మంత్రార్థమును జింతించుచు చేయు జపమును "మానసము" అనియందురు.[1] ప్రాణాయామ పూర్వకముగా ఈ జపమొనర్చినచో దానిని "సగర్భము" అనియును, ప్రాణాయామరహితముగా జపించినచో దానిని "అగర్భము" అనియును-అందురు.[2] వీనిలో సగర్భ జపమధికమహిమాన్వితము.

"వాచిక"జపము కంటెను "ఉపాంశు" జపము నూఱురెట్లధిక ఫల ప్రదము.దానికంటెను "మానసము"వేయిరెట్లధిక ఫలవంతమైనది. దానికంటెను సగర్భ జపము వందరెట్లధిక ఫలములను ప్రసాదించును. దానికంటెను ధ్యాన యుక్త జపము వేయిరెట్లు గొప్పది.[3]

మొత్తము మీద ఈ శివ పంచాక్షరి మంత్రమహిమ మనంతము. దానిని వివరించి చెప్పటకు బ్రహ్మకును-అశక్యము.[4]

## పంచాచారములు

ఆరాధ్యశైవ సంప్రదాయమునకు ఈ పంచాచారములు పంచప్రాణ ముల వంటివి. ఇవి సాధకులకు మనోబుద్ధి చిత్తాహంకారములను గుదుర్చు మహిత మార్గములు.

---

1. చం. జ్ఞా. పుటలు. 102, 103. శ్లో॥ 64,65,66.
2. చం. జ్ఞా. పుటలు. 103. శ్లో॥ 68.
3. చం. జ్ఞా. పుట. 103. శ్లో॥ 67,71.
4. అపారోమహిమా శైవపంచాక్షర మహామనోః
   నవక్తుం విధినాశక్యః సంక్షిప్యోక్తోమయానఘ!
   చం. జ్ఞా. పుట. 110. శ్లో. 102.

ఆచారమే భూషణము. ఆచారహీన జీవనము నింద్యము. ఆచారయుక్త జ్ఞానము వలననే పరమశివుడు సంప్రీతుడగును. కనుక జీవితాంతము జ్ఞానికి ఆచారమనుష్ఠింప దగియున్నది.[1]

1. లింగాచారము. 2. సదాచారము. 3. శివాచారము 4. గణాచారము. 5. భృత్యాచారము అను పంచాచారములును శైవ సంప్రదాయమున ప్రఖ్యాతములు.[2] ఇవి శైవ సంప్రదాయ జీవనమున అవిభాజ్యములు.

"సర్వత్ర లింగం మన్యేత్" అని తలంచుచు గురువొసంగిన లింగము కంటె వేఱొక దైవము లేదను నిశ్చయము గల్గియుండుటయే లింగాచారము.[3]

ధర్మార్జిత ద్రవ్యముతో నను దినము గురు లింగ జంగముల నారాధించుటయే సదాచారము.[4]

"సృష్టి, స్థితి, లయ, తిరోధానానుగ్రహములు" అను పంచకృత్యములను నెరపు శివుడే పరంబ్రహ్మము. ఆ దేవుడే సర్వ శరణ్యుడను నిశ్చయము గల్గి యుండుటయే శివాచారము.[5]

శివుడు, శివభక్తుడు, శివధర్మము, శివశాస్త్రము మొదలగు వాని నిందను సహింపకుండుట "గణాచారము".[6]

"శివభక్తులందఱును సర్వోత్తములు. వారికి నేను భృత్యుడను." అను నిశ్చయము గలిగియుండుట "భృత్యాచారము".[7]

---

1. సిద్ధాన్త శిఖామణి. శ్రీ. పీ. శై. సి. శి. పుట 261.
2. చం. జ్ఞా. పుట. 112 శ్లో॥ 4.
3. చం. జ్ఞా. పుట. 112. శ్లో॥ 5.
4. చం. జ్ఞా. పుట. 112. శ్లో॥ 6.
5. చం. జ్ఞా. పుట. 113. శ్లో॥ 7.
6. చం. జ్ఞా పుట. 113, శ్లో॥ 8.
7. చం. జ్ఞా. పుట. 113, శ్లో॥ 9.

వేధామనుక్రియా దీక్షలతో నొప్పునది లింగాచారము. అష్టవిధ శీలములతో విలసిల్లునది సదాచారము. ద్రవ్యక్షేత్ర గృహాది షోడశశుద్ధులతో వరలునది శివాచారము. చతుష్షష్టి శీలములతో విలసితమైనది గణాచారము. భృత్యత్వ, వీరభృత్యత్వ లక్షణములతో నలరారునది భృత్యాచారము.

## ఆరాధ్య సంప్రదాయము - ఆచారములు

ఈ సంప్రదాయము నిగమాగమోక్తములైన వర్ణాశ్రమ ధర్మములను విహితముగా భావించును. జాతకర్మ నామకరణ,+ అన్నప్రాశన, చౌల,+ ఉపనయన వివాహాది షోడసంస్కారములను నెరపును.

సాధారణముగా పురుషులు శాంభవదీక్షను (లింగధారణమును) ఉపనయనానంతరము స్వీకరింతురు. కాని కొందలు, ఉపనయనమునకు ముందే లింగధారణమొనర్చుటయు కలదు.1 భక్త్యుత్సాహముతో గూడిన యభినివేశమే యుపనయనాత్పూర్వ లింగధారణమునకు గారణమైయుండనోపును. స్త్రీలు తమ వివాహానంతరము-ఈ లింగధారణము కావింతురు.

ఈ సంప్రదాయమున షష్ఠ్యుపవాసము త్యాజ్యము. షట్కాలముల యందుగాని, త్రికాలములయందుగాని, కనీసము ఏకకాలమునందుగాని ప్రతిదినము శివపూజనొనర్చియే తీరవలెను. శివపూజానంతరము శివార్పిత పదార్థమును (శివప్రసాదమును) విధిగా స్వీకరింపవలెను. కనుక ఇందు షష్ఠ్యుపవాసము నిషిద్ధము.

శాంభవదీక్షితులు శివునిజేరినచో (మృతులైనచో) వారితనువులకు సమాధి సంస్కారములను జరుపవలసినదేగాని, దహనసంస్కారములను

---

1. శ్రీపతి పండితారాధ్యుల శివానందశాస్త్రిగారు శిశువు పుట్టగనే లింగ ధారణ మొనర్పవలయునని సిద్ధాన్తమొనర్చి వారు తమ సంతానమునకు శైశవమునందే లింగధారణము కావించుచు వచ్చిరని శ్రీ ముదిగొండ నాగలింగశాస్త్రిగారు "కాదణోత్తర విమర్శనము"న (పుట.7) తెలిపిరి. (భవిస్పర్శను దూరమొనర్చుటకై యిట్లు చేసియుందురేమో?)

చేయరాదు. ఈ సమాధి సంస్కారాదికముల్లైన "ఉత్తరక్రియాకలాపము"ను "శివమేధము" అనియందురు.

## ఆశౌచములు-శివపూజలు

యతీశ్వరులకు సంసార బంధములు లేనందున వారికి జాతాశౌచ, మృతాశౌచములులేవు. శాంభవవ్రతులైనను సాంసారిక జీవన ప్రవంతిలోనున్న వారికి ఈ జాతాశౌచ, మృతాశౌచములు పాటింపవలసియే యున్నవి. ఈ యాశౌచములు సంసార సంపర్క కారణములు.[1]

ఐనను నిత్య విధియైన శివపూజకంతరాయములు కలుగరాదు. కనుక ఆశౌచకాలమునందును దానినాచరింపవలెను. సంధ్యావందనమునుపాంశు వుగాను (పైకి వినబడని రీతిగను) శివపూజను యథావిధిగను చేయవలెను.[2] కాని ప్రత్యేక జపతపములు మానవలెను. స్త్రీలురజోదోష మేర్పడినప్పుడును ప్రసూతి సమయములందును, శివపూజను యథాప్రకారము కొనసాగింపవలసి యున్నది.[3]

---

1. యతీనాం తద్ధిసంసారయోగాభావాన్నయుజ్యతే
తస్మాత్ సంసారసంపర్కో హేతురాశౌచసంగమః॥
తద్యోగాద స్త్రివ్రతినాం, అశౌచ మితి నిశ్చను,
అశౌచేవిద్యమానేఽపినాఽన్తరాయోఽర్చనస్యతు,
మదర్చాఽవిఘ్న విచ్ఛేది దీక్షాసామర్థ్య యోగతః॥
ముకుటోత్తర ఆగమము. పుట. 41.

2. సూతకే మృతకేచైవ, సంధ్యాం, పూజాం నసంత్యజేత్
ఉపాంశు సంధ్యాం, పూజాంతు కుర్యాత్ త్రికరణైరపి॥
ముకుటోత్తర ఆగమము. పుట. 45. పటలము. 10.

3. లింగార్చన రతాయాశ్చ ఋతౌ నార్యా నసూతకం
తథా ప్రసూతి కాయాశ్చ, సూతకం నైవ విద్యతే॥
సిద్ధాన్త శిఖామణి లింగధారణ దీపిక. పుట. 11.

## శివదీక్షితులకు-పునర్జన్మ లేదు

చిన్మయ (శివ) దీక్షితులకు లింగధారణ కారణముననుు, నిత్య శివ పూజా విధాన ప్రభావముననుు శివానుగ్రహ లాభ ఫలితముగ శివ సాయుజ్యము ప్రాప్తించి, జన్మ రాహిత్యము సిద్ధించును. ఒకవేళ నీ శివదీక్షితులు రాగ ద్వేష దూషితులై, ప్రాకృతసములై, పాపకార్యము లొనర్చినను, కరుణాళువైన పరమశివుడు వారిని కనికరించి, తన ధ్యానయోగము ననుగ్రహించి, పరమ పదమును ప్రసాదించును.

ఈ శివదీక్షితుల పాపాచరణములకు శివుడే భైరవ వ్యూహమున వారికి తగిన దండనము నొసంగి,వారిని సంస్కరించి, పునీతులను గావించును. శివదీక్షితులను శిక్షించు నధికారము దండపాణికి లేదు. అది శివ శాసనము. కనుక ఏ విధముగను శివదీక్షితులకు పునర్జన్మ లేదు. 1

## పునర్లింగధారణము

శివదీక్షితుడు (లింగధారి) తనకు గురుదత్తమైన "ఇష్టలింగము"ను సర్వదా పదిలముగా పరిరక్షించుకొను చుండవలెను. ఉపాసకునకు లింగము ప్రాణతుల్యమైన దనుటకంటెను ప్రాణాధికమైన దనుటయే లెస్స. కనుక లింగధారి ప్రాణమొక యెత్తుగా లింగమును గాపాడుకొనుచుండలెను.

---

1 వేదాన్తార్థ పరిష్కార తారహారము - ఆంధ్రానువాదము
అనువాదకుని యుపోద్ఘాతము. 41.

* నజన్మయాతనా జన్తోర్నచ సంయమ యాతనా,
మద్ జ్ఞాన విముఖస్యాపి శాంభవవ్రత సేవినః
మహా పాతక యుక్తోఽపి, దీక్షితశ్శుచి తామియాత్
దీక్షితః పాతకీ చేత్స్యాద్గచ్ఛేద్భైరవ యాతనాం
సతథా భైరవీ ముగ్రాం, యాతనామను భూయచ,
మదనుగ్రహ పాత్రస్స్యాన్న పునర్జన్మ భాగ్భవేత్॥
కారణోత్తరాగమము. పటలము. 2. శ్లో. 22, 23, 24. P, 28.

ప్రమాద వశమున లింగము కన్పింపకుండ పోయినను, ఒకవేళ చేయి జారి క్రిందపడి లింగము భంగమైనను, స్నానాది సమయములందు జలములలో శివ సూత్రమే జారిపోయినను, మఱి యేవిధముగనైనను లింగమే యదృశ్యమైనను, లింగధారి ప్రాణత్యాగము చేయవలయునని శంకర సంహిత, కారణాద్యాగమములును నొక్కి చెప్పుచున్నవి.[1]

లింగమదృశ్యమైన వెంటనే ప్రాణములను విడువలేనివారు, నిరాహారముగ మంత్రమును జపించుచు, ఇరువది యొక్క (21) దినములా లింగముకొఱకు వెదకింపవలెను. దొరికినచో దానిని ధరింపవలెను. వెదకినను దొరకనిచో నిక వారు ప్రాణములను విడువవలసియుండును.[2]

కాని లింగమదృశ్యమైనప్పుడు ప్రాణములను త్యజింపజాలని వారికి పునర్లింగధారణమును కారణోత్తరాగమమనుమతించుచున్నది. అట్టి విధిలేని విపత్కర పరిస్థితులలో శాంభవదీక్షితుడు గురుని యనుగ్రహముతో పూర్వ లింగ కళాన్యాసశోభితముగ షడధ్వన్యాసము గావించి, వేఱొక లింగమును గురువు

1. i. ప్రమాదాత్ పతితేలింగే, సహప్రాణాన్ పరిత్యజేత్
శంకర సంహిత- కారణోత్తరాగమము. పుట. 2.
ii. లింగస్యాదర్శనే త్యాజ్యాః, ప్రాణాస్స్వైర్భక్తి యోగతః
కారణ-అగ-10-35 P.132.

2. ప్రాణత్యాగేత్వశక్తశ్చేత్, ఏక వింశద్దినావధి,
నిరాహారో జపన్మూలం, లింగమన్వేషయేజ్జనైః॥
యదావై లభతేలింగం, ధృత్వా భక్త్యా తద్దైవతత్
తథాప్యలాభే విసృజేత్, అసూన్ సద్భక్తి యోగతః॥
కారణోత్తరాగమము. 10వ, పటలము. పుట. 132. శ్లో॥ 35,36,37.

వలన గ్రహించి, దానిని ధరింపవలెను.[1] పునర్లింగధారణానంతరము పూర్వ (మొదటి) లింగము లభించినచో, దానిని గురువునకు గన బఱచి, జలములలో విడువవలెను.[2]

## ప్రసాద నియమము-భరితము

శివునకర్పింపక లింగధారి యేపదార్థమును స్వీకరింపరాదు. శివునకు నివేదితమైన పదార్థమును-అనగా శివప్రసాదమును విధిగా స్వీకరింపవలెను. దీనినే ప్రసాదనియమమని యందురు. ఈ నియమపాలనము ప్రతిశైవునకును (శివదీక్షితునకును) వర్తించును.

తన భోజనప్రమాణము ననుసరించి, లేక తాను తీసికొన (తిన)దలచిన పదార్థముల పరిమితి ననుసరించి, అంతమేరకే వడ్డింపజేసికొని దానిని శివ నివేదనమొనర్చి, మఱల (మఱియొకసారి) వడ్డించుకొనకుండ, ఆ మొదట వడ్డించుకొనిన పదార్థములతోడనే భోజనమును పూర్తిచేయు నియమమును "భరితము" అని యందురు. ఈ నియమమును కొందఱే స్వీకరింతురు.

## విదేశములలో శైవము

ఖాట్మండూలోని "పశుపతినాథు"ని కృపాకటాక్షములతో పదిలముగా పరిఢవిల్లుచున్న నేపాల్ శైవమునకు కల్యాణవేదిక. ఈ విషయమున అది (నేపాల్) భారతదేశమునకు సౌదర్యమును నెరపుచున్నది.

1. ప్రాణత్యాగేత్వశక్తశ్చేత్, లింగమన్యద్గురోః కరాత్
   అకృష్ణ పూర్వలింగీయ, కళాన్యా సాభి శోభితం
   షడధ్వన్యాస కలితం, బిభృయాత్ -|-అప్రమాదతః॥
   కారణోత్తరాగమము. పటలము. 10. పుట. 132-శ్లో. 37,38.
2. పూర్వలింగోపలబ్ధేఽపి త్యజేన్నైవ ధృతం నవం,
   యత్తదీయా కళాస్సర్వా నవేసంవేశితాః పురా
   తత్పూర్వ లింగం గురవే వినివేద్య క్షిపేజ్జలే.
   కారణోత్తరాగమము, 10వ, పటలము. పుట. 132 శ్లో॥ 40,41,

అపస్తంబుని ముఖ్యశిష్యుడు బకుడను వాడొకడు కలడు. అతడు మధ్యధరాసముద్ర మందుగల "క్రీటి" అను ద్వీపమునకు పాలకుడు. అతడు తన గురువగు అపస్తంబునినుండి గ్రహించిన శైవారాధనాపద్ధతిని (శైవ సంప్రదాయమును) ఆ ప్రాంతమున ప్రచారముగావించెను. బకుని నామమును గ్రీసు దేశచరిత్రకారులు "బాకూస్" అని వ్యవహరించిరి. అతనియెడ ప్రేమాభిమానములు కుదురుకొనిన వారతనినొక దైవముగ ఆరాధించుచు, కొన్నివేళల అతనినే శివునిగ పూజించుచు వచ్చిరి.[1] ఆ "క్రీటి" ద్వీపమునుండి శివారాధనము (శైవము) క్రమక్రమముగా గ్రీసుదేశమునకును, అందుండి యూరప్ ఖండమునకును ప్రాకినది.

ఈజిప్టు దేశమున వారి యారాధ్యదైవము "ఓరిసిస్". ఇది బాకూస్ యొక్క రూపాంతరము. ఈ బాకూస్ దేవతకు గజ, వ్యాఘ్రములయెడ ప్రేమ గలదు. ఈ దేవత "తెర్సస" (త్రిశూలము)ను ధరించును.

ఈజిప్టు ప్రాంతములోని "మేఫిస్" "అఫీరిస్" అను నగర ప్రాచీన శిథిలములలో బయల్పడినవి త్రిశూలధారియై, నందినధిరోహించిన శివప్రతిమలట. ఈజిప్టువాసులు మహమ్మదీయులయ్యును బిల్వదళములతో అచటి లింగములను నేటికిని పూజించుచుందురట.

అతిప్రాచీనమైన మెసపొటోమియన్ నాగరికత వర్ధిల్లినది "యూఫ్రటిస్" "టైగ్రిస్" అను నదీ తీరములందే. ఆనదుల సంస్కృత నామములు క్రమముగా "ఉపరతీశ" "త్రిగిరీశ" అనునవి. ఈ సంస్కృత నామములనుబట్టి అచటి శైవ ప్రభావము ద్యోతకము కాగలదు. పాశ్చాత్యఖండములలో లింగాకృతిలో నారాధింపబడు దేవతల నామధేయము లన్నియును పూర్తిగా శివునకు సన్వయించును. టర్కీలోని "లూచిరోల్" నగరములో 1200 అడుగుల ఎత్తు

---

1. Prof. Bhudebe Mukerje. Indian culture and its antiquity. పుట. 13-సర్వసిద్ధాన్త సౌరభము. (7వ భాగము). పుట. 62,

శివలింగముకలదట. "హైడ్రోపోలిస్" నగరములో 300 అడుగుల ఎత్తు శివలింగమున్నదట.

ప్రముఖ ముస్లిముయాత్రా స్థలమైన మక్కాలో మక్కేశ్వరలింగము గలదు. అరబ్బులు దానిని ఖర్జూర పత్రములతో పూజించెదరు. బ్రెజిల్‌లో శివలింగములసంఖ్యాకముగా బయల్పడినవి.

యూరప్‌లోని "కారింథో"లో పార్వతీమందిరము నేటికిని గలదు. ఇటలీలో, స్కాట్‌లాండులో, ఎటిన్‌లో శివాలయములున్నవి. చంపా, కంబోడియా, దేశములందు శైవమే ప్రభుత్వమతముగ స్వీకరింపబడినది. ఇండోచైనాలోని "అనాం" నగరమే ప్రాచీన చంపానగరము. అందు నేటికిని శివపూజను షట్కాలవిధితో జరిపెడి వారున్నారు. అమెరికాను కొలంబస్ కనిపెట్టకపూర్వమే శైవమక్కడ సహస్రముఖముల విలసిల్లినట్లు "దిహిందూ అమెరికా" అనుగ్రంథము నిరూపించుచున్నది.

"మిసో భేదా"లో కాశీకి మించిన శివక్షేత్రముండి కాలగర్భములో కలిసి పోయినట్లు సునీతి కుమార్ చటర్జీగారు పేర్కొనుచున్నారు. ఆ మిసో భేదాలో" భద్రేశ్వరాలయము" పేర 1450 సంవత్సరములకు పూర్వము లింగప్రతిష్ఠ జరిగినట్లు వారే పేర్కొని, శాసన శ్లోకముల నుదహరించిరి. ట్రాక్వా, యానాముం, దాన్‌లాయ్, డాంగ్‌ఫక్, అంధోర్‌తాం, వంటి ప్రాచీన చరిత్రాత్మక పాశ్చాత్య నగరములలోను, జావావంటి ద్వీపములలోని ప్రాంబ నాన్, లారంజో గ్రాంగ్, పద్మైతరక్, వంటి గ్రామములలోను. షట్కాల శివ పూజలు జరిగెడివని పరిశోధకులు నిర్ణయించిరి.

బొలీవియా దేశమున బ్రహ్మాండమైన "కైలాస"- ఆలయము గలదు. మెక్సికోలో చారిత్రాత్మకమైన గొప్ప శివాలయమున్నది. బలి ద్వీపమున ఇప్పటికిని సంస్కృతమున శివపూజలు జరుగుచున్నవని డాక్టర్ రఘువీర్‌గారు పేర్కొనుచున్నారు.[1] దక్షిణాఫ్రికాలోని "క్వాగర్షూ పట్టణము"లో చైనావారు

---

1. హిందూ సంస్కృతి విశేషాంకము, కల్యాణ ప్రచురణలు, పుట. 930. 1950. ఫిబ్రవరి.

త్రవ్వకాలు జరుపగా అచటి బ్రాహ్మణిక దేవాలయాల శిథిలములలో శివశిలా ప్రతిమలు బయల్పడినవి. విశాల వక్షస్థలముతో, సన్నని నడుముగలిగి, త్రిశూలము పట్టుకొని, పార్వతితోనున్న శివుని మూర్తులు చెక్కబడిన శిల్పాలు అందు బయల్పడినవి. అచటి దేవాలయాలు మధుర మీనాక్షి సుందరేశ్వరుల దేవాలయ శిల్ప కళలతో నొప్పుచున్నట్లు డాక్టర్ యాంగ్ (అ త్రవ్వకాల పరిశోధకుడు) అభిప్రాయపడెను.1

ఈ విధముగా విదేశములలో గూడ శైవము2 విలసిల్లినట్లు తెలియవచ్చు చున్నది.

## శివాద్వైతము

ఈ యారాధ్య (శ్రౌత) శైవము శివాద్వైత సిద్ధాంతమును అనుసరించు నట్టిది. అంతేగాక పరమ "శివాద్వైత" పండితుడైన ములుగు పాపయారాధ్య కృత "వేమనారాధ్య చరిత్రము" ఈ శివాద్వైత సిద్ధాంతమునకు ప్రబంధ రూపము. కనుక ఈ సందర్భమున "శివాద్వైత సిద్ధాంతము"ను గూర్చి కొంత విపుల వివరణము కావించుట యెంతేనియావశ్యకమే యైయున్నది.

శివ + అద్వైతము = శివాద్వైతము

ఈ శివాద్వైతములో అద్వైత విలసనము గూడ కలదుగాన, ముందుగా అద్వైతమును గూర్చిన సంగ్రహ సమీక్షయు, క్రమముగా శివాద్వైతమునకు సంబంధించిన విశేష వివరణము కావింపబడును.

---

2. 1987లో (19-2-87న) ఉదయం, దినపత్రిక, పుట 9, కాలము 5, ఉత్తరార్థము.
3. "విదేశములలో శైవవ్యాప్తి" అను విషయముల వివరణమునకు శ్రీఅనుభావానందస్వామి కృత "సర్వమత సిద్ధాంత సౌరభము" 9వ (శైవ) ఖండము, "వేదసారశివ సహస్రనామావళి"యను గ్రంథము నకు శ్రీ. ముదిగొండ శివప్రసాద్‌గారు వ్రాసిన పీఠిక ఆధారములు

## అద్వైతము

శ్లో॥ వేదాంత సిద్ధాన్త నిరుక్తి రేషా
బ్రహ్మైవ జీవః సకలం జగచ్చ
అఖండ రూప స్థితి రేవ మోక్షో
బ్రహ్మా౽ద్వితీయం శ్రుతయః ప్రమాణమ్॥
వివేక చూడామణి — 179

అద్వైత సిద్ధాన్తము పై శ్లోకమున నిష్కర్షగా ప్రకటిత మగుచున్నది. జీవుడును సర్వ జగత్తును బ్రహ్మమే. అట్టి యఖండ రూప స్థితియే మోక్షము. "ఏకమేవ-అద్వితీయం బ్రహ్మ" మన్నగు శ్రుతులును, ఇందుకు ప్రమాణములు.

ద్వైతమనగా రెండుగానుండుట. రెండుగా లేకుండుటయే యద్వైతము. సచ్చిదానంద స్వరూపుడైన యాపరబ్రహ్మ యొక్కడే నిత్యుడని యీ సిద్ధాన్తము పేర్కొనును. ఆ పరబ్రహ్మము - అవాఙ్మానసగోచరము.

ఈ "అద్వైత సిద్ధాన్తము"ను సువ్యవస్థిత మొనర్చి, వేదాది ప్రమాణములతో దీనికి జగత్ప్రసిద్ధినిగూర్చిన మహాపురుషుడు "జగద్గురు" శ్రీ శంకరాచార్యస్వామి.

"బ్రహ్మసత్యమ్-జగన్మిథ్యా-జీవోబ్రహ్మైవనా౽పరః" అని యీ సిద్ధాన్తమును గూర్చి సర్వజన సులభగ్రాహ్యముగ ముక్తసరిగ ముచ్చటింపబడినది.

ఆ పరబ్రహ్మము నిత్యమైనది, శుద్ధమైనది, బుద్ధమైనది, ముక్తమైనది, యని బ్రహ్మసూత్రములు పేర్కొనుచున్నవి![1]

జీవుడు, జగత్తు, పరబ్రహ్మము అను వానిని "వస్తుత్రయము" అన్న పేరుతో ఈయద్వైత సిద్ధాన్తము పేర్కొనదు. ఐనను, జీవజగద్బ్రహ్మములను గూర్చి యిందు వివరింపబడియున్నందునను, ఇతర సిద్ధాన్తముల (విశిష్టాద్వైత, ద్వైతాది సిద్ధాన్తముల) యందు ఈ వస్తుత్రయ వ్యవహారము లోకప్రశస్తి

1. అస్తితావత్, బ్రహ్మ నిత్యశుద్ధ బుద్ధముక్త స్వభావ సర్వజ్ఞమ్ సర్వశక్తి సమన్వితమ్, బ్రహ్మ సూత్రములు-1-1-1.

నందియున్నందునను, ఈ యద్వైతమునుగూర్చియు, ఆ వస్తుత్రయ వ్యవహారముననుసరించి, వివరింపబడుచున్నది.

## "బ్రహ్మము"

1. సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ. (తై.ఉ. 2-1-1)
2. విజ్ఞానమానందం బ్రహ్మ. (బృహ. ఉ.ప. 3-9-28)
3. నిత్యశుద్ధ బుద్ధముక్త స్వభావం బ్రహ్మ
4. ఏకోదేవః సర్వభూతేషు గూఢః
   సర్వవ్యాపీ సర్వభూతాంతరాత్మా
   కర్మాధ్యక్షః సర్వభూతాధివాసః
   సాక్షిచేతా కేవలో నిర్గుణశ్చ॥ (శ్వేత. ఉప. 6-11.)
5. సర్వం ఖల్విదం బ్రహ్మ. (ఛాందో. ఉప. 3-14-1)

మొదలగు శ్రుతి వాక్యములలో బ్రహ్మమునుగూర్చి తెలుపబడినది.

సత్యము, జ్ఞానము, అనంతము, విజ్ఞానము, ఆనందము, నిత్యము, శుద్ధము, బుద్ధము, ముక్తము, ఏకైకము, సర్వభూతనిగూఢము సర్వవ్యాపి, సర్వప్రాణులకు అంతరాత్మ, సాక్షి, చేతనము, కేవలము, నిర్గుణము మున్నుగాగల బ్రహ్మము యొక్క లక్షణములు పై శ్రుతులలో పేర్కొనబడినవి.

## "జీవుడు" (జీవాత్మ)

వ్యష్టిరూపమున గోచరించు జీవుడు సమష్టిరూపుడైన ఈశ్వరుడేగాని భిన్నుడుగాడు.

మహాకాశమే మఠాకాశముగా, ఘటాకాశముగా వేర్వేఱుగా తోచుచున్నట్లు చిదాకాశమున జీవేశ్వరులు పరికల్పితులు.[1] ఘటము నష్టముకాగా ఘటాకాశము

1. ఘటకాశ మఠాకాశౌ మహాకాశే ప్రకల్పితౌ
   ఏవంమయి చిదాకాశే జీవేశౌ పరికల్పితౌ॥ స్వా. ప్ర. 42.

మహాకాశమేయగును. అట్లే యుపాధి నశింపగనే "ఆత్మ" (జీవుడు) బ్రహ్మమే స్వయముగనగును.[1]

సూర్యుడొక్కడే, కాని ప్రతిబింబములసంఖ్యాకముగా గన్పట్టును. అట్లే యాపరబ్రహ్మయొక్కడేయైనను వేర్వేఱు ఉపాధులలో తత్ప్రతి బింబములైన జీవులు వేర్వేఱుగా నానాత్వముతో అధ్యాస కారణముగ, తోచుచుందురు. కనుక శివజీవులొక్కటియే. వీనియైక్యమును గ్రహించినవాడే యాత్మజ్ఞుడు.[2]

## జగత్తు

అనంత శక్తియుక్తుడైన యీశ్వరుడు మాయోపాధికుడై సంకల్పమాత్రమున చరాచరాత్మకమైన సమస్త విశ్వమును సృజించుచున్నాడు. అతడు మాయోపాధికుడయ్యును మాయాధీనుడు గాడు. మాయ యాపరమేశ్వరునకు వశవర్తిని. స్వయముగ నతడే యీ విశ్వమునకు నిమిత్తోపాదాన కారణములునై, దీనిని సృష్టించుచుండును.[3] ఈ సృష్టియంతయు ఈశ్వరేచ్ఛారూపము. సర్వప్రపంచము బ్రహ్మముయొక్క వివర్త (భ్రాంతి సిద్ధ)రూపమే.[4]

రజ్జు వివర్తమైన సర్పము తదధిష్ఠానమైన రజ్జువుకంటె వేఱుగానట్లును, మృద్వివర్తమైన కుంభము (కుండ) తదధిష్ఠానమైన మట్టికంటె భిన్నము కానట్లును, ఈ జగత్తు బ్రహ్మవివర్తమగుటచే సర్వదా అది బ్రహ్మాఽభిన్నమే[5]

---

1. ఘటాభావే ఘటాకాశో మహాకాశోయథా తథా ఉపాధ్యభావే త్వాత్మైష స్వయంబ్రహ్మైవ కేవలమ్:-స.వే. సి.సా. 694
2. శివఏవసదాజీవో. జీవఏవసదాశివః
 ............సఆత్మజ్ఞోనచేతరః॥ అద్వై. అ. 75.
3. అనంతశక్తి సంపన్నో మాయోపాధిక ఈశ్వరః
 ఈక్షా మాత్రేణ సృజతి, విశ్వమేతచ్చరాచరమ్॥
 నిమిత్తమ ప్యుపాదానం స్వయమేవ భవన్ ప్రభుః
 చరా చరాత్మకం విశ్వం సృజతి........॥ స. వే.సి.సా. 330,332.
4. జగత్సర్వం వివర్తం బ్రహ్మణస్త్వితి. — మ.వా.ద. 126,
5. ఇదం బ్రహ్మవివర్తత్వాత్, బ్రహ్మభిన్నం జగత్ సదా
 మృద్వివర్తః స్వయం కుంభో మృదభిన్నోయథా తథా॥ మ.వా.ద108.

సర్పాదులకు రజ్జువే సత్తుగా నున్నట్లు, కేవలం బ్రహ్మమే ప్రపంచమున కాధారమై, సత్తైయున్నది. వాస్తవముగా జగత్తు లేనిదేయగును.[1] చిత్తమును బట్టి విశ్వము స్వయముగా ప్రతీతమగుచుండును. చిత్తములేనిచో, ఈ జగత్కథయేలేదు.[2]

## మోక్షము

బ్రహ్మజ్ఞాని మాత్రమే మోక్షమున కర్హుడు. మోక్షమనగా కైవల్య ముక్తియే. బ్రహ్మవేత్తకైవల్య ముక్తినిపొందును.[3] "తరతిశోక మాత్మవిత్" ఆత్మ (బ్రహ్మ) జ్ఞాని శోకముక్తిని పొందును.[4] ఆబ్రహ్మజ్ఞానమును పొంటయే యమృతత్వమునకు మార్గము మఱియొకరీతిలేదు.[5] ఆపరబ్రహ్మము నెఱుగుట వలననే కైవల్యపదమబ్బును.[6] కైవల్యముక్తి జ్ఞాన మార్గమువలననే యబ్బును కర్మ, సాంఖ్య, యోగ, ఉపాసనాదులచే అది లభ్యముగాదు.[7]

ముక్తి మాత్రము బ్రహ్మతత్త్వజ్ఞానమువలన మాత్రమే లభించును. మఱియొక విధముగా నలభ్యము.[8] ఈ ముక్తియే "జీవన్ముక్తి" యనియు, "విదేహముక్తి" యనియు రెండు విధములు. ఈ రెండును సమ్యగ్దర్శనముచే

---

1. సర్పాదౌరజ్జు సత్తేవ బ్రహ్మ సత్తైవ కేవలమ్.
   ప్రపంచాధారరూపేణ వర్తతే సజ్జగన్నహి॥ స్వా.ప్ర.6.
2. యత్రచిత్తం తత్రవిశ్వం స్వయమేవప్రతీయతే
   యత్రచిత్తం నాస్తి తత్ర నాస్తికించి జ్జగత్కథా॥ మ.వా.ద. 140.
3. బ్రహ్మవిదాప్నోతిపరమ్. (తైత్తిరీయ, ఉపనిషత్తు. 2.1.1.)
4. తైత్తిరీయోపనిషత్తు. 2.9.1.
5. తమేవ విదిత్వాఽతిమృత్యుమేతి. నాఽన్యః పన్థా విద్యతేఽయనాయ. (శ్వేత. ఉప. 3.88. 6.154.)
6. తస్మాదేవం విదిత్త్వైనం కైవల్య పదమశ్నుతే॥ (కైవల్యోపనిషత్తు.24)
7. కైవల్యముక్తిర్జ్ఞాన మార్గేణోక్తా. నకర్మ సాంఖ్యోపాసనాదిభిః॥
   ముక్తికోపనిషత్తు. అధ్యాయము.1
8. ముక్తిస్తు బ్రహ్మతత్త్వస్య జ్ఞానాదేవనచాన్యథా.
   వేదాంత పంచదశి. 6.120.

ప్రాప్తించును. సమ్యగ్దర్శనముచే నవిద్యానివృత్తియు, చిదచిద్గ్రంథి భేదనమును జరుగును. అనంతరము సంచితకర్మ నశించుటయు, ఆగామికర్మతో సంబంధము లేకపోవుటయు సంభవించును.

ప్రారబ్ధ దేహము యొక్క నాశము పర్యంతము సమ్యగ్దర్శనము వలన గలిగిన ముక్తి "జీవన్ముక్తి" యనియు, ఈ దేహనాశానంతరము. అదియే "విదేహ ముక్తి"యనియు వ్యవహృతమగును. ఈ స్వస్వరూప సాక్షాత్కార రూప ముక్తిని "సద్యోముక్తి"యనియు, "శుకముక్తి"యనియు, "విహంగ ముక్తి"యనియు, పేర్కొనుట జరిగినది.

సగుణ బ్రహ్మోపాసకులకు సాలోక్య, సారూప్య, సామీప్య సాయుజ్య ముక్తులు లభించును. వారికి ఉత్తరాయణ మార్గమున హిరణ్యగర్భలోక ప్రాప్తియు, అచట సమ్యగ్దర్శనము కలుగుటయు, సంభవించును. ఆ విధముగా వారికి "కైవల్య ముక్తి"యు ప్రాప్తించును. ఈ రీతిగా ప్రాప్తమైన "కైవల్య ముక్తి"కి "క్రమముక్తి"యనియు, "వామదేవ ముక్తి"యనియు, "పిపీలికా మార్గముక్తియనియు లోక వ్యవహారములుగలవు.1

"అద్వైత సారాంశము" సర్వాధిష్ఠానమైన పరబ్రహ్మము మాత్రమే సత్యము. పర వస్తుజాలమంతయును (చరాచర ప్రపంచమంతయును) మిథ్యయే. ఈ దృశ్యము (ప్రపంచము) అంతయును ఆ పరబ్రహ్మయొక్క వివర్త రూపము. జీవబ్రహ్మలభిన్నులు. ఈశ్వరునకు భిన్నముగ జీవత్వమే లేదనినప్పుడు జీవ బహుళత్వ ప్రసక్తియే యుండదుగదా।

సాధన చతుష్టయ సంపత్తి గలిగి యుండి, జ్ఞానమార్గమున బ్రహ్మ జ్ఞానమునందుటయే మోక్షము.

---

1. వరాహోపనిషత్తు - 4వ అధ్యాయము.
ఇవి వేదాంత సర్వస్వములో - కైవల్య ముక్తి ప్రకరణములో నుదాహృతములు. పుట. 263.

## శివాద్వైతము

శ్లో॥ శ్రీమచ్ఛైవమతే శివః పరతమో, జీవప్రపంచౌస్థిరౌ
చైతన్యాదిగుణైః శివేనసమతా మాప్నోతిజీవఃకిల
బద్ధో శంభుసమిచ్ఛయా ఒద్య పశుతాంప్రాప్తః పుమాన్ సంసర
త్యార్తస్సన్ తదనుగ్రహాచ్ఛివ సమో భక్త్యాచ ముక్తోభవేత్.॥

శ్లో॥ విశ్వాతీత మమేయమాద్య మమలం విశ్వాత్మకం కారణం
కార్యంచోభయ మేక మేవ. శివశక్త్యోః సామరస్యంజగత్
ముక్తిః శాశ్వతనైజ లాభవిషయా సృష్ట్యాది వ్యాపారతః
శూన్యానందమయాచ శంభుపదవీ, విశ్వోత్తరా వర్తతే.॥

శ్లో॥ ఆనందప్రచురః పరాత్పరతనుః చిచ్ఛక్తియుక్తోవిభుః,
సూర్యాకాశపదేష దోషరహితః కైలాసవాసీ ప్రభుః
భక్తోద్ధార పరోవిచిత్రగతికః కారుణ్యసింధుశ్శివః,
సృష్ట్యాదికృతి పంచకం వితనుతే లీలార్థమేవాభయం॥[1]

శైవమతమున శివుడే పరమదైవము, అ దేవుడు (శివుడు) జీవుడు, జగత్తు-అను వస్తుత్రయము సత్యము. చైతన్యాది గుణములచే జీవుడు శివునితో సమత్వమును పొందును. పాశబద్ధుడైన జీవుడు పశువుగా వ్యవహృతుడై, ఆర్తితో శివోపాసనమొనర్చి, తదనుగ్రహమువలన పాశములనుండి ముక్తుడై, శివ సముడై యొప్పును.

శివుడే పరబ్రహ్మము. అ పరబ్రహ్మము విశ్వాతీతము. అమేయము. ఆద్యము. అమలము. విశ్వాత్మకము. జగత్తునకు నిమిత్త కారణము ఉపాదాన కారణము గూడ అ పరబ్రహ్మమే (శివుడే.) శివశక్తులయొక్క సామరస్యమే యీజగత్తు. శివోపాసనచే, తదనుగ్రహమువలన జీవులకు సాయుజ్యప్రాప్తి

1. ఈ శ్లోకములు శివాద్వైత పంచరత్నములలోనివి. "నీలకంఠ శివాచార్యులవారు- శివాద్వైతము" అను గ్రంథమునందు - ఇవియుదాహృతములు.

కలిగి శాశ్వతానందస్థితి చేకూరును. అదియే మోక్షపదము. శివపదము. అది విశ్వోత్తరమైనది.

ఆ పరమశివుడానంద స్వరూపుడు. పరాత్పరుడు. చిచ్ఛక్తి యుక్తుడు. సూర్యాకాశములవలె దోషరహితుడు. కైలాసవాసి. ఉపాసకులకు మోక్ష ప్రదుడు. విచిత్రమైన గతిగలవాడు. దయా సముద్రుడు. సృష్ట్యాది పంచకృత్య పరాయణుడు. అభయ ప్రదాత.

పైన వివరింపబడిన విషయము లన్నియును శివాద్వైత సిద్ధాన్తమునకు సారభూతములైనవి.

ఈ శివాద్వైతమునే, శివవిశిష్టాద్వైతము, సవిశేషాద్వైతము, విశిష్టాద్వైతము, ఈశ్వరాద్వైతము, అనుభవాద్వైతము, మున్నగు నామములతో తత్త్వ శాస్త్రజ్ఞులు వ్యవహరించిరి.

ఈ శివాద్వైత సిద్ధాన్తమును సప్రమాణముగ వివరించునది శ్రీ నీలకంఠ భగవత్పాద ప్రణీతమైన "బ్రహ్మసూత్ర భాష్యము" ఈ నీలకంఠాచార్యునకే శ్రీ కంఠుడు అనియు నామాంతరము.

శ్రీ నీలకంఠాచార్యులవారు ప్రస్థాన త్రయమునకు భాష్యములను వ్రాసిరి. వారు తమ భాష్యములలో శివపారమ్యమును, శివాద్వైత సిద్ధాన్తములను నిగమాగమ ప్రమాణములతో, బ్రహ్మ సూత్రాది సమన్వయముతో సువ్యవస్థిత మొనర్చిరి.

## తత్త్వత్రయము

1. శివుడు. 2. జీవుడు. 3. జగత్తు.

"శివుడు" సర్వవ్యాపకుడు. పరబ్రహ్మము. బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుల కతీతుడు. "సృష్టి, స్థితి, లయ, తిరోధానానుగ్రహములు" అను పంచ కృత్యములను నెరపువాడు. తురీయుడైనవాడు శివుడు.

ఈ పరమ శివుడు వేదవేద్యుడు. ప్రత్యక్షాది ప్రమాణములచే గమ్యుడు గానివాడు. ఈయనకు సాకార (సగుణ) నిరాకార (నిర్గుణ) రూపములు రెండును గలవు.

"నిర్గుణమ్" అను పదమునకు నిర్గతాః, గుణాః కల్యాణ గుణాః యస్మాత్తత్ = నిర్గుణమ్. అని సంప్రదాయజ్ఞులర్థ వివరణము చేయుదురు. నిర్గుణ రూపమనగా సంకోచ వికాసావస్థారహితమై, అగ్నియందు దాహక శక్తివలె, అపృథక్సిద్ధమై, చిదచిదాత్మక శక్తి విశిష్టమైన అమూర్త్యాత్మక మహాలింగ స్వరూపమే. సగుణరూపమనగా మూర్త్యాత్మకమైనది.

ఈ పరబ్రహ్మము ద్వివిధము. 1. కారణబ్రహ్మము, 2. కార్య బ్రహ్మము. సూక్ష్మచిదచిద్విశిష్ట బ్రహ్మము కారణ బ్రహ్మము. స్థూలచిదచిద్వి శిష్ట బ్రహ్మము కార్యబ్రహ్మము.

## జీవుడు

ఈ జీవునకు చేతనుడు, జ్ఞాత, కర్త, మొదలగు నామాంతరములు గలవు. ఇతడీశ్వరునివలె జననమరణములు లేనివాడు. నిత్యుడు. చూచుటకు జీవుడు పుట్టుచున్నట్లును, మరణించుచున్నట్లును గన్పట్టుచుండును. ఆత్మ స్వరూపుడైన జీవునకు దేహముతో సంబంధమేర్పడుటను జన్మముగాను, దేహముతో సంబంధము విడిపోవుటను మరణముగాను భావింపరాదు. వాస్తవ ముగా జీవుడు పుట్టుటగాని, మృతిజెందుటగాని లేనేలేదు.[1] ఏలయనగా అతడజుడు. నిత్యుడు. శాశ్వతుడు.[2]

ఆ సర్వేశ్వరునివలెనే యీజీవుడును జ్ఞానస్వరూపుడు. ఆనంద స్వరూపుడు. అవ్యక్తుడు. అచింత్యుడు. నిర్వికారుడు. కాని ఈతడణు స్వరూపుడు.

---

1. నజాయతే మ్రియతేవా విపశ్చిత్.
2. అజో, నిత్యః, శాశ్వతోఽయం, పురాణో, నహన్యతే, హన్యమానో॥
3. బ్రహ్మద్యాః స్థావరాంతాశ్చపశవః పరికీర్తితాః, తేషాంపతిత్వాత్ దేవేశః, శివః పశుపతి స్స్మృతః :— (స్కాందము. కాశికాఖండము. శైవరహస్యము. పుట. 22.
4. పశూనాం పతయేనమః - నమకము. వేదము.

బ్రహ్మాది స్థావరపర్యంతముగల సకలజీవులును పశువులనబడుదురు. ఈ పశువు (జీవు)లకు పతియగుటవలన ఈశ్వరునకు "పశుపతి" యనియు వ్యవహారము గలదు.

## త్రివిధ జీవులు

ఈ జీవులు పాపులు, పుణ్యులు, ఉపాసకులు, అని త్రివిధములుగా నుందురు. శాస్త్ర నిషిద్ధాచరణము గలవారు పాపులు. శాస్త్రీయమైన కర్మాను ష్ఠానములచే స్వర్గాది పుణ్యలోకముల నపేక్షించువారు పుణ్యులు. శివదీక్షను స్వీకరించి, "ఇష్టలింగము" నర్చించుచు పరమేశ్వరోపాసనము చేయుటద్వారా పరమపదమందలి యప్రాకృత (సాయుజ్యరూప) సుఖముల నపేక్షించువారు "ఉపాసకులు." ఈ యుపాసకులే ముముక్షువు లనబడుదురు. వీరికి పునరావృత్తిరహితమైన శాశ్వత పరబ్రహ్మలోక నివాసము కలుగును.

అంతర్యామియగు శివునకు ఈ జీవుడు శరీరము. పాంచభౌతికమగు శరీర సంబధము గల్గి యుండునుగాన ఇతడు శరీరి. మల మాయాది పాశ యుక్తుడైన జీవుడు లింగాంగ సామరస్యముతో శివోపాసన చేయుట ద్వారా పాశముక్తుడై శివసముడగును 1

ముక్త జీవునకు శివస్వరూపానందములు కలవన్నంతమాత్రమున వీనికి సర్వాత్మనా శివాభేదము సిద్ధింపదు. పార్వతీ పతిత్వముగాని, అర్ధనారీశ్వర స్థితిగాని, సర్వవ్యాపకత్వముగాని, జగత్కర్తృకత్వముగాని, యీ జీవులకు లేవు. సకలకాల వృత్తిత్వ రూప నిత్యత్వము పరమేశ్వరునకువలె వీరికిని కలదు. జీవుడు ముముక్షువు. శివుడు మోక్షదాయకుడు. ఇతడు కించిజ్ఞుడు. అతడు సర్వజ్ఞుడు. ఇతడు పశువు. అతడు పశుపతి. ఇతడు కర్మఫల భోక్త. అతడు కర్మఫల ప్రదాత. ఇతడు నానాత్వశోభితుడు. అతడే కత్వ

---

1. పాశయుక్తో భవేజ్జీవః, పాశముక్తో భవేచ్ఛివః॥ వాయుసంహిత.
శైవసర్వస్వము :- పుట. 22.

విరాజితుడు. ఇతడు శేషుడు (శేషము)[1] అతడు శేషి. ఇతడు సేవకుడు. అతడు సేవ్యుడు. ఇతడు నియామ్యుడు. అతడు నియామకుడు (నియన్త) ఇతడసంపూర్ణుడు. అతడు పరిపూర్ణుడు. ఇతడు పాసకుడు. అతడు పాస్యుడు. ఇతడు పూజించువాడు. అతడు పూజ్యుడు. ఇతడు చిత్కణము. అతడు చిద్ఘనము.

జీవుడు - శివుడు, - ఇట్లింతగ విభిన్న లక్షణములు గలవారైనను వీరత్యంత భిన్నులుగారు. నిత్యత్వాదులు జీవేశ్వరులకు సాధారణలక్షణములు. జనన, మరణరాహిత్యము, జడద్రవ్యముకాకుండుట, స్వయంప్రకాశ ద్రవ్యమై యుండుట,[2] అవ్యక్తస్థితి కల్గియుండుట (ప్రత్యక్ష ప్రమాణములతో తెలియబడకుండుట) అచింత్యుడై య ండుట (అచిత్తుతో సమానముగా భావింపదగినవాడు గాక శ్రవణమననాదులచే భావింపదగినవాడై యుండుట) నిరవయవుడై యుండుట, (అవయవరహితుడై యుండుట- అనగా అచిత్పదార్థమువలె అవయవములతో నున్నవాడుగాకుండుట) నిర్వికారుడై (వికారములు లేనివాడై)

---

1. శేషము. పరార్థః శేషః — పూర్వ మీమాంసాసూత్రము. వేదాన్తార్థ పరిష్కారతారహారము - పుట. 55.
స్వతంత్రుడగు ఒకని ప్రయోజనమునకై, తాను, అస్వతంత్రముగ నేర్పడి, యుండుటయే "శేష" భావము. ఆ స్వతంత్రుడే "శేషి"— యనబడును. చిదచిదాత్మకమగు ప్రపంచము పరమేశ్వరుని యారాధనోపయోగియై, వెలసియున్నది. కావున ఈ ప్రపంచమునకు "శేష" భావమును, దీనియుపయోగమును చెందెడి పరమేశ్వరునకు "శేషి" భావమును గ్రహింపవలెను.

2. స్వయంప్రకాశ ద్రవ్యమనగా ప్రత్యగ్ద్రవ్యము. అనగా తానెవరో తనకు తెలియు ద్రవ్యమని యర్థము. అనగా "అహంవేద్మి" అను ప్రత్యర్థమునకు అర్థభూతమైనదని తాత్పర్యము. (వే.త. అవలోకన. పుట. 74) స్వయంప్రకాశమనుటకు దీపము నుదాహరణముగా గ్రహింపదగును. వెలుగుచున్న దీపమును గుర్తించుటకు మఱియొక దీపమపేక్షితము గాదు. అట్టిస్థితి. వేదాన్త తత్త్వావలోకనము - పుట. 74.

యుండుట, మున్నగునవి జీవునకును దేవునకును గలయభిన్న లక్షణములు. కనుక భేదాభేదకల్పమైన విశిష్టాభేద (విశిష్టాద్వైత) సంబంధమే జీవేశ్వరుల మధ్య నెలకొనియున్నది.

## జగత్తు

"మాయాంతు ప్రకృతిం వింద్యాత్, మాయినంతు మహేశ్వరమ్
తస్యావయవ భూతైస్తు వ్యాప్తం సర్వమిదం జగత్॥[1]

మాయ యనగా "ప్రకృతి". మహేశ్వరుడు "మాయి". ఆ పరమేశ్వరుని యవయవ భూతులైన జీవులచే ఈ జగత్తు పరివ్యాప్తమైయున్నది.

జగత్తునకే ప్రకృతియని వ్యవహారము. స్వభావమునుబట్టి యీప్రకృతికి (జగత్తునకు) త్రిగుణ, మాయ, అవిద్య, అనునవిగూడ పర్యాయవాచకములుగా తత్త్వశాస్త్రమున నుపయోగింపబడినవి.

## ప్రకృతి

ప్రకృతి, మహత్తు (బుద్ధి) అహంకారము, మనస్సు, పంచజ్ఞానేంద్రియములు, పంచకర్మేంద్రియములు, పంచతన్మాత్రలు, (శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు,) పంచమహాభూతములు – అను ఇరువదినాలుగు (24) తత్త్వములతో గూడియున్నది యీప్రకృతి.

ప్రకృతి తత్త్వములగు ఇరువదినాలుగు తత్త్వములలో "ప్రకృతి" యనుపేరుతో దానినొక ప్రత్యేక తత్త్వముగా పరిగణించి, దానిని "సూక్ష్మప్రకృతి"గా పేర్కొనిరి. మహత్తు (బుద్ధి) మొదలగు ఇరువదిమూడు (23) తత్త్వములను "స్థూలప్రకృతి"గా వ్యవహరించిరి.

ఈ స్థూలప్రకృతినే "వ్యక్తప్రకృతి" యనియును, ఆ సూక్ష్మప్రకృతినే "అవ్యక్తప్రకృతి" యనియును, తత్త్వవేత్తలు వ్యవహరింతురు.[2]

---

1. శ్వేతాశ్వతరోపనిషత్తు. (కేనోపనిషత్తు - ఆంధ్ర వ్యాఖ్యానమున ఉదాహృతము)
2. వేదాన్త తత్త్వావలోకనము - పుట. 6.

ప్రకృతి యను శబ్దమునకు "కారణము", "ప్రధానము" అనునర్థములు గలవు. మహత్తు (బుద్ధి) మొదలగు ఇరువదిమూడు తత్త్వములకును మూల కందమగుటచే నిది ప్రకృతి యనబడినది. కావుననే యిది ప్రధాన శబ్దవాచ్యమైనది. కారణశబ్ద వాచ్యమైనది.1

"ప్రకర్షేణక్రియతే జగదారంభః అనయా" ఇతి ప్రకృతిః —
సృష్టి దేనివలన ప్రారంభమగుచున్నదో, ఈ జగత్తు ఆరంభమగుటకు మూల పదార్థమేదియో, అదియే "ప్రకృతి" యనబడును.

## మాయ

ప్రకృతి యీ విచిత్ర సృష్టికి ఉపకారణము గనుక మాయా శబ్దవాచ్యమైనది. త్రిగుణాత్మకమైన ప్రకృతిని మాయా శబ్దముతో వ్యవహరించితి.

## అవిద్య

ప్రకృతియే జ్ఞానతిరోధాయకమగుటచే "అవిద్య" యనబడుచున్నది.

ప్రకృతి యచేతనమైనది. (జ్ఞానశూన్యమైనది.) భోగ్యమైనది. నిత్యమైనిది. సంతత పరిణామశీలము గలది.2 ఇట్టి యీ ప్రకృతి సృష్టి, స్థితి, లయములనొనర్చు పరమేశ్వరునకు క్రీడాపరికరము.

ఈ ప్రకృతికే "అచిత్తు" అనియు వ్యవహారము. ప్రకృతి జడపదార్థము. పరమేశ్వరుడును, పదార్థము, నిత్యసత్యములే. పదార్థము సృష్టిస్థితిలోనుంటు కాలమును "కల్పము" అనియందురు. లయమైయున్న కాలమును"ప్రలయము" అనియందురు.

ప్రలయమునందు అవ్యక్త (సూక్ష్మ) ప్రకృతితో గుణత్రయము సామ్యావస్థ గల్గియుండును. సూక్ష్మ స్థూలప్రకృతి యంతయును త్రిగుణాత్మకమే గనుక విశ్వము గుణత్రయ రూపమేయగును.

---

1. వేదాన్త తత్త్వావలోకనము- పుట. 6.
2. అచేతనా, పరార్థాచ, నిత్యా, సతతవిక్రియా,
   వేదాంత తత్త్వావలోకనము- అచిత్తత్త్వము- పుట. 7.

గుణత్రయమనగా మూడు గుణములు. అవి సత్త్వరజస్తమో గుణములు. అవియింద్రియ గోచరములుగావు. ఆయా కార్యములనుబట్టి వాని స్వరూప స్వభావములు తెలియబడుచుండును.

సత్త్వము : సత్త్వగుణము నిర్మలమైనది. ఇది వస్తువులయొక్క యథార్థ జ్ఞానమును గల్గించును. సమ్యగ్‌జ్ఞానము కలిగించుట ద్వారా యిది మోక్షమునకు హేతువగును.[1]

రజోగుణము : రాగాదులను గలిగించుట ద్వారా రజోగుణము దుఃఖాదులకు మూలమగును.[2]

తమోగుణము : తమోగుణము, అజ్ఞానరూపమైనది. విపర్యయ జ్ఞానమునకిది హేతువు. ఇది కార్యములయందు అనవధానతను, విపరీతజ్ఞానమును, జ్ఞానశూన్యతను, మాంద్యమును, గలిగించును. ఇది నరకమునకు దారి తీయును.[3]

ప్రళయమునందు ప్రకృతిలో సామ్యావస్థతోనున్న గుణత్రయము తదనంతరము వైషమ్యావస్థతో విజృంభించుటచే మహదాది తత్త్వములు ఇరువదిమూడును జలబుద్బుదములవలె అవ్యవహితములై యుద్భవించి, యొకేసారి పెల్లుబుకును. దానినే వ్యక్తప్రకృతియని వ్యవహరించుచున్నాము.

ఈ జగత్తునకు "దృశ్యము", "కార్యము" అనియు నామాంతరములు.

## సిద్ధాన్త విలసనము

ఈ శివాద్వైతసిద్ధాన్తమునందు షట్‌త్రింశ (36) తత్త్వములు — అంగీకరింపబడినవి.

1. భగవద్గీత. 14-6. 2. భగవద్గీత. 14-7,
3. భగవద్గీత. 14-8,

షట్త్రింశ తత్త్వములు

1. శివుడు, 2. శక్తి, 3. సదాశివుడు, 4. ఈశ్వరుడు, 5. శుద్ధవిద్య, 6. మాయ, 7. కల, 8. విద్య, 9. రాగము, 10. కాలము, 11. నియతి, 12. పురుషుడు, 13. ప్రకృతి, 14. బుద్ధి, 15. అహంకారము, 16. మనస్సు, 17. శ్రోత్రము, 18. త్వక్కు, 19. చక్షువు, 20. జిహ్వ, 21. ఘ్రాణము, 22. వాక్కు, 23. పాణి, 24. పాదము, 25. పాయువు, 26. ఉపస్థము, 27. శబ్దము, 28. స్పర్శము, 29. రూపము, 30. రసము, 31. గంధము, 32. ఆకాశము, 33. వాయువు, 34. వహ్ని (అగ్ని), 35. సలిలము (నీరు), 36. పృథివి (భూమి).

పశువు - పాశము - పశుపతి

జీవులెల్లరును "పశు" శబ్దవాచ్యులే. పశువనగా జీవుడు. అతడు దేహేంద్రియాదిభిన్నుడు. అనాది మలావృతుడు. అస్వతంత్రుడు. స్వకృతము లైన సుకృత దుష్కృతముల ననుభవించువాడు. కించిజ్జ్ఞుడు.

పాశబద్ధుడైన జీవుడు "పశువు"- అని శ్రీవిద్యారణ్యస్వామి నిర్వచించెను. 1 పాశభేదమునుబట్టి వీరు ముత్త్రివిధములుగనుందురు. 1. విజ్ఞానకలులు, 2. ప్రళయాకలులు, 3. సకలులు.

పాశము

శివానందా (బ్రహ్మానందా) విర్భావమునకు విరోధమైనది పాశము 2

---

1. పాశబద్ధాః జీవాః పశవః - సూతసంహితా వ్యాఖ్య.

సిద్ధాన్త కిరణాలు - పుట. 19.

2. పాశత్వంనామ శివానందాభివ్యక్తి విరోధిత్వమ్-

బ్రహ్మసూత్ర (శైవ) భాష్యము- పీఠిక.. పుట. 15.

ఈ పాశములైదు విధములు

1. మలతిరోధాయిపాశము (ఆణవమలము లేక అనాదిమలము)
2. శక్తిపాశము (మాయికము లేక రోధశక్తి)
3. బిందుపాశము (బైందవము)
4. మాయాపాశము (మాయీయము)
5. కర్మపాశము (కార్మికమలము)

ఈ పాశములనే మలములనియు వ్యవహరింతురు. ఈ పాశబద్ధులైన లేక మలావృతులైన జీవులకు (పశువులకు) శివజ్ఞానము దూరమగుచుండును. ఇవి యజ్ఞానమును పెంచును. దుష్కృతాభిలాషను వృద్ధిచేయును. శివభక్తిని కలుగకుండజేయును సద్విషయముల కడ్డుపడుచుండును, పాపకార్యములలో ప్రవేశపెట్టును.

"ప్రారబ్ధం భోగతోనశ్యేత్" అను సూక్తి ననుసరించి, కొన్ని పాశబంధముల ననుభవించుట ద్వారా వానినుండి బయటపడవచ్చును. మఱి కొన్నింటిని, పుణ్యకర్మలవలన నశింపజేయవచ్చును. తక్కిన యన్నింటిని శివోపాసనవలన ఛేదించుకొని, పాశముక్తులు (శివసములు) కావచ్చును.

వీనిలో "ఆణవ", "కార్మిక", "మాయా" మలములే (పాశములే) సుప్రసిద్ధములు. వీనికే "మలత్రయము" అని వ్యవహారము.1

## శక్తి విశిష్టాద్వైతము

శ్లో॥ శివేన నవినాదేవీ దేవ్యాచ నవినాశివః
ఏతయోరంతరంనాస్తి చంద్రచంద్రికయోరివ॥
"బ్రహ్మజిజ్ఞాసా" తృతీయభాగము. పుట. 321.

---

1. ఆణవం మాయికంచైవ కార్మికంచయథాక్రమమ్
మలత్రయమనాదీదం తనుత్రయగతం భవేత్॥
చంద్రజ్ఞానాగమము, పుట. 45. పటలము 3. శ్లో॥ 51.

శివుడులేనిదే దేవిలేదు. దేవిలేక శివుడులేడు. ఆయుభయులును చంద్ర చంద్రికలవలె అవిభాజ్యులు.

సృష్టికి పూర్వమునగాని, ప్రళయమునగాని, ఈ దివారాత్ర విభాగము లేదు. ఈ సదసద్విభాగములులేవు. అప్పుడు కేవలము "శివుడు" మాత్రమే విరాజిల్లుచుండెను.1 ఆ శివుడే పరబ్రహ్మము. అతడు మహాదేవుడు. మహాశక్తిమంతుడు. ఈ చరాచరాత్మకమైన సమస్త విశ్వమునకును, అధిష్ఠానమైనవాడతడే. ఈ జీవజగత్తులు తద్రూపములే.2 సకలచేతనా చేతనములకు శేషియగుటచే నాతడు సర్వేశ్వరుడు. క్షరమైనయచిత్తును (ప్రకృతిని) జీవసముదాయమును శాసించువాడుగాన అతడు "ఈశ్వరుడు".3

<u>అనంతుడు</u> : అంతమనగా పరిమితి. ఏ పరిమితియు లేనివాడు గాన అతడనంతుడు. సర్వ (విశ్వ) వ్యాపిగాన ఆయనకు దేశపరిమితిలేదు. నిత్యుడు గనుక కాలపరిమితిలేదు. సర్వాంతర్యామిగనుక వస్తుపరిమితిలేదు.4

<u>నిర్వికారుడు</u> : సర్వజీవాంతర్యామియయ్యు నాజీవుల సుఖదుఃఖము లంటనివాడు. తత్పుణ్య పాపవ్యాపారములకు సాక్షిభూతుడై యుండువాడు. సమస్త భూతములను శరీరముగా గలవాడయ్యును, తచ్ఛరీర వికారములకతీతముగా నుండువాడు.

ఈశ్వరుని గుణములు నిత్యములు. వీనికి ఉత్పత్తి వినాశములులేవు.5 తద్గుణములు నిస్సీమములు. అనగా అవధిలేనివి.6 అవియసంఖ్యాకములు

---

1. యదా తమస్తన్నదివానరాత్రిః, నసన్నచా "సచ్ఛివ ఏవకేవలః" శ్వేతాశ్వతరోపనిషత్తు.
2. "యస్యాత్మా శరీరమ్" "యస్యపృథివీశరీరమ్"
3. క్షరాత్మానావీశతే దేవఏకః :- శ్వే.త.అ.పుట. 103.
4. నిత్యం, విభుం, సర్వగతం, సుసూక్ష్మం,
   అంతః ప్రవిష్టః, శాస్తాజనానాం సర్వాత్మా॥ శ్వే.త.అ. పుట. 104.
5. తథమే సత్య కామాః శ్వే.త.అ. పుట. 105.
6. యతోవాచో నివర్తన్తే అప్రాప్యమనసా సహ :- శ్రుతి.

(భిక్కుకందనివి). అవి నిరుపాధికములు. జీవునిగుణములు ఈశ్వరేచ్ఛాను రూపమైన ఉపాధినపేక్షించుచుండుటచే అవి సోపాధికములు. సర్వేశ్వరుని గుణములు ఉపాధినపేక్షింపనివి. సహజములు, అతడసమానుడు. సర్వాధికుడు.1 పరమేశ్వరుడు కర్మాధీనుడుగాడు. సకల జీవులకును కర్మఫల ప్రదాత.

ఈ చరాచర సృష్టియంతయు ఈశ్వరేచ్ఛా విలసితము. శక్త్యాత్మనా సృష్టికీతడు మూలకారకుడు. పరమేశ్వర తత్త్వము- ఎల్లప్పుడును శక్తి విశిష్టమైన "ఈశ్వరుడే" యగును. చంద్రచంద్రికలవలె "ఈ శివశక్తులు" అవినాభావ సంబంధముగలవారు.

ఈశక్తినే "చిచ్ఛక్తి"యని యందురు. ఈమెనే "పరాశక్తి" యనియు, "పరాప్రకృతి" యనియు, చిదంబర ప్రకృతియనియు, పరాంబికా, పరాభట్టారికా, యనియు వ్యవహరింతురు. జడప్రకృతికి, లేక అపరాప్రకృతికి ఈచిచ్ఛక్తియే యధిష్ఠాత్రి.

ఈచిచ్ఛక్తి సంకల్పానుసారమే జడప్రకృతి పరిణమించి, యాయా సృష్టివికారమును గలిగించుచుండును. ఈమెజ్ఞాన స్వరూపిణియయ్యును శివునివలె సర్వాత్మనా స్వతంత్రగాక శివపరతంత్రయై, యీశ్వరేచ్ఛానుసారముగనే సృష్టియొనర్చుచుండును 2

## పరిణామవాదము

ఆరంభ, ఉత్పత్తి, పరిణామ, వివర్త, వాదములలో ఈ సిద్ధాన్తము పరిణామ వాదమునంగీకరించును.

ఈ చేతనాచేతనాత్మక జగన్నిర్మాణమునకు నిమిత్తకారణము, ఉపాదానకారణము, గూడ ఆసర్వేశ్వరుడే.

---

1. నతత్సమశ్చాభ్యధికశ్చ దృశ్యతే॥ శ్రుతి.
2. ఏవమేషా పరాశక్తిః, ఈశ్వరేచ్ఛానువర్తినీ
   స్థిరః, చరంచ, యద్విశ్వం, సృజతీతి వినిశ్చయః
   వేదాంతార్థ పరిష్కారతారహారము. పుట. 35.

కుండలు చేయు సంకల్పము కుమ్మరిది. ఆతని సంకల్పము, అందులకు నిమిత్తము. కనుక ఘటనిర్మాణమునందు కుమ్మరి నిమిత్తకారణమగు చున్నాడు. అట్లే జగన్నిర్మాణమునకు ఆపరమేశ్వరుని సత్యసంకల్పమే నిమిత్తము. కనుక ఈ చరాచర సృష్టికాతడు నిమిత్తకారణము.

ఉపాదాన కారణమనగా, అవస్థాంతరమును పొందుద్రవ్యము. ఆయవస్థాంతరప్రాప్తి ప్రత్యక్షముగాగాని, పరంపరగాగాని జరుగవచ్చును. ఘటనిర్మాణమున మృత్తిక (మన్ను) ప్రత్యక్షముగా ఉపాదానమైనది.

అట్లే బ్రహ్మము స్వప్రకారములైన చేతనాచేతనముల ద్వారా, అనగా సూక్ష్మచిదచిద్విశిష్టుడై ఉపాదానకారణమయ్యెను. అందును అచేతనాంశమున ప్రత్యక్షముగా అవస్థాంతరమును, చేతనాంశమున సంకోచ వికాసములుగల చేతనజ్ఞానముద్వారా అవస్థాంతరమును జెందెను. ఈ విధముగా ఆ సర్వేశ్వరుడు ఈ చరా చర జగన్నిర్మాణమునకు ఉపాదానకారణముగూడ నయ్యెను.

శివాశ్రితయై యవ్యక్త రూపమున సామ్యావస్థలో నున్న జడశక్తి (అపరాప్రకృతి) చిచ్ఛక్తి యొక్క వీక్షణముచే మహదహంకారాది ప్రకృతి వికృతుల రూపమున ప్రాకృతమైన జగత్తుగా పరిణమించుచున్నదని భావము. కాన దీనిని "పరిణామ వాదము" అనియందురు.

ఈ పరిణామ వాదమునే "సత్కార్య వాదము" అనియు, నందురు. సత్ = ఉన్న (నిత్య సత్య) పదార్థమునుండియే, కార్యము = క్రొత్త యాకారము సంభవించుటను "సత్కార్యము" అని యందురు.

సృష్టికి ముందు శివాశ్రితమై, సూక్ష్మరూపమున నున్న జడపదార్థమే (అపరా ప్రకృతియే) చిచ్ఛక్తి వీక్షణమూలమున జగత్తుగా క్రొత్త (స్థూల) ఆకారమున సంభవించుచున్నది. కాన ఈ కార్యమును "సత్కార్య"మనియును, ఈ రీతి జగన్నిర్మాణవాదమును "సత్కార్యవాదము" అనియును అందురు.

ఈ సందర్భమున బీజాంకుర న్యాయము నుదాహరణముగా స్వీకరింతురు. అంకురము (మొక్క)గా నేర్పడుటకును, పిదప శాఖోపశాఖలతో

క్రమ క్రమముగా వృద్ధిచెంది, మహావృక్షముగా పరిణమించుటకును వలసిన మౌలిక లక్షణములు సూక్ష్మాతి సూక్ష్మరూపమున ఆ బీజమునందే (గింజ యందే) నిక్షిప్తములై యుండును.

అట్లే స్థూల చిదచిత్తుల (చేతనా చేతనముల) యావిర్భావమునకును, విశ్వరూపమున దాని బృహత్పరిణామమునకును సూక్ష్మచిదచిద్విశిష్టమైన యా పరబ్రహ్మమే (శివతత్త్వమే) మూలకారణము. కాన శక్తి విశిష్టమైనయాశివ తత్త్వమే జగదధిష్ఠానమగుచున్నది.

అందువలననే సూక్ష్మ చిదచిద్విష్టమైన శివుడు ఈ విశ్వమున కారణ బ్రహ్మముగా, స్థూల చిదచిద్విష్టమైన శివుడు కార్యబ్రహ్మముగా వ్యవహార ప్రసిద్ధి యేర్పడినది.

అసద్వస్తువుకంటె భిన్నమైనందున ఈ శివరూప పరబ్రహ్మము సద్రూపము (త్రికాలాబాధ్యము.). జడవస్తువు (అచిత్తు)కంటె ఇతరమైనదిగాన నిది చిద్రూపము. (స్వప్రకాశాత్మక జ్ఞాన స్వరూపము) దుఃఖరూప వస్తువుకంటె భిన్నమైనదగుటచే నిది "ఆనంద రూపము." పరిమితమైన వస్తువుకంటె వేఱై యున్నందున నిది "అనంతము".

కావున నీ పరబ్రహ్మము (శివతత్త్వము) అనంతసచ్చిదానంద విలసితము.

ప్రలయమునందు ఈ చేతనా చేతనాత్మక సర్వవిశ్వమును తనలో లయమొనర్చుకొనుచు, శివుడు తానొక్కడే మిగిలియుండుననుచు శివుని యొక్క యద్వైత స్థితిని తెలుపుచున్నది గాన ఈ సిద్ధాన్తమును "శివాద్వైత సిద్ధాన్తము" అని వ్యవహరించుట జరుగుచున్నది.

శివ-శక్తి స్వరూపములభిన్నములు. శివుడు లేక శక్తిలేదు. శక్తి లేక శివుడులేడు. ఈ యుభయులది అవినాభావస్థితి. కనుక ఈ సిద్ధాన్తము "శక్తి విశిష్టాద్వైతము" అనియు ప్రసిద్ధి చెందినది.

జగద్గురు శంకరాచార్య ప్రతిపాదితమైన "అద్వైతము"నందు వలెగాక యిందు జీవ బ్రహ్మలకు భేదాఽభేదరూపమున విశిష్టముగా అద్వైత (అభేద)

స్థితి వివరింపబడినదిగాన నిది "విశిష్టాద్వైతము"ని పేర్కొన బడుచున్నది. శంకరాద్వైతమునందు లేని యేవం విధ విశేషమిందుండుటచే నిది "విశేషాద్వైతము" అనియు వ్యవహరింపబడినది.

విశిష్టాద్వైతమున కవిరోధముగా శివోఽహం భావనా పారవశ్యముచేత శివదీక్షను స్వీకరించి, లింగధారణ పూర్వకముగా ఉపాసకులు శివారాధన మొనర్చి, శివసాయుజ్యరూప మోక్షమునందుదురు. అప్పుడు వారు జగత్కర్తృకత్వము, పార్వతీ పతిత్వము వినాగా శివసములై, శివునితో అద్వైతానందము ననుభవింతురు. కనుక నిది "అనుభవాద్వైతము" అనియు పిలువబడుచున్నది.

"ఏక ఏవరుద్రో నద్వితీయాయతస్థే" శివమద్వైతం చతుర్థం మన్యన్తే" "మాయాంతు ప్రకృతిం వింద్యాత్, మాయినంతు మహేశ్వరమ్" మొదలగు శ్రుతులననుసరించి, జీవ జడతత్త్వ విశిష్టుడగువాడు - ఆ పరమశివుడేయని యీ సిద్ధాన్తము విస్పష్ట మొనర్చుచున్నదిగాన నిది "శివ విశిష్టాద్వైతము" అనియు రూఢికెక్కినది.

"ద్వాసుపర్ణా" "అధికంతు భేదనిర్దేశాత్" అను భేద సూచక శ్రుతి సూత్రములను బట్టి తత్త్వత్రయమును (జీవ జగదీశ్వరులను) గ్రహించుటయు, "ఏకమేవాఽద్వితీయం బ్రహ్మ" "తదనన్యత్వమ్" మున్నగాగల యభేద శ్రుతి సూత్రముల ననుసరించి, తత్త్వత్రయమునకు (జీవ జగదీశ్వరులకు) అవినాభావసంబంధమును గ్రహించుటయు, సమంజసమని యీ "శివాద్వైత సిద్ధాన్తము" నొక్కి చెప్పును.

## మోక్షము

ఈ శివాద్వైత సిద్ధాన్తము - సాలోక్య, సారూప్య, సామీప్య సాయుజ్యమీరూప చతుర్విధముక్తులును శివోపాసకులకు సిద్ధించునని పేర్కొనును.

శివదీక్షను స్వీకరించుట ద్వారా లింగధారణమొనర్చి, వర్ణాశ్రమ ధర్మములను పాటించుచు, వైదిక మార్గమున శివునుపాసించినచో తత్ఫలితముగ ఉపాసకునకు శివతత్త్వజ్ఞానము సిద్ధించునని నొక్కిచెప్పెను.

శివజ్ఞాన లాభములనందిన యుపాసకుడు పాంచభౌతికమయిన యీతనువును చాలించిన పిమ్మట శివానుగ్రహమున అర్చిరాదిమార్గమున పరమపదమును (శివలోకమును) జేరి, క్రమముగా శివసాయుజ్యరూప మోక్షానందములననుభవించును - అని ప్రతిపాదించును.

## శివాద్వైత సారము

శివుడు శక్తివిశిష్టుడు. ఈ "శివశక్తులు". అవినాభావస్థితితో నొప్పుచుండురు. ఈ పరాశక్తి (చిచ్ఛక్తి) ఇచ్ఛా, జ్ఞాన, క్రియాశక్తులకు మూలము. స్వాభావికమైన తనమాయాశక్తివలననే చిదచిద్రూపమైన యీ జగద్విషయమున, ఆపరమేశ్వరుడు "సృష్టి, స్థితి, లయములు, తిరోధానానుగ్రహము" లనెడి పంచకృత్యములను లీలగా నొనర్చుచుండును.

సూక్ష్మ చిదచిద్విశిష్టుడై, యీశ్వరుడు కారణ బ్రహ్మముగను. స్థూల చిదచిద్విశిష్టుడై, కార్యబ్రహ్మముగను పిలవబడుచుండును.

"ఈశ్వరుడు, జీవులు, జగత్తు". అను ఈ మూడు తత్త్వములును నిత్య సత్యములు. జీవబాహుళ్యము గలదు. ఈశ్వరుడు ప్రేరకుడనియు, జీవులు కర్తలనియు, జగత్తు భోగ్యమనియు, ఇది నొక్కిచెప్పును.

చేతనాచేతనములందు అంతర్యామియై ప్రవేశించి, పరమేశ్వరుడు రెండు తత్త్వములను నియమించుచుండును. కనుక భగవంతుడు చిదచిద్విగ్రహుడే. పరమేశ్వరుడు సగుణుడనియు, నిర్గుణుడనియు చెప్పనొప్పును. "సగుణుడనగా మంగళకర గుణ విశిష్టుడు. నిర్గుణుడనగా, ఆకలి, దప్పిక వంటి అభవ్య గుణములు లేనివాడు." అను నర్థములను గ్రహింపనగును. ఇతడు మూర్తా మూర్త స్వరూపుడు.

చిద చిదాకారమైన నిఖిల ప్రపంచము మహా మహిమాన్వితుడగు పరమేశ్వరునకు శేషమైయున్నది. ఆ ప్రపంచమునకీ పరమేశ్వరుడు శేషి.

పరమ శివుడే జ్ఞానప్రదుడు. మోక్షప్రదాత. శివానుగ్రహ కారణమునవే జీవులకు అర్చిరాది మార్గమున శివలోక ప్రవేశము, సాయుజ్య లాభానందములును సంభవములు.

"ముక్తః శివ సమో భవేత్" అనునది యీ శివాద్వైత సిద్ధాన్తపరమాశయము.

o

# మూఁడవ ప్రకరణము

# అహల్యా సంక్రందన విలాసము

ములుగు పాపయారాధ్యులచే నిర్మింపబడిన తెలుగు ప్రబంధములలో "అహల్యా సంక్రందన విలాసము"ను రెండవ రచనగా పేర్కొనవచ్చును. వేమనారాధ్య చరిత్రమున కవి తన పూర్వ రచనలను గూర్చి యొక సీసమున బ్రస్తావించెను[1]. ఛందస్సులో సర్దుకొనుటకే గావచ్చును గాని యీ సీసమున "సరస శృంగారాను షంగముల్ దవణిఁజూ, పగ నహల్యా వధూ పరిణయంబు" అని యీ ప్రబంధ నామమును "అహల్యా వధూ పరిణయము"గా పేర్కొనినాడు. కాని యేతత్ప్రబంధమున నాయా ప్రస్తావనలందు[2] మాత్రము దీనిని గూర్చి స్పష్టముగా "అహల్యా సంక్రందన విలాసము" అనియే తెలిపినాడు.

1) స్వస్తియగునట్లుగా విరచింపంబూని, త "దహల్యా సంక్రందన విలాసంబు"నకు 1 గృతినాయకుం డైన. (1-21.)

2) అచ్చంద్రమౌళిధరాధీశ్వరునకు నభ్యుదయ పరంపరాభివృద్ధియగు నట్లుగా నా చేత నిర్మింపబూనియున్నయేత"దహల్యా సంక్రందన విలాసంబు"నకు కథా ప్రారంభ సంరంభం బెట్టిదనిన - (1-60).

3) విద్వజ్జన మనో రంజనోల్లాసంబగు, "అహల్యా సంక్రందన విలాసంబు"నకుఁగథా ప్రారంభ సంరంభం బెట్టిదనిన - (1-182)

ఈ మూడవ ప్రస్తావనమునందు కావ్యమునకుపయోగింపబడిన విశేషణము నందలి యంత్యప్రాసమును బట్టిగూడ నీ రచనకు కవిపెట్టినపేరు "అహల్యా సంక్రందన విలాసము" అనియే నిశ్చయింపనగును.

---

1. వే.ఆ.చ. 1-25 2. అహల్యా సంక్రందన విలాసము. 1-21,60,82.

4) అశ్వాసాంత గద్యములయందును "అహల్యా సంక్రందన విలాసము" అనియే ప్రస్తావింపబడినది.

ఈ యహల్యాసంక్రందన విలాసమిప్పటికిని అముద్రితముగనే మిగిలి యున్నది. ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారముల పుస్తకముల పట్టికలను బరిశీలింపగా మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమున దీని ప్రతులు రెండున్నట్లు తేలినది.

1. తాళపత్రప్రతి S.No. 128, D. 385.
2. కాగితంప్రతి. S.No. 127, D. 384 (వ్రాతప్రతి)

కాని వాస్తవముగా మద్రాసువెళ్ళి, యాగ్రంథాలయమున విచారింపగా తాళపత్రప్రతి తమకడ లేదనియు, వ్రాతకాగితంప్రతి మాత్రమే తమకడ గలదనియు ఆ గ్రంథాలయ నిర్వాహకులు తెలిపిరి.

రాష్ట్రముల పునర్నిర్మాణముల యనంతరము కొన్ని తెలుగు తాళపత్ర ప్రతులను "ఆంధ్రప్రదేశ్" రాష్ట్రమునకు తరలించినట్లు వారు చెప్పిరి. వానిలోనీతాళపత్రప్రతియు ఆ రాష్ట్రమునకు చేరియుండవచ్చునని పల్కిరి. ఆంధ్రప్రదేశ్‌లో స్పష్టముగా నిది యేగ్రంథాలయమునకు చేరినదియును వారు చెప్పలేకపోయిరి. తెలుగు రాష్ట్రమునందలి ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారములలో దీని "ఆచూకీ"యే తెలియుటలేదు.

ఈ "అహల్యాసంక్రందన విలాసము" ఐదు- ఆశ్వాసములుగా రచింపబడినది. ఇందలి గద్యపద్యముల సంఖ్య ఇంచుమించుగా "౭౪౫" అని తలంపవలసియున్నది.

వాస్తవమునకు ఈ గద్య పద్య సంఖ్య సరిగానున్నట్లు భావింప వీలు లేదు. ఎందుకనగా సీసములలోని తేట గీతులకును, ఆటవెలదులకును వేఱుగా సంఖ్యలీయబడినవి. అంతేగాక రెండవ యాశ్వాసమునందు సుమారు రెండు పుటలలో సాగిన దండకమునందు ప్రతినాలుగు పంక్తులకును వేర్వేఱు పద్య

సంఖ్యలు గుర్తింప బడియున్నవి[1]. కనుక నీ గద్య పద్యముల సంఖ్య మఱి కొంత తగ్గవచ్చును.

ఈ వ్రాత ప్రతిలో లేఖక దోషములు పెక్కుగలవు. లోగడ దీనిని పఠించినవారు అటనట ఆయా దోషములను దిద్దిన చోట్లును గలవు. ఇంకను దిద్దవలసినవి చాలగలవు. దీనికేగాక దాదాపు ప్రాత కాలపు వ్రాత ప్రతుల న్నింటికిని దోషసంస్కరణ మావశ్యకమైయున్నది.

ఈ కాగితం ప్రతి అఱువదినాలుగు (64) పత్రములకు రెండు వైపుల వ్రాయబడియున్నది. కాని 55వ పత్రమునుండి 62వ పత్రమువఱకుగల యెని మిది (8) పత్రములును, ఈ వ్రాత ప్రతిలో లేవు. ఆ పుటల మధ్య గ్రంథా లయ నిర్వాహకుల రిమార్కుతో కూడిన చిన్న కాగితము భద్రముగా అంటింప బడినయున్నది. అందు "54 to 62 are missing ఎవరు దీనిని తొలగించిరో కనుగొన వీలులేకున్నది" సంతకం-15-9-42" అని కలదు.

ఈ కవికి 1. సంగమేశ్వరారాధ్యుడు 2. పాపయారాధ్యుడు అని రెండు నామములున్నను, ఈ గ్రంథమును రచించునాటికి "పాపయారా ధ్యుడ"ను రెండవపేరు రూఢిలోనికి రానట్లు తోచుచున్నది. దీని యవతారి కలో కవి తన పేరునే ప్రస్తావింప లేదు.

ఆశ్వాసాంత గద్యములలో మాత్రము "శ్రీమద్వేమనారాధ్య వంశ పయః పారావార రాకా సుధాకర శ్రీ సంగమేశ్వ రారాధ్య విరచితంబగు అహల్యా సంక్రందన విలాసంబను మహాప్రబంధంబునందు" .......అనుచు కవి సంగమేశ్వర నామమునే ప్రస్తావించినాడు. కనుక ఆనాటికి కవికి వ్యవ హార నామముగా "పాపయారాధ్య" నామము స్థిరపడియుండలేదని భావింప నగును. శ్రీ వీరేశలింగం పంతులు గారు తమ కవుల చరిత్రలో ఈ కవి

---

1. దండకమున. నాలుగేసి పంక్తులను "ఒక విభాగముగా, జయకీర్తి మున్నగు ఛందశ్శాస్త్రజ్ఞులు అంగీకరించిరి.

* దండకాశ్చండ వృష్ట్యాద్యాః పాదాంశనియ మోదితాః
అపాద నియమాశ్చోక్తాః గణధా గద్యదండకాః॥

జయకీర్తి ఛందోఽనుశాసనము 1.123.

ఇది ఆం.మ. ఛందశ్శిల్పమునందుదాహృతము. పుట. 271,

నామమును "శ్రీ వేమనారాధ్యుల సంగమేశ్వరారాధ్యులు" అనియే తెలిపి యున్నారు.[1]

## ప్రోత్సాహము - అంకితము

ఈ రచనకై కవిని ప్రోత్సహించినవాడు శ్రీవాసిరెడ్డి చంద్రమౌళి భూపతి. ఈతడు వాసిరెడ్డి వేంకటాద్రి నాయని పినతండ్రి కుమారుడు. ఈతడు 20.2.1796 "దివి" నుండి (దివిసీమనుండి) తనపరగణా పాలన చేయుటకు అనుమతింప వలసినదని కుంఫిణీ అధికారులను కోరగా వారందులకామోదించిరి.[2]

ఈ చంద్రమౌళి భూపతి యొకనాడు మహోత్సాహముతో కొలువుదీరి యుండెను. సత్కవీంద్ర ప్రబంధ గోష్ఠి కాతడాసక్తి చూపెను, విచిత్ర కథా కృతి కల్పనైక వాంఛ యాయనలో పెల్లుబికెను. వెంటనే యాతడు సాదరముగా పాపయారాధ్యుల నాహ్వానించి, సభకు రప్పించెను. అఖండానంద సంధాయిగా నుండు సుశ్లోకంబౌ కృతిని సంఘటింపుమని యాతడు కవినభ్యర్థించెను. సముత్సాహముతో నానృపతి సబహుమానంబుగా పాపయారాధ్యులకు తాంబూలాదికముల నర్పించెను. ఆమోద ప్రమోదములతో కవివానినందు కొనెను.[3]

అంత పాపయారాధ్యుడు రాజును పేర్కొని, చంద్రమౌళి నరపతిని కృతిపతిగా నొనర్చి, తత్కృతి రచనకు పక్రమించెను.

పాపయారాధ్య ప్రణీతమైన యీ "అహల్యాసంక్రందన విలాసము" ఐదాశ్వాసములతో నలరారుచున్నది. ప్రథమాశ్వాసమున మొదట గౌరీశస్తుతిని

1. ఆంధ్రకవుల చరిత్ర. తృతీయ సంపుటము. పుట. 528.
2. శ్రీ.రా.వా.వేం.నాయుడు పుట. 104లో (103) 20-2-96 "Vasireddy Chandra Mouli—requests for his remaining in "Divi". fear of V.V.N. orders issued (2292 V 235).
3. అహల్యా సంక్రందన విలాసము. 1.15,16,17,18,19,20,21.

గావించినాడు. పిదప వాణిని దలంచినాడు. పిమ్మట రమాధవునకును, వినాయకునకును అంజలి ఘటించినాడు. అనంతరము నానాదేశముల యాస్థానములనుండు కోవిదాగ్రణులకు త్రైలోక్యత్ప్రల నర్పించినాడు. కుకవినింద నొనర్చినాడు. కృతి ఆ చంద్రార్కముగా బాసిల్లునని తత్ప్రశంస చేసినాడు.

స్వస్తియగునట్లుగా విరచింపంబూని తదహల్యా సంక్రందన విలాసంబునకు కృతినాయకుండైన నరపాల శిఖామణి వంశావతారంబభివర్ణించెద- అనుచు సుమారు 00 పద్యములలో కృతిపతి వంశమును వర్ణించినాడు. పిమ్మట షష్ఠ్యంతములను పల్కినాడు,1 తదనంతరము కథా ప్రారంభము జరిగినది. ఈ ప్రథమాశ్వాసగాథ దాదాపు 60 పద్యములలో నొప్పారినది.

నైమిశారణ్యమున శౌనకాదులు వేడుకపడి కోరగా సూతుడు ప్రవచించనట్లు- ఈ ప్రబంధగాథ కొనసాగినది.

## కథా సంగ్రహము

### ప్రథమాశ్వాసము

నిష్ఠాగరిష్ఠుడైన గౌతముడు తపశ్చర్యకు పూనుకొనెను. ఆ తపః ప్రభావమునకు లోకములాకులములయ్యెను. దేవతలాందోళనమునకు లోనైరి. పరిస్థితులను చక్కదిద్దుటకు బ్రహ్మ "అహల్య"ను సృజించెను. ఆమె సౌందర్యమతిలోక మహితమైయలరారెను. సామాన్య దేవతల మాట యటులుంచి, హరి ప్రభృతులకును ఆమె రూప సౌందర్యము పరమాకర్షకమై మిరుమిట్లు గొల్పుచుండెను, హరి ప్రభృతి నిర్జరులెల్లరును- ఏదోయొక నెపమున బ్రహ్మ కొలువునకు వచ్చి, ఆమె యందచందముల గాంచుచు నానందింపసాగిరి. పెద్ద కాలమట్టనే యుండిపోవుచు వచ్చిరి.

### ద్వితీయాశ్వాసము

మనోహరమైన యహల్యా సౌందర్య వార్త ఇంద్రునకు చేరినది వెంటనే యాతడు పయనమైనాడు. బ్రహ్మసభకు విచ్చేసినాడు. ఇంద్రునితో

1. అహల్యాసంక్రందన విలాసము 1-73 నుండి 81 వరకు.

బ్రహ్మ కుశలప్రశ్నలు కావించెను. ఇంతలో నహల్యా వీణానాదము వీనుల విందుగా వినిపించెను. వీణానిక్వాణ మాధుర్యములకు సదస్యులెల్లరును నిశ్చేష్టులైరి. పురందరుని పారవశ్యమునకు మితితప్పెను. అహల్యా విరహమునకు లోనైన యాతనికి మతి తప్పెను. అంతనతడు అహల్య పుట్టుపూర్వోత్తరములను గూర్చి ప్రజాపతినడిగి తెలిసికొనెను. విరహార్తుడై యతడు సురపురికి జేరెను.

క్రమక్రముగా గౌతమముని తపోనిష్ఠ యినుమడింపసాగెను. వాణితో, అహల్యతోగూడి బ్రహ్మ గౌతమునకు సాక్షాత్కరించెను. విరించి సాక్షాత్కారమునకు మహర్షి యానందించి, ధన్యతను ప్రకటించెను. బ్రహ్మ గౌతమునకహల్యను సమర్పించెను.

బ్రహ్మతాను కన్యాదాతగా ఉండి, అహల్యా గౌతముల కతివైభవముగా వివాహమహోత్సవమును జరిపించెను అప్పగింతలైపోయినవి. దంపతులు గౌతమాశ్రమమున(బ్రవేశించిరి. అత్యంత భక్తి ప్రపత్తులతో అహల్య పతిసేవలొనర్పఁజొచ్చినది. గౌతముని నియమనిష్ఠాజీవనము నిరంతరాయముగా కొనసాగుచు వచ్చినది. పరస్పరానురాగములతో దంపతులు సుఖగోష్ఠులనోలలాడసాగిరి. గౌతముని సుఖలౌల్య మతివేలమై యుప్పొంగినది. ఏకాంత విహారానందములతో వారు పొంగిపోసాగిరి.

## తృతీయాశ్వాసము

విరహార్తితో నమరపురి(జేరిన సురరాజు పరితాపమవధులు దాటినది. అహల్యాగౌతముల వివాహ వృత్తాంతమును విని యతడు నివ్వెరపడెను. ఉల్లమూరటచెందుటకై యతడు దివినుండి భువికి దిగి, గౌతమాశ్రమును జేరెను. వాసవ గౌతములకు కుశల ప్రశ్నలు లోకరీతిలో కొనసాగినవి, మనస్సున "గిలి" పెట్టుకొనిన యింద్రుడు గౌతముని పరోక్షమున చొరవలు చూపి, అహల్యను సమీపించినాడు. సంభాషించినాడు. ఇంద్రాహల్యలయన్యోన్యానురాగ ప్రచలనములు తీగెలుసాగినవి.

ఇంద్రుడు నిజపురమునకు చేరెను. నందన వనమునఁ బ్రవేశించెను. విరహబాధల నలమటించెను.

దౌత్యము లేనిదే తన మనోవాంఛా సాఫల్యము సమకూరదని యతడు తలపోసెను. వెంటనే "మనోరంజని" యను దూతికను రప్పించి విషయములను వివరించి, దౌత్యకార్య భారమునామెకప్పగించెను. ఇంద్ర మనోరథము నీడేర్చుటకై, దూతిక గౌతమాశ్రమమును జేరెను. అదనుజూచి, యామె యహల్యచెంత చేరెను. ఇంగితజ్ఞానముగల యామనోరంజని సమయసందర్భ శుద్ధితో సరస సంభాషణములతో, ఓర్పునేర్పులతో, అహల్యాస్వాంతమును శృంగార రసజలధిలో పరిప్లుతముగావించెను. అందముగా పురందరుని గాఢానురాగములను, మనోభావములను, ఆమెముందావిష్కరించెను. ఇంద్రుడిడిన "కల్ప పల్లవ మంజరిని" ఆమె యహల్యకు సమర్పించెను. క్రమముగా ఆ దూతిక యహల్యను మధురోహలలో ముంచెత్తి, యామెను వాసవానుకూల వేదికకు చేర్చెను. పైకి గాంభీర్యమును ప్రదర్శించుచు పెక్కునీతి సూత్రములను వల్లించుచున్నను, ఇంద్రునియెడ అహల్య గుండెలలో నిండారిన గుబులును దూతిక పూర్తిగా గుర్తించెను. వచ్చిన పనియైనందులకామె మిక్కిలి సంతసించెను.

అచ్చట ఇంద్రుని యావేదన చెప్పనలవి కానిదయ్యెను. ఎంతకును దూతిక తిరిగిరాక పోయెనని యాతడు వ్యాకుల పడుచుండెను. దౌత్యకార్య వైఫల్యమే యీవిలంబమునకు కారణమైయుండునని యతడుడికి పోవుచుండెను. కృతకృత్యయైన మనోరంజని (దూతిక) అమరావతికి పయనమాయెను.

## నాల్గవ - ఆశ్వాసము

అమరేంద్రుని పైమరులు పెంచుకొనిన యహల్య లోకరీతికి విపరీతముగా స్వైప్న వీధులలో విహరింపసాగెను. ఊహాలోకములలో ఉయ్యాలలూగసాగెను.

దూతికరాకకై యెదురు తెన్నులు చూచుచు ఇంద్రుడు పడుచున్న యూగాటమున కంతులేకుండెను. అతడు మదన తాపమ్ములకు క్రాగిపోసాగెను.

సూర్యాస్తమయములకు క్రుంగిపోవుచుండెను. సంజెకెంజాయలకు తట్టుకొన లేకుండెను. చీకట్లకు చీకాకు పడజొచ్చెను. చంద్రోదయములకు తల్లడిల్ల సాగెను.

అతడు మన్మథుని తిట్టిపోయుచుండెను. చంద్రుని నిందించుచుండెను. మలయ పవనుని దుమ్మెత్తిపోయుచుండెను. శుకపిక నికరములను జూచి, కసరి కొట్టుచుండెను.

ఇంతలో దూతికపురందరుని ముందర నిలిచెను. తాను వెళ్ళినవని "పండు" ఐనదని యాతనికి సంతోషముతోఁదెల్పెను.1 అహల్య యానుకూల్య ములను, సంకేత స్థలాదికమును ఆమె యింద్రునకెఱింగించెను.

## పంచమాశ్వాసము

అహల్యతోడి సుఖములకు తహతహపడుచున్న యింద్రుడు- అర్ధరాత్రమున సరసవిట వేషమును సంతరించుకొనెను. నిండు నిశీథిలో తలంపులు పండించుకొనుటకు అతడు గౌతమాశ్రమము పొంతనిలిచెను. కోడియైకూసెను. ఆ కోడి కూత వినిన గౌతముడు నిజముగనే వేకువయైనదని తలంచి, స్నానమునకై నదీతీరమునకు నడిచెను.

---

త్రివిధ దూతికలు (సాహిత్య దర్పణము)

1. నిసృష్టార్థ 2. మితార్థ 3. సందేశహారిక

* నిసృష్టోర్థో, మితార్థశ్చ, తథాసందేశహారికః
  కార్యప్రేష్యస్త్రిధాదూతో, దూత్యశ్చాపి తథా విధాః॥
* ఉభయోర్భావమున్నీయ స్వయం వదతి చోత్తరం
  సుశ్లిష్టం కురుతేకార్యం నిసృష్టార్థస్తు సస్మృతః॥
* మితార్థ భాషీకార్యస్య సిద్ధికారీమితార్థకః
  యావద్భాషిత సందేశహారః సందేశహారకః.

ఈ త్రివిధ దూతికలలో "మనోరంజని"ని "నిసృష్టార్థ" యనుత్తమ దూతికగా భావింప వచ్చును.

అహల్యాశయ్యామందిరమును జేరుటకు ఇంద్రుడు సన్నద్ధుడగు చుండెను. నిర్ణీత సమయ సంకేతముల మేరకు ఇంద్రుడు తనయెదుట నిలువ లేదని అహల్య పరిపరి విధముల పరితపింపజొచ్చెను. ఇంతలో ఇంద్రుడామె ముందర నిలిచెను. అహల్య యంతరంగ మానంద తరంగముల మునిగి తేలెను. కాని మహేంద్రుని మనసు పరీక్షింప దలఁచి, యహల్య యనేక సంప్రశ్నములతో అయనను సతమత మొనర్చినది.

ఇంతలో సమయ ధర్మము ననుసరించి, నిజముగనే కోడికూసినది. నదీ తీరమునకేగిన గౌతముడు కాల్యముల ముగించుకొని, స్నానకార్యక్ర ముల నిర్వర్తించుకొనెను, భార్యపై మరులు గొనిన యామహర్షి ఆశ్రమము కడ అనుష్ఠానాదికముల నాచరింపదలచినవాడై యింటికి బయలుదేఱెను.

ఇటనుండి యాయాశ్వాసాంతము వఱకుగల కథా భాగములతో గూడిన పత్రములు (8) ఆ గ్రంథమున లేవు. ఇది విచారకరము' కవి దీనిని పూర్తిగా వ్రాసెననుటకు పంచమాశ్వాసాంతమునందలి గద్యమే ప్రబలనిదర్శనము.

ఇది.......... శ్రీ సంగమేశ్వరారాధ్య విరచితంబగు నహల్యా సంక్రం దన విలాసంబను మహాప్రబంధంబునందు సర్వంబును పంచమాశ్వాసము— శ్రీశ్రీశ్రీశ్రీశ్రీం జేయును—

గ్రంథము సమాప్తము

---

## కథాపరామర్శ

ఇంద్రాహల్యల ప్రస్తావన వేదములయందును, పురాణేతిహాసముల యందును సంస్కృతాంధ్ర కావ్యములయందును గలదు.

## వేదమునందు

"ఇంద్రాగచ్ఛ, హరి రివాగచ్ఛ మేధాతిథేః
మేష వృషణశ్వస్యమేనే, గౌరావస్కందిన్
అహల్యాయై జార ! కౌశిక బ్రాహ్మణ గౌతమబ్రువాణ"1

---

1. తైత్తిరీయారణ్యకము.

దీనికి సాయన(ణ)భాష్యము:-

హరియను పేరుగల అశ్వయుతుడవైన ఇంద్రా! ఈ యజ్ఞమునకే తెమ్ము. కణ్వపుత్రుడైన మేధాతిథిని తూపముగా గలవాడవై వృషణశ్వముని పుత్రికయగు మేనకను వలచినట్టివాడా! గౌర మృగరూపమును దాల్చి యాగశాలకు విచ్చేయుము. ఇందు "అహల్యాయైజార" అను దానికి వైదిక పరమైన యర్థములేదు.

## భట్ట భాస్కర భాష్యము

శబ్ద జాలమును సంతరించినవాడా! లేదా! వాగతీత మహత్త్వముగల యింద్రుడా! మేషరూపముదాల్చి, మేధాతిథిముని సమీపమునకు వచ్చితివి. జారుడవై గౌతముని దారను తారసిల్లితివి. బ్రాహ్మణ రూపమున కౌశికును తేజ పఱచితివి.

ఇట "అహల్యాజారుడ"నగా వాక్పరిణామకారకుడు, "గౌర" శబ్దమునకు ఆద్యంత వర్ణగ్రహణముచేత "గౌతమ దార" అని వివరణము"2

నిరుక్తకారులు "అహల్యాజారుడు" అనగా ఆదిత్యుడు (సూర్యుడు) అని పేర్కొనిరి.

అత్రనిరుక్తకారాః :- "ఆదిత్యోఽత్ర జార ఉచ్యతే - రాత్రేర్జరయితా"1
వార్తికకారా అపి :- (3-3-4)

ఏవం సమస్త తేజాః పరమైశ్వర్య నిమిత్తం ఇంద్రశబ్ద వాచ్యః సవితైవ. అహనిలీయ మానతయా రాత్రేః అహల్యా శబ్ద వాచ్యాయాః క్షయాత్మక జరాయా హేతుత్వాత్ జీర్యతి అస్మాదనేనైవోదితేనేతి ఆదిత్య ఏవ "అహల్యాయైజార" ఇత్యుచ్యతే. సతు పరస్త్రీ వ్యభిచారాత్. ఇతి. (సాహిత్య దర్పణోపోద్ఘాతః.)

---

1. ఈ రెండు వివరణములును. అహల్యా సంక్రందనము. అనుశీలనము (P.4.). సందు కావింపబడినవి. అవి యిట గ్రహింపబడినవి.

ఇక్కడ ఆదిత్యుడే "అహల్యాజారుడ"ని చెప్పబడినది. ఆదిత్యునందు ఇంద్ర శబ్దము వర్తించును. "అహనిలీయతే ఇత్యహల్యా" అహస్సునందు లయమును పొందుచున్నది అను నర్థము ప్రకారము "అహల్యా" శబ్దము రాత్రిని జెప్పును.

అహల్యాం రాత్రిం జరయతీతి, "అహల్యా జారః" సూర్యుడు తాను దయించి, రాత్రిని క్షయముచొందించు చున్నందున ఆదిత్యునియందు "అహల్యా జార" శబ్దము వర్తించుచున్నది. పరస్త్రీ వ్యభిచారము వలన అహల్యా జారుడనికాదు..1

"అహల్య" యన రాత్రి, లేక చీకటి. (అహఃలీయతే అస్యామ్) ఇంద్రుడు-సూర్యుడు, గౌతముడు-చంద్రుడు. ఇది కుమారిలభట్టు తెలిపిన సాంకేతిక వివరణము. తన సంస్కృత సాహిత్య చరిత్రమున "మాక్స ముల్లర్". ఈ యభిప్రాయను నాదరించినాడు.2

"అహల్య" యన ఊషరక్షేత్రము. అది వర్షాదిపతియగు ఇంద్ర సమాగమము వలన ఫలవంతమైనది. మీ మాంసకులీయభిప్రాయమునే విశ్వసింతురు.2 వేదము ప్రకారము. అహల్య వాక్కు. ఇంద్రుడు వాక్సంధాత.2

నిరుక్తకారుల, వార్తికకారుల వివరణములను బట్టి అహల్యాజారుడ" నగా "ఆదిత్యుడు, వాక్పోషకుడు" అను నర్థములు వివక్షితములైనవి.

కాని పురాణాదులు మాత్రము - అహల్యాజారుడనగా గౌతముని భార్య యగు అహల్యయందు వ్యభిచరించినవాడు. ఇంద్రుడు (సురరాజు) అనియే భావించినవి.

అహల్యా గౌతమస్య భార్యా - తస్యాః ఇంద్రోజార ఇతిపురాణే ప్రసిద్ధమ్ - విద్యారణ్య భాష్యము3

1. శ్రీ మద్రామాయణ తత్త్వ కథనము. పుట.240.
2. అహల్యా సంక్రందనము. అనుశీలనము. పుట.38.
3. శ్రీమద్రాయాయణ తత్త్వ కథనము - పుట. 204.

"అహల్యాజార" ప్రయోగమునకు "ఇంద్రుడను అర్థము" పురాణ ప్రసిద్ధమై" కల్పభేదాత్ కథాభేదః" అనుసూక్తి ననుసరించి,అహల్యా వృత్తాంతము పలు మార్పులకును, చేర్పులకును లోనైనది.

రానురాను శృంగార రస లౌల్యమున మునింగి, కవులలో పెక్కుమంది "అన్యదావా ప్రకల్పయేత్" అను నార్యోక్తి యాధారముగా అహల్య గాథను - అవధులు మీఱి, అతివేలముగా వర్ణించిరి.

రామాయణమున - అహల్య గాథ :

రామాయణమున బాలకాండములోను, ఉత్తరకాండమునందును— "అహల్య - ఇంద్రుల గాథ" వివరింపబడినది.

బాలకాండ కథ : గౌతముడొక మహర్షి; అయన భార్య "అహల్య" అతడు తపోనిష్ఠాగరిష్ఠుడు.

లోక పరితాపకారకములైన తపశ్శక్తులను లోకక్షేమముకొఱకు క్షీణింపజేయుచుండువాడు ఇంద్రుడు. అందువలన నింద్రుడు గౌతముని తపశ్శక్తికి విఘ్నకరముగా నాయనలో క్రోధమును పుట్టించి, సురకార్యమును నిర్వహింపదలచెను. మునులు శాపాయుధులని యెఱిగియే యందుల కతడు సన్నద్ధుడయ్యెను.1 ఒక్కొక్కప్పుడు రాజ్యభారనియుక్తులకు అది కర్తవ్యముగూడ.

గౌతముడింట లేని సమయమున ఆ మునివేషమున ఇంద్రుడచటికి వెళ్ళెను. ఆ వచ్చినవాడు సురరాజని అహల్య గమనించెను. ఇంద్రుడహల్యను ధర్షించెను. పిదప నతడాయాశ్రమమునుండి వెలువడెను. ఇంతలో గౌతముడు రానేవచ్చెను. ఇంద్రుడు వెలవెలఁబోయెను. గౌతముడు కుపితుడై "విఫలుడవగుము" అని యింద్రుని శపించెను. అంత నా యింద్రుడు వెడలిపోయెను. గౌతముని తపోభంగమును సురకార్యమును సంఘటించి, శప్తుడైన యింద్రుడు మేషవృషణుడయ్యెను.

1. కుర్వతా తపసోవిఘ్నం గౌతమస్య మహాత్మనః
క్రోధము త్పాద్యహి మయా సురకార్య మిదం కృతం
శాపమోక్షేణ మహతాతపోఽస్యాపహృతంమయా

"వాయుభక్షణము సేయుచు, నిరహార వ్రైతపించుచు సర్వభూతముల కదృశ్యవై భస్మమున శయనించుచుండు"మని గౌతముడహల్యను శపించెను.[1] రాముని దర్శనముతో అహల్యకు శాపవిముక్తి కల్గునని పలికి, ఆయాశ్రమమును విడిచి, గౌతముడు హిమవన్నగమున కేగెను.

రాముని రాకతో పునీతయైన యహల్యను గౌతముడు స్వీకరించెను.

## ఉత్తరకాండ కథ

బ్రహ్మయొక సర్వాంగ సుందరిని సృజించెను. ఆమె కహల్యయని పేరిడెను. (అహల్య = సర్వాంగ సుందరి) హలమనగా విరూపము హల్యము వైరూప్యము. హల్యములేనిది "అహల్య" సర్వాంగ సుందరి.[2]

అతిలోక సుందరియగు అహల్య కొఱకు ఇంద్రుడాశపడెను. కాని బ్రహ్మయామెను తపస్వియగు గౌతమున కిచ్చెను. ఇంద్రుడు మోహామాత్సర్య వశుడయ్యెను. అహల్యను ధర్షించెను. గౌతముడింద్రాహల్యలను శపించెను.

---

1. నృశంస మనృశంసంవా ప్రజారక్షణకారణాత్
పాతకంవా సదోషంవా కర్తవ్యం రక్షతా సదా
రాజ్య భారనియుక్తానాం, ఏషధర్మస్సనాతనః॥
మమరూపం సమాస్థాయ కృతవానసి దుర్మతే!
అకర్తవ్యమిదం యస్మాత్, విఫలస్త్వం భవిష్యసి॥
వాయుభక్షా నిరాహారా తప్యన్తీ భస్మశాయినీ,
అదృశ్యా సర్వభూతానా మాశ్రమే త్వం భవిష్యసీ॥
బాలకాండ సర్గ 28

2 హలం నామేహ వైరూప్యం, హల్యం తత్ప్రభవంభవేత్
యస్యా న విద్యతే హల్యం తేనాహల్యేతి విశ్రుతా॥
అహల్యా సంక్రందనము అను శీలనము - పుట. 7.

పగవానిచే బంధితుడగునని యింద్రునకు శాపము. శిలా రూపమును బొందునట్లహల్యకు శాపము. గౌతమశప్తుడైన యింద్రుడు ఇంద్రజిత్తుచే బంధితుడై పరాభూతుడాయెను. అహల్య శిలయైనది. రాముడహల్య నుద్ధరించెను. శాస్త్ర నియతిననుసరించి, గౌతముడామెను స్వీకరించెను.[1]

ఉత్తరకాండ కథ యొక విధముగ బాలకాండ కథకు పూరకమనదగి యున్నది. బాలకాండ కథలోని "ఇంద్రుడు విఫలుడగుటయు", ఉత్తరకాండ కథలోని, "అహల్య శిలయగుటయు", అనంతర కవుల యాదరములకు పాత్రములైన వృత్తాంతములు.

## పురాణాదులలో - ప్రస్తావనలు

బ్రహ్మపురాణము, బ్రహ్మాండపురాణము, పద్మపురాణము, వరాహపురాణము, శివపురాణాదులు, అధ్యాత్మరామాయణము, ఆనందరామాయణము, మృచ్ఛకటికము, ప్రబోధ చంద్రోదయము, రఘువంశము మున్నగు సంస్కృత కావ్యములును, అహల్యా వృత్తాంతమును సందర్భానుసారముగా యథోచితముగా ప్రస్తావించినట్టివే.

గౌతముడు గోప్రదక్షిణముతో భూప్రదక్షిణమొనర్చి, అహల్యను సతిగా బడసినట్లు బ్రహ్మాండ పురాణము తెలుపుచున్నది.[2]

ద్విముఖీ గోవునకు (ఈనుచున్న ఆవునకు ఒక వైపు ఆవుతల, మఱొక ప్రక్కన దూడతల ఉండుస్థితిలో) ప్రదక్షిణముచేసి, గౌతముడహల్యను భార్యనుగా బొందెనని యానంద రామాయణమునుడుపుచున్నది.[3]

---

1. వినా గర్భం సపత్నేషు సత్యాజ్యా గమనాత్ స్త్రియః
   ప్రాయచ్చిత్తంయథాన్యాయం.

2&3. అహల్యా సంక్రందనము. అనుశీలనము. పుటలు. 9, 10.

## తెలుగు కృతులలో అహల్యా కథలు

భాస్కర రామాయణము, తిక్కన కృత నిర్వచనోత్తరరామాయణము, రంగనాథ రామాయణము, మొల్లరామాయణము, గోపీనాథ విరచిత విచిత్ర రామాయణము, కంకంటి పాపరాజు ప్రణీత - ఉత్తర రామాయణము, రామయ మంత్రి "దశావతార చరిత్రము," పుష్పగిరి తిమ్మన - సమీర కుమార విజయము, వేంకటకృష్ణప్ప నాయకుని "అహల్యా సంక్రందనము" మున్నగు తెనుగు కృతులలో కొన్ని సూక్ష్మముగను, మఱికొన్ని కొంత విపులముగను - అహల్యా గాథలను నుడువగా, కొన్ని యహల్యా వృత్తాంతములకే యాకృతి దాల్చినవి.

తెలుగు కావ్యములలో రంగనాథ రామాయణమునుండి "ఇంద్రుడు నిండు నిశీథమున కోడియై కూయుట" ప్రారంభించినట్లు గన్పట్టును. ఆ తరువాతి కవులలోను కొంతమంది యాకోడి కూతను విడిచిపెట్టలేదు.

## కావ్య విమర్శ

"అహల్యా సంక్రందన విలాస" ప్రబంధ నిర్మాత ములుగు పాపయారాధ్యుడు. ఏతద్రచనా ప్రేరకుడు వాసిరెడ్డి చంద్రమౌళి భూపతి. తనకొక కృతిని రచించియిమ్మని యా భూపతి పాపయారాధ్యుని నిండుకొలువులో కోరినాడు.

ఆ, కృతి సత్కవీంద్ర వాచారమణీయమై, అఖండానంద సంధాయియై, పుణ్య స్థాపకము కావలెనని యా భూజాని కోరికపడెను. వివిధ కవితా విశారదుడైన పాపయారాధ్యుడు రాజుకోరిన రీతిగా కృతిని రచించుటకు సంసిద్ధుడై, రాజబహుమానముల నందెను.

కవి "గౌతమాహల్యల గాథ" పుణ్యస్థాపకమని తలంచినాడు. పురాణ ప్రసిద్ధమై, పరమార్థ కారణమైన యింద్రోదంతములను దానికి జోడించినాడు.

---

1. అహల్యా సంక్రందన విలాసము - అవతారిక 1.16, 18.

రసవత్ప్రబంధా కృతికై యనల్పకల్పనలను గావించినాడు. ప్రౌఢార్థ వాక్పరి-పాకములతో తత్కావ్యమునకు సత్కవీంద్ర వాచా రమణీయ గౌరవము సంభావించినాడు. చిత్రపదశోభలతో చారురీతులను సమకూర్చినాడు. సరస శైలిని సంతరించినాడు. మధురభావములను రంగరించినాడు. ఆ విధముగా తత్ప్రబంధమును విద్వజ్జన జాలలాలిత మొనర్చినాడు.

## ఇది పుణ్యస్థాపకము

గౌతముడు సప్తర్షి గణములో సమలంకృతుడు.[1] ఈ సప్తర్షుల దర్శన స్మరణములు పవిత్రములు, సర్వ శుభావహములు ననుటకు వివాహానంతరము నవదంపతులిప్పటికిని సప్తర్షి- అరుంధతీ దర్శనముల నొనర్చుచుండుటయే యొక ప్రబల నిదర్శనము.

ఈ గౌతమునకు "గోదముడు" అనియు పేరుగలదు. గోపదార్థమును (స్వర్గమును, భూమిని) వశపఱచుకొనగలవాడుగాన నితడు గోదముడు.[2]

అహల్యా సమేతుడై గౌతముడు, ఈశ్వరునారాధించినప్పుడు గౌతముని దర్శనము పాపభంజకమనియు, శివుడనుగ్రహ వచనములను బలికెను.[3]

---

1. కశ్యపోఽత్రిర్భరద్వాజో విశ్వామిత్రోఽథగౌతమః,
జమదగ్నిర్వసిష్ఠశ్చ, సప్తైతే ఋషయస్తథా॥
రామాయణ రహస్యాల సమీక్ష - పుట. 25.

2. (i) గోపదార్థం స్వర్గం, భూమించ దమయతి వశీకరోతి,
ఇతిగోదమః॥
(ii) గాం, ద్యాంచ దమితుం శక్తోఽస్తి - ఇతి గోదమః॥
రామాయణ రహస్యాల సమీక్ష - పుటలు. 26, 23.

3. త్వదీయ దర్శనాల్లోకా నిష్పాపాశ్చ భవన్తి హి,
ఉపద్రవస్త్వయిమునే! యైః కృతస్తు దురాత్మభిః,
తే పాపాశ్చదురాచారా హత్యాపన్నాస్తథైవహి,
ఏతేషాం దర్శనాదన్యే పాపిష్ఠాస్సంభవన్తుచ॥
శివపురాణ.... సంహిత అధ్యాయము-26. రా. రహ. సమీక్ష. పుట. 22.

"పంచ కన్యలు"గా ప్రసిద్ధినందిన వారిలో నహల్యయు కలదు. వారి స్మరణము మహా పాతకములను గూడ నశింపజేయును.1

రామలక్ష్మణులచే పాదాభివందనముల నందుకొన్న పవిత్రురాలు అహల్య.2

ఈ విధముగా సర్వపవిత్రతకు కుదురైన యీ గౌతమాహల్యల వృత్తాంతము పుణ్యస్థాపకమే యౌనుగదా।

## ఇంద్రోదంతములు-పరమార్థములు

"అహల్యాయైజార" అనువాదానికి అహల్యయందు వ్యభిచరించినవాడు ఇంద్రుడు. ఇది లోకమున ప్రసిద్ధికెక్కినయర్థము. చీకట్లను పోద్రోలువాడు సూర్యుడు, వాత్ప్రేరకుడు ఇంద్రుడు, అనునవి వేద భాష్యార్థములు.

ఋషీశ్వరాదుల తపస్సులత్యుగ్రములై యొక్కొక్కప్పుడు లోకభయంకరములగు చుండును. అట్టి పరిస్థితులలో ఆయా తపోధనుల తపోనిష్ఠలకు భంగములు కలిగించు చుండుట ఇంద్రునకు సాధారణ కృత్యము. అట్టి విషయములందు. ఆ, సురపతి యెట్టి ప్రమాదములెదురైనను వెనుదీయడు. రాజ్యపాలకుల కర్తవ్య లక్షణమే యంత.

గౌతమునకు క్రోధము పుట్టించుట ద్వారా, ఆయన తపశ్శక్తిని క్షీణింపజేయుటకై "అహల్యాజారుడు"గా దేవేంద్రుడు ప్రవర్తించెను. ఈ విషయ

---

1. అహల్యా ద్రౌపదీ సీతా తారా మందోదరీ తథా,
పంచకన్యాః పఠేన్నిత్యం మహా పాతకనాశనమ్॥
అహల్యా శాప విమోచనము. పరిచయము. పుట.8.

2. శాపస్యాంతముపాగమ్య తేషాందర్శన మాగతా
రాఘవౌతు తతస్తస్యాః పాదౌ జగృహతు స్తదా
రామాయణము. బాలకాండ. సర్గ.49.

మును. అ, సురరాజే స్వయముగా దేవతలకుఁజెప్పినట్లు రామాయణము నుడువుచున్నది.1

వాస్తవముగా వాల్మీకి వ్యభిచారమతే అయుగధర్మములననుసరించి, శాప పాత్రములయ్యెనని ధర్మమర్మజ్ఞుల యభిప్రాయము.

## అనల్ప కల్పనలు

1. అహల్యా సృష్టి. కారణము.

పాపయారాధ్యుని "అహల్యా సంక్రందన విలాసమునకు, ధరణిదేవుల రామయమంత్రి "దశావతార చరిత్రము" సమ్ముఖము వేంకటకృష్ణప్ప నాయకుని "అహల్యా సంక్రందనము" అనునవి యించుక పూర్వరచనలు.

దశావతార చరిత్రమునందలి రామావతారమునందు అహల్యా వృత్తాంతము సుమారు 130 గద్య పద్యములలో వర్ణితము. అహల్యా సంక్రందనమున మూడు (3) ఆశ్వాసములుగా సుమారు 355 (83+123+149) గద్య పద్యములలో అహల్యోదంతము చెప్పఁబడినది. ఈ "అహల్యా సంక్రందన విలాసము" సుమారు 600 గద్య పద్యములలో రచింపఁబడినది. దశావతార చరిత్రమునందలి "అహల్యకథ" ఆ గ్రంథమున రామకథలో ఉపకథగా తక్కువప్రాముఖ్యము కలిగియున్నది. "అహల్యా సంక్రందనము" పూర్తిగా అహల్యా వృత్తాంతమునే దెల్పును.

ఈ మూడింటను బ్రహ్మ అహల్యను ప్రత్యేకముగా సృజించినట్లు కలదు. కాని యీ యహల్యా సంక్రందన విలాసమునందు మాత్రము గౌతముని తపము యొక్క తీవ్రతను తగ్గించుటకై బ్రహ్మ యామెను సృజించినట్లు కారణము కల్పన చేయబడినది. రామయ మంత్రిచే, మోహినీ రూపమును మించుటకై బ్రహ్మ "అహల్య"ను సృష్టించినట్లును, కృష్ణప్పచే, రంభాద్యప్సరసలను మించుటకై యహల్యను బ్రహ్మ సృష్టికావించినట్లును, చెప్పబడినది.

1. రామాయణము. బాలకాండము. సర్గము.25

ఇందు పాపయారాధ్యుడు కల్పించిన కారణమే సముచితముగానున్నది. గౌతమ తపస్త్రీవ్రతను తగ్గించి, లోకప్రమాదమును తప్పించుటకు - ఈ యహల్యాసృష్టి పూర్వచర్య కాగా, ఇంద్రుని జారచర్యలు తదనంతర చర్యలుగా, ఇందొక క్రమరీతి కన్పట్టుచున్నది.

ఇచట బ్రహ్మ గౌతమునిలో శృంగారాభిలాషను కల్గించుటకు పూను కొనగా, అనంతరము - ఇంద్రుడాయనలో క్రోధోద్రేకములను కల్గించుటకు యత్నించెను. ఈ యుభయుల చర్యలలో ధర్మాధర్మ విషయ సామ్యము చాల యుండుట యనునది వేఱు విషయము.

2. అతిలోక సుందరియగు నహల్యను గాంచి, యానందించుటకై యింద్రాది దేవతలు బ్రహ్మలోకమునకు వచ్చుటను పెక్కుమంది కవులు వర్ణించిరి. వారిలో కొందఱు "అహల్యను తనకిమ్మని యింద్రుడు కోరినట్లు" తెల్పిరి. కాని యిందు మాత్రము - ఇంద్రుడహల్యపై నాశపడియు, బయట పడక విరహముతో నమరపురికిఁ జేరినట్లు వర్ణింపబడినది అంతియేగాక యింద్రాదులు వచ్చినప్పుడు అహల్య వీణానాద మొనర్చినట్లును వర్ణితము—

3. అహల్యా గౌతముల వివాహఘట్టమిందు ప్రత్యేకముగా, విపులముగా వర్ణింపబడినది. భారతీ బ్రహ్మలు కన్యాదాతలుగా నుండి యా కార్యక్రమమును నడిపిరి. అప్పగింతల వఱకును తెలుగువారి పెండ్లివేడుకలు వర్ణితములు. తక్కిన కవులీ పెండ్లివేడుకల నొక్కొక్క పద్యముతో ముగించిరి.

4. ఇంద్రుడహల్య ననుకూలనుగా జేసికొనుటకై దూతికనంపుట యీ మూడు కృతులయందును గలదు. దశావతార చరిత్రమునందు దూతిక పేరు "మనోరంజని" కృష్ణప్ప కృతియందలి దూతిక నామము "యోగిని" అహల్యా సంక్రందన విలాసమునందలి దూతికయు "మనోరంజని"యే దశావతార చరిత్రమునందును, ఇందును దూతిక పేరు "మనోరంజని"యే యైనను, అహల్యా సంక్రందన విలాసమునందలి "మనోరంజని" నిండుగా ప్రవర్తించినది.

5. అహల్యా సంక్రందన విలాసమునందలి మనోరంజని ఇంద్రుని బహుమతిగా "కల్పపల్లవ మంజరి"ని - అహల్యకు సమర్పించెను.

6. ఇంద్ర విరహవర్ణనలో వైశిష్ట్యము—

మొదటి యిరువురు కవులును దూతిక తిరిగి యింద్రునిజేరిన పిమ్మట, ఆయమరపతి విరహవేదనను పొందినట్లు వర్ణించిరి ఇందు మాత్రము దూతిక రాకకై నిరీక్షించుచు తహతహ పడుచున్న యింద్రుడు విరహవ్యథకు లోనైనట్లు వర్ణితము.

7. సరసశృంగారమూర్తిగా ఇంద్రుడహల్యను జేరెనట్లు - ఇందు కల్పింపబడినది. తక్కినవారు గౌతమమునివేషములో సురపతి యహల్యను సమీపించినట్లు చెప్పిరి. దౌత్యప్రయత్న ఫలితముగా ఇంద్రాహల్యలలో సౌముఖ్యములు కుదురుకొన్నందున దాగుడుమూతలతో పనితీరినదని, భావించి, ఈ కవి యిట్లు కల్పనచేసి యుండును. కాని రామాయణమునందు ఇంద్రుడు గౌతమాకృతితోడనే వచ్చినట్లుగ తెలుపబడినది.

8. నదీతీరమున కేగిన గౌతముడు యోగ ప్రక్రియలు నెరపినట్లు - అహల్యా సంక్రందన విలాసమునందు పేర్కొనబడినది.

9. అహల్యా విషయమున మరులుగొనిన గౌతముడు నదీతీరమున అనుష్ఠానముల నిర్వహింపకయే గృహోన్ముఖుడైనట్లు - ఇందు వర్ణితము.

యోగసాధన చేసిన వెంటనే గౌతమునిలో కామప్రవృత్తి కల్గినట్లు వర్ణించుట మాత్రము సముచితముగా కన్పట్టదు.

అనంతర గాథకు సంబంధించిన రచన ఖిలమైనది—

ముఖ్యముగా "అహల్యా సంక్రందన విలాసమునందు" ఒక విషయము గమనింపదగియున్నది.

వివాహానంతరము అహల్యాగౌతములు పరస్పరానురాగములతో దాంపత్య సుఖగోష్ఠుల నోలలాడినట్లు వివరింపబడినది. గౌతముని సుఖలౌల్యమతివేలమై

యొప్పినట్లు వర్ణింపబడినది. ఏకాంత విహారానందములతో వారు పరవసించి పోయినట్లు తెలుపబడినది.

గౌతముని (పతియొక్క) సుఖలౌల్యమతి వేలమైయున్నప్పుడు, ఆ దంపతులు ఏకాంత విహారానందములతో పరవసించి పోవుచున్నప్పుడు, దాంపత్య సుఖగోష్ఠులతో నోలలాడుచున్న యాజంటకు పరస్పరానురాగములకు కొదువలేనప్పుడు, కుటుంబ సుఖజీవనములకు కుదురుకొనిన అహల్యతో ఇంద్రాపేక్ష (పరపురుషాపేక్ష) తొంగిచూచుట లోకానుభవములకు దూరమనిపించును.

దీనికి తోడుగా నదీతీరమున స్నానానంతరము నిష్ఠానుష్ఠానములకు దిగవలసిన గౌతముడు భార్య (అహల్య)పై మరులుగొనినవాడై, నిత్యనైష్ఠిక కృత్యాలకు నామములు పెట్టి, గృహోన్ముఖుడైనట్లు వర్ణింపబడినది.

ఈ సన్నివేశములనుబట్టి గౌతముని పాత్రచిత్రణముతో కవియే శృంగార వర్ణనాలౌల్యములోబడి, యౌచిత్యావధులు దాటి, కలమును కదిపినట్లూహింప వలసియున్నది.

ఇక నహల్య తీరునుగూర్చి పరామర్శింతము. సర్వసుఖావకాశములుండి, తదనుభూతియు సమకూరుచున్న స్థితిలో నహల్యలో ఇంద్రాపేక్ష (పరపురుష సుఖవాంఛ) పొడసూపుట వాస్తవముగా ఆశ్చర్యకరమే.

కాని లోకానుభవముతో మఱికొంత సుసూక్ష్మముగా నిట పరిశీలింప వలసియున్నది.

లోకములో గర్వ హేతువులనంతములు. కొందఱిలో ధనగర్వము, మఱికొందఱిలో విద్యాగర్వము, అట్లే వేరొక కొందఱిలో రూపగర్వము నుండుట సహజము. ఆ గర్వమదెట్టిదైనను పతనహేతువేయగును.

అహల్య అతిలోక సుందరి. అట్టి తఱి ఆమెలో సౌందర్య గర్వము తలయెత్తుట అసహజము కాబోదు.

సర్వ దేవతలకును ప్రభువై, స్వర్గ రాజ్యాధిపతియైనవాడు ఇంద్రుడు;

అట్టి దేవేంద్రునియంతటి వాడు తనయందు చందాలకు ముగ్ధుడై, అఱ్ఱులు చాచినప్పుడు, తన్నుగోరివచ్చి, తన పాదాలపై బడినప్పుడు, అహల్యలో ఒకవేళ రూపగర్వము చిందులువేసి, యుండవచ్చును. మనోరంజనీ దౌత్యాదికములైన యింద్రుని యెత్తుగడలన్నియును ఒక్కుమ్మడిగా నహల్య చిత్తమును మిక్కిలి చిత్తుగావించి యుంకవచ్చును. ఫలితముగా జాఱువాటు లకు గురియై, యామె మనస్సు ఇంద్రానుకూల వేదికకు మాఱియుండ వచ్చును. మనశ్చాంచల్యము దుర్నిగ్రహముగదా!

లోకములో జాఱువాటు లన్నింటికిని గర్వాతిరేక జనితములైన క్షణికోన్మాదములే కారణములు.

ఈ విషయమున కవి సమర్థన రూపమును పూర్తిగా దర్శించుటకును, దానిపై తర్జన భర్జనలు గావించుటకును, పంచమాశ్వాసమునందలి లుప్త భాగములు లభించినప్పుడే సాధ్యము. గ్రంథము చివరి వఱకేమాత్రము ఖిలము గాకుండ పూర్తిగా లభించియున్నచో కవి యాలోచనలను విమర్శించుటకు మఱికొంత వీలుండెడిది.

ఇట్టివి యొకటి రెండంశములు ప్రక్కన బెట్టినచో మొత్తముమీద ఈ కావ్యము సహృదయులైన పాఠకులకు రసానందమును బంచియిచ్చునని గట్టిగా భావింప వచ్చును.

ఇందు అహల్యా గౌతముల మధ్య శృంగార రసము ప్రతిపాదితము. ఇంద్రాహల్యల మధ్య వ్యక్తమైనది శృంగార రసాభాసము.[1]

---

1\. i) అనౌచిత్య ప్రవృత్తత్వేత్వాభాసో రస భావయోః. సాహిత్యదర్పణము.

ii) ఏకత్రైవాను రాగశ్చేత్ తిర్యక్ మ్లేచ్ఛగతోఽపివా
యోషితో బహుసక్తిశ్చేత్, రసాభాసస్త్రిధామతః॥
ప్రతాపరుద్ర యశోభూషణము.

iii) ఉపనాయ సంస్థాయాం, ముని, గురు పత్నీ గతాయాంచ
బహునాయక విషయాయాం, రతౌ తథానుభయ నిష్ఠాయాంచ,
ప్రతినాయక నిష్ఠాయాం, తద్వదధమపాత్ర తిర్యగాదిగతే
శృంగారేఽనౌచిత్యమ్. సాహిత్యదర్పణము.

ఇంద్రుడు ముని పత్నియగు అహల్య విషయమున రతిగల్గియుండుట యనౌచిత్యముగాన ఇది శృంగార రసాభాసము.

అహల్య పర పురుషదగు (ఉపపతియగు) ఇంద్రుని యెడ ననురాగము చూపుట యనుచితముగాన నిది శృంగార రసాభాసము.

ఇంద్రునకు అహల్య పరకీయ. అహల్యకు ఇంద్రుడు పరపురుషుడు (ఉపపతి). కనుక వీరియెడ ప్రతిపాదితమైనది శృంగార రసాభాసము.

## ''సరస హృదయానురంజనము''

"సరస హృదయాను రంజనము" అనునది యొక తెనుగు ప్రబంధము దీనిని ములుగు పాపయారాధ్యకవి రచించెను. తద్రచనలలో దీనిని వేమనారాధ్య చరిత్రమున కనంతర రచనగా భావింపవచ్చును. కుమారస్వామి కల్యాణ గాధ యిందు వర్ణితము. స్కాందపురాణము నందలి స్కందుని కల్యాణ వృత్తాంతము దీనికి మూలము.1

1. లక్ష శ్లోక పరిమితమైన స్కాంద పురాణమున ఆఱు (6) సంహితలు గలవు. 1. శంకర సంహిత, 2. సూత సంహిత, 3. బ్రాహ్మ సంహిత, 4. వైష్ణవ సంహిత, 5. సనత్కుమార సంహిత, 6. సౌర సంహిత.

   అందు శంకర సంహిత 1. శివరహస్య ఖండము, 2. నాగర ఖండము - అని రెండుగా విభజింపబడినది.

   ఆ శివరహస్య ఖండము మరల 1. సంభవ కాండము 2. అసుర కాండము 3. వీరమహేంద్రకాండము 4. యుద్ధకాండము 5. దేవ కాండము, 6. దక్ష కాండము, 7. ఉపదేశ కాండము - అని యేడు కాండములుగా విభక్తము.

   అందలి దేవకాండములోని కథ యీప్రబంధ గాథకాధారము. పాపయారాధ్యున కించుక పూర్వుడైన కోడూరు వేంకటాచల కవి ఈ శివ రహస్య ఖండమును తెనుగున పూర్తిగా రచించెను.

ఈ ప్రబంధమునందైదు (5) ఆశ్వాసములు గలవు. ఇందలి గద్య పద్యముల సంఖ్య 1320 (407+236+227+206+244 = 1320)

ఈ కావ్య రచనకు కవిని ప్రోత్సహించిన వాడు పొత్తూరి కుశలవ రామ మంత్రి. వాసిరెడ్డి వేంకటాద్రి నాయని అస్థానమున ప్రధానామాత్యుడగు పొత్తూరి కాళిదాసునకు ఈ కుశలవ రామమంత్రి సోదరుడు. ఈ మంత్రి కోరికపై కవి దీనిని రచించి, యాయనకే యంకితమిచ్చెను.

ఇది వరంగల్‌లోని శైవ ప్రచారణీ ముద్రాక్షర శాలలో 1962లో ముద్రితము. దీని కనుబంధముగా ఇందు ములుగు వీరభద్రయ్య శాస్త్రిగారి "విజ్ఞప్తి"యు శతావధాని సంపన్ముడుంబ సింగరాచార్యులవారి "పీఠిక"యు ముద్రితములు.

ఈ రచనా విర్భావమున క్రింది యంశములు కారణములుగా భావించుట యుక్తమని తోచును.

ములుగు పాపయారాధ్యుల కాలమునందును, దానికించుక పూర్వకాలమునందును (1700-1850) సంస్కృతమునగల పురాణేతిహాసములఁదెనిగించుటయో, లేక వానియందలి గాధలను కొంతమేరకు గ్రహించి, వానిని ప్రబంధములుగా రచించుటయో జరుగు వచ్చినట్లు. ఆంధ్ర వాఙ్మయ చరిత్రకారుల వివరణములను బరిశీలించినచో స్పష్టము కాగలదు.

1. స్కాంద పురాణాంతర్గత సంక్షిప్తగాధకు లభించిన యీ ప్రబంధాకృతి యాకాల ప్రభావిత రచనారీతికి నొక ప్రతికృతియని భావింపవచ్చును.

2. కృతికర్త ఆరాధ్యశైవుడు. ఆతడు కృతి పతికి బంధువు. గురువు.[1] ఆయుభయులలో గల శివభావప్రీతియే యీ శివతనూజుని కల్యాణగాధాకృతికి మూలమైయుండవచ్చును.

---

1. స. హ్యా. శం. 1-23 పుట. 5

9. పాపయారాధ్యుని తన సంస్థానమున నిల్పుకొని, సమ్మానించిన వాసిరెడ్డి వేంకటాద్రి నాయనికిరువురు భార్యలు. ఈ వేంకటాద్రికి దత్తపుత్రులును, ఈ కవియెడ భక్తి శ్రద్ధాదరములు గలవారును అగు జగన్నాథబాబునకును, రామనాథ బాబునకును ఇద్దరేసి యిల్లాండ్రు. అట్టి ప్రధానామాత్యుడు కాళిదాసునకును, వాని తమ్ముడును - ఏతత్ప్రబంధమునకు కృతిపతియును - అగు కుశలవరామ మంత్రికిని - ఇద్దఱిద్దఱు పత్నులు.[1] కనుక ఇద్దఱు కన్యలను వివాహమాడిన యీశ్వరతనయుని (కుమారస్వామి) కల్యాణగాథ ఈ యందఱికి నానందదాయకమై యుండునని తలచి కవి ఈ యుదంతమునకు ప్రబంధాకృతిని నిబంధించి యుండును.

పౌరాణిక గాథలలో స్తుత్యమగు దానికి కావ్యరూపమీయఁదలచినాడు కవి. అట్టి తఱి కుశలవ రామమంత్రి యాయనను సభకాహ్వానించి, గౌరవించినాడు. సప్త సంతానములలో కావ్యముత్తమమైనదిగాన తనకొక కృతిని రచించి యిమ్మని యభ్యర్థించినాడు. అందలి వస్తువు పురాతన పుణ్య కథా సుధార్ద్రమై, మాధుర్య గుణ విలసితమై యుండవలెనని వేడుకపడినాడు.[2] కవి యందుల కానందించినాడు. పుణ్యావహ పూర్వ సత్కథను సంతరించి, దాని నపూర్వముగా నొక ప్రబంధముగా నిర్మించుటకు నిశ్చయించుకొని, సబహుమానముగా తాంబూలములను స్వీకరించినాడు.[3]

కవి ఈ కృతిని శ్రీకారముతో నారంభించెను. ఇష్టదేవతాస్తుతిలో సర్వ దేవతలను స్తుతించెను. కవి వందనమును, కుకవి నిందనమునుగావించెను. మంత్రి కోరికను, నిజామోదమును ప్రకటించెను. కృతిపతి వంశావళిని సరసముగా, సుదీర్ఘముగా వర్ణించెను[4]. మంత్రివేడుకపడగా తదాస్థాన ప్రభువుల

---

1. స. హ్వా. రం. కృతి పతివంశావళి, రాజవంశ వర్ణనము - 1-30 - 165, పుటలు 6-39.
2. స. హ్వా. రం. 1-26, 27, పుట. 6.
3. స. హ్వా. రం. 1-28, 29, పుట. 6.
4. స. హ్వా. రం. 1-30 to 34, పుటలు 6-20

వంశవర్ణనమును గూడ కావించెను.[1] షష్ఠ్యంతములను నుడివి, కావ్యోదంత మునకు గడంగెను.

## సంగ్రహముగా - ఇతివృత్తము

### ప్రథమాశ్వాసము

నైమిశారణ్యమునందు శకశౌనకాదిమునులకు సూతమహర్షి వివరించి నట్లుగా నీ వృత్తాంతము ప్రారంభింపఁబడినది.

కుమారస్వామి కన్నివిధముల కుదురై యలరారుచున్నది శాంతి పురము. బ్రహ్మాది దేవతలును, అందు పాదచారముననే మసలుచుందురు. ఒకానొక నాడు సపరివారముగ నందివాహనుడచటికే తెంచెను. గుహుడు వినమ్రుడై, యెదురేగి, తలిదండ్రులైన పార్వతీ పరమేశ్వరులను సభకు గొని వచ్చెను. శివుని వెంటనే తెంచిన లక్ష్మీనారాయణులను, వాణీ పితామహులను గౌరవించెను. తదితర దేవతాగణముల నెడ శ్రద్ధాదరములను ప్రకటించెను. కుమారస్వామి శివస్తుతి యొనర్చెను. శివుడనుగ్రహ భాషణముగావించెను. విష్ణువు, బ్రహ్మ మొదలగు దేవతలు స్కందునకు తమతమ శుభాశీషముల నందించిరి. పిదప నందఱును తమతమ నెలవుల కరిగిరి.

పిమ్మట వార్తావహులు కుమారస్వామిని దర్శించిరి. వారు నతినుతులు సలిపి, తమలోకాలోకన విశేషముల నుగ్గడించిరి. వైకుంఠపుర వైభవమును ప్రకటించిరి.

అనంతరము స్కందుడు జైత్రయాత్రకు బయల్వెడలెను. ఇంద్రాది దిక్పాలురెల్లరును విధేయులై కానుకల సమర్పించిరి. స్వర్గలోకమున సాదర ముగా బహుమతులందింపబడినవి. సత్యలోకమున లభించిన గౌరవాదరములు కొల్లలు. తరువాత నతడు విష్ణులోకమునకేగగా వైకుంఠపతి గుహునకు చక్కని మర్యాదలు సమకూర్చెను.

---

1. స. హ్యా. రం. 1-135 నుండి 265 వఱకు పుటలు 20-39.

## ద్వితీయాశ్వాసము

విష్ణు సభలో నందఱు నాసీనులైరి. ఉన్నతాసనమున కుమార స్వామి కూర్చుండెను. విష్ణుపుత్రికలగు, అమృతవల్లియు, సౌందర్యవల్లియు, తండ్రి ప్రక్కన ఆసనముల నలంకరించిరి. ఆ యిరువురి యందచందములనుగాంచి, కుమారస్వామి వారియందు మరులుగొనెను. ఆ స్కందుని గాంచిన యమృత వల్లియు, సౌందర్యవల్లియు, వలరాజు వలలకుఁ జిక్కుకొనిరి. విష్ణువు గుహునిగాంచి, సంతోషించి, యతడే తన సుతలకు తగిన వరుడని భావించెను.

విష్ణుమూర్తికి నమస్కరించి, కుమారస్వామి పయనమయ్యెను. "ఇష్టార్థ సిద్ధిరస్తు" అనుచు పలికి, విష్ణువు గుహునకు వీడ్కోలు చెప్పెను.

స్కందుడు నిజ నగరమునకుఁజేరెను. కాని యతడు విష్ణు తనయల ప్రేమ పాశములలో చిక్కుకొని, విరహార్తుడుకాసాగెను. వైకుంఠమున ఆ యమృతవల్లీ సౌందర్యవల్లులును గుహునిమరులలోఁబడి విరహవ్యధలకు లోనైరి. వారి యెడ చెలుల యోదార్పులు పనిచేయకుండెను కడకు గుహుని చిత్రరువుల నందుకొని, వాని దర్శన స్పర్శనములతో నాయిరువురును కొంత యుపశాంతిని పొందసాగిరి.

వారి చెలులలో నొకతెయగు "కలకంఠి" పరిస్థితుల గమనించి, స్కంద సంధానమునకు సన్నద్ధయై, శాంతి పురమునకు బయలుదేఱినది.

## తృతీయాశ్వాసము

ఆ నాయికా నాయకులు విరహవేదనలకు వేగిపోసాగిరి. మలయానిలముల తాకిడులకు క్రుగ్గిపోవుచుండిరి. పువ్విలుకాని నొవ్వులకు నొచ్చిపోసాగిరి. నాయికలే గాక నెచ్చెలులు సైతము కలకంఠి రాకకై దిక్కులు చూడఁజొచ్చిరి.

కలకంఠి తిన్నగా స్కందుని మందిరమును సమీపించినది. ఇంతలో నారదుడచటికి వచ్చెను. అంత నాకుమార నారదుల మాటలు వినదలచి, యామె యచట నిలిచి పోయినది. కుమార నారదులకు కుశలప్రశ్నలు నడిచినవి. ఆ భాషణములలో బయల్పడిన కుమారస్వామి తికమకను నారదుడు గుర్తించెను. తానెఱిగిన వైకుంఠ విశేషములను వెల్లడించెను. అమృతవల్లియు, సౌందర్య వల్లియు, తమ నెచ్చెలిచే ప్రేమసందేశములను గుహునకు పంపిన విషయమును దెల్పెను. ఊరట చెందియుండుమని యోదార్చెను. నారదునిమాటల కలరిన స్కందుడు, నారదుని సంపూజించి, యాయనను వీడ్కొలిపెను.

"సంధి"కిదియే యదనని భావించి, కల కంఠి స్కందుని ముందర నిలచెను ప్రొక్కులు చెల్లించెను. తన్ను గూర్చి వైకుఠవాసినిగా, వల్లీద్వయమునకు "అనుంగు చెలి"గా, పేరు "కల కంఠి"గా తెలుపు కొనెను. నాయికల ప్రణయ పరిధులను దెలిపి, వారు తనకిచ్చి పంపిన "ముక్తాహారము" నామె గుహుని కంఠమున నలంకరించెను. అందుల కతడమందానందమునందెను.

కలకంఠి మాటల నాతడు. "భవిష్యత్కల్యాణ గాథా సంసూచనోజ్జ్వల మంత్రావళి"గా తలంచెను. వల్లీద్వయ సందేశమును వినిపింపుమని కోరెను. నాయికల ప్రాణప్రియ సందేశములను కలకంఠి కమ్మగా వినిపించెను. అపుడాయనలో వెల్లివిరిసిన సంతసమున కంతులేకుండెను. అతడవ్వనితలపై తనకుగల వలపుల వాసనలను ప్రకటించి, కల్యాణ ప్రాప్తికై తన తొందరను దెలిపి, కలకంఠి పయనమున కనుమతించెను.

కలకంఠి (దూతిక)[2] వైకుంఠమును జేరి, నాయికలకు స్కందుని సౌముఖ్యములను, వానివలవంత వంతలను ప్రకటించి, గుహుడిడిన "తమ్మ

1. స. హ్య. రం. 3-163 పుట - 167.
2. త్రివిధ దూతికలలో - ఈ కలకంఠిని "నిసృష్టార్థ" దూతికగా భావింపవచ్చును. త్రివిధ దూతికలను గూర్చి, అహల్యా సంక్రందన విలాసము నందలి "మనోరంజని" యను దూతికను గూర్చి వివరింపుచు, విపుల వివరణము చేయబడినది.

దండలను" వారి మెడలలో నుంచెను. అయిరుపురు నాయికలును కలకంఠిని ప్రశంసించిరి. ఆలింగనములతో నాదరించిరి. వల్లభుడంపిన తమ్మిదండలను కన్నులకద్దుకొని, మోహమున మునింగిరి. వారియానంద జలధి తరంగములు త్రుళ్లింతలిడెను.

## నాల్గవ – ఆశ్వాసము

తనయుల వలపుల గుట్టులను గమనించిన తల్లి (లక్ష్మి) చెలులచే తన బిడ్డలను గౌరీపూజకై పిలిపించినది. వెంటనే యాతనయలు వచ్చి తల్లి యుత్సంగము నలంకరించిరి. యథావిధిగా గౌరీదేవిని పూజించిరి.

అనంతరము గౌరీదేవి కైలాసమునుండి సపరివారముగా బయల్వెడలి వైకుంఠమునకు విచ్చేసెను. విష్ణువామెకు స్వాగత మర్యాదలు నెరపి, నిజ మందిరమునకు, గొనివచ్చెను. కుశల ప్రశ్నలు ముగిసినవి. అతిథి సత్కార ములు పూర్తియైనవి.

అమృతవల్లియు, సౌందర్యవల్లియు, తన చెంత చేరగా, గౌరి వారిని తన యుత్సంగమునఁజేర్చుకొని, ఆత్మీయతతో అదరించినది. గౌరీసంకల్పము నెఱింగిన కశ్యపభరద్వాజాది మహర్షులు వైకుంఠమునకు విచ్చేసిరి. సర్వ దేవతలతో మునులతో తదితర ముఖ్యులతో వైకుంఠసభ కలకలలాడు చుండెను.

అమృతవల్లిని, సౌందర్యవల్లినీ, తన తనయుడగు కుమారస్వామికిచ్చి, పెండ్లి జరిపింపవలసినదిగా గౌరీదేవి సమయోచితముగా లక్ష్మీనారాయణుల నభ్యర్థించెను. సభాసదులందఱును గౌరీ ప్రస్తావనకు ప్రహర్ష భాషణముల గావించిరి. విష్ణుమూర్తియు, అందులకామోద ప్రమోదములను దెల్పెను. కాని లక్ష్మీదేవి మాత్రము శివసంపదను నిందించుచు, పల్కెను. శివపార్వతులతో వియ్యమందుట కామె వైముఖ్యమును బ్రకటించెను. అంత మహర్షులు శివతత్త్వ వైభవములను లక్ష్మి కెఱింగించిరి.

మునుల మాటలను విన్న శ్రీదేవి మహేశ్వరుని వైభవములను గుర్తించినది. బ్రహ్మాదుల పలుకుల పరమార్థములను గమనించినది. గౌరీశ్వరులతో వియ్యమందుట కామోదించినది. గౌరియెదుట తన సమ్మతిని ముమ్మాఱు ప్రకటించినది." "తథాస్తు" వచనములు విన్పించినవి. పెండ్లి ముహూర్తము నిశ్చితమైనది.

గౌరీదేవి తుష్టాంతరంగయై, లక్ష్మీనారాయణుల వీడ్కొని, తన వారితో కైలాసమును జేరినది. "శివ సంకల్ప సిద్ధి" విషయము నామె పరమేశ్వరున కెఱింగించినది. శంకరుడందులకు సంతసించెను. గౌరిని సంతోషపెట్టెను.

పెండ్లిపనులు ప్రారంభములైనవి. విశ్వకర్మ కైలాసపురమును సర్వాంగ సుందరముగా నలంకరించెను.

ఇంతలో శ్రియఃపతి పంపిన శుభలేఖ వచ్చినది. అందఱిలో ఆనందము పెల్లుబికినది. పార్వతి స్కందగిరికేగినది. జరిగినదంతయు వివరించినది. పెండ్లి ముహూర్తమును తెలిపినది. సిద్ధముకమ్మని పల్కినది.

కుమారస్వామి కైలాసమునకేతెంచి, తండ్రికి పాదాభివందన మాచరించి, పెండ్లికొడుకయ్యెను.

పెండ్లివారికి వైకుంఠమున స్వాగత సన్నాహములు ముగిసినవి.

## పంచమాశ్వాసము

వైకుంఠమున పెండ్లి కుమార్తెలనలంకరించిరి. పార్వతీ పరమేశ్వరులు పెండ్లికొడుకును వెంటనిడుకొని, పరివారములతో తరలి, వైకుంఠమును జేరిరి. వరపూజలాచరింపబడినవి. పెండ్లివారు విడిదల నలంకరించిరి. స్నాతక వ్రతానంతరము, వివాహమహోత్సవమతివైభవముగా జరిగినది. వధువులకును, వరునకును ఆదిదంపతుల యాశీస్సులందినవి. కుమారస్వామి వధూద్వయముతో, ఆత్మీయగణములతో శాంతిపురము చేరి, గృహప్రవేశ మహోత్సవము నొనర్చెను. ఆ దంపతులు సర్వ సుఖశాంతులతో తేజరిల్లిరి.

## పురాణ గాథ

స్కాంద పురాణాంతర్గతమగు శివ రహస్య ఖండము నందలి "దేవ కాండము"న ఈ కుమారస్వామి కల్యాణగాధ విపులముగా వర్ణింపబడినది. అమృతవల్లియే "ఇంద్రసేన", "దేవసేన" యను పేర్లతో వ్యవహరింపబడి నది. అట్లే సౌందర్యవల్లికి "లవలి" యను పేరు పేర్కొనబడినది.

## దేవకాండ కథా సంక్షిప్త రూపము

### అమృతవల్లితో పెండ్లి

ఇంద్రుని కుమార్తె ఇంద్రసేన. అమృతవల్లియు, దేవసేనయునామెయే. ఇంద్రుడామెను కుమారస్వామికిచ్చి పెండ్లి చేయదలచెను. గుహునికడ కేగి యతడు తన తనయను పెండ్లియాడుమని కోరెను. షణ్ముఖుడందుల కంగీకరించెను.

పరివారములతో స్కందుడు పెండ్లికి తరలివెళ్ళెను. సతీసమేతులై త్రిమూర్తులచటికి విచ్చేసిరి. ఇంద్రుడు కన్యాదానము నొనర్చెను. పెండ్లి వేడుకలు ముగిసవి. అమృతవల్లిని, కుమారస్వామిని (వధూవరులను) దేవతలాశీర్వదించి, యంతర్హితులైరి. కుమారస్వామి దేవసేన (అమృతవల్లి/ఇంద్రసెన)తో కొంతకాలము సుఖించి, యనంతరము, భార్యతో స్కందాద్రికిఁజేరి, సుఖముగా నుండెను.

ఈ విధముగా కుమారస్వామి ముందుగా అమృతవల్లిని పెండ్లియాడి నట్లు వర్ణింపఁబడినది.

### సౌందర్యవల్లితో వివాహము

సముద్రతీరమున "కాంచీనగరము" కలదు. ఆ నగర సమీపమున "పరిపూర్ణపురము" విలసిల్లుచున్నది. ఆ పురమున "చక్రభ్రమము" అనునొక సాలముగలదు. ఆ నగరమునకు చేరువలో "లవలీనగము" అలరారుచున్నది. దానికధిపతియొక శబరనాయకుడు.

కణ్వశాపమున విష్ణువు "శివముని"గా జన్మించెను. అలవలీవనమున ఈ శివముని తపశ్చర్య గావించుచుండెను. లక్ష్మీదేవి "హరిణి"యై జన్మించి యచ్చట విహరించుచుండెను.

తపశ్చర్యలో నున్న శివముని యాహరిణి యందచందములగాంచి, మదనాగ్ని పరితప్తుడై, దానిని తదేక దృష్టితో జూచెను. ఫలితముగా అది గర్భమును దాల్చి, లవలీకుంజ మధ్యమున నొక బాలికను గనెను. జన్మించిన శిశువు రోదింపసాగెను. అపుడచటికి విచ్చేసిన శబరనాయకుడు — ఆ బాలికం గొనిపోయి, తన భార్యకిచ్చెను. ఆ బాలిక పెఱిగి పెద్దదయ్యెను. లవలీకుంజమున పుట్టిన కారణముగా "లవలి"యనియు, అతిలోక సౌందర్యము కలిగియున్నందున "సౌందర్యవల్లి"యనియు నామెకు పేర్లేర్పడి, రూఢికెక్కెను.

లవలీ కన్య (సౌందర్యవల్లి) నిషాదుని యింట పెఱుగుచున్న సమయమున కుమారస్వామి యచటికేతెంచెను. లవలీరూప సౌభాగ్యమును గాంచి, యతడు మనోవికారములకు లోనయ్యెను. వృద్ధబ్రాహ్మణ రూపమున నా లవలీవనమున మసలుచు, లవలిచే సేవలనందెను. సమయమును గమనించి, యామెకు నిజరూపమును జూపి, యతడు తన వలపు తలపులను దెల్పెను. వారు పరస్పరాను రాగములతో కేళికారామముల విహరింప సాగిరి.

శబరనాయకుడు (ఈ శబర నాయకుడును కణ్వశప్త విష్ణ్వంశ సంభూతుడే) ఆ లవలీ - కుమార స్వాములకు పెండ్లి యొనర్చెను. త్రిమూర్తులు నితర దేవతలు నచటి కపుడు విచ్చేసి, యాశీర్వదించి, యంతర్హితులైరి. అనంతరము భిల్లుడు లవలినామె భర్తతో పంపివైచెను. ఆదంపతులు స్కందాద్రికిఁ జేరిరి. అమృతవల్లి వారికి స్వాగతము పలికెను.

అమృతవల్లియు, సౌందర్యవల్లియు, పూర్వజన్మమున విష్ణుపుత్రికలై యుండి, స్కందుని పరిణయమాడగోరి, యిట్లు జనన మందిన విషయమును ఆయుభయులకును కుమారస్వామి వివరించెను.

## కథలో - మార్పులు - చేర్పులు

పురాణ గాథలు కావ్యాకృతి దాల్చినప్పుడు కథా నిర్మాణము లందు తారతమ్యములుండుట సహజము. మిత్ర సమ్మితములైన పురాణములకును, కాంతా సమ్మితములైన కావ్యములకును గాథయొకటే యైనను, అందు తేడాలు చోటుచేసికొనుట, అనివార్య మనుట సాహసమేగా వచ్చునుగాని అవసరము మాత్రము "తప్పనిసరియే"యనుటలో పెక్కుమంది యేకీభవింతురు. కవికులతిలకుడైన కాళిదాసుచే రచితమగు "అభిజ్ఞాన శాకుంతలము"నందలి "అంగుళీయ"కాది వృత్తాంతములమూలకములేగదా! ఇట్టివే తక్కినవియును.

కాలానుగుణములైన కథాకల్పనలతో (కథల మార్పుల చేర్పులతో) పఠితల హృదయముల నాకట్టుకొనుచు సరస (రసప్రధాన) రీతిలో సాగుట సాహిత్య పరమ ప్రయోజనము. పురాణ గాథలను స్వీకరించి, తమ తమ కావ్యములకు రూపరేఖలు దిద్దిన కవులెల్లరును, ఈ బాటలో సాగినవారే!

కావున పాపయారాధ్యుని "సరస హృదయానురంజన" కథా విషయ నను-ఇదియపవాదము గాబోదు.

## కథా తారతమ్య పరిశీలనము

1. విష్ణుపుత్రికలలో నమృతవల్లి స్కందుని పరిణయమాడగోరి, యింద్రునకు కూతురై, దేవసేన పేరుతో రూఢికెక్కి గుహుని పెండ్లియాడి నట్లు పురాణగాథ. అట్లే - సౌందర్యవల్లి శివముని దృష్టిపాతమున హరిణి గర్భమునఁజేరి, లవలీ కుండమున బాలికగా జన్మించి, లవలిగా వాసికెక్కి, కుమారస్వామిని పరిణయమైనట్లు పురాణ కథనము. ఈ సరసహృదయాను రంజనమున విష్ణుపుత్రికలుగా నుండియే యా యిరువురును, కుమారస్వామిని వివాహమాడినట్లు చెప్పబడినది.

2. పురాణమున స్కందునకు ముందుగా, అమృతవల్లితో వివాహమై, ఆ పిమ్మట కాలక్రమమున సౌందర్యవల్లితో పాణిగ్రహణము జరిగినట్లు

వర్ణితమైనది. ఈ ప్రబంధమునందు నాయిరువురునేక కాలమందే గుహుని చేపట్టినట్లు చిత్రింపబడినది.

3. ఈ సందర్భముగా నీ కావ్యమునందు నారద ప్రమేయము, కల కంఠి సారథ్యము (దౌత్యము), చోటు చేసికొనినవి. ఇవి పురాణమునలేవు.

4. లవలీ (సౌందర్యవల్లీ) వివాహ విషయమున కుమారస్వామియే కృతప్రయత్నుడై, అవసరమును బట్టి వృద్ధబ్రాహ్మణ రూపమును గైకొని, లవలిచే సేవలనందుచు, ఆమెతో చనవులు మెఱసి, కడకామెను చేపట్టినట్లు పురాణమున నుడువబడినది. ఈ కావ్యమునందదిలేదు.

5. కావ్యమున నాయికా నాయకులు పరస్పరము కానుకలు పంపు కొనినట్లు వర్ణితము. ఇది పురాణమునఁ గన్పట్టదు.

6. పురాణమున స్కందుని స్వతంత్ర దైవముగా వర్ణించుట జరిగి నది. ఆ వర్ణన మచట సముచితమే. కావ్యమునందా విధముగా గాక, శివ పారమ్యము వర్ణితమై కుమారస్వామి, తల్లిదండ్రుల చాటు బిడ్డడుగా చిత్రింప బడినాడు.

7. గౌరి స్వయముగా వైకుంఠమునకు వెళ్ళి, తన కుమారునకు విష్ణు పుత్రికల నిమ్మని యడిగినట్లుగ్గడింపబడినది కావ్యమునందు. పురాణము నందు వివాహ ప్రయత్నముల విషయమున, అమృతవల్లి విషయమునందిం ద్రుడును, సౌందర్యవల్లి విషయమునందు కుమారస్వామియే చొరవచూపి, ముందునకు సాగినట్లు కథితము.

8. కావ్యమున గుహుని ముఖ్యనగరము "శాంతిపుర"మని పేర్కొన బడినది. పురాణమున "స్కందాద్రి"యని మాత్రమే చెప్పబడినది.

9. కావ్యమున కుమారస్వామి "చైత్రయాత్రలు" వర్ణితములు. పురాణ మున నవిలేవు.

10. కావ్యమున సూర్యోదయాది వర్ణనా పౌష్కల్యముగలదు. పురాణ మున నదిలేదు. ఇట్లే చిన్న సన్న విభేదములు మఱికొన్ని గలవు.

## కావ్య విమర్శ

ములుగు పాపయారాధ్యుడు దైవభక్తి విశ్వాసములు గలవాడు. కథ నెన్నుకొనుటలో గూడ - ఈ భావన యాయనను వీడదు. ఈ కావ్య పీఠికలో దీని కథా విషయమును గూర్చి ప్రస్తావించినాడు.

పురాతన, పుణ్యకథా సుధార్ద్రిమై, మధురాచ్ఛ గుణాలవాలమై, యుండు కావ్యమును రచించి, యిమ్మని, కృతిపతి కోరినట్లు కవి కృత్యవతారికలో వెల్లడించినాడు.[1] ఈ కృతిపతి కోరిక ననుసరించి, పుణ్యావహ పూర్వ సత్కథల నారసి, యపూర్వ సత్కథను రచింపబోవుచున్నట్లు-ఆయవతారికలోనే నుడువబడినది.[2]

అమృతవల్లి, సౌందర్యవల్లి విష్ణుపుత్రికలనియు, వారు కుమారస్వామిని పెండ్లాడినట్లును, పూర్వకవులెవ్వరు నీరీతి గాథను ప్రబంధముగా జెప్పి, యుండలేదు. కావుననిది యపూర్వ కథయే. ప్రసిద్ధములైన భారతీయ షణ్మతములలో "స్కాంద" మొకటిగాన - భక్తుల దృష్టిలోనిది పుణ్యావహము.

మాధుర్య గుణమునకు నీయన కవిత పెట్టినది పేరు. ఈ విషయమున ప్రతి పఠితయు తలయూపును.

ఈ కవి తనకవితనుగూర్చి యిందే - అది పాతంజల వాగ్విశుద్ధము, సరస మృదూక్తి వైభవయుతము, సత్కవిలక్షణ లక్షితము - మున్నుగా జెప్పికొనినాడు.[3] నిశిత విమర్శానికషోపలముపై నిగ్గుదేల్చినప్పుడు ఈ ప్రబంధమునందలి గుణదోషములు రెండును బహిర్గతములగును.

తర్కవ్యాకరణాది శాస్త్రములు - ఈ కవికి జిహ్వాగ్రవిలసితములైనట్లే, ప్రాచీన మహాకవుల సంస్కృతాంధ్ర రచనలన్నియును ఈయనకు కరతలామలకములు.

---

1. స.హ్వా.రం. 1-27. పుట. 6. 2. స.హ్వా.రం. 1-28. పుట. 6.
3. స. హ్వా.రం. 1-21, 24. పుట. 5.

దీనిని దృష్టిలో నుంచుకొని పరిశీలించినప్పుడు ప్రాచీన కవుల ప్రభావ మీయనపై కొట్టవచ్చినట్లుగా గన్పించును. ఇది కవియొక్క సాహిత్య బల మునకు నిదర్శనముగాన గుణావహమే.

శాంతిపుర వర్ణనము, నాయక వర్ణనము, నాయికల వర్ణనము, విప్ర లంభ శృంగార ప్రతిపాదనము, సూర్యోదయ, సూర్యాస్తమయ, చంద్రో దయాది వర్ణనములు, వసంతర్తు వర్ణనము, మున్నగువాని విషయమునందు ఈ రచనలో ప్రాచీన కవుల ముద్రలు స్పష్టముగా గోచరించుచున్నవి. వర్ణన ముల పట్టున నీ మహాకవి కవితావేశము పట్టరానిదై పొదగట్టును. సమర్థుడైన సత్కవి లక్షణమే యట్టిది.

నాయికానాయకుల మధ్య సరససారథ్య (దౌత్య)మును నెరపిన "కల కంఠి" పాత్ర చిత్రణమునందు - ఈ కవికౌశలము మిక్కిలి ప్రశంసావహమై యున్నది. ఈ ఘట్టమున వసుచరిత్రమునందలి రామరాజ భూషణుని దూతికా పాత్ర చిత్రణము కన్నులకు గట్టును. ఆ దూతిక "మంజువాణి". ఈ దూతిక "కలకంఠి." కాని యీదౌత్య విషయమున కవి చూపిన యొడుపును మెచ్చు కొంపవలసియున్నది.

కవి, దూతికయగు కలకంఠి కర్తవ్య పరాయణయై బయలుదేఱినట్లు చెప్పెను. పిదప నతడు నాయికల విరాళిని వర్ణించి, కలకంఠి రాకకై వారి నిరీక్షణను దెలిపెను. ఇంతలో కలకంఠి రానే వచ్చెను. ఈ సందర్భమున పాఠకునిలో నుత్కంఠ పెల్లుబుకును. కలకంఠి యెక్కడికి వెళ్ళినది? ఏమి సాధించి వచ్చినది?

ఆ తరువాత తన ప్రయాణ విధానమును, నారదుని ప్రమేయమును, తాను స్కందుని దర్శించిన రీతిని, మాటాడిన తీరును, ఆ నాయకుని ప్రణయ ప్రపంచ స్థితిని, కార్యసాఫల్య విశేషములను, సమగ్రముగా ఆ నాయికల ముందు యథాతథముగ ఆవిష్కరించినది దూతిక కలకంఠి.

విరహ వ్యథాదోదూయమాన మానసలైన నాయికలకు ఈ ప్రత్యక్ష చిత్రణము పట్టరాని సంతోషమును గూర్చినది. వారి విరాళికి విశ్రాంతిని చేకూర్చినది. తత్రత్యులగువార యందఱిలో ఆనందము పొందు పఱిచినది.

పాఠకుల యుత్కంఠను పొలుద్రోలి, యద్భుతావహముగా వారి హృదయములపై చెరగని చిరముద్ర వైచినది. నిజముగా కవి ఈ ఘట్టము నొక నాటక రీతిలో నడిపినాడు.

ఈ ప్రబంధమునందు చతుర్థాశ్వాసముతో దాదాపు కథ సమాప్తమైనట్లే తోచును. అంతటితో పాఠకుని హృదయము గూడ "భరత గీతాలాపము"నకు సన్నద్ధమగుచుండును. కాని కవి మాత్రము దీనినంత తేలికగా వదలలేదు.

నాయికా (వధూ) ద్వయమును పెండ్లి కుమార్తెలను జేయుట, నాయకుని పెండ్లికొడుకును జేయుట, వరపూజ, స్నాతకము, ఎదురుకోలలు, ఊరేగింపులు, వివాహమహోత్సవాలు, బువ్వంబంతులు, అప్పగింతలు మున్నగు వాని విపుల వర్ణనములతో నిర్దైదవ (నేప) యాశ్వాసమును కవి మిక్కిలి తెగసాగదీసినాడు.

అంతేగాక చూర్ణోత్సవమునుగూడ విడిచి పెట్టలేదు. అంతటితో తను ఆగలేదు. గర్భాధానమును గూడ రవ్వంతయు వదలక ప్రతి ప్రక్రియను నొక్కి నొక్కి వక్కాణించినాడు. అందునా అంతులేని విరాళినుండి బయట పడి సర్వాత్మనా సర్వవిధ సుఖములకొఱకు తహతహలాడుచున్న యిరువురు నాయికలతో ఆ యేకైక నాయకుని ఏకాంత భోగములను (సంభోగములను) ఒక్కుమ్మడిగా పట్టుబట్టి వర్ణించుట చూడ ఆ నాయికా నాయకుల కేమోగాని, పఠితలకు మాత్రము ఎబ్బెట్టుగా తోచక మానదు. ఈ యుగ సాహిత్య లక్షణమే యింతయేమో!

మీదు మిక్కిలి గర్భాధానానంతరము కథయే లేదు. దీనితో నిది ముగిసినది. ఇట్టి వానినైనను కొన్నింటిని విడిచిపెట్టినచోగాని, లేక సరసశోభితముగా క్లుప్తముగా వివరించియున్నచో గాని సముచితముగా నుండెడిదేమో యని తోచెడిని.

ఏదియేమైనను దేశకాల పరిస్థితుల కనుగుణములైన యానాటి యాచార వ్యవహారములను బట్టి యిచ్చుటకు మాత్రము ఈ యాశ్వాసవర్ణనము భద్ర భూమియైనదని మాత్రము చెప్పనగును.

## "సర్వమధురము"

పాపయారాధ్య రచితమైన "సర్వమధురము" అచ్చతెనుగు రచన. ఇది సరసహృదయాను రంజనమున కనంతర రచనమైయుండును. ఇది శాలివాహన శకము 1846 లో (క్రీ.శ. 1924 లో) వరంగల్, శైవప్రచారిణీ ముద్రాక్షర శాలలో ముద్రింపబడినది. దీనికి తాడేపల్లి వేంకటప్పయ్య శాస్త్రిగారు "ఉపోద్ఘాతము"ను వ్రాసిరి. ఈ కావ్యమును ప్రశంసించుచు శతావధాని చల్లా పిచ్చయ్యశాస్త్రిగారు వ్రాసిన పద్యములిందు ప్రకటింపబడినవి.

ఈ కావ్యము మూడు విన్నపములుగా విభజింపబడినది. అంబరీషుని కూతురగు "శ్రీమతి"ని శ్రీమహావిష్ణువు పరిణయమాడుట యిందలి యితివృత్తము. శ్రీమతి పరిణయగాథ లింగపురాణమునగలదు. దానినుండి కథను స్వీకరించి, ఈ కవి దీని నచ్చతెనుగున రచించెను. ఈ కావ్యమునితడు శ్రీశైల మల్లికార్జునస్వామి కంకితమిచ్చెను.

"అయోధ్య, శ్రీమతి, అంబరీష, నారద, పర్వత, సర్వమధురంబు" అనునాలు తత్సమ పదములను దప్ప తక్కినవాని నెల్లను - అచ్చ తెలుగు పదములనే యిందు ప్రయోగించితినని కవియే స్వయముగఁదెల్పెను,1

ఈ కావ్యము శ్రీకారముతో ప్రారంభమైనది. ఇష్టదేవతాస్తుతి చేయబడినది. సుకవిస్తుతి యొనర్పబడినది. ఇందలి గద్య పద్యముల సంఖ్య 520 (112+158+250 = 520)

కవికి కలలో విష్ణువు గన్పట్టి "శ్రీమతికిని తనకును, పెండ్లియైన కథను కబ్బముగ రచింపుమని కోరియదృశ్యమయ్యెను.2 వెన్నుని ప్రేరణ కారణముగ దీనిని తాను రచించినట్లు3 కవి పేర్కొనెను.

షష్ఠ్యంతములు ఐదు కందములతో నలరారినవి.

---

1. సర్వమధురము 1-26. పుట. 6.
2. సర్వమధురము 1-15 to 19. పుటలు. 4, 5.
3. సర్వమధురము 1-20. పుట. 5.

## కథాసంగ్రహము

### మొదటి విన్నపము

బదరికాశ్రమమునందు సూతుడు శౌనకాది మహర్షులకు దెలుపుచున్నట్లు ఈ కథ కొనసాగినది.

అయోధ్యను రాజధానిగా జేసికొని, యంబరీషుడు ప్రజా పాలనము చేయుచుండెను. ఒకానొకనాడు కొందఱు మునీశ్వరులు అంబరీషుని చెంతకు విచ్చేసిరి. అతిథి మర్యాదలతో వారినతడు గౌరవించెను. పీతరాగులైన యా మునులు "పుట్టుక యొక్క పరమార్థము"ను దెల్పిరి. విష్ణుమహిమలను వివరించిరి. హరిసేవలతో జన్మను చరితార్థము చేసికొనవలసినదిగా హితము పలికిరి. పిదప వారు వెడలిపోయిరి.

అనంతరమంబరీషుడు సంతతము విష్ణుసేవలతో గడుపసాగెను. ఊరూరను దేవాలయములను గట్టించెను. తనవలె ప్రజలను హరిభక్తులను గావించెను. తానేకాదశీవ్రతము నాచరించుచు నందఱిచే నాచరింపఁజేసెను. అనన్యమైన యంబరీషుని దైవభక్తికి మెచ్చుకొని, శ్రీమహావిష్ణువాయనకు సాక్షాత్కరించెను. చక్రమాయంబరీషున కెల్లప్పుడు తోడుగా (రక్షకముగా) నుండునట్లును, మునుల శాపములెవ్వియును ఆ రాజును తాకకుండునట్లును వరమిచ్చి, యాహరియంతర్ధానమయ్యెను. చక్రము రాజును జేరెను. దాని ముందతడు వినమ్రుడై వర్తించెను.

### రెండవ విన్నపము

అంబరీషుని కూతురగు శ్రీమతి యుక్త వయస్కురాలయ్యెను. ఆమెయు తండ్రివలె నకుంఠితమైన భక్తి విశ్వాసములతో ననవరతము వైకుంఠుని సేవించునట్టిది. అన్ని విధముల నా శ్రీమతి "ఒప్పులకుప్ప". ఆమె యందచందాలు లోకవిఖ్యాతములైనవి. పరువములనున్న రాకుమారు లందఱు నేదోయొక నెపమున నచటికి వచ్చి, యామెను జూచి, యానందింపఁ

సాగిరి. కడకు జడదారులు సైతమామెనుగాంచి యానందించుటకై, యటకు వచ్చి పోవుచుండిరి.

రాను రాను ఆమె తనలోగల విష్ణుభక్తిని పతిభక్తిగా మార్చుకొనుట కారాటపడసాగెను. తదాశయ సిద్ధికై యామె యహరహము తహతహపడ జొచ్చెను. ఆమె యీ విరాళి వర్ణనాతీతమయ్యెను.

కూతురు వయో వైభవములను గమనించిన యంబరీషుడు "శ్రీమతి" స్వయంవర వార్తను నలుదిశల చాటఁబంచెను. వరాన్వేషణకై యన్ని దిక్కులకు చారులను బంపించెను. స్వయంవర వార్త వినినదే తడవుగ రాకుమారులందఱును అయోధ్యకు చేరుకొనసాగిరి. అదను గమనించి నారదుడును, పర్వతుడను మునియును. శ్రీమతిని సతిగా పొందఁగోరి, యచటికి విచ్చేసిరి. అందఱి సందడితో నయోధ్య కోలహలముల నలరారెను.

చల్లకు వచ్చి ముంత దాచుట యెందులకని భావించిన నారదుడు శ్రీమతిని తనకిచ్చి పెండ్లి చేయుమని యంబరీషునితో పల్కెను. పర్వతము నియునట్లే కోరెను. మునుల యభిలాషలకంబరీషుడు చకితుడయ్యెను. ఆ యిరువురిలో శ్రీమతి యెవరిని వరించునో వారికామెనిచ్చి, వివాహము జరిపింతుననీ యతడనెను. రాజు సమాధానమునకానిరాటారులు నిశ్చేష్టులైరి. స్వయంవర కార్యక్రమము మఱునాటికి మాఱెను.

అయోమయావస్థకు లోనైన యామునీశ్వరులు మాధవానుగ్రహముతో తమ మనోరథముల నీడేర్చుకొనదలఁచి, వైకుంఠమునకేగిరి. దామోదరుని దర్శించిరి. నతినుతులు సలిపిరి. శ్రీమతిని పెండ్లాడు విషయమున పర్వత ముని తన కడ్డుగానున్నాడనియు, కనుక శ్రీమతికి పర్వతుని ముఖము కోతి ముఖముగా గన్పట్టునట్లు చేయుమనియు నారదుడేకాంతముగా నావైకుంఠుని వేడుకొనెను. ఆ శ్రియఃపతి నారదుని కోర్కెకు సమ్మతించెను. పర్వత మునియు విడిగా నా నారాయణునిదరిఁజేరి, విషయమును వివరించి, శ్రీమతికి నారదుని ముఖము కొండముచ్చు ముఖముగాఁగనఁబడునట్టు గావింపుమని యర్థించెను. ఆ జగన్నాథుడందులకును అంగీకరించెను.

మునుల వింత ధోరణులకా హరి లోలోన నవ్వుకొనెను.

## మూడవ విన్నపము

మునులకు మాట యిచ్చిన యంబరీషుడు "శ్రీమతి" స్వయంవరము ముని ద్వయమునకు మాత్రమే పరిమితమైనట్లు, రాజకుమార లోకమునకు వెల్లడించెను. వచ్చిన రాజన్యులలో కొందఱావార్త విని, వెడలిపోయిరి. మఱి కొందఱు పెండ్లి వింతలను దర్శింపగోరి యచటనే నిలిచిపోయిరి

శ్రీమతికి వచ్చిన ఈ చిక్కు విడదీయరాని దయ్యెను. మునుల కోరిక కామె ముక్కుమీద వ్రేలువేసికొను చుండెను. తండ్రిమాట జవదాటలేకుండెను. ఆ మాధవుడు తన్ను చేపట్టునని నమ్ముచుండెను తదాగమనమునకై యెదురు తెన్నులు చూచుచు సలసిపోవుచుండెను.

స్వయం వరవేదిక సిద్ధమైనది. ముని ద్వయమాసనముల నలంకరించెను. ముఖ్యులందఱు నచ్చట చేరిరి. శ్రీమతి సర్వాలంకృతయై యచటికిఁ గొనిరాబడెను. అందఱి ముఖములలో నాసంచమునకు మాఱుగా నాందోళన ములే ప్రస్ఫుటములయ్యెను తమలో నామె యెవరికి దక్కునోయని మునుల భయము. మునికి సతి యగుట తప్పదాయని శ్రీమతి చింత. ఈ పరిస్థితుతే స్థితికి దారితీయునోయని తల్లిదండ్రుల తొట్రుపాటు.

దైవముపై భారముంచి, ధైర్యముతో శ్రీమతి ముందడుగు వేసినది మునుల ముఖములఁ జూచినది. ఆ కోతి, కొండముచ్చుల ముఖములను గాంచి భయవిహ్వలయైనది. చిత్త విభ్రాంతితో దిక్కుతోచక ఒక్క పరుగున తన గదికి చేరి, స్పృహతప్పి పడిపోయినది. తనోదార్చ వచ్చిన తండ్రికి నిజాను భూతిని చెప్పినది.

తండ్రియోదార్పుతో నామె యెట్టకేలకు మఱల "దండ"ను చేతబట్టి సన్నద్ధయైనది. ఈ పర్యాయమా యిరువురు మునుల మధ్య ముకుందుని సుందరమూర్తిని దర్శించినది. విష్ణుమాయా విలాసములను బ్రస్తుతించినది. తన చేతులలోనున్న దండను వాని మెడలో వేసినది. ఆయనకై దండనర్ప్యర్థించినది. ఆమె మనోరథము సిద్ధించినది.

అగ్రహోదగ్రులైన మునులంబరీషుని జ్ఞానము నశించునట్లుగా శపించిరి. అతడు వారియడుగులపైబడి క్షమింప వేడుకొనెను. ఆ యభ్యర్థనను మన్నింపకయే వారు వెడలి పోయిరి. విష్ణువర ప్రభావమున ఆ శాపమంబరీషునంటకపోగా, ఆ విష్ణుచక్రమా జడదారులను వెంటాడ జొచ్చెను.

శ్రీమతి యర్పించిన దండతో విష్ణువు ప్రత్యక్షమై, శ్రీమతియెడ తనకుగల ప్రేమానురాగముల నంబరీషునకు ప్రకటించి, పెండ్లివేడుకలు జరిపింపుమనెను. అందఱి వదనములలో నానందము చిందులు వేసెను. సంప్రదాయబద్ధముగా వివిధ కోలాహలములతో నా శ్రీమతీవిష్ణుల వివాహమతి వైభవముగా జరిగెను.

శ్రీమతిని చెట్టబట్టి, పీతాంబరుడు నిజనివాసమున కరిగెను. సుదర్శనము వెంటాడుచుండగా నా పెను మంటలకు తాళలేక మునులిద్దఱును మాధవుని మఱుగుఁజొచ్చిరి. తమ దొసఁగుల మన్నింపుమనిరి. తమ్ముకాపాడుమని వేడుకొనిరి. ఆ కమలాక్షుడు వారిని కరుణించి, మన్నించి, బుద్ధిచెప్పి, పంపినాడు.

శ్రీమతి సిరుల నలరుచు నా శ్రియఃపతి తన కృపాకటాక్షములతో లోక కల్యాణముల ననుగ్రహించినాడు. సర్వమధురమును ప్రసాదించినాడు.

## కావ్య విమర్శ

అచ్చతెనుగు కావ్యమను మాట విన్నంతనే యందలి గద్య పద్యములు సులభముగా నర్థము కావని భావించుట సర్వసాధారణముగా పాఠకలోకమున పరిపాటి. నిజముగా నది నిరాధారమైన విమర్శయేమాత్రమును గాదు.

కొంతమంది కవులు నిత్యజన వ్యవహారములో నాలుకలపై నాని నాని, లోకప్రసిద్ధములైన యచ్చ తెనుగు పదములను విడిచిపెట్టి, కేవలమనువాద ప్రాయములుగా, వికృతులుగా నున్న మూలగొట్టు పదములను తమ యచ్చ తెలుగు రచనలలో ప్రయోగించుచుందురు. అవి వ్యాకరణ నియమముల

ననుసరించుచునే యుండవచ్చును. భాషాదోషములు లేనివియే కావచ్చును. కాని యవి తెలుగువారి నాలుకలపై నలిగి నలిగి, వారి గుండెలలో బాగుగా మాగినవి మాత్రము కావనుట ముమ్మాటికి సత్యము.

ప్రతిపదముయొక్క యర్థము కొఱకును నిఘంటువులు చూచుకొనవలసిన దుస్థితి యెదురైనచో నిక నాకావ్యమును జదువుట కెంతమంది యుత్సాహము చూపుదురు? జనుల వాడుకలో సుపరిచితములైన యచ్చతెలుగు పదములకు కొదువలేదు. కవి, పాఠకులను దృష్టిలో బెట్టుకుని తదేకదృష్టితో రచించినప్పుడే యిది సాధ్యము.

ఈ దృష్టితో జూచినచో పాపయారాధ్యుడు సహృదయులైన పఠితల నాడిని కనిపెట్టి, "సర్వ మధురము"ను రచించినట్లు భావింపవచ్చును.

ఈ రచనకు పూనుకొనినప్పుడే ఈకవి పంచదారకంటెను తియ్యగను, వెన్నకంటెను మెత్తగను, ఉండు తెలుగు పదములను ప్రయోగించుటకు నిర్ణయించు కొనినట్లు తానే యుగ్గడించెను.[1] దీనినిబట్టియే ఈ కవి "సరస రచనా రీతి"కి నెంత ప్రాధాన్యమును జూపెనో విదితము కాగలదు. కవి చెప్పికొనుటయే గాదు దీనిని చదివిన ప్రతి పాఠకునకును ఇందలి సరససారళ్య పద ప్రయోగ రీతులు తేటతెల్లము కాగలవు.

లోకసామాన్య ధోరణితో పరిశీలించినప్పుడిదియును ప్రాచీన ప్రబంధముల రీతిలో మూసపోసిన విధముగా నడిచినట్లు గన్పించును. కాని లోతుల నరయుచు బోయినచో నిందలి సరసమాధుర్య వచో విలాసములు పఠితల గుండెలలో గుడికట్టుకొనును.

ఇందు కృత్యాదిలో, ఇష్టదేవతాస్తుతులు, సుకవిస్తుతి, కుకవినింద, కలలో దైవము దర్శనమిచ్చి, కావ్యమును రచింపుమని కోరుట, షష్ఠ్యంతములు మున్నగునవి యథా విధిగ కొనసాగినవి.

---

1. నీనుడి పంచదార పొడి, నీ పలుకుంజవి వెన్నకన్న మిన్నై నిను గోరి నారము..........సర్వ మధురము 1-19. పుట. 5.

కథాప్రారంభమున- అయోధ్యాపుర వర్ణనము, చాతుర్వర్ణ్యములవారి వర్ణనము, కమ్మతెమ్మెరల కదలికలు, పురస్త్రీల సొబగులు, కొలంకుల శోభలు, తోటల సీటులు, చతురంగ బలముల ప్రాబల్యాలు, అంగళ్ళలో పడుచువారి కోలాహలాలు, వెలనెలతల వలపులు, కల్లరులలేములు, దేవాలయముల వైభవములు, అంబరీషుని ఔన్నత్యాలు – ఒకటేమిటి? అన్నియును వడివడిగా, విడివిడిగా విడువక వర్ణింపబడినవి.

మునులయోధ్యకు రాగా నంబరీషుడు ఎదురేగి వారిని దీసికొని వచ్చి, యతిథి సత్కారములు నెఱపెను.

అప్పటను కవి, ఆ మునుల రాకకు పరమ ప్రయోజనమును కల్పన మొనర్చినాడు.1 పుట్టుక యొక్క పరమార్థమును, దైవ (హరి) భక్తి విలసిత జీవన ప్రాముఖ్యమును, ఏకాదశీ వ్రతమహిమలను, ఇంతంబరీషునిమిషతో లోకమునకుపదేశించుటగా భావింపనగును. విష్ణు భక్త్యుత్సాహముతో నంబరీషు డొనర్చిన ఘనకార్యములు వర్ణితములు.

ఇక్కడ ప్రత్యేకముగా గమనింపదగిన విషయమొకటి గలదు.

అంబరీషుడు ఏకాదశీవ్రతమును తానాచరించుచు, ప్రజలచే ఆచరింప జేయుటమేగాక పశువులును దానిని పాటించునట్లు చేయుట విశేషము.2

ఈ సందర్భమున భగవద్భక్తి ప్రశంస చేయుచు, భక్తునిపుట్టుకయే పుట్టుక (సార్థకము) గాని తక్కినవాని పుట్టుక తల్లి లావణ్యమును భంగపఱచుట కేయని, విష్ణు ముఖమునఁజెప్పించినాడు 3 ఇది భర్తృహరి వైరాగ్య శతక శ్లోకమును స్మరింపఁజేయుచున్నది.4

---

1. న.చ 1–66 నుండి 83 వఱకు.
2. "పసులంగు దత్తడు లెకిరింత లెద్దులు క్రేపులాపులు మొదల్ పెనలిడ్డయైన కసవు మేయఁమిగాదు కలనైన ముట్టవు. న.చ. 1.90.
3. పుట్టువు లెన్నియైన తలపన్ నను జేర్చిన వాని పుట్టువే పుట్టువు, గానిచోఁబుడమిఁబుట్టుట తల్లికిఁబ్రాయబూదఁగాఁ బుట్టుట... — సర్వమధురము-1.98-పుట.22.
4. నధ్యాతం పదమీశ్వరస్య విధివత్ సంసార విచ్ఛిత్తయే మాతుః కేవలమేవ యౌవన వనచ్ఛేదే కుఠారా వయమ్॥

శ్రీమతి విష్ణుమూర్తిని భర్తగాగోరి, విరహవేదన పడుట రెండవ విన్నపమునందును (2-20 to 45) మూడవ విన్నపము నందును (మొత్తము రెండు సార్లు) వర్ణింపబడినది. రెండింటను వైవిధ్యముగలదు. మొదటి విరాళి యందు విష్ణుని యనుగ్రహమునకు పాత్రురాలగుటకై, ఆడుట, పాడుట, గుడికి వెళ్ళి పూజించుట, తదేక స్మరణతో ప్రొద్దులు పుచ్చుట వంటివి శ్రీమతి యొనర్చినట్లు వర్ణితములు. ఈ విరాళి వర్ణింపబడిన తీరు మిక్కిలి మనోహరము.1

మూడవ విన్నపమునందలి విరాళిలో నాయిక యొక్క ప్రౌఢత్వము కొంత (భావమున ముదురు పాకము) గోచరించుచున్నది.

పోతన భాగవతమున రుక్మిణి శ్రీకృష్ణుని కడకు అగ్నిద్యోతను డను బ్రాహ్మణుని పంపిన పిమ్మట, ఆమె పడిన వేదనతో నిచటి శ్రీమతి విరహవేదన పోల్చదగియున్నది. ఇచటి శ్రీమతి

- స, న్నెపగదియించి, యేలుకొనవేనియు బుట్టువులెన్నియేని నె
  త్తెదఁదుదకీవె పర్గుడగఁదిర్చెద నోర్చెద మిఁదియాసలన్॥
  
  అని పలికెను. (3-33 పుట. 68)

ఈ శ్రీమతి పల్కులు - పోతన భాగవతమునందలి రుక్మిణి పల్కిన

- నూఱు జన్మంబులన్, నినుఁజింతించుచుఁబ్రాణముల్ విడిచెదన్
  
  నిక్కంబు-అను పల్కులను - స్ఫురింపజేయుచున్నవి.

స్వయంవర వార్త విని యన్నిదిక్కులనున్న రాజకుమారు లెల్లరను అయోధ్యకు వచ్చిన తీరు వర్ణించుచు, దానిని కవి చక్కగ చమత్కరించినాడు. ఈ వార్త వినిన పిమ్మట రాకుమారులలో కామవికారములు పెల్లుబికినవి. వారిని కిర్తోల పెంచినవి. అతికమునకలకు తట్టుకొనలేక వారు వచ్చిరేగాని వాస్తవముగా వారికా మయుందదు. కొమ్మకొనలనున్న పండ్లు పొట్టివారికి నందనట్లు - అతిలోక సౌందర్యమున నిరులొలుకు శ్రీమతి యా పురుషోత్త

---

1 సర్వమధురము. 2-45. పుట. 37.

మున (అత్యున్నతున)కే దప్ప, పొట్టివారగు (అత్యల్పులగు) ఈ రాజన్యుల కామె యెట్లు దక్కును?[1] — అని.

అభినవ కాళిదాసుని యీచమత్కృతి కాళిదాస మహాకవి రఘువంశమును వర్ణింపబోవుచు చెప్పిన రీతిని ప్రతిబింబించుచున్నది[2]

విరాళిగొన్న శ్రీమతి యొక్క విన్నబాటు దనమును వర్ణించు పట్టున కవి జోడించిన లోకానుభవము కడుశ్లాఘ్యము. లోకములో కోరికలందఱికిని కలుగుచుండుట సహజము. సంపన్నుల కోరికలు దీరుచుండుటయు, పేదల కోరికలు వారిలోనే మ్రగ్గిపోవుచుండుటయు జగమెఱిగినదే. ఇది లోకజ్ఞుల మాట.[3] ఈ మాటను శ్రీమతినోట కవి సమయస్ఫూర్తితోఁ బలికించినాడు.

* పేదతలంపులట్లు మదిఁబెట్టిన నాదు తలంపు లెల్ల వ

మ్మైదఱిఁబట్టకుండునొకొ? — అని, కవి యింతటితో నాగిపోక గాఢమైన భక్తి సత్ఫల సంధాయియే సుమా! అని చెప్పి, ఆమె యాశలకు ఆయువు నింపుచు—

...........మాటలికేటికి నెట్లులైనఁదా

సాదుల పాలి పెద్దగని సామియ నా పలుకేల చెల్లదీ

పైదలిపైఁదలిర్చు తమి పట్టుగ నిల్పకయేల మానెడిన్—? అని

యామెలో దిటవు గూర్చినాడు (స. మ. 3-14)

మునుల(పెండ్లి) గోలకారణముగ స్వయంవర సందర్భమున సభలో నున్నవారికాందోళన మేర్పడెను. కవి దానిని వర్ణించు నందు పాఠకులుగూడ పాలుపంచుకొనునట్లు చక్కని మనోవిశ్లేషణము గావించినాడు.

---

1. కదలివచ్చిరిపుడ మినల్గడలనెల్ల, యెడలఁగాపున్న రాకూనలడలఁజేయు వెడవిలుతు దెబ్బపోటులఁబడయులేక, కొమ్మకొనపండ్లు గోరిన గుజ్జులట్లు. స.మ. 25. P. 38..
2. ప్రాంశులభ్యేఫలేలోభాదుద్బాహురివ వామనః, రఘువంశము 1.3. పుట. 3.
3. ఉత్పద్యన్తే విలీయన్తే దరిద్రాణాం మనోరథాః॥ నీతి శాస్త్రము.

విష్ణుమాయా విలాసములవలన నెట్టకేలకు స్వయంవరము శుభాంత మైనది. ఆందోళనము లాగిపోయినవి. శ్రీమహావిష్ణువు శ్రీమతిని చెట్టబట్టినాడు!

కావ్య పరమ ప్రయోజనములైన "ఆనందోపదేశములు" ఇందు సమకూరినవనియే భావింపవచ్చును.

సరస రచనారీతులచే, సముచిత పద ప్రయోగకౌశలములచే, సందర్భోచితములైన శబ్దార్థాలంకార శోభలచే, మనోజ్ఞ కల్పనల కూర్పులచే, శృంగార రస ప్రధానముగా రూపుదిద్దుకొనిన యీ కావ్యము "అమందానందమును" అందించుచునే యున్నది.

జన్మ సార్థకమొనర్చు కొనుటకై యత్నింపవలయునని హితము పలుకుట. భాగవత సేవలు పరమ పురుషార్థ హేతువులని చాటిచెప్పుట, నియమ వ్రతాచరణములు దీనికి మూలములని విప్పిచెప్పుట, ధర్మములను తామాచరించుచు లోకమునకు వానిని బోధింపవలయునని తెల్లమొనర్చుట, జడదారులను సైతము ముప్పుతిప్పలు పెట్టు మన్మథలీలలను కట్టెదుట నిలిపి కనువిప్పు కలిగించుట మున్నగునవి యిందలి యుపదేశములు.

ఈ విధముగా "ఆనందోపదేశములకు" కుదురైన యీ "సర్వ మధురము" పేరునకు తగినట్లుగా నిజముగా "సర్వమధురమే."

## సర్వమధుర – రచనా రీతులు

ఈ సర్వమధుమునందు ఉత్పలమాలాది ప్రసిద్ధ వృత్తములేగాక మాలినీ, భుజంగ ప్రయాతము వంటి విశేష వృత్తములును విరచింపబడినవి. గద్యములల్లబడినవి. దండకము కూర్పబడినది. లయవిభాతులు విరాజితములైనవి. ఇందలి గద్య పద్యములనవద్యములు. హృద్యములు. శబ్దార్థాలంకారములు సందర్భోచితములై కావ్యశోభా కారకములై విలసిల్లుచున్నవి.

ఈ కవి పద్యములను రమణీయముగా రచించుట సాధారణ విషయము, ఇందీతడు గద్యమును, దండకమును కూడ సరసరీతిలో సంతరించినాడు.

ఇందలి గద్యములు అలతియలతి పదములతో రసస్ఫోరకములై యొప్పుచు పఠితలచే చదివించును. "గద్యం కవీనాం నికషం వదన్తి" అను నార్యోక్తికివి చక్కని వ్యాఖ్యానములు పలుకును.

ఈ కవి తన ప్రతిప్రబంధంబునందును సామాన్యముగా నొక దండకమును రచించుచుండును. ఇందు రెండవ విన్నపమున (2-126) ఒక దండకము గలదు. అచ్చ తెనుగులో వ్రాయబడిన యిందలి దండకము సరళ మధురముగా సాగినది.

నారద పర్వతమునులు శ్రీమన్నారాయణుని దర్శించి, నమస్కరించి, ఈ దండకములో నా స్వామిని స్తుతించిరి.

ఇందు దశావతారముల[1] స్తుతింపుట జరిగినది.

ఈ దండకము తగణాదిగా ప్రారంభమై పూర్తిగా తగణములతో నడచి, గురుద్వయాంతముగా ముగిసినది. ఇట్టి దండకమును "కామబాణము"[2] అను పేరుతో శాస్త్రజ్ఞులు వ్యవహరించిరి.

## దేవీ భాగవతము

ములుగు పాపయారాధ్యులచే రచితములైన యాంధ్రకృతులలో ఈ దేవీభాగవతమును చివరి రచనగా భావింప వచ్చును.

---

1. మత్స్యః కూర్మవరాహశ్చ నారసింహశ్చ వామనః
రామో రామశ్చ రామశ్చ కృష్ణః కల్కిర్దేవచ॥ అను పాఠము ననుసరించి యిందు దశావతారములు పేర్కొనబడెను—

2. తాః గౌ "కామబాణః" అనియత సంఖ్యాక తగణములపై గురుద్వయము ముండుట "కామబాణ" దండక లక్షణము.

హేమచంద్రుని "ఛందోఽనుశాసనము"— 2.399.

ఇది పాటిబండ మాధవశర్మగారి "ఆంధ్రమహాభారతము - ఛందశ్శిల్పము" నుండి గ్రహింపబడినది.

అమరావతి సంస్థాన ప్రభువగు వాసిరెడ్డి వేంకటాద్రినాయని యిరువురు దత్త పుత్త్రులలో నొకడగు జగన్నాథ భూపాలుడు ఈ రచనకు ప్రత్యక్ష ప్రేరకుడు.[1] స్వప్నమున తనకు అన్నపూర్ణా విశ్వేశ్వరులు దర్శనమిచ్చి "దేవీభాగవతము"ను తెనుగున ప్రబంధముగా రచించి, తమకంకితమిమ్మని కోరినట్లు కవి చెప్పెను.[2] "శ్రవణ పఠనంబుల ముక్తి విధాయకంబగుకృతి"ని రచింప వలెనని కవి స్వయముగనే సంకల్పించి యుంచగా, ఆయనకు ఈ భూపతి పశుపతులనుండియు ప్రేరణములు తోడైనవి.

నిత్య ప్రవచనములచే పురాణేతిహాస కథా సుధాసేవనముల నానానం దించుచు శ్రోతల నానందింపజేసిన పరమ పౌరాణికుడు ములుగు పాపయా రాధ్యుడు.[3] కావున జగన్నాథ బాబు కోరిన రీతిగా, కవి దేవీభాగవతమును "శోధించి"[4] తెలుగు ప్రబంధాకృతిలో దానిని సాధించినాడు. ప్రతిపాదిత వస్తు స్వరూప స్వభావముల ననుసరించి దీనిని పురాణముగనే భావింపవలసి యున్నది. రచనా రీతులను బట్టి, యిదియొక ప్రౌఢ ప్రబంధముగా పేర్కొన దగియున్నది.

ప్రథమ స్కంధమున శ్రీకారముతో ప్రారంభమైన పద్యమున "దేవీ భాగవతము ఆగమ రహస్య విమల ప్రాగల్భ్య విలసితము" అని కవి తెలిపి నాడు. పిదప నంబాప్రార్థనతో నారంభమై, తొమ్మిది పద్యములు వివిధ దేవ తాస్తుతులతో విలసిల్లినవి. ఈ దైవస్తుతులలో హరిహరాది భేదములకు తావు లేని యుదాత్త స్థితి యుప్పినది.

సుకవిస్తుతి, కుకవినింద, ముగిసిన పిమ్మట కవి తనరచనా సంకల్ప మును వెల్లడించినాడు. అనంతరము కృతి ప్రేరకుడైన జగన్నాథనృపతి యొక్క వంశోదంతము సుమారు ఎనుబదియైదు (౮౫) పద్యములలో వర్ణిత

---

1. దేవీభాగవతము,1-109 పుట.16.
2. దే.భా 1-111. పుట. 16
3. దేవీ భాగవతము. 1-12. పుట.3.
4. దే.భా. 1-110. పుట. 16.

మైనది. పిమ్మట కృతి ప్రేరకుని పలుకులు, స్వప్న వృత్తాంతములు, అలరారినవి. కదకు షష్ఠ్యంతముల తరువాత కథా ప్రారంభమైనది.

## మహాపురాణము

భగవంతునకు "పురాణ పురుషుడు" అను నామ ప్రసిద్ధి గలదు. భగవంతునికంటె ఆద్యుడైన (పురాతనుడైన) పురుషుడు మఱియొకడు లేడు గనుక ఆయనకాపేరు రూఢమైనది. ఆయర్థరీతిని స్వీకరించినచో పురాణమనగా అతి ప్రాచీనమైనదను నర్థము సిద్ధమగును.

వేదము లత్యంత ప్రాచీనములు. అట్టి వేద విజ్ఞాన విశేషములిందు సుప్రతిష్ఠితములై యున్నందున వీనికి "పురాణములు" అని వ్యవహార ప్రసిద్ధి యేర్పడినది,[1] అని నారద, స్కాందముల కథనము. వేద విజ్ఞానము పురాణేతిహాసములయందు లెస్సగా చెప్పబడి నందున వానికా పేర్లు రూఢములైనట్లు భారతము నుడువుచున్నది.[2]

సర్గము (ప్రపంచోత్పత్తి) ప్రతిసర్గము (బ్రహ్మాదులు చేసెడియుత్పత్తి) వంశము (దేవాసురాది విభిన్న వంశములు) మన్వంతరములు (వేఱు వేఱు మనువుల తరములు) వంశాను చరితము (సూర్య చంద్ర వంశముల చరిత్రము) అనునైదు లక్షములు గలది - పురాణము అని యమరము వివరించుచున్నది.[3]

---

1. i) వేదాః ప్రతిష్ఠితా స్సర్వే పురాణే ష్వేవ సర్వదా
 ii) వేదాః ప్రతిష్ఠితా స్సర్వే పురాణే నాఽత్ర సంశయ.॥
 నారద, స్కాంద పురాణములు. పురాణవాఙ్మయము. పుట. 1.
2. ఇతిహాస పురాణాభ్యాం వేదం సముపబృంహయేత్ - భారతము.
 పురాణవాఙ్మయము. పుట. 1.
3. సర్గశ్చ, ప్రతి సర్గశ్చ, వంశో, మన్వంత రాణిచ,
 వంశాను చరితం చేతి పురాణం పంచలక్షణం॥
 అమరకోశము గురుబాల ప్రబోధిక పుట. 127.

"పురా అపి నవం పురాణం" అనువ్యుత్పత్తినిబట్టి, రచన ప్రాచీనమైనదే యైనను, అందలి విషయవైశిష్ట్యమును బట్టి, అది యెప్పటికప్పుడు నూతనమై కన్పట్టుచుండుననియు, అందుచే దానికా పేరు స్థిరపడినట్లును పండితులు పేర్కొనుచుండుట ప్రసిద్ధము.

మహాపురాణములలో నొకటియగు భవిష్య పురాణము - ఇకముందు జరుగబోవు విషయములను గూడ చెప్పుచున్నది. దీనిని బట్టియో యేమో అమరుడు పురా(ణము) అనగా భూత, భవిష్యద్వర్తమాన విషయములను తెల్పునదియని పేర్కొనెను.1

మహాపురాణములనియు, ఉపపురాణములనియు, ఈ పురాణములు రెండు విధములుగా నుగ్గడింపబడినవి. మహాపురాణములు పదునెనిమిది. (18) యని దేవీభాగవతము తెలుపుచున్నది.2 అట్లే - ఉప పురాణములును పదునెనిమిదియే యని పెక్కు పురాణములు పేర్కొనుచున్నను, తత్తన్నామముల యెడ వానిలో వానికేకీభావము లేదు.

అష్టాదశ పురాణములలో పేర్కొనబడిన భాగవత పురాణమనగా "దేవీభాగవతమే" యని కొందఱును (కొన్ని పురాణములును) విష్ణుపరమైన కథలుగల భాగవతమేయని మఱికొందఱును, (కొన్ని పురాణములును) పేర్కొనుట జరిగినది.

ఆ యా పురాణములలో ఆ యా కథలను జెప్పిన వక్తల ప్రాధాన్యమును బట్టియు, శ్రోతల ప్రాముఖ్యము ననుసరించియు, తత్తత్పురాణములలో ప్రతిపాదితములైన ముఖ్య దేవతా చరిత్రముల కారణముననును ఆయా పురాణ నామము లాయా పేర్లతో ప్రసిద్ధములైనట్లు భావింపడుచున్నది.

---

1. స్యాత్ ప్రబంధేచిరాతీతే నికటాగమికే పురా.

అమ. గురు. బాల. ప్రు. పుట. 860.

2. మద్వయం, భద్వయం చైవ, బ్రత్రయం, వచతుష్టయం,

అ, నా, ప, లిం, గ, కూ, స్కాని, పురాణానిపృథక్ పృథక్.

దేవీభాగవతము 1-3-2.

కొన్ని పురాణములు (మత్స్య, పద్మ, ఆదిత్యాది పురాణములు)ను, కొన్ని యామళము (తంత్రము)లును, దేవీభాగవతమే మహాపురాణమని నుడువుచున్నవి. దుర్గాదేవీ మహిమా వృత్తాంతములు ఇందు ప్రధానముగ, ప్రముఖముగ ఉగ్గడింప బడియున్నందునను, ప్రతిపాదిత వస్తుప్రాధాన్యము ననుసరించియు, దీనికి "దేవి భాగవతము" అను పేరు ప్రఖ్యాతమైనది.

సంస్కృతమున దేవీభాగవతము పండ్రెండు స్కంధములుగా విభక్త మైనది. ఈ పురాణమునందలి మొత్తమధ్యాయముల సంఖ్య (318) మూడు వందల పదునెనిమిది. ఇది పంచలక్షణ లక్షితము అనుచు స్కంధముల వారీగా గల యధ్యాయముల సంఖ్యను గూర్చియు పాపయారాధ్యుడు వివరించెను.1 ఇందు (మహా) పురాణముల, ఉప పురాణముల నామములును, ఆయా (మహా) పురాణముల యందు గల శ్లోకముల సంఖ్యలును తెలుపఁ బడినవి.2 సంస్కృత దేవీ భాగవతానుసారిగా నిదియు ద్వాదశ స్కంధ విలసితమే. దేవీభాగవతమునకు "బ్రహ్మవిద్య" యనియు నామాంతరము.

## పురాణముల వైశిష్ట్యము

వేదధర్మము భారతీయ సంస్కృతికి మూలకందము, దానిని లోకమున సుప్రతిష్ఠిత మొనర్చుటకు ఏర్పడిన రచనా సాధనములు పురాణములు, అవి చతుర్విధ పురుషార్థ (ధర్మార్థ కామమోక్ష) ఫలములను లోకమున కందించుటకై మిత్ర సమ్మితములుగా సారస్వతమూర్తులను సంతరించుకొనిన సంహితా స్వరూపములు.

ప్రతి పురాణము ఒక మహా శిల్పసాగరము. పవిధ విజ్ఞాన వాహినుల సంగమక్షేత్రమది. అందు నానావిధ గాథాతరంగము లెప్పటికప్పుడు నిత్య నూతనములై యుబరారుచునేయుండును. దరిఁజేరి దర్శించు వారికవి నయనా

1. దేవీభాగవతము. 1-158, 159 పుటలు 22, 23.
2. దేవీభాగవతము. 1-173, 174, 175, 176.

నందముల సందించును. ఒడుపు చూపి, చొరవ చేసికొని, దిగి, మున్కలిడు వారి కవి ఆత్మానందములను సమకూర్చుచుండును. పురాణగాథా తరంగ ఘీలల విలాసము లట్టివి.

ఈ పురాణ పయోనిధులను నేర్పుతో ఓర్పుతో మథించు వారికి నంత మృత లాభములకు కొదువయుండదు. లోతుల నరయక సద్యఃఫలములకై తొందరపడు వారికందు విషప్రాయములైన వస్తు స్వరూపములు గోచరించు చుండుటయు తటస్థించును. అట్టి తఱి వానిని పండిత పరమేశ్వరార్పణము గావించి, తదనుగ్రహ లాభముల నానందించుటయే వారి కర్తవ్యము.

పురాణములుత్తమ సాహిత్య గౌరవము లందుటతోపాటు తదితర కావ్య ప్రక్రియలకును వస్తు దానమును, అర్థ దానమును, జ్ఞానభిక్షను ఒసఁగి పోషించు చున్నవి.1 పురాణము సర్వ సాహిత్య ప్రక్రియలకును మాతృభూమి. పురాణ పురుషుని (భగవంతుని) నుండి బ్రహ్మాండ మెట్లుద్భవించు చున్నదో యట్లే పురాణమునుండి సర్వవాఙ్మయ జగత్తు నావిర్భవించుచున్నదని నారద పురాణము నుడువుచున్నది.2

శ్రుతిస్మృతులయందు కానరాని వివిధ ధర్మాంశములను పురాణములు బోధించు చున్నవని నారదపురాణ కథనము.3

సంస్కృత పురాణ వైభవ ప్రాభవ ప్రాముఖ్యములకు ముగ్ధులై పాశ్చాత్యులు సైతము ముక్తకంఠముతో వానిని ప్రశంసించిరి, అందులకు భారతీయ

---

1. పురాణ వాఙ్మయము డా॥ జి.వి. సుబ్రహ్మణ్యంగారు. పుట.11.
2. పురాణ పురుషాజ్జాతం యథేదం జగదద్భుతం
తథేదం వాఙ్మయం జాతం పురాణేభ్యో నసంశయః॥
నారదపురాణము. పురాణవాఙ్మయము. పుట.11
3. యన్నదృష్టం హివేదేషు తత్సర్వం లక్ష్యతే స్మృతౌ
ఉభయోర్యన్న దృష్టంహి తత్పురాణైః ప్రతీయతే॥
నారదపురాణము, పురాణవాఙ్మయము. పుట. 11.

మత సాహిత్య సమీక్ష" అను గ్రంథమున Farqular పలికిన పలుకులు ప్రబల నిదర్శనములు.

ఈ ప్రసిద్ధి కారణముగ పురాణ రచనము, పురాణ ప్రవచనము పురాణ పఠన - శ్రవణములు భారతీయ సంస్కృతిలో నొక ప్రముఖ భాగమై పోయినవి.1 తెనుఁగున వెలసిన వాఙ్మయమున పెద్ద భాగము వివిధ పురాణములచే ప్రభావితమైనట్టిదే.

సమగ్రముగనో, సంగ్రహముగనో, యథాతథముగనో, ఏక భాగముగనో, ప్రత్యక్షముగనో పరోక్షముగనో స్థూలముగనో, సూక్ష్మముగనో పురాణ ప్రభావమునకు గురికాని రచన తెనుగు సాహిత్యమున దాదాపు లేదనియే చెప్ప నొప్పును.

## పాపయారాధ్యుల - దేవీభాగవతము

ఇది సంస్కృత దేవీభాగవతమునకు తెలుగున వెలసిన తొలి యనువాద గ్రంథము. దేవీ భాగవతానువాదకులలో త్రిపురాన తమ్మయగారు రెండవవారు. వీరి గ్రంథమముద్రితము. మూఁడవ వారు తిరుపతి వేంకట కవులు. దాసు శ్రీరామ కవిగారు నాల్గవవారు. ఈయుభయుల గ్రంథములును ముద్రితములే. ఈయనువాదకులలో ములుగు పాపయారాధ్య డాద్యుడు. ఈ విషయమును శతావధానులు శ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు తమ యుపోద్ఘాతముల్లో దెల్పిరి.

భాషాంతరీకరణమను నది నిజముగా నొక యసాధారణ విషయము. రెండు భాషలపైనను కవికి గట్టి యధికారమున్నప్పుడే యది సాధ్యము. ఒక స్వతంత్ర రచన చేయుటకు కవి తానొక్క భాషలో కుశలుడై యున్న చాలును. అనువాద రచనమునకది చాలదు. ఉభయ భాషలలో పరిజ్ఞాన ముండియే తీరవలయును. ఇంతియగాదు. ఆరెండు భాసలలోను పాండిత్యము లున్నంత మాత్రమునను సరిపోదు. రచనా రాసిక్యములను వెలువరింపదగినంతగా, ఆ భాషాద్వయమునందలి తీరు తీయములును ఆ కవికి కరతలామలకముల్లై యుండవలెను.

వాస్తవముగా ననువాదరచనమొక ప్రత్యేకకళ. అదియొక యసిధారా వ్రతము. మూలమునగల ముద్దుమురిపెములను- అంతేయందముగ అనువాదమున నందించుటకు కవి ఓర్పునేర్పులను సమర్థముగ సంతరించుకొని యుండవలెను. నిజమునకది యొక సుకృత పరిపాకలాభ విశేషము.

పాపయారాధ్యుడు పెక్కు శాస్త్రములను పుక్కిటబట్టినవాడు. ఆంధ్ర గీర్వాణభాషలలో అందెవేసిన చేయి. నిత్య గోష్ఠి నిర్వహణములచేతను, సంతతపఠన ప్రవచనముల వలనను వివిధ పురాణ విశేషములను లోతుగా నరసి, తద్విజ్ఞానమును తన హృదయమున పదిలపఱచుకొనినవాడు 1 అంతే గాక యనుదిన శివపూజలతో ఆ పరమశివుని కృపకు పాత్రుడైనవాడు. మీదు మిక్కిలి దేవ్యుపాసకుడు.

కవి దైవభక్తి విశ్వాసములు గల్గియుండి, దేవ్యుపాసకుడైనప్పుడే "దేవీ భాగవత రచనకు" పూనుకొనుట యుపయుక్తమని శ్రీ చెళ్ళపిళ్ళవారభిప్రాయపడిరి.2

పాపయారాధ్యునిలోగల పై శుభలక్షణములన్నియును దెలుగున దేవీ భాగవతమును వెలయించుటకాయనకు మిక్కిలి తోడ్పడినవి.

పురాణ సత్కథాసతత సమావృతంబగు ప్రశస్త పవిత్ర చరిత్రమును రసవద్రచన కావింప సంకల్పించినాడు కవి. అది దురితభంజకమై, తమోనివృత్తిని గూర్చునదై యుండవలెనని భావించినాడు. అంతేగాక అది, ఆకల్పాంత యశఃప్రకాశకమై, ఆనందసంధాయి కావలెననుకొన్నాడు. కలము పట్టినాడు. ఇంతలో భూపతి, పార్వతీపతులనుండి "దేవీభాగవత రచనకై" ప్రేరణలందినవి. ఫలితముగా - రః దేవీభాగవతము - ఆంధ్రమున నవతరించినది.

1. దేవీభాగవతము 1-109. పుటలు. 3,16.
2. ,, ఉపోద్ఘాతము. పుట. 4,

తన దేవీభాగవతమునందు పురాణపంచలక్షణములు పరిఢవిల్లుచున్నట్లు కవి తానే స్వయముగ తెలిపెను.1

సాత్త్విక రాజస తామసరూపములలో ఆమహాదేవియావిర్భవించిన సందర్భమంతయు "సర్గము" అనియు, సృష్టి, స్థితి, లయముల నిమిత్తమై జరిగిన బ్రహ్మ విష్ణు మహేశ్వరుల యవతారములు "ప్రతిసర్గము" అనియును, రవి శశి వంశముల రమ్యతర కీర్తనము "వంశము" అనియు, దేవదానవుల వృత్తాంతములు "వంశానుకీర్తనము" అనియు, స్వాయంభువాదుల యుదంతములు "మన్వంతరము" అనియు- కవి తన సమన్వయ రీతులను నుడివెను.

"వంశము", "వంశానుచరితము"ల సమన్వయాదికములలో చిన్న సన్న తేడాలున్నను, పురాణ ప్రసిద్ధములైన పంచలక్షణములిందు విల్లసిల్లుచున్నట్లు భావింపవచ్చును.

హయగ్రీవ బ్రహ్మవిద్యయు, వృత్రవధయు, గాయత్రి యుపాసనాదిక ప్రతిపాదనము, కావింపబడియున్నందున నీ దేవీభాగవతము మహాపురాణలక్షణ విలసితమగుచున్నది.

"దేవీ మధికృత్య కృతమిదమ్ భాగవతమ్" "దేవీభాగవతమ్" అని పండిత వివరణము. దేవీమహిమాదిక పారమ్యప్రాథమ్యములు బహుధా ఉగ్గడింపబడియున్నందున ఇది - "దేవీభాగవతము".

ఈ నామకరణమునుబట్టియే ఈ చరాచర జగత్తునకు సర్వాధిష్ఠాన దైవము- ఆ "పరాశక్తియే" (పరాదేవియే) యనియు, శక్తిహీనమైనదేదియును

1. దేవీభాగవతము 1-161, 162. పుట. 23.

2.* హయగ్రీవ బ్రహ్మవిద్యా యత్రవృత్ర వధస్తథా
గాయత్ర్యాచసమారంభః తద్వైభాగవతం విదుః
దేవీభాగవత పీఠికలో 7వ పుటలో నిదియొక పురాణాన్తర వచనముగా పేర్కొనబడినది. దీనియాధారమున- అందు దేవీభాగవతముయొక్క మహాపురాణస్థితి సమర్థింపబడినది.

దేనికిని సమర్థము కారనియును, సందర్భానుసారముగా నితివృత్తముల యాధారముతో పేర్కొనుచు, శాక్తమహిమలను, దేవీతత్త్వమును - ఈ దేవీ భాగవతము పలువిధముల ప్రతిపాదించుచున్నది.

## వస్తు వివరణము

ప్రథమ స్కంధము : ఇందు హయగ్రీవావతార ఘట్టము, శుకవృత్తాంతము, ప్రముఖముగా చోటుచేసికొనినవి. ముఖ్యముగా నిందలి శుకవృత్తాంతము లోకమునకు మహోపకారకమై యలరారుచున్నది.

ద్వితీయ స్కంధము : ఈ స్కంధమున సత్యవతీ జననము మొదలుకొని జనమేజయుని సర్పయాగము వఱకుగల భారతగాథ సవిస్తరముగా వర్ణింపబడినది. ఇందు భీష్మప్రతిజ్ఞా పాలనమొక ప్రత్యేకతను సంతరించుకొని యున్నది.

తృతీయ స్కంధము : శ్రీ సీతారాముల వృత్తాంతములిందు వర్ణితములు. ఇనను నిర్గుణ సగుణాత్మకమైన సృష్టిరహస్య వర్ణనముల ప్రాధాన్యమిందు గమనింపదగినది.

చతుర్థ స్కంధము : ఇందు బలరామకృష్ణ గాథలును, శుక్రుని యుదంతములును, గలవు. కృష్ణుడు తపమొనర్చి, దేవియనుగ్రహమున వరములు వడయుటతో నిది ముగియును.

పంచమ స్కంధము : ఆ పరాశక్తియొక్క లీలలకును, హేలలకును ఇది విహారభూమి. మహిషాసుర మర్దనము మొదలుకొని, శుంభ నిశుంభుల సంహారముల వఱకు ఇది నడచినది. దేవీ పారమ్యమిందు విశ్వరూపము దాల్చెను.

షష్ఠ స్కంధము : వృత్రాసుర వృత్తాంతము, నారదోదంతము మున్నగునవి యిందు వివరింపబడినవి.

సప్తమ స్కంధము : ఇందు సూర్యవంశగాథ ప్రముఖముగా వర్ణితము. హరిశ్చంద్ర, విశ్వామిత్రుల కథలు ప్రస్తావింపబడినవి.

అష్టమ స్కంధము : యజ్ఞవరాహావతారము, స్వాయంభువ మనువు గాథ పాతాళలోకాది వర్ణనము- ఇందు కావింపబడినవి.

నవమ స్కంధము : ఇది ప్రకృతిలక్షణ వివేచనముతో ప్రారంభమై, రాధా గాథాదికముల వివరించి, సుయజ్ఞుని యుదంతముతో నిధనమగినును. ఇందు రాధాదేవి గాథ ప్రకృష్టమైనది.

దశమ స్కంధము : ఇందు వింధ్య వృత్తాంతము, చతుర్దశమను చరిత్రములు ప్రధానములైనవి.

ఏకాదశ స్కంధము : ధర్మస్వరూప నిర్ణయాదికముతో నిది మొదలై సంధ్యోపాసనాదికములనుదెల్పి, ఉత్తమ ధర్మప్రతిపాదనముతో నిది సమాప్తమగును.

ద్వాదశ స్కంధము : గాయత్రీదేవి యుపాసనాది ప్రముఖ విషయములకు ఇది భద్రభూమి

స్థాలీపులాక న్యాయమున సాగినప్పుడు - ఇందు గోచరమగు వస్తుస్వరూపమిది.

ఇనను మధ్యమధ్య కాలధర్మములు, పుణ్యతీర్థములు బ్రహ్మచర్యాది చతుర్విధాశ్రమముల వైశిష్ట్యములు, సృష్టి పరిజ్ఞానము, కర్మత్రయ నిరూపణము, కర్మఫలము, గురుబోధలు, శక్తి తత్త్వములు, భూగోళ వివరణము, సాలగ్రామ ప్రభావము, ధర్మస్వరూప నిర్ణయము, ఉత్తమ ధర్మములు మొదలగునవి సందర్భానుసారముగ వివరింపబడినవి.

## దేవీతత్త్వము

దేవ-శబ్దమునకు స్త్రీ ప్రత్యయము చేర్పగా నేర్పడిన రూపము దేవి. దేవశబ్దమునకు "స్వయం ప్రకాశమానుడు" అని యర్థము. అట్లే దేవీశబ్దము

నకును "స్వయం ప్రకాశమాన" అనియే యర్థము. ఈ రెండు శబ్దముల యొక్కయర్థము స్వయంప్రకాశమానత్వ రూపమేయైనను శబ్దగతమైన పుంలింగము పుంరూపమును, శబ్దగమైన స్త్రీ లింగము స్త్రీ రూపమును స్ఫురింపజేయును. యథార్థమునకు స్వయంప్రకాశమైన యాతత్త్వము లింగాతీతము. అది స్త్రీ రూపముగాని, పురుష రూపముగాని గాదు. అట్లని నపుంసక రూపము గూడ కాదు. అది లింగాతీతము.

అట్టి బ్రహ్మము "ఉపాసకులను" అనుగ్రహింపగోరి, స్త్రీ పుంరూపములను పొందినది. శివుడు, విష్ణువు, సూర్యుడు, గణేశుడు, స్కందుడు మొదలగు వారు పుంరూపమును దాల్చిన బ్రహ్మస్వరూపులు. పార్వతి, లక్ష్మి, సరస్వతి, మొదలగు స్త్రీ మూర్తులు స్త్రీ రూపమును ధరించిన బ్రహ్మ స్వరూపములే.

లోకమున పురుషరూప దేవతలకున్న ప్రాధాన్యము స్త్రీరూప దేవతలకు లేదు. మనుష్య సంసారమున పురుషప్రాధాన్యము దేవ సంసారమునను ప్రవర్తిల్లి యుండుటచే పురుష దేవతలకున్న ప్రాముఖ్యము స్త్రీ దేవతలకు రాలేదు. స్త్రీ దేవతలు పురుష దేవతలకు అంగభావమునే భజించిరి. అంగిభావమును భజించలేదు. దీనికిగల మఱియొక కారణము నిట్లు భావింపవలసియున్నది.

ఈ సంసారము జడ చేతనాన్యోఽన్య + అధ్యాసవలన కలిగినది. చైతన్యము సంసార విముక్తిరూపము. జడము సంసారబంధ రూపము. కావున బంధ విముక్తిని గోరువారు జడప్రకృతి ప్రతీకలగు స్త్రీ దేవతలను ఉపాసించుటవలన ముక్తిని పొందలేరనియు, సంసార విముక్తిరూప పురుషదేవతల యనుగ్రహముల వలననే సంసార నివృత్తి కలుగుననియు భావించిరి. ఇట్లు భావించుటచే పురుషదేవతోపాసనమే మోక్షసాధనమన్న భావమేర్పడి, అది లోకమున రూఢమైనది. స్త్రీ దేవతోపాసనము మోక్షసాధనము కాదేమోయన్న భ్రమగూడ అంతగానే పాదుకొని పోయినది.

బ్రహ్మము జ్ఞానస్వరూపము. "బ్రహ్మవేత్త బ్రహ్మమేయగును." అనునది యద్వైత సిద్ధాన్తము. అట్లే బ్రహ్మము సత్యము. జగత్తు మిథ్యయనియు

ఆ సిద్ధాంతము చాటినది. జగత్తు మాయామయము. మాయ యనునది స్త్రీలింగము. ఇది బంధహేతువు. కావున మాయామయులైన మూర్తులలో స్త్రీమూర్తిని ఉపాసించుటయన్న సామాన్యులు భయపడుదురు. భగవద్గీతయందు "మామేవ యే ప్రపద్యన్తే మాయామేతాంతరన్తితే" అను వాక్యము పురుష మూర్తి యుపాసనమే మాయాతరణ కారణమను భావమును స్థూలముగా గల్గించినది.

యథార్థమునకు "సగుణ బ్రహ్మమే" అనగా మాయా శబల బ్రహ్మమే సృష్ట్యాదుల నొనర్చును. తదుపాసనము మోక్షసాధనములలో మిక్కిలి ఉపాదేయము. అందువలననే కేవలము పురుషోపాసనమును గాక, పార్వతీ సహిత పరమేశ్వరుడు, లక్ష్మీసహిత నారాయణుడు, సీతాసహిత రాముడు, రాధా సహిత కృష్ణుడు ఉపాస్యులైనారు. మాయికిని. మాయకును ఉన్న సంబంధ మవినాభావమైనప్పుడు పైశబ్దములకు విపరీతముగా పరమేశ్వర సహిత పార్వతి, నారాయణ సహిత లక్ష్మి, రామసహిత సీత, కృష్ణసహిత రాధ మోక్షఫల సాధికలే యగుటలో విప్రతిపత్తి యుండరాదు.

మఱియును స్రష్టృత్వము, రక్షకత్వము జగన్మాతాపితరులకు సమానమేయైనను "పుత్త్రిసదృశులైన సంసారులకు తండ్రికంటె తల్లి కరుణామయి. శీఘ్ర దుఃఖ విముక్తికారిణి" అనుట సర్వలోకానుభవ సిద్ధమేయైనను స్త్రీ మాతృ- ఉపాసనము భక్తులలో నధికముగా కానరాకుండుట విస్మయజనకమై విలసిల్లుచున్నది.

ఇట్టి వైచిత్రి లోకమున వ్యాపించుట చూచి, లోకకల్యాణ కాంక్షగల వ్యాసుడు పురుషదేవతా ప్రధానములైన పెక్కు పురాణములను వ్రాసియు తృప్తిపడలేక, శ్రీ దేవీకటాక్ష ప్రభావములను, దేవి ప్రాధాన్యమును వివరింప జాలని తనయపార పాండితీ ప్రాగల్భ్యములకు నివ్వెఱపాటుతో నొచ్చుకొని, పశ్చాత్తప్తుడై, తనయపరాధములను దూరమొనర్చుకొనుటకై కథకు దేవీ భాగవతమును రచించెనని ప్రాజ్ఞులు విశ్వసింతురు.

దేవీతత్త్వమును బోధించు శాక్తేయమున శివపారమ్యము విస్మరింపబడ లేదు. శైవమునగల పంచకృత్యపరాయణత్వము- అనగా సృష్టి స్థితి, లయ, బంధ, మోక్షములనొనర్చుట, శాక్తేయమునందును గ్రహింపబడినది.

శాక్తేయమున దేవి జీవస్వరూపిణిగను భావింపబడును. జీవస్వరూపిణిగా ఆమె యుపాసకురాలు. శివస్వరూపముగా నామె యుపాస్య. కావున దేవీ భిన్నముగా నేదియు లేదనుట పరసు సిద్ధాన్తము.

"చేతనః" అను శబ్దము పుంలింగమున శివస్వరూప చైతన్యమును బోధించునట్లు, "చేతనా" అను స్త్రీలింగ శబ్దము శివా (దేవీ)స్వరూప చైతన్యమును బోధించును. ఈ యుభయబోధలలో నిస్త్రైగుణ్యము, మాయాతీతత్వము, జగదధిష్ఠానత్వము, మొదలగు బ్రహ్మధర్మముల (లక్షణముల) విషయమున పరమసామ్యమే గోచరించును.

విష్ణువు వైకుంఠ నగరవాసి. వైకుంఠ నగరము శ్వేతద్వీపమున గలదు. పాలసముద్రమునందలి ముత్తెములు ప్రోగుపడి, యాద్వీపమేర్పడెను. దానిని శ్వేతద్వీపమందురు.

శివుడు కైలాసవాసి. కైలాసము వెండికొండ. కావున వైకుంఠము (ముత్యములకుప్ప)కంటె, కైలాసము (వెండికొండ) విశిష్టమైనదిగా భావింపబడుచున్నది.

శ్రీమాత (దేవి) శ్రీపురవాసి. అది మణిద్వీపమున గలదు. ఆ మణిద్వీపము అమృత సముద్రమధ్యమున నున్నది. కావున పాలసముద్రముకన్న అమృత సముద్రము గొప్పది. శ్వేతద్వీప, కైలాసములకంటెను బహువర్ణచ్ఛటులుగల మణిద్వీపము సుందరతమమని యూహింపబడుచున్నది.

పైగా శ్రీదేవి సుమేరు (మేలిమిబంగరు) పర్వత శృంగమధ్యస్థ— శివుడు కైలాసవాసి. వెండికొండకంటె బంగారుకొండ గొప్పది గదా!

ఈ విధముగా జూచినచో వైష్ణవ శైవపారమ్యములకంటె దేవీపారమ్యము- అత్యుత్కృష్టణీయమని తేలుచున్నది.

## వస్తు ప్రశస్తి

దేవీభాగవతమునందలి ప్రతి స్కంధము- ఒక్కొక్క ప్రబంధ ప్రమాణములో అలరారుచున్నది. ఈ కవిచే రచితములైన పెక్కు రచనల మధ్య

యిట్టి బృహద్గ్రంథమును గూర్చి పూర్తిగా గాదు సరికదా యేకభాగమును గూర్చి యైనను సమగ్రముగా సమీక్షించుటకిందు చోటు చాలదు. అందువలన ఒక ఘట్టమునుగూర్చి యథావకాశముగా చర్చించు ప్రయత్నమునుజేయుదును.

పురాణ గాథలన్నియు లౌకికజీవన విధానములకు దూరముగా నుండు ననియు, అవిలోక వృత్తములను ప్రతిబింబింపజేయవనియు పెక్కుమంది భావించుట కలదు. కాని శ్రద్ధాదరముల బరపి యరసినచోనందు, కొన్ని లౌకికానుభూతులకు- అద్దముపట్టు సందర్భములును గన్పట్టుచుండును. మచ్చునకు శుకుని వృత్తాంతమును గమనింతము.

వ్యాసమహర్షికి అయోనిజుడై లభించిన కుమారుడు శుకుడు. అంగిరసునికడ నిగమాగమములను, సాంగరహస్యముగ వివిధ మంత్రములను నేర్చి, యతడు మతస్మృతివాదములందు పారంగతుడయ్యెను. సర్వవిద్యా విలసితుడై, జగన్మంగళమూర్తిగా నతడు తండ్రికడ కేతెంచెను.

తన దఱిఁజేరిన తనయుని వయోవైభవములనుగాంచి, గార్హస్థ్యధర్మమును స్వీకరింపుమని, వ్యాసుడు కొడుకుతో (శుకునితో)ననెను. మోక్షాపేక్షతో అలౌకిక పథముపై దృష్టిని ప్రసరింపఁజేయుచున్న శుకుడు తండ్రిమాటల కామోదింపలేకపోయెను.

సర్వ ధర్మములకును కుదురైన గార్హస్థ్యమును కాదనుట యెవ్వరికిని తగదని వ్యాసుడు నొక్కిచెప్పెను.

శుకుడందులకు విముఖత చూపెను. అయోనిజుడైనతనకు యోనిప్రాప్తి వలదనెను. ఆత్మ సుఖము ఏడి, యసంగ సుఖములను తాను కోరననెను. సంసార పంకమున దిగజాలననెను. దారపైనాస పడినచో తపము సాగదనెను. కనుక తనకు పెండ్లి వలదనెను.

శుకుని మనస్సును మరల్చుటకై వ్యాసుడింకను ఇట్లు పల్కెను..

తనువు సంసార మగ్నమైనను, మనసు వైరాగ్య విలసితము కావచ్చును. ధర్మాచరణము తోడనే యర్థార్జన మొనర్చి యారెండింటి పరిధులకు

లోబడియే కామానుభవముల నొందవచ్చును. ఋణత్రయ (దేవర్షిపితృ-ఋణ) విముక్తికి గార్హస్థ్యము నవలంబించుట విధ్యుక్తము. చతుర్విధ పురుషార్థ సిద్ధికిది రాజమార్గము. చతురాశ్రమములలో మధ్యనున్న గార్హస్థ్యమును కాదని తురీయమునకు త్వర పడినచో భంగపాటులు వాటిల్ల వచ్చును.

కోమలులెదురైనచో కొమ్ములుదిరిగిన వారే వారినుండి తప్పించుకొన లేక పోయిరి. మేనక తన యెదుట నిలిచినంతనే విశ్వామిత్రుడు తన తపోవిధులకు దండము పెట్టి, ఆమెనాదరించి, శకుంతల జన్మకు కారకుడయ్యెను. తక్కినవారి మాట నటుండనిమ్ము. ఇక తాతపాదులు పరాశరుల మాట యేమిటి? దాశ పుత్రిక కాశపడి, యామె యాశలు పండించిన వాడేగదా! యతడు.

ఏనియన్నింటికంటెను పెండ్లియగుట మేలు. గార్హస్థ్యము ఆశ్రమ రాజము. కావున దానిని స్వీకరింపుము. అని.

తండ్రియగు వ్యాసుడెంత చెప్పినను శుకుడు తన యాశయములను వీడలేక, ఆలోచనలను మార్చుకొనలేక యాయనతో నిట్లనెను.

పెండ్లియనినంతనే కాంతాచింత. ఆకాంతా పరిస్పర్శతో అర్థచింత. సంతానచింత. ఈ కాంతార్థ సంతానచింతాపరంపరలో పడినవాడు దైవ చింతకు దూరమగును.

ఈ కామినీ మాయావాగురలకు గురియైనవారికి దుఃఖములే తప్ప సుఖములు సున్న. శ్రీవాణీ గిరిజలను తమ వక్షోముఖాంగముల మోయుచు ఆయాస పడుచున్న యా త్రిమూర్తుయాత్రియిచట స్మరింపదగియున్నది. అనుచు శుకుని దీర్ఘోపన్యాసమనంత ముఖముల సాగినది.1

ఇక వ్యాసుడు చేయునది లేక తన కుమారుని (శుకుని) జనక మహారాజుకడకు వెళ్ళుమనెను. ఆయనతో భాషించి యాయన చెప్పినట్లుచేయుమనెను.

1. అనంతముఖముల = పెక్కు విధముల, ఆధ్యాత్మిక (వైరాగ్య) మార్గముల.

పిత్రాదేశముతో శుకుడు మిథిలకు చేరెను. అతిప్రయాసములతో నద్వారం కులనధిగమించి, అతడు జనకమహారాజును దర్శింపఁగల్గెను. శుకుడు తమ పితాపుత్రులవాద వివాదముల సారాంశమును జనకునకు వినిపించెను. తనకు సంశయనివృత్తి గావింపుమనెను.

అంత జనకుడిట్లు వచించెను. ద్విజుడుపనీతుడై, వేదాది విద్యలనునేర్చి, గృహస్థాశ్రమమును స్వీకరించి, న్యాయవర్తనుడై, సిద్ధ్యసిద్ధులయెడ సమచిత్తుండై, నిరాశుండై, గతకల్మషుండై, సత్యజీవనమును కొనసాగించుచు వంశమునుద్ధరింపవలెను. క్రమపరిపాకమున వానప్రస్థతురీయాశ్రమములఁ జేపట్టవలెను. "ఆశ్రమాదాశ్రమంగచ్ఛేత్" అనునది శిష్టానుశాసనము. ఇదియే యుత్తమ మార్గము.

చెట్టుపై వరుండినవానికి చేటురావచ్చును. నేలను ఉవశించినవానికి పతనభయములేదు మొదట (త్వరపడి) సన్న్యసించి, మూఢుడై చెడినచో నతడు భ్రష్టుడగును. పిపీలికాఫలలాభ న్యాయమవలంబనీయముగాని, విహంగ ఫలన్యాయముగాదు.1_ అని.

జనకుని మాటలు విని, మఱల తనకుగల పెక్కు సందేహములను శుకుడు ప్రకటించెను. జనకుడు వానినన్నింటిని దొలగించెను. కడకు "నిరహంకారముతో, నిర్మమత్వముతోనున్న గృహస్థునకు భవ బాధలంటవు" అన్న జనకుల మాటకు తృప్తిపడి, శుకుడు ఆ జనక మహారాజును వీడ్కొని తండ్రినిజేరి (పీవరి యనుకన్యను జేపట్టి) గృహస్థుడయ్యెను.

ప్రథమ స్కంధమున ఈ ఘట్టము సుమారు రెండు వందల (200) గద్య పద్యములలో నిండాఱినది. అనంత విజ్ఞానానుభవ సంపదల కావాసము

1. పిపీలికా ఫల లాభన్యాయము :-
చీమ క్రమముగా చెట్టునకు ప్రాకి, ఫలమునుజేరి, దానిననుభవించుట.
విహంగ ఫల న్యాయము :-
పక్షియాకాశగమనముతో చెట్టుకొననున్న ఫలస్థలమున వ్రాలి దానిననుభవించుట.

వ్యాసుడు. వివిధ విద్యా విశారదుడై, పరువాల కలిమికి నెలవయ్యును మోక్షా పేక్షతోనున్న యువకుడు శుకుడు. విద్యా వైదుష్యాలలో వారు సమస్కంధులు. కాని వయస్సులలో, అనుభవాలలో వారి మధ్యగల యంతరము వారి దృక్ప థములను వేఱు చేసినది.

ఈ సన్నివేశ సందర్భములన్నియును ముఖ్యముగా వ్యాస శుకులకును కొంతవఱకు జనక మహారాజునకును సంబంధించినవిగా గన్పట్టవచ్చును. కాని యీ సన్నివేశ దర్పణమున తదేక దీక్షతో దృష్టిని ప్రసరింపజేసినచో లోకము యొక్క నిజానుభవ ప్రతిబింబములే యిందు దర్శనమిచ్చును.

లోకమున గల తండ్రులకు ప్రతినిధి వ్యాసుడు. పుత్త్రులకు ప్రతీక శుకుడు. పర్యవసానమున సర్వధర్మ సమన్వయ సమవర్తి ప్రాతినిధ్యము జనకునిది.

తరముల యంతరముల కారణముగ ప్రతి గృహము కూడ వివాహాది ఘట్టములయందు అనంత చర్చలకు ఆవాస భూమియే. విభిన్న ధోరణులకు వికాస వేదికయే.

ప్రతి తండ్రియు తన విజ్ఞానానుభవ సంపదల నన్నింటిని వెచ్చించి, కొడుకులను సుగమ సుఖ మార్గముల మఱల్చుట కారాటపడుచుండును. ప్రతి సుతుడును లోకానుభవములకు దూరముగా ఆదర్శ ప్రేరితుడై, ఊహాలోక ముల విహరించుచు పెద్దల సుద్దులకు తలయూప లేక పోవుచునే యుండును. సన్నగా మొదలైన యీ చర్చల సెలయేఱులు సాగి సాగి, అపార ఘర్షణ జలధుల యాకృతి దాల్చును. కడకు దానినుండి బయటపడి, దరిఁజేరుటకు సమధికృతుల సహకారములే యాలంబనము లగుచుండును. లోకవృత్త ప్రవృత్తియేయింత.

లోకమున సాధారణముగా తండ్రియెంత వాదయ్యును విభిన్న దృక్ప థములకు లోనైన కొడుకును ఒప్పింప లేక పోవుట సహజము అట్లే కొడు కెంత యోగ్యుడైనను ఆదర్శముల వేదిక మధ్య (కూరుకొని) కుదురుకొనిపోయి,

చర్చల కారణముగా వేడెక్కిన మనస్సు నొక్కసారిగా తండ్రి యెదుటనే చల్లార్చుకొనలేక తికమకపడుచుండును. ఇక విధిలేక తండ్రి తన తనయుని నొక యనుభవజ్ఞుడైన విజ్ఞునికడకు కార్యసాధనకై విధిగా పంపించియే తీరును. పెద్దల మాటలకు మనస్సు మెత్త (చల్ల) బడగా చిలుక గూటికి చేరి, ఒదిగిపోవు చుండును.

ఈ లోకానుభవములకు ఆ ఘట్టము (శుక వృత్తాంతము) అణువణువునను అద్దము పట్టుచున్నది. ఇంటింటి కథలకు నిదియొకయనుభవైక వేదిక.

అనుభవాల కడలిలో కొట్టుమిట్టాడు పతితల స్వాంతములను ఈ సన్నివేశము స్పందింపజేయును. శ్రోతల యెదలను కుదిపివేయును. సహృదయ హృదయములకు ఆనందాశ్రువుల నభిషేక మొనర్చును.

ఇది సర్వకాల సర్వావస్థల యందును ఎల్లరకు నమోఘముగా పరమ ప్రయోజనములను సమకూర్చు సహకార క్షేత్రము.

ఈ సందర్భమును గీర్వాణవాణిలో మధురముగా చిత్రించిన వ్యాస మహర్షి కృషివలన లోకమేధస్యమైనది. ఇఁక తెనుఁగు తీయందనాలతో దానికి మెఱుఁగులు గూర్చి, మూలాతిశాయిగా, మధురాతి మధురముగా ఈ ఘట్టమునకు రూపురేఖలు దిద్దిన పాపయారాధ్యుని ఆంధ్రభారతి కడుంగడు శ్లాఘనీయ.

సూత్రప్రాయముగా జెప్పవలెనన్న సర్వకాల లోకానుభవములకు నిదియొక చక్కని సారస్వత భాష్యము.

## నక్షత్ర మాలికలు

పాపయారాధ్యుడు శతకముల ససంఖ్యాకముగా రచించినట్లు తానే వేమనారాధ్య చరిత్రలో చెప్పుకొనెను. 1

1. వేమనారాధ్య చరిత్రము. 1.25.

శతకమను పేరునుబట్టి నూఱు పద్యములుగల రచనయనుట సువిదితమే. (శతం ప్రమాణం, అస్య, శతకమ్) ఈశతక పద్యముల కన్నింటికిని సంఖ్యా నియమముతో బాటు చివరి పాదమున, పరమేశ్వరా! దాశరథీ! సుమతీ! కృష్ణా! మున్నగురీతిలో మకుటనియమమును పాటించుచుండుటయు పరిపాటి. కాని ఏనుగు లక్ష్మణకవి మున్నగువారు తమ శతకములలో మకుటనియమమును పాటింపలేదు. వేమన శతకాదుల సంఖ్య శతాధికమై, కడకు వేలకు చేరినది.

పద్య సంఖ్యనుబట్టి "నవరత్నములు" "శశికళలు" "నక్షత్ర మాలికలు" "శతకములు" మున్నగు వివిధ నామములతో రచనలెన్నిరీతుల నేర్పడినను, దాదాపుగా నవియన్నియును భగవన్నుతి విభాగములకు జెందినవే.

సంఖ్యా నియమమును గాని, మకుట సంప్రదాయమును గాని, పాటించుటయు, పాటింపకుండుటయు, కవులయభిరుచులను బట్టియుండును.

నక్షత్ర సంఖ్యననుసరించి, ఇఱువదియేడు(27) పద్యములకు పరిమితమైన రచనకు "నక్షత్ర మాలిక" అను నామ ప్రసిద్ధి యేర్పడినది. పాపయారాధ్యుడు తాను పెక్కు శతకములను వ్రాసినట్లు చెప్పికొనినను, ఆయనది ఒక్క శతకముగూడ నేడు పూర్తిగా లభ్యమగుటలేదు. నక్షత్రమాలిక త్రైదు (౩) మాత్రము నేడు లభించుచున్నవి.

పాపయారాధ్యకృత "శివస్తోత్ర నక్షత్ర మాలాపంచకము" 1907 లో ముద్రితము.1 అందు ముద్రితములైన నక్షత్ర మాలికలివి.

1. క్రౌంచామరేంద్ర లింగస్తవము. (27 పద్యములు)
2. చంద్రమౌళి స్తవము ,, ,,
3. కనక దుర్గాస్తవము. (మూడు (౩) పద్యములు మాత్రమే ముద్రితములు)

---

1. ఈనక్షత్రమాలా పంచకము వేమనారాధ్య భాగత్రయాయుర్వేద శిఖామణి గారి ద్రవ్య సహాయమున బెజవాడ, దుర్గా ముద్రాక్షరశాల యందు 1907లో ముద్రాపితము.

4. మల్లికార్జున స్తవము (పదమూడు (13) పద్యములు మాత్రమే ముద్రితములు

5. చాముండా స్తవము (27+1 : 28 పద్యములు)

## క్రౌంచామరేంద్ర లింగస్తవము

ఇది యమరావతిలోని అమరేశ్వరుని సంబోధించుచు "అంబునిధిషంగ! చాముండికాంతరంగ! చంద్రధవళాంగ! క్రౌంచామరేంద్రలింగ!" అనుమకుటముతో రచింపబడినది. ఇందలి పద్యములు సీసములు. పురాణాది ప్రసిద్ధములైన పెక్కు ప్రాచీన గాథల యాధారమున ఇందు శివ పారమ్యము బహుధా వర్ణితమైనది. ఇందలి ప్రతి పద్యము కవియొక్క మధుర ధారకు మచ్చుతునకయే—

మచ్చునకొక పద్యము :

సీ॥ మధ్యలోకము వారి మర్దించు మృత్యువు,
నీదుము మ్మొనవాల నేలగూలు,
స్వర్లోకములవారిఁ ఆమరుకృతాంతుండు,
భవదుగ్రకోపాగ్ని పదటఁగలిసె,
కారణంబుల మీదఁగవయునక్కాలుండు,
భ్రూకుటి స్ఫురణచే బూదియయ్యె
మడియించు వారల మడియించు వారల,
మడియించు వారలెక్కడగలారె

తే॥గీ॥ నిత్యుడా నీవెకాని యీనిఖిలమునను,
తాను నిత్యుదనని పల్కుదైవమెద్ది?
అంబునిధిషంగ! చాముండి కాంతరంగ!
చంద్రధవళాంగ క్రౌంచామరేంద్రలింగ!

## చంద్రమౌళీశ్వర స్తవము

ఇదియును సీస పద్యములతో సాగిన రచనయే. ఎత్తు గీతియంతయును మకుటముగా స్వీకరింపబడినది.

"పుష్పగిరి పీఠ సంస్థాన పూజ్యమాన షణ్మతస్థాపనాచార్య సత్యచర్య
శంకర నృసింహ భారతీస్వామి హృదయ, జలజదళమధ్య చరహేళి
చంద్రమౌళి"॥

అనునది యీనక్షత్రమాలికకు మకుటము.

ఇందు శైవక్షేత్ర విశేషములను గూర్చియు, శివమహిమలను గుఱించియు సరళ సుందరముగా, సరస శోభితముగా కమ్మని శైలితో కవనమల్లబడినది. ఇందలి శివాధిక్య ప్రకటన ప్రస్తావిత గాథలన్నియును పురాణ ప్రసిదములే. ఉదాహరణమున కొక పద్యము.

సీ॥ విజయ ప్రదుండన్న విఖ్యాతిఁ బ్రకటింప,
జయమునొందిన ధనంజయుడె సాక్షి,
ధర చిరంజీవిత్వదాతవంచనుటకు,
ఘనుడు మృకండనందనుడె సాక్షి,
ఆరోగ్యదాయకుండనుటకు దక్షుచే,
శప్తుడై కృశియించు శశియెసాక్షి,
ఐశ్వర్యమొసఁగు వాడనుటకు వైకుంఠ,
పదవిగాంచిన రమాపతియె సాక్షి,

## కనక దుర్గాస్తవము

ఇదియును సీస పద్యములతో నాకృతి గొన్న రచనయే.
"విజయ గోపాల సహజాత విశ్వమాత, కలిత గుణవర్గ బెజవాద
కనకదుర్గ"

అను మకుటముతో నిది యలరారినది. ఇందు మూడు పద్యములే లభ్యమగుచున్నవి. సరసధార కొక పద్యము.

సీ॥ మాయవై పరమేశజాయవై దళితదైతేయవై సాధకధ్యేయవైతి,
తారవై జగదేకవీరవై నాగేంద్ర హారవై భక్తమందారవైతి,
భద్రవై, హరియోగ నిద్రవై, స్థితమహారుద్రవై కరుణాసముద్రవైతి
ధామవై కువలయశ్యామవై మధుమదోద్దామవై దురిత విరామవైతి,

తే॥గీ॥ ...............................................................

విజయ గోపాలసహజాత విశ్వమాత, కలిత గుణవర్గ బెజవాడ
కనకదుర్గ"

## మల్లికార్జున స్తవము

ఈ నక్షత్రమాలిక కంద పద్యములతో కమనీయమైనది. ఇందు పదు మూడు (13) పద్యములు మాత్రమే ముద్రితములు. ముద్రాపకుల యేమరు పాటువలన తక్కిన పద్యములు ముద్రితములైన పత్రములు పుస్తకమును కుట్టునప్పుడిందు చేరక యుండవచ్చును. ఎందుకనగా, ఈ 13వ పద్యముతో 27వ పుట ముగిసినది. వెంటనే (ప్రక్క పేజీ) 30 వ పుటతో ప్రారంభ మైనది. ఆ 30 వ పుటలో ఈ కవిచే రచితమైన భ్రామరీ స్తవ పద్యములు ముద్రితములై యున్నవి.

కావున తక్కిన 14 కంద పద్యములును ముద్రాపకులకు లభించియు, ముద్రితములయ్యు, వారి పొరపాటువలన మనకు నేడవియలభ్యములు. రసానందమునకొక కందము.

---

కం॥ భీమా ! హృతకామా ! ధృత
సోమా ! ఫణిరాజధామ ! సోమా ! సుగుణో
ద్దామా యుతధామా ! నిహ
తామయ ! బెజవాడ మల్లికార్జున లింగా !

## చాముండా స్తవము

"శార్దూల విక్రీడితము"లతో నడయాడిన "నక్షత్ర మాలిక" యిది. ఇందలి పద్యములన్నియును "ముక్తి ద్వారము తల్పు దీయగదె చాముండా! జగజ్జీవనీ !" అను మకుటముతో నలరారుచున్నవి.

ఇందలి "క్త" ప్రాసము సరస ధారకు సహజముగ సంతరాయము కల్గించునదై యున్నది. కాని వివిధ విద్యా విశారదుడును, విద్వత్కవి

తల్లజాడునైన పాపయారాధ్య మహాకవికి మాత్రము ఈ "క్త" ప్రాసము సహజముగనే లొంగినదై, మృదుమార్గమున నొదిగి కవికెనలేని కీర్తిని గూర్చినది.

ఆరాధ్య శైవ సంప్రదాయజ్ఞుల యిండ్లలో పాపయారాధ్యుల పేరు తెలియని వారుండవచ్చునేమోగాని, ఈ పద్యములను గూర్చి వినని వారుండరనుట యత్యుక్తికాదు. ఆ ముక్తిద్వారము తలుపులు తీయించిన మహాకవులా! వానిని గూర్చి మేమెఱుగక పోవుట యేమిటి? అని యనెడివారే యందఱును. ఈ "ముక్తిద్వార" పద్యములను పాపయారాధ్యుడు వార్ధక్యమున రచించి యుండును.

శా॥ త్వక్తారుణ్యము డుస్సె, దస్సెవలవంతల్, చూపులోపించె, న
వ్యక్తంబయ్యె దిగంతరాళము, భవిష్యద్భ్రాంతు లూటాడె, సం
పృక్తంబయ్యెను బుద్ధిమాంద్యము, భవత్ప్రేమంబు దిక్కంటి, నీ
ముక్తిద్వారము తల్పుతీయగదె చాముండా! జగజ్జీవనీ!

శరీర లావణ్యము జారినది. ఇంద్రియ సుఖాపేక్షదూరమైనది. చూపులోపించినది. దిక్కుతోచని స్థితియేర్పడినది. భవిష్యదాశలు సన్నగిల్లినవి. బుద్ధిమాంద్యమేర్పడినది. శివభక్తి మాత్రమే మిగిలియున్నది. ఆ దశలో నిదియీ కవిచే రచితము.

"రుచికి మఱొక్క పద్యము"

"భోక్తవ్యంబు శివప్రసాద"మని సంబోధించు వారిన్, సదా
"వక్తవ్యంబు శివాఖ్య మంత్రము"ని, సంభావించు వారిన్, మనో
రాక్తశైక్య నిరూఢి సేవయని సేవావృత్తి నున్నాడ, నీ
ముక్తిద్వారము తల్పుతీయగదె చాముండా! జగజ్జీవనీ!

శక్తి విశిష్టాద్వైత సిద్ధాంతమును బాగుగా నెఱిఁగిన యీ కవి "న శక్తి శక్తిమతోర్భేదః" అను సూక్తి ననుసరించి, వీనిని దేవీ పారమ్యముతో రచించెను. ఇవి పండితైక వేద్యములుగా, పామరజన రంజకములుగా నుండునట్లు విశిష్టరీతిలో విరచింపబడినవి. ఇందు కొన్ని పద్యముల కర్థములు సుబోధ

ములు గాకున్నను ఇవి పెక్కుమంది జిహ్వాగ్రముల జేరియుండుటయే వీని ప్రత్యేకత.

## భ్రామరీస్తవము

ఈ పద్యములు మొత్తము పదునేడు. (17) 16+1 = 17) వీనికి "శశికళ"యను నామ ప్రసిద్ధి యేర్పడినది.

"ప్రస్థానావసరంబు డాసె దరిఁజేర్పన్ నీవె సూభ్రామరీ!" అను మకుటముతో కొనసాగిన రచనయిది. ఇందలి "స్థ" ప్రాసము మిక్కిలి క్లిష్టమైనదే యైనను ఈ మహాకవి ముందది మదత పేచీలు పెట్టక సాఫీగా సాగిపోయినది. పద్యము లన్నియును శార్దూల విక్రీతములే. మకుటమును బట్టియే కవి దీనిని తన యవసానదశయందు రచించెననుట సుస్పష్టము.

క్లిష్టమైన "స్థ" ప్రాస ప్రభావమున పద్యములు నారికేళ పాకమున నడచినవి. బలమైన భాషాపటిమ, చక్కని శాస్త్ర పరిజ్ఞానము, తలస్పర్శియైన తాత్త్విక చింతనము, వీనియన్నింటికి మించిన మౌలిక విజ్ఞానముగల పండితులు మాత్రమే ఈ పద్య భావములను విప్పి చెప్పగలరు. ఐనను వీని ప్రచార ప్రాభవములకు లోటులేదు. ఇప్పటికిని తత్సంప్రదాయ గృహములలో సందర్భాను సారముగా నివి విన్పించుచునే యుండును. ఆరాధ్య శైవ "గణార్చనాద్యుత్సవముల"లో భోజనాది సమయములలో ముక్తిద్వార పద్యములది ప్రథమ స్థానము కాగా— ఈ భ్రామరీస్తవ పద్యములది ద్వితీయ స్థానము.
రచనానుభూతి కొక పద్యము :

శా॥ అస్థూలాల్ప కుటీ నిభం బగుచు మేనా నమ్రమై చంచలా
వస్థా వన్నత నొంది, కుంది, చరమా వస్థో చితంబయ్యె, న
మ్మా! స్థాపత్యుడ నౌదుఁ జేర్చుకొనుమమ్మా! రాఁగదమ్మా! మహా
ప్రస్థానావ సరంబు డాసె, దరిఁజేర్పన్ నీవె సూభ్రామరీ!

## మంగళారతి

పురాణములను రచించినను, ప్రబంధముల నిర్మించినను, శతకముల నల్లినను, స్తుతులను కావించినను, ఆరతుల నొనర్చినను పాపయారాధ్యుల ముద్ర ప్రత్యేకముగా నందు గోచరించుచునేయుండును.

ఈ కవి రచనలలో అకృతిని బట్టి చిన్న, పెద్ద తారతమ్యములుండ వచ్చునే గాని, విషయ గౌరవ ప్రతిపాదనలో మాత్రమన్నియును "సమస్థితి"1నే భజించుచుండును. ఆ రీతిలో గమనించినచో నీ "మంగళారతి"యు, తదితర రచనములవలె శ్లాఘ్యమేయగు చున్నది.

ఈ మంగళారతి "ఏకతాళము"తో "మాళవగౌళ" రాగములో గానము చేయదగునని, శీర్షిక క్రింద సూచింప బడినది.

"ఆరతి ఇష్టలింగయ్య మంగ

ళారతి ప్రాణలింగయ్య లింగయ్య" అను పల్లవితో, కొనసాగిన రచన యిది. ఇందైదు (౫) చరణములు గలవు. మొదటి నాల్గుచరణములలో శివ తత్త్వ ప్రస్తుతి యొనర్చి, ఐదవ చరణమున కవినామాది ప్రకటనము చేయ బడినది.

ఇది శైవతత్త్వ పరిపుష్టము. శివ తత్త్వమున "ఓనమాలు" దిద్దనిదే యిందలి తాత్త్వికానందానుభవము సులభ సాధ్యముగాదు. చరణములందు యోగశాస్త్ర పరిభాషా పదములు ప్రయుక్తములైనవి.

అభిన్న స్వరూపులైన శివపార్వతులకు ప్రతి రూపము (ప్రతీకము) లింగస్వరూపము. భక్తుడు లింగమున శివపార్వతులను దర్శించును ఆ లింగ దీధితులలో నతడు శివతాండవమును, పార్వతీలాస్యమును గాంచును. ఆ దర్శనానందమును పూర్తిగా పొందుటకు వేయి కన్నులైనను చాలవని మొదటి చరణ తాత్పర్యము.

---

1. "సమస్థితి" యనుటలో సమానమైన స్థితి యనియు, పరబ్రహ్మ స్థితి యనియు శ్లేషార్థ విలసనము గుప్తము. నిర్దోషం హి "సమం" బ్రహ్మ అనునది తాత్త్విక నిర్వచనము.

చందమామ సుధల చిందులచే నిండిన యా లింగపరబ్రహ్మమును సురటులతో వీచుచు సేవించుటకు వేయిచేతులైనను తక్కువయేయని ద్వితీయ చరణ భావము.

నాదాత్మకమై శివలింగోద్భూతమైన సామగాన శ్రవణానందాను భూతికి వేయి వీనులున్నను - ఏ మూలకు? అని తృతీయ చరణము పేర్కొనును.

ఆ లింగము యొక్క పరతత్త్వమును భావించుటకు వేయి మనస్సులను దెచ్చుట యెట్లని నాల్గవ చరణము ప్రశ్నించును.

భక్తి తాత్పర్యములు గల గాయకులకును, శ్రోతలకును సమముగా పరమానందమును పంచియిచ్చు మధుర రచనమిది.

దీనిని గూర్చి పరిచయము చేయుచు శ్రీ శివదేవుని వీరభద్రారాధ్యులు- "ఈ హారతి శివపూజా విధానమునకు పట్టుగొమ్మ. శివయోగ సౌధమునకు మూలస్తంభము. ఇష్టప్రాణ భావలింగోపాసకులకు జీవగఱ్ఱ. కనుక నిది మంగళహారతులలో నగ్రతాంబూలము నందికొనినది." అని నుడివిరి. వారి పలుకులతో కంఠము కలుపుచు దీని వివరణము ముగింపబడుచున్నది.

## మంగళారతి

ఆరతి ఇష్ట లింగయ్య, మంగ
ళారతి ప్రాణలింగయ్య, లింగయ్య.

1. నాడులందుఁ బెద్ద నాడి నట్టనడుమ
నాడుచున్న పూవులోఁదితోఁద
జోడు గూడియున్న కోడెకాడవు నిన్ను
జూడవేయు కన్నులేద దెత్తురలింగ! ॥ఆరతి॥

2. చందమామలోన చిందిన యమృతము
చిందర నీమేను చెమటలురా
అందముగ సురటు లంది వీవ ప్రేమ
జెందివేయు చేతులెందు తెత్తురలింగ? ॥అరతి॥

---

1. "వీరశైవ దీక్షాబోధ - మోక్షోపాయము" అను గ్రంథమున పరిచ్ఛేదము - పుట. 11.

3. వేయు రేకుల కమల పీఠి నట్టనడుమ
భాయక సాముము బాడగనూ
వేయేల నామది వినగ వేడుక పుట్టె
వేయి పేనుల నెందు వెదకి తెత్తుర లింగ! ॥ఆరతి॥

4. ఒంటియాకుమీద ఓంకార మూర్తివై
జంటచిత్తు కలువకంటి గూడి
దంటయైన నిన్ను దలపున నిడుప్రేమ
నింట వేయి మనసు లెందు తెత్తుర లింగ! ॥ఆరతి॥

5. పావనుడగు ములుగు పాపయ్య కరమందు
భావప్రాణేష్ట ప్రభావముచే
సేవించుకొనియెడి చెన్నమల్లేశ్వర
దేవుడవైనట్టి దివ్య సద్గురు లింగ! ॥ఆరతి॥

## ఏకాదశీ వ్రత చంపువు

ఇది యీ కవి యొక్క సంస్కృత రచన. ప్రస్తుతమిది యలభ్యము. ముద్రితములైన యీ కవి గ్రంథ పీఠికలలోను పత్రికల వ్యాసములలోను. విజ్ఞాన సర్వస్వము (4వ సంపుటము)లోను పండితులు ములుగు పాపయారాధ్యుని రచనలను పేర్కొనిరి. ఆయన రచించిన సంస్కృత రచనలలో "కల్యాణ చంపువు"తో బాటు, "ఏకాదశీ వ్రత చంపువు", "ఆర్యాశతీ శివ స్తోత్రము" మొదలగునవి గలవు.

ఏకాదశీ వ్రత చంపువును పాపయారాధ్యుడు శ్రీ వేంకటాద్రి ప్రభువున కంకితమిచ్చినట్లు శ్రీ ముదిగొండ బసవయ్యశాస్త్రి గారు తెల్పిరి.[1] కాని కొమ్మనమంచి జోగయ్యశర్మగారు, "ఈయన (ము.పా. కవి) ఆ ప్రభుని (వేంకటాద్రినాయని) పేర ఏ కావ్యమును అంకిత మొనర్చినట్లు కనపట్టదు" అని భావించిరి.[2]

---

1. 1951 దుర్మతి ఉగాది సంచిక. (ఆంధ్ర పత్రిక స్వర్ణోత్సవ సంచిక) పుట. 127. By ముదిగొండ శాస్త్రి.
2. విజ్ఞాన సర్వస్వము 4వ సంపుటము పుట.918.

పేరునుబట్టి యిందు ఏకాదశీ వ్రత విధానము, దాని మహిమాతి శయము తెలుపబడి యున్నట్లు భావింపవచ్చును.

కవి రచనారీతికి కొన్ని శ్లోకములు

శ్లో॥ కతినహి భువనాని బ్రహ్మణా నిర్మితాని,
ప్రథిత సుగుణశోభా భాసమానానిసంతి
తదపి సకల సంపత్సద్మ వేధో౽౦దరాశేః,
వినిహితమణి పేటీరాజతే మధ్యలోకః[1]

శ్లో॥ శ్రీ వేంకటాద్రి నృపతేర్గుణ రత్నరాశే,
రేకాదశీ వ్రతవిశేష కథాప్రసంగః
చంపూ ప్రబంధ తిలకో భజతి ప్రతీతిం, విద్వన్ముతాం[2]

## ఆర్యాశతీ శివస్తోత్రము

పాపయారాధ్యుల సంస్కృత రచనలలోనిది యొకటి. ప్రస్తుత మీ గ్రంథమలభ్యము. ఈ శివస్తోత్రము వంద ఆర్యలలో కావింపబడినది గాన దీనికి "ఆర్యాశతి" అని పేరు పెట్టబడి యుండవచ్చును.

శివస్తుతి పరములైన ఈ యార్యలలోని పదములు మృదుమధురముగా నున్నవి. అందలి భావములు మనోహరములు అవి పఠితలకు సమధికోత్సాహ మును గలిగించునవియై యున్నవి. శబ్దార్థములలో లాలిత్యములోలలాడు చున్నవి.

ఇవి చిన్నచిన్న శ్లోకములగుటవలన పాఠకులకు శ్రమయనునది తెలి యనే తెలియదు. ఈ రచనా రామణీయకమును గూర్చి యెంత చెప్పినను స్వభావోక్తియే - అందలి శుభలక్షణము లట్టివి.

పరిశీలనానందములకు ఒక శ్లోకము :

* శాటీకృత చర్మాణం
ఘోటీకృత నిగమ మసమకర్మాణం
కోటీర దమృత సూతిం
పాటీరదనంగ భూతి మాటీకే॥

---

1. సర్వ మధురము. పీఠిక. పుట. ౨.
2. సరస హృదయాను రంజనము. పీఠిక. పుట. ౧.

ఈ కవి ఇందలి శ్లోకములను "ఆర్యలు"గా భావించి — తన కృతికి "ఆర్యాశతి" అని పేరు పెట్టినాడు. కాని శాస్త్రజ్ఞుల లక్షణములను బట్టి యివి "గీతి" లక్షణములతో నొప్పారుచున్నవి. పూర్వోత్తరార్ధము లొకేరీతిగ-ఆర్య యొక్క పూర్వార్ధ లక్షణములనే గలిగియున్నవి. వాస్తవముగా నిది "గీతీశతీ శివస్తోత్రము" అనదగియున్నది. కమ్మని రచనయైన ఈ "ఆర్యాశతీ శివ స్తోత్రము" అలభ్యమైయుండుట చింత్యము.

## ఆర్యాలక్షణములు - గీతి లక్షణములు

శ్లో॥ లక్ష్మైతత్ సప్తగణా గోపేతాభవతి, నేహ విషమేజః
(న+ఇహవిషమే జః.)
షష్ఠోఽయంచ నలఘువా ప్రథమార్ధే నియత మార్యాయాః,॥

శ్లో॥ షష్ఠే ద్వితీయ లాత్పర కేన్లే ముఖలాచ్చ సయతి పదనియమః,
చరమేఽర్ధే పంచమకేతస్మాదిహ భవతి షష్ఠోలః॥ (వృత్తరత్నాకరము)

ప్రథమార్ధమున చతుర్మాత్రా గణములు (గా,భ,జ,స,నలములు) ఏడు, ఆపైన నొక గురువు నుండును. బేసిగణములందు జగణము - ఉండరాదు, ఆఱవ గణమునలముగాని, జగణముగానియైయుండవలెను. దానిలో మొదటి ద లఘువు తరువాతయతి. ఉత్తరార్ధమున ఆఱవగణము ఒక్క లఘువు మాత్రమే. అందు చతుర్మాత్రా గణము ఉండదు. తక్కిన లక్షణము పూర్వార్ధము వలె నుండును. ఇది సామాన్యార్యాలక్షణము[1]

ఈ యార్య యొక్క పూర్వార్ధమున - ఆఱవ (6వ) గణము జగణము గాని, నలముగాని, ఐయుండ - ఉత్తరార్ధమున ఆఱవ గణ స్థానమున చతుర్మాత్రా గణమునకు (నల, జ, లకు) బదులుగా ఒక్క లఘువు మాత్రమే యుండుట గమనార్హము. ఆ ఆర్యయందలి పూర్వోత్తరార్ధములతో గల భేదమిది.

---

1. (i) తెలుగు భాషలో ఛందోరీతులు-పుటలు 146-150.
(ii) బాల సరస్వతీయ పీఠిక - పుటలు 78, 79.

* ఆర్య యొక్క పూర్వార్థ లక్షణము తోడనే - పూర్వోత్తరార్థములు రెండును - ఉన్నచో అది "గీతి"1 యనబడును.
* ఆర్య యొక్క ఉత్తరార్థ లక్షణములతోడనే పూర్వోత్తరార్థములు రెండును ఉన్నచో అది "ఉపగీతి"2 యనబడును.
* ఆర్య యొక్క పూర్వార్థ లక్షణములు - ఉత్తరార్థమునందును, ఉత్తరార్థ లక్షణములు పూర్వార్థమునందును ఉన్నచో - అది "ఉద్గీతి"3 యనబడును.
* కందలక్షణములు గలదియే "ఆర్యాగీతి"యని యనంతుడు చెప్పెను.4

తెనుగున ఆద్యవ్యాకరణమైన "ఆంధ్ర శబ్దచింతామణి" ఆర్యా శ్లోకముతో ప్రారంభింపబడినది. కావున తెనుగున "ఆర్యా" రచనకు శ్రీకారము చుట్టినవాడు నన్నయ.

## ''కల్యాణ చంపూ ప్రబంధః''

(కల్యాణ చంపూ ప్రబంధము)

ఇది పాపయారాధ్యుల సంస్కృత రచనలలో ముఖ్యమైనది. దీనిని కవి తన వందమంది విద్యార్థులకు బోధించినట్లు ప్రతీతి. కాని దీని ప్రతికొఱకెంత గాలించినను (కృష్ణా గుంటూరు ప్రాంతములలో) లభ్యముకాలేదు. ప్రస్తుతము మద్రాసు ప్రభుత్వ ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమున దీని ప్రతి యొకటి కలదు. అది భద్రమైన బైండింగుతో నున్నది. దేవనాగరలిపిలో గజిబిజిగా వ్రాయబడి యున్నది. ఈ కాగితం ప్రతిని వ్రాసినవారి పేరు ఈ గంథాంతమున "న. పార్థసారథ్యాచార్యః" అని కలదు. 1925 లో కృష్ణా జిల్లాలోని చల్లపల్లి జమీందారుగారి నుండి, ఈ ప్రతి ఆ గ్రంథాలయము వారికి (మద్రాసు వారికి) చేరినట్లు ఆ గ్రంథము చివరి పుటలలో వ్రాయబడి యున్నది.

ఈ కల్యాణ చంపువు (5) ఐదు స్తబకములుగా వ్రాయబడియున్నది. పుల్ స్కేపు సైజులో 186 పుటలలో నిది లిఖింపబడి యున్నది.

---

1. 1,2,3 తె.భా ఛం.రీ. పుటలు. 146-150 & ఛా.స. పుటలు 78, 79.
4. ఛందోదర్పణము - (అనంతుని ఛందస్సు) పుట. 68. (3-14)

దేవనాగర లిపిలో గజి బిజిగా వ్రాయబడి యున్నందున పూర్తిగా సమర్థముగా దీనిని చదువు నవకాశము లేకపోయినది. కొన్ని ముఖ్యాంశముల నతి ప్రయాసముతో పఠించి, వానిని వ్రాసికొని రాగలిగితిని.

ఆ ప్రాచ్య లిఖిత గ్రంథాలయమున, ఈ ప్రతి నెం. R.N.o. 4490 (T4-80/103×9 1/2) అయి యున్నది.

ఇది చంపూ ప్రబంధముగాన గద్య పద్యములలో సాగినది.
("గద్య పద్యాత్మికా చంపూః" ఇత్యాలంకారిక నిర్వచనమ్)

ప్రథమ స్తబక ప్రారంభమున

శ్రీ కల్యాణ చంపూః శ్రీః ప్రథమ స్తబకః:-

శ్లో॥ జయన్తి జగతాం మాతుః స్తన కుంకుమ బిందవః
ముకున్దా శ్లేష సంక్రాంత కౌస్తుభ శ్రీ విడంబినః॥

శ్లో॥ అంతరాయతిమిరోపశాంతయే శాంత పావన మచింత్య వైభవమ్
తం నరం వపుషి కుంజరం ముఖే, మన్మహే కిమపితుందిలంమహః॥

ప్రథమ స్తబకాంతమున

శ్లో॥ శ్రియం దిశతు కేలికా భవన దర్పణాంతస్థలీ
నిజ ప్రతి కృతేర్ముహుః వినిమయం స్వభాగేదధత్
అనంత గుణకల్యాణ కథామయ సుధారసః
కల్యాణ చంపూ ప్రథమస్తబక స్తనుతాం యశః॥ పుటలు 31-56.

ఇతి కల్యాణ చంపూ ప్రథమ స్తబకః,

శ్రీః అథ ద్వితీయ స్తబకః "హయగ్రీవాయనమః" పుటలు 31-56.

ద్వితీయ స్తబకాంతమున:-

శ్లో॥ కల్యాణ చంపూజలధౌ రసభంగ తరంగితః
ద్వితీయోஉప్యద్వితీయోஉయం స్తబక స్తనుతాం శుభమ్॥

ఇతి పాపయారాధ్య విరచితే కల్యాణ చంపూ ప్రబంధే ద్వితీయ స్తబకః,
వేమారాధ్య కులీనా యా పాపయారాధ్య భారతీ.

అథ తృతీయ స్తబకః. శ్రీః పుటలు. 57-98

ఇతి పాపయారాధ్య విరచితే కల్యాణ చంపూ ప్రబంధే తృతీయ స్తబకః॥

అథ చతుర్థః స్తబకః శ్రీః పుటలు 99-131.

ఇతి శ్రీపాపయారాధ్య విరచితే కల్యాణ చంపూ ప్రబంధే చతుర్థః స్తబకః—

శ్లో॥ దిగ్వధూ కర్ణ కల్హారచూళీ కేళిం తనోతు సా
వేమారాధ్య కులీనా యా పాపయారాధ్య భారతీ॥

శ్రీరామచంద్రాయనమః— శ్రీః

అథ కల్యాణ చంపూ ప్రబంధే పంచమః స్తబకః—131-186.

పంచమ స్తబకాంతమున—

శ్లో॥ నిత్యానందేనిగమ తురగే స్వాత్మవస్తున్యఖండే,
యద్వల్లీలావిలసితమిదమ్ కల్పితం ద్విత్వవృత్త్యా
తత్తత్సర్వం వియతిపసినే పృక్షవాట్యాం రసాలీ
పుష్పం గంధః ఫలమితి కథాం కల్పయేద్విద్వదగ్రే॥

ఇతిశ్రీ పాపయారాధ్య విరచితే కల్యాణ చంపూ ప్రబంధే పంచమః స్తబకః—సమాప్తః—శుభమ్ భూయాత్.

శ్లో॥ దిగ్వధూ... ..................... పాపయారాధ్య భారతీ—

ఇందు పార్వతీపరమేశ్వరుల కల్యాణగాథ వర్ణిమైనది. ద్వితీయ స్తబక ప్రారంభమున "హయగ్రీవాయ నమః" అనియు చతుర్థ స్తబకాంతమున "శ్రీరామ చంద్రాయనమః" అనియు వ్రాయబడిన విషయము గమనింప దగియున్నది.

వీనిని పాపయారాధ్యులే వ్రాసిరో లేక ఈ గ్రంథాలయ ప్రతిని వ్రాసిన శ్రీమాన్. న. పార్థసారథ్యాచార్యుల వారు వ్రాసిరో తెలియదు.

## శివ పంచరత్న స్తుతిః

శ్రీ పాపయారాధ్య రచిత సంస్కృత స్తవములలో ఈ శివ పంచరత్న స్తుతి యొకటి.

ఈ స్తవము "సర్వమధురమ"ను కృతి యొక్క ముద్రిత ప్రతికి అట్ట వెలుపలి భాగమున అచ్చు వేయబడి యున్నది. ఆ స్తుతి పేరునుబట్టి యే యైదు రత్నములవంటి ఐదు శ్లోకములు గలవని తెలియుచున్నది.

ఇందు మొదటి శ్లోకము "ఓంతత్సత్" అని ప్రారంభమై "తస్మైచిద్వపుషే- కుర్యాం పరంజ్యోతిషే" అని ముగియు చున్నది. రెండవ శ్లోకము "నాస్యత్కించిద ఖండమద్వయ మజమ్" అని మొదలై, మాయా వాద ఉదేతి యత్రమహసే తస్మైనమో బ్రహ్మణే" అని పూర్తియైనది. ఇక మూడవ శ్లోకము మోహధ్వాంత తమోనుదే.... అని ప్రారంభింపబడి— "తస్మైనమశ్శంభవే" అని పూర్తి చేయబడినది. నాల్గవ శ్లోకము సృష్టిం పాలన మంత్యం తస్మై విశ్వకృతే జగత్త్రియ ధృతే దేవాయ తుభ్యం నమః॥ అని సాగినది. చివరిదైన యైదవ శ్లోకము "నైంద్రీ మాత్మ భువీం.... సుమనసాం శ్రేయః పదే తే నమః"॥ అని నడిచినది.

"శ్రీ షట్ స్థల పరబ్రహ్మార్పణ మస్తు" అనుచు నీస్తుతి ముగిసినది. శివ పంచరత్న స్తుతిః ములుగు పాపయారాధ్యకృతా అన్న రీతిలో ఈ స్తుతి ప్రారంభింపబడినది.

ఆ పరబ్రహ్మము, అఖండము, అద్వయము, అజము, తేజస్స్వరూపము అని వివరింపబడినది.

ఆ పరమ శివుడు మోహ ధ్వాంత తమోవిచ్ఛిత్తికి కారకుడు. మాయావరణములను తొలగింపగలవాడు. మోక్షప్రదుడు అని స్తుతింప బడినాడు.

త్రిమూర్తుల (బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుల) సృష్టి, స్థితి, లయ కార్యములు ఈ శివ శాసనము ననుసరించియే జరుగుననియు, జగత్త్రియమును ధరించు వాడతడే యనియు నిందు ప్రకటింపబడినది.

తనకెట్టి సంపదలును వలదనియు, శివపాదాబ్జ మరంద బిందువుల నాస్వాదించుటలో లోలుభమైన జన్మమాత్రమే తనకు వలయుననియును పలుకుచు, కవి తన యనన్య శివభక్తిని ప్రకటించుచు ఈ స్తుతినతడు సమాప్తమొనర్చెను.

ఇవి మోహధ్వాంతపీడితులకు శివ తత్త్వాకర దీపికలు.
భక్తి ప్రపత్తులకు ప్రతీకలు.

## వేదాంత సారసంగ్రహః

ఈ వేదాంత సారసంగ్రహము పాపయారాధ్య రచితమైన తాత్త్విక సిద్ధాంత సంస్కృత రచన. ఇదియు సముద్రితము. దీనివ్రాతప్రతి మద్రాసు ప్రభుత్వ ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమున గలదు. ఇది కాగితపు ప్రతి. గ్రంథాలయమున దీనిసంఖ్య S.R. 913, R. 2232.

ఈ గ్రంథము పదునైదు (15) పుటలలో వ్రాయబడియున్నది. ఇది గ్రంథ (తమిళలిపిని బోలిన) లిపిలో లిఖితము. దీని రచన సరళ సంస్కృతమున కొనసాగినది.

ఈ గ్రంథము ఫుల్‌స్కేపు సైజులో కలదు. బైండింగు చేయబడి యున్నది. పైనియట్ట ఎఱుపురంగులో నున్నది.

## ప్రారంభ రూపము

శ్లో॥ శ్రీశివం పరమానందం జగజ్జన్మాది కారణమ్,
సత్యజ్ఞానానందరూపం, ప్రణమామి జగద్గురుం॥

అస్మిన్ శ్లోకే తాపత్రయార్కా సంతప్తాః జననమరణ ప్రవాహరూప సంసారే పతితాః తన్నివృత్తేరుపాయాభావేన దుఃఖానంతరం దుఃఖమేవ ప్రాప్నువంతి. తేషాంవివేకార్థం శ్రీసాంబశివానుగ్రహవశాత్ ఆత్మానాత్మ వివేకరూపం సర్వవేదాన్త సిద్ధాన్తసార సంగ్రహం కథయిష్యామః.

ఆవరణవిచారః క్రియతే॥ ఆత్మానాత్మవిచారః ప్రతీయతే. మహావాక్యార్థ విచారః క్రియతే. సమాధివిచారః క్రియతే.

ఈశ్వరప్రసాదాత్ కృతకృత్యః జీవన్ముక్తోభవతి

..........................................................

ఇతి శ్రీ వేమనారాధ్య వంశోద్భవ పాపయారాధ్య విరచితోఽయం వేదాన్త సారసంగ్రహః సమాప్తః ॥

సంపూర్ణోఽయం వేదాన్త సారసంగ్రహం॥

ఈ గ్రంధాంతమున విషయ సూచిక కలదు.

## విషయ సూచిక



-:సంపూర్ణమ్:-

ఈ గ్రంథము "గ్రంథలిపి"లో వ్రాయబడి యుండుటచే, ఆ లిపి తెలియనందున అందలి విషయములను సమగ్రముగా సమీపించుటకు వీలు పడలేదు. దయాహృదయుడైన యొక సహ (గ్రంధాలయ) పాఠకుని సాయమున ఈ మాత్రముగా నాయా యంశములను తెలుగు లిపిలో వ్రాసికొనగలిగితిని.1 విషయ సూచికను బట్టి, వేదాన్త విషయములు సూత్రప్రాయముగ ప్రకరణ విభాగమున చక్కగా వివరింపబడినట్లు కన్పించుచున్నది.

కవి తాను "పరమ శివాద్వైత పండితుడ"నని వేమనారాధ్య చరిత్రమున జెప్పికొనెను. కనుక నీ"వేదాన్తసార సారసంగ్రహము" మొలుగు పాపయారాధ్యుల "శివాద్వైత సిద్ధాన్త" పరిజ్ఞానమునకు సూత్రప్రాయముగానున్న యొక చక్కని యక్షరాకృతియని తలంపవచ్చును.

# నాల్గవ ప్రకరణము

# వేమనారాధ్య చరిత్రము

## వస్తువు

ఈ వేమనారాధ్య చరిత్రమునందు తొమ్మిది (9) ఆశ్వాసములు గలవు. ఆశ్వాసాంత గద్యములుగాక మొత్తము రెండువేల నాలుగువందల ముప్పది యొక్క (2431) గద్యపద్యములతో సలరారుచున్న రచనయిది. (320 + 193 + 212 + 193 + 212 + 210 + 332 + 354 + 405)

## ప్రథమాశ్వాసము

ప్రథమాశ్వాసమున కవి యిష్ట దేవతా ప్రార్థన గావించెను. మొట్టమొదట అష్టభూతి కలితుడగు శంభుని స్తుతించెను. పిమ్మట శివార్థ దేహయగు దేవిని నుతించెను. అనంతరము క్రమముగా తమ యిలవేలుపులగు వీరభద్రుని, భద్రకాళిని, శరభ సాంబవ స్వామిని, శరభ కాళికను, నందీశ్వరుని, ప్రమథ గణములను వినుతించెను.[1] తదనంతరము తనకు విద్యాగురువగు శంభులింగార్య దేశికస్వామిని, శివకవులైన శ్రీపతి పండిత కవిని, పాల్కురికి సోమనాథ కవులను, బసవేశ్వరుని ప్రస్తుతియొసర్చెను. పిదప కుకవి నిందను గావించెను.[2]

ఆ పిమ్మట లౌకిక పారలౌకిక సుఖదాయకమైన పురాతన శివభక్త గోష్ఠికి కవి కుతూహల పడుచున్న సమయమున మహాశైవులచటికి విచ్చేసిరి. వారిలో సాహితీ గురువులు కొందఱు కాగా మఱికొందఱు గురు పట్టభద్రులు. వీరశైవ గురురాజ్య చక్రవర్తులుగా సలరారిన ద్వాదశారాధ్యులను[3] గూర్చి యాగురువర్యులు ప్రశంసా పూర్వక ప్రస్తావనలు చేసిరి. ప్రసంగ వశమున వేమనారాధ్యుని గూర్చి ప్రత్యేకముగా పేర్కొనిరి.

---

1. వే.ఆ.చ. 1-1నుండి 8. (2) వే.అ.చ. 1-9, 10, 10, 11.
2. వే.ఆ.చ. 1-15. ద్వాదశారాధ్యులు - పండితత్రయము. ఆరాధ్య త్రయము. ఆచార్యత్రయము. సిద్ధత్రయము.

అనంతరము వారు పాపయారాధ్యుల పాండితీగరిమను, కవితా కౌశలములను, తద్రచితములైన గ్రంథములను, తద్వైశిష్ట్యమును, పేర్కొని, మహా మహిమోపేతమగు "వేమనారాధ్య చరిత్రము"ను రచింపుమని పాపయరాధ్యుని వారు కోరిరి. కవి వారి మచ్చుల మాటలకు మాఱువల్కక, తత్కావ్యరచన కంగీకరించెను. పిమ్మట వారు నూతన వస్త్రాభరణాది సత్కారములతో కవికి హర్షమ్ముగూర్చి, నిజేచ్ఛంజనిరి.

పిదప పాపయారాధ్యుడు స్వగృహమునకుంజని, కావ్య ప్రారంభ సంరంభియై, ఆరాధ్య గురు పరంపర కంజలి ఘటించెను. గణబృందములకును, సోమనాథాది సత్కవి సమితికిని వందనముల నర్పించెను. ఆ వేమనా రాధ్యుని గుణాతిశయములను సంగ్రహించెను. వానికి విశేషముగసారవంతములైన గాథలను, బోధలను జేర్చి,[1] కావ్యరచనకు కృతనిశ్చయుడయ్యెను. కవి తన గురుదేవునికే యాగ్రంథము సంకితమొనర్చుటకు నిశ్చయించుకొనెను.

పిమ్మట కవి తన వంశమును "వేమనారాధ్యుడు మొదలుకొని తన వఱకును కొనసాగిన ప్రకారమును" విపులముగా వర్ణించెను.[2] వంశకథనానంతరమొకనాడు సకల వేదశాస్త్రాగమ పురాణేతిహాసాది విద్యావైదుష్యములనలరారు తనుజులు, అనుజులు- ఆ పాపయారాధ్యుని పరివేష్టించియుండిరి. అపుడాతడు తన మహాప్రబంధమునకు కృతిపతియగు "షట్స్థల బ్రహ్మానంద యతీంద్రుని[3] మాహాత్మ్యములను" అభివర్ణించెను. పిమ్మట షష్ఠ్యంతములు కొనసాగినవి.

---

1. వే.ఆ.చ. 1-47.
2. వే.ఆ.చ. 1-50 నుండి 175 వఱకు కవి వంశవర్ణనము గలదు. కవి జీవిత విశేషములకు సంబంధించిన ప్రథమ ప్రకరణమున ఈ వంశోదంతమును పూర్తిగా వివరించుట జరిగినది.
3. వే.ఆ.చ. 1-175 పాపయారాధ్యులకు మాతామహుడును, గురుడును, దేశికుడును ఐన శంభులింగార్యులు నిరాభారి వీరశైవదీక్షను గైకొనిన పిమ్మట వారి దీక్షానామమే "షట్స్థల బ్రహ్మానంద యతీంద్రులు"-

అనంతరము "నా యొనర్చంబూనిన శ్రీ మద్వేమనారాధ్య చరిత్రంబను నితిహాసంబు"నకు కథాక్రమం బెట్టి చందంబునం బ్రవర్తిల్లెనని యడిగిన. అను వచనముతో. సర్వసాధారణ ప్రబంధరీతిలో కథ ప్రారంభింపబడినది.

పార్వతీ పరమేశ్వరుల విహార భూమియైన కైలాసపుర వర్ణనముతో కథా ప్రారంభము జరిగినది. కైలాస సభలో పార్వతీ పరమేశ్వరులు సింహాసనముల నాసీనులై యుండిరి. సర్వదేవతల కోలాహలములతో ఆ పరమేశ్వరుని కొలువు పరమానందదాయకమై యలరారెను.

లీలావతారమూర్తియగు వేమనారాధ్యుడు భువినుండి దివికి యథేచ్ఛా విహారములు సలుపుచు శివసేవలు కావించుట గమనించిన పార్వతీదేవి యా మహాపురుష వృత్తాంతమును వినగోరెను. అప్పుడా పరమశివుడు "భువియందు శైవధర్మ పరిరక్షణము కావించుటకై యేర్పడిన వీరభద్రుని లీలావతారమే యీవేమనారాధ్యు"డని వచించెను. మఱియు నా వేమనారాధ్యుని సమస్త వృత్తాంతమును సంగ్రహముగా, క్రమప్రకారమున దెల్పెను.1 సంక్షిప్తముగా దెల్పబడిన వేమనారాధ్య చరిత్రమునందు సముత్సుకితయైన పార్వతి దానిని విపులముగా వివరింపుడని కోరగా నాపరమేశ్వరుడాయుదంతమును విశదముగా వివరింపసాగెను.

పరమేశ్వరుడు వక్తగా పార్వతి శ్రోతగా సాగినది యీ వేమనారాధ్య చరిత్రము.

## దక్షయజ్ఞ కథనము

దక్షుడు యజ్ఞ నిర్వహణమునకు పూనుకొనెను. అతడు పరమేశ్వరుని తప్ప అందఱిని (సర్వ దేవతలను) ఆహ్వానించెను. బ్రహ్మ, విష్ణువు, ఇంద్రాది దేవతలందఱును, మునీశ్వరులును, దివ్యజాతుల వారును, ఆ యజ్ఞమునకు విచ్చేసిరి.

ఆహ్వానము లేకున్నను శివుని సమాధాన పఱచి, సతీదేవియు యజ్ఞవేదికను సమీపించెను. దక్షుడామెను సముచిత రీతిని గౌరవింపలేదు సరిగదా

1. వేమనారాధ్య చరిత్రము. 1-221.

మీదు మిక్కిలి కించపఱచెను. అంతేగాక అతడు శంకరుని నిందించెను. సతీదేవినవమానించినందులకు దధీచి మున్నగు మునీశ్వరులు దక్షుని మందలించిరి. దక్షుడు వారిని తూలనాడెను. అంతట నామునులు దక్షుని శపించి యచటినుండి వెడలిపోయిరి. శంకర నింద యొనర్చినందులకు కట్టలుకవహించిన వేదములు దక్షుని దుర్గతి పాలగునట్లు శపించి, వెళ్ళి పోయినవి.

అవమతికి గురియైన సతీదేవి చిదగ్ని విలీనమయ్యెను. ఈ వార్తలందిన వెంటనే యీశ్వరాదేశము ననుసరించి, వీరభద్రుడు పరివారములతో విచ్చేసి, శివాపచారముల నొనర్చిన దక్షుని శిరమును ఖండించెను. అచటికి వచ్చిన దేవతల నందఱిని యథార్హముగా శిక్షించెను. దేవతలందఱును వీరభద్రునకు విధేయులై స్వస్వనివాసముల కరిగిరి. దక్షుని కాంతలార్తితో కీర్తింపగా పరమేశ్వరుడు కనికరించి మేషముఖ మమర్చి, దక్షునను గ్రహించెను.

ఆ దీక్షాయణియే పార్వతిగా నవతరించి, పరమేశ్వరునకు పత్నియైన దనగా కథ వినుచున్న పార్వతి ముసి ముసినవ్వుల వెలార్చెను.

భూలోకమున పరవాదుల విజృంభణము నరికట్టి శైవమును సుప్రతిష్ఠిత మొనర్చి, రమ్మని యీశ్వరుడు వీరభద్రునాదేశించెను. అతఢందులకు సన్నద్ధుడయ్యెను.

## ద్వితీయాశ్వాసము

శివాదేశము ననుసరించి భువియందు లీలావతారి యగుటకు వీరభద్రుడు బయలు దేఱెను.

శ్రీగిరికి దక్షిణమునగల "బెలిదీవి" నివాసి విజయశర్మ. ఆయన భార్య సౌభాగ్యవతి. అది (వారిది) వేదశాస్త్ర విద్యాసంపన్న కుటుంబము. ఆ దంపతులకు సంతులేదు. సంతానార్థమై యాదంపతులు శ్రీపర్వతమున శివుని గూర్చి తపమొనర్చిరి. పరమ శివుడు వారిని కరుణించెను. శివసంకల్పానుసారము వీరభద్రుడు మల్లికార్జున లింగ గర్భ సంభూతుడై, లింగ పురోభాగ

మున శిశువై ప్రాకృతునివలె విలసిల్లెను. ఆ శిశువును శివప్రసాదునిగా ఆ దంపతులు స్వీకరించి, పరమేశ్వరున కానందాశ్రువులతో కృతజ్ఞతలు చెల్లించుకొనిరి.

భర్తనుండి శిశువు నందుకొని యా మాతృమూర్తి (సౌభాగ్యవతి) వానిని తన గుండెల కద్దుకొనెను. స్తన్యము పొంగారెను. ఆ తల్లి తన గుండెలలో గూడుకట్టుకొనిన కోటి మరులు క్రుమ్మరించి, తన ముద్దుల వట్టికి తనివి తీర సకలోపచారముల నొనర్చినది. ఆ శిశువు వేమనారాధ్య నామముతో విద్యాబుద్ధుల గఱచుచు వెలుగుచుండెను. అతడు త్రిపురాంతకమున తల్లి దండ్రులతో గూడ శివసేవలొనర్చుచుండెను.

తల్లిదండ్రులు వేమనారాధ్యునకు ఉపనయనము చేయ సంకల్పించిరి. అది గమనించిన త్రిపురాంతకేశ్వరుడు, సిద్ధుని రూపమున విజయ శర్మ గృహమునకే తెంచి, వేమనారాధ్యునకు శివదీక్ష ననుగ్రహించెను. ఉపనయన, లింగధారణ దీక్షా కార్యక్రమములు ముగిసినవి.

వేమనారాధ్యుడు సత్యవ్రత పూర్వకముగ శైవపారమ్య పునరుద్ధరణకు "ప్రతిజ్ఞ"ను స్వీకరించెను. అనంతర మొకనాడు వేమనారాధ్యుడు త్రిపురాంతకుని సన్నిధికేగి స్తుతులొనర్చెను. వేమనారాధ్యుననుగ్రహింపదలచిన త్రిపురాంతకేశ్వరుడు అయనకు "సిద్ధసారస్వతంబు"ను మహావిద్యను ప్రసాదించెను. పిమ్మట వేమనారాధ్యుడు గురుపట్టభద్రుడయ్యెను.

ఒకనాడు వేమనారాధ్యుడు లింగ నిరీక్షణమున (లింగములో) సర్వ దేవతా విలసితమైన శ్రీగిరిని దర్శించెను. ఆనందముతో పొంగిపోయెను. మఱునాడు స్వయముగా శ్రీశైలమును గాంచుటకై యా వేమనారాధ్యుడు మాహేశ్వర గణములతో గూడి బయలుదేఱెను. వారు చుక్కల పర్వతమెక్కి శిఖర దర్శనము గావించిరి. భైరవుని పూజించిరి. సాక్షి గణపతిని సేవించిరి.

వారు మల్లికార్జున మందిరమునకేగి, ముందుగా "ధూళి దర్శనము" చేసికొనిరి.[1] మల్లికార్జున లింగముపై శీర్షములమోపి, భ్రమరాంబా మల్లేశ్వరులకు నతి నుతులు సల్పిరి. దర్పణాంతర్వర్తియైన మల్లేశ్వరునిగాంచి[2] (దర్పణమున) ఆనందాశ్రువుల నభిషేకించిరి.

పాతాళ గంగాదర్శన స్నానముల వారు పరమానంద భరితులైరి. సిద్ధుని రూపమున మల్లికార్జున స్వామి వేమనారాధ్యుని పరీక్షించెను. ఆ పరీక్షలలో నాతడు నెగ్గి, శివానుగ్రహముతో "సిద్ధవిద్యోపదేశముల"ను పొందెను.

అనంతరము వేమనారాధ్యుడు శైవగణ పరిషత్తును వెంటనిడికొని, విజయ యాత్రా సన్నాహముల నొనర్చెను. ముందుగా సిద్ధవటము మీదుగా మధురకు ప్రయాణమయ్యెను.

## తృతీయాశ్వాసము

పరవాదుల విజృంభణము నరికట్టుటకై శైవగణమండలితో గూడి మధుర కేగుచు వేమనారాధ్యుడు మార్గమధ్యమున కావలిలో నాగెను. అచట సుకేతుడను శివభక్తుని ప్రార్థనపై వానియింట శివపూజకు నంగీకరించెను. పూజకు ఏర్పాట్లు పూర్తియైనవి. శివపూజా పుష్పములను దెచ్చుటకై వెళ్ళిన సుకేతుని సుతుడు సరస్సులోని మొసలి కారణముగ మృత్యువు వాతబడెను.

---

1. ధూళి దర్శనము :- శ్రీ పర్వతముపై అడుగిడిన భక్తులు పాద ప్రక్షాళనము చేయకయే, పాదధూళితోడనే ఆలయమున ప్రవేశించి, మల్లికార్జునలింగమును (మల్లేశ్వరుని) దర్శించుటను "ధూళిదర్శనమ"ందురు ఆయాచార మిప్పటికిని గలదు.

2. మల్లికార్జునస్వామిని సేవించి, గర్భగుడిలో లింగముపై శీర్షమునుమోపి "మల్లేశ్వరా ! వచ్చితిని" అని పలికి, యాస్వామి సేవలయనంతరము, ఆ గర్భమందిర ద్వారముకడకు వచ్చి, అచటనున్న "అద్దములో ఆ మల్లేశ్వరలింగమును దర్శించుటను" "దర్పణ దర్శనమ"ని యందురు. ఈ యాచారము నేటికిని పాటింపబడుచున్నది.

పూజానంతరము వేమనారాధ్యుడు పాదతీర్థ ప్రసాదములను సుతునితో గూడి స్వీకరింపుమని సుకేతునితో ననెను. అతడు గురునకు తన సుతుని మృతిని దెలిపెను. గురుడా గ్రహోదగ్రుడయ్యెను. శివ పరిచర్యలలో నున్న సుకేతుని సుతుని కబళించిన "మృత్యువు"ను శిక్షించుటకు గురుడు తన "లింగ పసాయిత" మనుకత్తిని బంపెను అది యమపురికి జేరి. దాని నల్ల కల్లోల మొనర్చెను యముడు విషయమును గ్రహించి, బాలుని బ్రదికించి వానిని గురున కప్పగించి, రమ్మని. మృత్యుదేవత నాజ్ఞాపించెను. వెంటనే మృత్యువు, బాలుని గురు సమక్షమున నిలిపెను. గురువు మృత్యువును మందలించి, పంపివైచి, యంగళిని పాదతీర్థ ప్రసాదములతో ననుగ్రహించెను, సుకేత సుతునకు శివదీక్షను బ్రసాదించెను.

అనంతరము గురు వర్యుడు తన పరివారములతో మధురానగరమున బ్రవేశించెను. ఆ నగరమును పాండ్య వంశజుడైన మత్స్యధ్వజ మహారాజు పాలించుచుండెను.

వేమారాధ్యుల శివపారమ్య ప్రబోధ కోలాహలములు నగరమునం దెల్లెడల ప్రతిధ్వనించినవి. దానిచే వైష్ణవులు కలవరములకు లోనైరి. సమాలోచనముల సాగించిరి. తమ శ్రేష్ఠత్వమునెడ మస్సున సన్నగిల్లుచున్నందులకు కలత పడిరి. పాండ్యభూపతిని జేరి, వేమనారాధ్యుని విజృంభణమును, వాని వైభవ ప్రాభవములు మధురయందంతట సందడించుటను, తద్విషయమున పౌరుల మర్యాదా సమాదరణంబులను, వివరించిరి. సభనేర్పఱచి, యారాధ్య గురువుల రప్పించి, వాదముల జరిపింపుడని కోరిరి. "ఆ సభలో మేము విష్ణు పారమ్యమును బ్రకటింతుము. లేదా మేము కావేరీ తీరములజేరి, భాగవత సేవలతో కాలము వెళ్ళబుత్తుము." అనుచు వారు పరిపరివిధముల రాజును వేడుకొనిరి.

అపుడు రాజు తాను విన్న యాయారాధ్య గురువర్యుల ప్రాభవ విశేషముల నుగ్గడించి, వాద సభ విషయమున బునరాలోచింపుడని వైష్ణవాచార్యులను గోరెను.1 ఏది యేమైనను వాదసభ కే వారు పట్టుబట్టుటచే పాండ్యభూపతి

1. వే.ఆ.చ. 3.93, 94,95,96,97,

యందుల కంగీకరించెను. రాజసభ కాహ్వానించుచు ఆ ప్రభువు వేమనారాధ్యుల కడకొక దూతను బంపెను.

దారముఖమున ఆహ్వానమునందు కొని వేమనారాధ్యుడు సపరివారముగా రాజసభకరుదెంచెను. అందఱును సుఖాసీనులైరి. రాజు గురువునకు నమస్కరించెను. "సర్వేశ్వరుడైన పార్వతీపతి రాజాయొక్క మనోఽభీష్టములను దీర్చుగాక" యని గురువర్యుడాశీర్వదించెను

సర్వేశ్వరుడు శివుడనుట తగదనియు, ఆ మహావిష్ణువు మాత్రమే పరమదైవమనియు పలుకుచు వైష్ణవులు శైవ గురువును ప్రతిఘటించిరి. గురువునకును వైష్ణవులకును దైవపారమ్య విషయమున వేదాగమ పురాణాది ప్రమాణములతో తీవ్ర వాదోపవాదములు సుదీర్ఘముగా కొనసాగినవి. గురుని వాద ధాటికి తట్టుకొనలేక కడకు వైష్ణవులు నిరుత్తరులైరి. శైవము నెగ్గినట్లయ్యెను. కాని పండితుల వాదబలాబలములను బట్టి దైవ పారమ్యమును నిర్ణయించుట సరికాదని పాండ్యుడనెను. ప్రత్యక్ష నిరూపణమే పరమ ప్రమాణము కాగలదనిన నరపతి పలుకుల కందఱు నామోదించిరి.

అందఱును గుడికేగి సుందరేశ్వరుని సమక్షమున నిలిచిరి. శైవ పారమ్యమును నిరూపించుచు సాక్ష్యమిమ్మని సుందరేశ్వరుని వేమనారాధ్యులభ్యర్థించెను. వెంటనే సుందరేశ్వరుడు "ఓంకారము" నుచ్చరించుచు సాక్ష్యమిచ్చెను. పిమ్మట గురువర్యుడు నందీశ్వరు నభ్యర్థించెను. స్థావరరూపమున నున్న నందీశ్వరుడు లేచివచ్చి, యచటగల యిక్షు ఖండములను భక్షించి, పిమ్మట యథా ప్రకారము తన స్థావరాకృతిని స్వీకరించెను.

ఈ ప్రమాణద్వయ నిదర్శనముతో నెల్లరును శైవ పారమ్యము నామోదించిరి. వెంటనే పాండ్యరాజు గురునకు విధేయుడై శివదీక్షను స్వీకరించెను.

## చతుర్థాశ్వాసము

భద్రగజారూఢుడైన వేమనారాధ్యుడు తల్లిదండ్రులతో పరివారములతో మధురను వీడి బెలిదీవి చేరెను. పురజనుల స్వాగత సత్కారములతో స్వగృ

హమున నడుగిడెను. ఆ గృహము నిత్యము శివతత్త్వ గోష్ఠులతో ప్రతిధ్వనించుచు వచ్చెను.

వేమనారాధ్యుని భాషావైదుష్యములకును, శాస్త్ర కౌశలములకును, వయో విలాసములకును ముచ్చట పడిన భానుమంతుడు తన దుహితయగు "విజయలక్ష్మి"కి తగిన వరుడితడేయని నిశ్చయించుకొనెను. భానుమంతుని యభ్యర్థనకు విజయశర్మ సమ్మతించెను. పెద్దలయామోద ప్రమోదములతో, నాశీస్సులతో, విజయలక్ష్మి వేమనారాధ్యులకు వివాహ మహోత్సవమతివైభవముగా జరిగెను.

వేమనారాధ్యుని గృహస్థ జీవితము యథా విధిగా కొనసాగుచుండెను. అనంతరమొకనాడు ఆరాధ్యవతంసులైన పెద్దయ్యగారు పుష్పగిరి నుండి వేమనారాధ్యుని కడకు విచ్చేసిరి. అతిథి సపర్యలనందిరి. ఇట్లు కొన్నినాళ్ళు గడిచినవి.

పుష్పగిరిలో విరూపాక్ష మఠ స్వాముల కడ ఆరాధ్య శైవులకు గౌరవాదరములు సన్నగిల్లినవనియు, మీరచటికి వచ్చి, వానిని చక్కజేయవలెననియు, పెద్దయ్య గురువర్యుని కోరెను.

వెంటనే గురువర్యుడు పరివారములతో, పాండ్యుడిచ్చిన బలములతో పుష్పగిరి చేరువకు చేరెను. విరూపాక్ష మఠ పక్షమువారితోడను, వారి పక్షమున నిలచిన చోళనరపతి బలములతోడను, గురుని పక్ష బలములకు పోరు ఘోరముగా సాగెను. కడకు గురుని బలములు విజయ దుందుభి మ్రోగించినవి. విరూపాక్ష మఠ పరివ్రాజకులు వేమనారాధ్యుని యెదుట వినమ్రులైరి. గురుడువారియెడ ఆర్ద్రభావమును ప్రకటించెను.

విరూపాక్ష దేవుల సన్నిధిలో వేమనారాధ్యునకాచార్య పీఠ మర్యాదలు లభించెను.

చోళుడు మొదలగు వారికి గురుడు శైవదీక్షల ననుగ్రహించెను. పండిత గోష్ఠులతో గురుని విజయ పతాకము రెపరెపలాడెను. పెద్దయ్య ప్రభృతులకును పెద్ద పీటలు వేయబడెను.

## పంచమాశ్వాసము

వేమనారాధ్యుడు సపరివారముగా పుష్పగిరిని వీడి, శ్రీరంగమునుజేరెను. గురుడు కావేరీ నదిలో పవిత్రస్నానముల నొనర్చెను. గుహేశుని దర్శించి, శివానుగ్రహముల నందెను. శ్రీరంగశాయిని దర్శింపగోరి, చారునివలన తన రాకను జియ్యరుల వారికి తెలియజేసెను. జియ్యరు వారందులకు సమ్మతింపక దూతను దుర్భాషలాడి వెనుకకు పంపివైచిరి.

అందులకు కుపితుడైన గురుడు తన మహిమలచే రంగనాథుని దేవాలయ ముఖద్వారముల తలుపులు బంధింపబడునట్లు చేసెను. గురుడు గుడికి చేరుటతో ఆ తలుపులు తెఱచుకొనెను.

"శివుడు విశ్వాధికుడు. నేను తదాజ్ఞావశవర్తిని" అని, యందఱు విను నట్టుగా నపుడు శ్రీరంగనాథుడు పలికెను. పిదప గురుడు శివగణ బాలకునిచే కావేరీ జలముల నన్నింటిని ద్రాగించెను.

గురుని శక్తిని గమనించిన వైష్ణవ స్వాములు భయపడి, నయ వినయముల వినమ్రులై గురుని సేవించిరి. వారిని దేశకోత్తము దనుగ్రహించి, కావేరీ జలములను మఱల బ్రసాదించెను. స్థానిక పాలకుడైన శాతవాహన నరపతి గురుని పాదములనాశ్రయించి, అగ్రహారములను కానుకగా సమర్పించెను వానిని గురుడు మహేశ్వరుల కర్పించెను.

అనంతరము వేమనారాధ్యుడాత్మీయ గణములతో శ్రీరంగమును వీడి పశ్చిమాభిముఖుడై ప్రయాణముల గావించెను. మార్గమధ్యమున దాడిచేసిన దొంగలపైనతడు మంత్రభస్మమును జల్లెను. తత్ప్రభావమునవారు శివభక్తి తత్పరులై, గురునకు విధేయులై, వెడలిపోయిరి. పరివారములతో గురుడు త్రిలింగపురికి జేరెను.

ఈ త్రిలింగ పురికే "అచ్ఛిద్ర కర్ణపురము"నియు నామాంతరము. గోహింసా పరులగు తురుష్కఖానులానగర పాలకులు. అచటి పరవాదుల యాగడములనరికట్టుటకై తత్పుర ప్రాంతమున ననుచరులతో గురుడు అచ్చట విడిసెను.

ఆరాధ్య శైవబ్రాహ్మణుడగు "దేవయ్య"యను వానివలన తురుష్క పాలకుల దుండగముల నెఱంగి, శైవసమయ ప్రయోగమొనర్చి, గురుడచట నల్లకల్లోలములను సృష్టించెను. ఆ తురుష్క భూపతి భయకంపితుడై, యను చరులతోగూడి, గురుని పాదములచెంత విధేయుడై, నిలిచెను. గురునను గ్రహముతో ప్రశాంతి కుదురుకొనెను.

తురకరాజు వైఖరికి తురుష్క పురోహితులైన ఖాజీలు కినుక వహించిరి. గురునితో వాదమేర్పఱచు మనిరి. రాజు వాద సభనేర్పాటు చేసెను. ఆ ఖాజీలు గురునితో వాదప్రవాదములు కావించిరి. గురుని చేతిలో వారు పరాజితులైరి. పసిబాలుని యాశ్చర్యకరమగు పలుకులతో సందఱిలోను ఆస్తిక్య బుద్ధి యేర్పడెను. యవనభూపతి వేమనారాధ్యునకు "దుర్గ పురము" అనుగ్రహారమును, వివిధములగుకానుకలను సమర్పించెను.

గురుడచట మూడు సంవత్సరములు నివసించెను. గురు పట్టపుదంపతులకు శివానుగ్రహమున నచట పుత్త్రిలాభము కలిగెను. నందీశ్వర నామముతో నతడు వర్ధిల్లుచుండెను. గురుడచటినుండి కల్యాణ నగరమునకు కదలెను.

## షష్ఠాశ్వాసము

బసవేశ్వరుని దర్శనానందమునకై తహతహలాడుచున్న వేమనారాధ్యుడు తన వారితో తిన్నగా కల్యాణనగర పరిసరములజేరెను.

కల్యాణ నగరమున మాధ్యాహ్నిక శివపూజా నిమగ్నుడైన బసవేశ్వరుడు తన కరపీఠమునందలి లింగమున శ్రీవేమనారాధ్యుని రాకనుగాంచి, యుప్పొంగి భక్తబృందములతో గురున కెదురువచ్చెను. బసవన గురునకు పాదాభివందనమాచరించెను. నగరమునకు జేర్చి వారిని విడుదులతో ప్రవేశపెట్టెను.

అనంతరము గురుడల్లమ స్వామికి పాదాభివందన మాచరించెను. గురుడట నొకమాసము గడిపెను.

బిజ్జల భూపాల సంస్థాన పండితుడగు అనంతశాస్త్రి శివభక్తులయెడ సముచిత గౌరవాదరములను చూపనందులకు భైరవ ప్రయోగమున గురుడాతని ప్రాణముల నాహరించెను.

ఆ సందర్భము పూర్వాపరముల నెఱింగిన బిజ్జల భూపతి వేడుకొనగా గురుడాయనంతశాస్త్రిని పునరుజ్జీవితుని గావించెను. అనంతశాస్త్రి గురుపాదముల నాశ్రయించెను. బిజ్జలుడు గురునకు చతురంగ బలములతో గూడ పెక్కు కానుకలను సమర్పించెను.

ఆ రాజసభలో నిత్యము గోష్ఠులొనర్చి, గురుడు వేవిధముల శివ పారమ్యమును ప్రకటించుచు వచ్చెను.

ఒకానొక ప్రత్యేక సందర్భమున గురువయ్యదు నిండు సభలో తన యజ్ఞోపవీతము నుండి, అమృతధారలు స్రవింపజేసి, యారాధ్యశైవ పారమ్యమును సదస్యుల సమక్షమున నిరూపించెను.

పిదప ఉత్తర భూములకు వెడలుటకై గురుడు సన్నాహములలో నుండెను. ఈ వార్తను విని బసవన గురునికడకేతెంచి, తత్పాదములపై వ్రాలి, తమయింట విందారగించి, ప్రసాదము పెట్టి, యనుగ్రహింపవలసినదిగా వేడెను.

అపుడు గురుడు అందులకు తన సన్నద్ధతను తెలుపలేక పోయెను. మఱియు నాతడు "వైదికావైదిక శివదీక్షలను బట్టి బాహ్య భేదమరయుట దేశికాచార పద్ధతి" శివభక్తులయెడ కులభేదము లేదనుట "అర్థ వాదము"1 కావున భక్తితోడి వలపు బ్రాహ్మ్యంబుతో పొత్తు, పాయరాదుమాకు బసవలింగ !" అని పలికెను.

మఱల బసవన తన కోరకను పునరుక్తమొనర్చెను. అల్లమస్వామి మాధ్యస్థ్యమున ఆయుభయులును దివ్యదేహధారులై సహభోజన లాభములను పొందిరి.

---

1. వైదిక సిద్ధాన్తములయెడ ప్రరోచనమును (అభిలాషాతిశయమును) గల్గించుటకై చేయబడిన యాఖ్యాయికాది కథనమును "అర్థవాదము" అని వ్యవహరింతురు.

అనంతర మాయిరువురును యథాపూర్వదేహముల నందిరి. బసవన యర్పించిన కాన్కలను స్వీకరించి, గురువర్యుడు ఉత్తరదేశయాత్ర ఆసపాలుర నాదరించుటకై యాత్మీయులతో నటనుండి బయలుదేరెను.

## సప్తమాశ్వాసము

గురుని ప్రయాణము పాండురంగ క్షేత్రాభిముఖముగా సాగెను. మార్గ మధ్యమున అడవి యేనుగుల గుంపు వారినడ్డగించెను. గురుడులింగాభిషేక జలములను వానిపై జల్లెను. తత్ప్రభావమున గజములు స్వస్వరూపములను వీడి గంధర్వరూపములను దాల్చెను. అనంతరము గంధర్వులు గురుని శరణు వేడిరి.

## గంధర్వశాప విముక్తి

కౌండిన్యముని నిజాశ్రమమున తపమొనర్చుచుండెను. ఆ తపమును భంగమొనర్చుటకు దేవేంద్రుడు గంధర్వులను బంపెను. వారాకౌండిన్యుని కడ (కపట) శిష్యులుగా జేరి, ఈ యాశ్రమ వాతావరణమును కలుషిత మొనర్పసాగిరి. వారి దుర్బుద్ధిని గమనించిన కౌండిన్యుడు వారికి గజరూప ములు ప్రాప్తించునట్లు శాపమిచ్చెను. పశ్చాత్తప్తులై వారు శాపవిముక్తికై ప్రాధేయపడగా "కౌండిన్య వంశజుడగు గురుని యనుగ్రహమున శాపవిముక్తి కలుగునని తెల్పెను. ఇప్పుడీవిధముగా శాపవిముక్తి లభించెనని, ఆ గంధ ర్వులు గురునకు దెల్పి, కౌండిన్య వంశజులకు దివ్యప్రభావములు కలుగునట్లు వరములిడి వారు గురువునుండి యనుమతి గొని, దివికి వెడలిపోయిరి.

క్రమముగా ననుయాయి గణముతో గురుడు ముందునకు సాగి, భీమ రథిని, నర్మదను[1] సేవించెను. పిదప నౌకద్వీపమున విడిసెను. అచట హఠా త్తుగా సంభవించిన "జలప్రళయము" గురు ప్రభావమున నివారితమయ్యెను. గురువర్యుడు పాండురంగ క్షేత్రమును సమీపించెను.

---

1. కల్యాణ నగమునకును - పాండురంగ క్షేత్రమునకును మధ్య నర్మద లేదు. ఈ ప్రస్తావన భ్రమప్రమాద జనితము.

వారికి పాండురంగ పురప్రవేశమునకు పరీక్షాత్రయ మెదురయ్యెను. గురుడు నగరమున ప్రవేశింపక తత్ప్రాంత శివాలయ ప్రాగ్భాగమున గల వటవృక్ష చ్ఛాయలలో విడిసెను. అతడు శరభసాళ్వని స్తుతించెను. సాళ్వశక్తి ప్రభావమున పాండురంగనగర మంతయును రోగగ్రస్తమయ్యెను. పాండురంగని హెచ్చరికతో తెలివితెచ్చుకొనిన నగరముఖ్యులెల్లరును గురుని చెంతకు చేరి, యాయనను పురమున కాహ్వానించిరి.

నగర ప్రవేశమునకు గురునకాటంకములు తొలగినవి. సర్వమునసుకూలించెను. పాండురంగనిని దర్శించెను. ఆ పాండురంగని శిరమునగల శివలింగమును గాంచెను. పాండురంగని కంజలి ఘటించెను. పదిమాసములటవసించెను.

మల్లికార్జున పండితారాధ్యులనుండి దూతద్వారా గురున కాహ్వాన లేఖయందెను. వెంటనే ద్రాక్షారామముఖముగా గురుడు ప్రయాణములను ప్రారంభించెను. మందతేంద్ర పురమును సమీపించెను.

మందతేంద్రుడను నరపతి ప్రజారంజకుడై తత్పురమును రాజధానిగా జేసికొని, పరిపాలన చేయుచుండెను.

ఆ పరిసర ప్రాంత మహీపతులలో క్షత్రవల్లభుడొకడు. ఆతని తమ్ముడు శూరసేనుడు. క్షత్రవల్లభుని భార్య పద్మావతి. ఆ దంపతుల యనుంగు కూతురు "కుండలి". ఆ రాకుమారికి స్వయంవరము ప్రకటింపబడినది. స్వయంవరమునకు రాకుమారులు విచ్చేసిరి.

కుండలి చెలులతో వన విహారమునకేగెను. స్వయంవరమునకు వచ్చి, యా వన సమీపమున విడిసియున్న మందతేంద్రుడు వనమున జేరి, కుండలి కరగ్రహణ మొనర్చెను. కుండలి సౌముఖ్యములను గమనించి, యాత్తడామెను తన రథముపై నెక్కించుకొని, తన రాజధాని వైపునకు సాగెను.

స్వయంవరమునకు వచ్చిన రాకుమారుల కీవార్త తెలిసినది. చేయునది లేక వారిలో కొంతమంది వెడలిపోగా మరికొందఱు మందతేంద్రునితో పోరు

నకు దిగిరి. ఇంతలో క్షత్రవల్లభుఁడు తనబలములతో వచ్చి, మండలేంద్రునకు బాసటయయ్యెను. శత్రుపక్షములు తోకముడిచినవి.

మండలేంద్రునకును కుండలికిని పెండ్లి వేడుకలు కనులపండువుగా కొనసాగినవి. క్షత్ర వల్లభుని వీడ్కొని, మండలేంద్రుడు భార్యతోగూడి రథముపై బయలుదేరి, నిజపురమును సమీపించెను.

తత్పుర సమీపమునగల వనమున విడిసియున్న వేమనారాధ్యునిగాంచి, మండలేంద్ర రాజదంపతులు రథము దిగివచ్చి, గురునకు నమస్కరించిరి. గురువర్యుడు కుండలి నాశీర్వదించి, మండలేంద్రు నాశీర్వదింపదయ్యెను. రాకుమారుడు మఱల నతులొనర్చి, గురునియాశీర్వాదమును కోరెను. గురుడు మిన్నకుండెను

గురుడాశీర్వదింప నందులకాగ్రహించిన రాజకుమారుడు భార్యతో నటనుండి కదలి గృహప్రవేశ మొనర్చెను. అతడారాత్రి భార్యతో సుఖానుభవములనంది, నిద్రించెను. భార్యయు నిద్రించెను. ఇంతలో నొక కాలసర్పముచ టికివచ్చి, మండలేంద్రుని కాటువేసెను. సర్పదుష్టుడై యతడు మృతిచెందగా కుండలి విలవిలలాడెను. బంధువులెల్లరును పలవించిరి.

మండలేంద్రుని కళేబరమును గురుని పాదముల చెంతచేర్చిరి. గురువర్యుడు మంత్ర భస్మమును, భక్తుల పాదోదకములను ఆ మృతునిపై జల్లెను. గురుమహిమా ప్రభావమున నతడు పునరుజ్జీవితుడాయెను. ఆ రాజదంపతులు గురునకు కృతజ్ఞతాంజలుల నర్పించి ఆశీస్సులనందిరి. వారికి శివదీక్షలనిచ్చి, గురుడటనుండి కదలెను.

## అష్టమాశ్వాసము

అనంతరమను యాయులతో గురుడు కొలనుపాక చేరెను. అది షణ్మత సామరస్యములకు భద్రభూమి. కొలనుపాక నివాసి "ఉరిలింగార్యుడు" గురునకు స్వాగత సత్కారములను నెరపెను. ఉరిలింగార్యుని కోరికపై వేమనా

రాధ్యునాచార్యత్వమున దేవీ నవరాత్రోత్సవములచట నేత్రపర్వము గావిం చినవి.

దేవికి బలియిచ్చుటకై నరపతి యొకదున్నను బలిపీఠముకడ కట్టి వేయించెను. భటులనుండి తప్పించుకొని, యా దున్న ప్రాణరక్షణకై ఉరు లింగార్యునింట జొరబడెను. వేమనారాధ్యుడు దానికభయమిచ్చెను. ఆ దున్న విషయమై స్థానిక నరపతి గురునితో కొంత ఘర్షణకు దిగెను. తిన్నగా గురుని మహిమను గుర్తించి, యతడు గురుని పాదములచెంత వినమ్రుడై నిలిచెను. గురునకు కానుకలతో నగ్రహారముల నర్పించెను.

శివాలయమున సోమేశ్వరుని సమక్షమున పూర్వోత్తర శైవములలో "ఉత్తరశైవము" సర్వశ్రేష్ఠమని గురుడు నిరూపించెను.

ఆ కొలను పాకలో గురునకు ద్వితీయ పుత్త్రిలాభము కల్గెను. ఆ ముద్దుల శిశువునకు "పర్వతాలయ్య" అని నామకరణ మొనర్పబడెను. అచట వారు నాల్గుమాసములు నివసించిరి.

అటనుండి బయలుదేరి గురుడు తన గణములతో భద్రాద్రికి చేరువలో గల "హయపతినగరము"1ను జేరెను. రామశాస్త్రియను విప్రునివలన స్థానిక పరిస్థితులను గురువర్యుడు గమనించెను. "కలహకారిణీ" శక్తిని ప్రయోగించి, కల్లోలమును సృష్టించి, గురుడాహయపతికి బుద్ధి వచ్చునట్లు చేసెను. పిదప నాహయపతి గురునివలన శివదీక్ష నందెను.

పిమ్మట గురువర్యుడా చేరువలోగల యగ్రహారమును జేరెను. పొరండ్ల సూరసానమ్మ యా యగ్రహార నివాసినియే. ఆమె మహాశివభక్తురాలు. ఆ సూరసానమ్మ గురువర్యునకును, మాహేశ్వర గణములకును పాదపూజ లొనర్చి, సకల సపర్యలు గావించి, వారి కతిథి సత్కారములనొనర్చెను. గురువర్యుడామెకు యోగశాస్త్ర రహస్యములను దెల్పెను. ఆమె యభ్యర్థనను మన్నించి, యామెను తన యనుయాయి గణమున జేర్చుకొనెను.

1. ఇది నేటి "అశ్వారావుపేట"గా వచ్చును.

అనుచరులతో నచటి నుండియు, ద్రాక్షారామదిశగా గురుడు ప్రయాణములను కొనసాగించెను. జైనప్రేరితులైన యిరువురు సాయుధులు వచ్చి, మార్గమధ్యమున వారినడ్డగించిరి. గురుడు తన మంత్రశక్తిచే వారిని దుర్బలుల గావించెను. వారు గురునకు పాదాక్రాంతులైరి. గురుడు వారికి "చాక్షుషీ దీక్ష"తో శివదీక్షల ననుగ్రహించెను. పిమ్మట గురువర్యుడాత్మీయ గణములతో ద్రాక్షారామమును సమీపించి, శివగంగ తీరమున నధివసించెను. మల్లికార్జున పండితుడు వేమనారాధ్యునకు స్వాగత మర్యాదలు సమకూర్చి, వారిని పురవీధుల నూరేగించుచు తన మందిరమునకు జేర్చెను.

మల్లికార్జున పండితుడు స్థానిక స్మార్తపండితులను ఎదుర్కొనిన విషయమును, గజపతిభూపతి మల్లికార్జున పండితునకు విధేయుడైన విధమును పండితస్వామికి నాచారపంక్తి గురుడైన ఇవటూరి మల్లికార్జునయ్య వివరింపగా వేమనారాధ్యుడు దెలిసికొనెను.

వేమనారాధ్యుడచట నొకసంవత్సరము గడిపెను.

ద్రాక్షారామమున గోపురసీమ నాసీనుడైయున్న వేమనారాధ్యునితో స్థానికుడైన నందశాస్త్రికి ఛందశ్శాస్త్ర పురాణాది విషయములందు వాద వివాదములు జరిగెను.

దేవతలు దిగివచ్చి, పండితుల వాదవివాదములను పరిష్కరింతురనుటను నందశాస్త్రి యాక్షేపించెను. దానిని గురుడు నిరూపింతుననెను. వెంటనే యాతడు సభకు నింద్రునాకర్షించెను. నందశాస్త్రి ప్రభృతులు చకితులైరి. ఇంద్రానుగ్రహముల కందఱును ఆనందించిరి.

## నవమాశ్వాసము

వేమనారాధ్యుడు విమతవాదములను పరాస్త మొనర్చిన పిమ్మట పురందరుడమరపురికి చేరుకొనెను.

ఇంద్రసాక్షాత్కారాది మహిమలను బ్రకటించిన వేమనారాధ్యునకు మల్లికార్జున పండితారాధ్య ప్రభృతులు జేజేలు పల్కిరి.

ఈ ద్రాక్షారామమునందు గురుపట్టపు (వేమనారాధ్య) దంపతులకు తృతీయ పుత్రోదయమయ్యెను. ఆ శిశువునకు" మల్లికార్జునుడు" అని, వ్యవహారనామ మేర్పడెను.

సర్వారాధ్య మహిమోపేతుడైన వేమనారాధ్యునకు రత్న ఖచితమైన బంగారు కిరీటము - అలంకరింపబడెను. మల్లికార్జున పండితారాధ్యుడు మొదలగు పండితు లెల్లరును వేమనారాధ్య గురువర్యునకు బ్రహ్మరథము పట్టిరి.

అసూయాగ్రస్తులైన గౌడ బ్రాహ్మణులు గజపతి నృపతిపజ్జకేగి, రాజలాంఛనమైన స్వర్ణకిరీటము నొక బ్రాహ్మణుడు ధరించుట విడ్డూరమనియు, వేమనారాధ్యునకు జరిగిన బ్రహ్మరథ మర్యాదలు స్థానిక పండిత మండలి కవమానకరములనియు, పలికి, యా నరపతి మనస్సును మలిన మొనర్చిరి.

ఈ యపచారములు క్షమార్హములు కావని భావించిన గజపతి వారి నుండి సమాధానమును కోరుచు నొక సచివుని ఆరాధ్యుల కడకు బంపెను.

సచివుడు గొనివచ్చిన రాజసందేశమునకు పండితారాధ్యుడాగ్రహావిష్టుడయ్యెను. భీమేశ్వరుని గుడిముందర (భీమేశ్వర సమక్షమున) సమస్యలు పరిష్కారమగునని, యా సచివునితోడనే ప్రత్యుత్తరము పంపబడెను.

ఉభయపక్షముల వారును దేవుని గుడియెదుట నిలిచిరి. ఏనుగు తొండమున "దండ" యుంచబడెను. ఎవరిమెడలో నీయేనుగు దండను వేయునో వారి రాజ్యమునకు ప్రభువులయ్యెదరని ప్రకటింపబడెను.

ఏనుగు దండతో ముందునకు సాగెను. అది యాదండను "వేమనారాధ్య గురువర్యుని కంఠమున" వేసెను. సదస్యుల కరతాళధ్వనులు మిన్నుముట్టెను. నరపతి (గజపతి భూపతి) గురువర్యుని పాదముల వ్రాలి క్షమింపుడని వేడుకొనెను. గురుడు రాజునకు క్షమాభిక్షను ప్రసాదించెను.

బండారు లంకకు సధిపతి దొడ్డమంత్రి. అతడు సద్గురు రేశ్వర సేవా పరిపూతచిత్తుడు. తన సమస్త సంపదలను శివార్పణ మొనర్చుచు జీవించువాడతడు. హఠాత్తుగా వచ్చిన పెను జడివానకు తుఫాను చెలరేగగా ఆ ఇళ్ల

ప్రళయముసుండి తోడివారిని కాపాడిన మహిమాన్వితుడాతడు. వేమనారాధ్యులకును, పండిత స్వాములకును దొడ్డమంత్రి పాదపూజలొనర్చి, వారియాశీస్సుల నందెను.

పండితారాధ్యుని, తత్పత్నియగు సావిత్రీదేవిని పిల్చుకొని, దొడ్డమంత్రి ప్రభృతులనామంత్రించి, వేమనారాధ్యుడు నిజ పరివారములతో గురుస్థానమైన త్రిపురాంతక క్షేత్రమునకు బయలు దేఱెను.

ప్రయాణ మధ్యమున గురువర్యుడు సముద్రస్నానముల నొనర్చెను.

పిదప "పట్టిస" గ్రామము చేరి, యచటి "శివ" "వీరభద్రు"లను సేవించెను. స్వప్నమున వీరభద్ర సాక్షాత్కారముల నందెను.

పిమ్మట పరివారములతో నతడు గోదావరిదాటి, గయాసురునకు బుద్ధి చెప్పి, స్థానిక బ్రాహ్మణునిచే శివాలయ నిర్మాణము చేయించెను. పాలకొలను చేరి, యచటి రామేశ్వరుని సేవించెను. ఆ నగరమున "పద్మావతి"యను నొక వేశ్య శివభక్తురాలై యుండెను. ఆమె తన యిష్టలింగమదృశ్యముకాగా గురుపాదముల నాశ్రయించి, లింగమనుగ్రహింపుడని వేడుకొనెను. పద్మావతి హృదయమును పరీక్షించి, తన మహిమచే గురుడాలింగమును దెప్పించి, యామె కప్పగించెను. కలికాలమున శాంబరీశక్తి పనిచేయకుండునట్లు గురుడు కట్టడిచేసెను.

అనంతరము గురుడు కాశీనగరము చేరెను. తత్రత్యుడగు మంచెన శంభులింగము "లింగ నిరీక్షణము"న (లింగమునందు) గురునిరాక నెఱిగి, యెదురేగి, గురునకు తన సేవలను సమకూర్చెను. అచటి భక్తుల సేవల నానందించుచు గురుడు కొన్ని వారములుగడిపి క్రమముగా కృష్ణాతీరమున నున్న "సరయూపురము" (రొయ్యూరు) చేరెను.

ఆ సరయూ పురపాలకుడు జరాసంధుడు అతడు కామాతురుడై పిచ్చిగా ప్రవర్తించి, ఆరాధ్యులచే శప్తుడై, మృతిచెందెను. ఆ యూరిలో గురుని ప్రవేశము - ఆరాధ్యుల కానందమును గూర్చెను. కృష్ణా పుష్కరముల నచట

గురుడు నిర్వహించెను. ఆరాధ్యుల సమర్చనముల యనంతరము గురువర్యుడు సపరివారముగ విజయ వాటికలో ప్రవేశించెను.

స్థానిక ప్రముఖుడైన నాగలింగార్యుడు నెరపిన స్వాగత మర్యాదలతో సపరివారముగా గురుడు విడుదుల నలంకరించెను.

కనకదుర్గను, మల్లికార్జునస్వామిని వ్యోమారాధ్యుడు సేవించెను. సహస్ర స్తంభ తాండవేశ్వర మంటపమున నతడు మాహేశ్వరులను భక్తితో గొలిచెను.

కృష్ణానదీ మధ్యమున జలముల కదుపు పెట్టిన నాగలింగార్యుని ప్రభావమును, ఆయన శిష్యుని భక్తి తాత్పర్యములను, వాని మహిమలను విని, వేమనార్యుడాయుభయులను ప్రశంసించెను.

వేమనారాధ్యుని వైభవముల కసూయపడిన కొందఱాయనపై ఉచ్ఛిష్ట గణపతిని (క్షుద్రశక్తులను) ప్రయోగించిరి.

దానిని గమనించిన వేమన దేశికుడు భైరవ ప్రయోగముతో దానిని త్రిప్పికొట్టెను. పాదాక్రాంతమైన యుచ్ఛిష్ట గణపతి శక్తిని క్షమించి యాతడు భైరవు నుపసంహరించెను.

కొన్ని దినము లచట మసలిన పిమ్మట గురుడనుయాయులతో ననంత శయన మార్గంబున కృష్ణానది నుత్తరించి, క్రౌంచామరేంద్రమును (అమరావతిని) జేరెను. చాముండీ - అమరేశ్వరుల సేవించెను.

దేవేంద్రుడచట గురుచంద్రునకు దర్శనమిచ్చి, "ఇంద్రదూతీ విమోచన విద్య"ను - ఆయన కొసగి సురపురి కరిగెను.

అమరావతిని వీడి గురువర్యుడు పిమ్మట "ఎనమదల" చేరి, వీరభద్రుని సేవించెను. తన సపర్యలకు మెచ్చి, సాక్షాత్కరించిన వీరభద్రునిలో గురుడు నిజకళలను నిక్షేపించెను. పిదప సపరివారముగ నాదేశికుడు త్రిపురాంతకమున నడుగిడెను.

దివ్యరూపమున త్రిపురాంతకు డెదురేగి, వేమనారాధ్యుని కౌగిలించుకొని, వాత్సల్యముతో తద్విజయ గాథలను వినియానందించెను శివగోష్ఠులతో నట గురుడొక్క సంవత్సరకాలమ్మును గడిపెను.

తనకు త్రిపురాంతకేశ్వరుడు ప్రసాదించిన "సిద్ధ సారస్వత మహా విద్య"ను గురుడు తన జ్యేష్ఠ కుమారుడైన నందీశ్వరారాధ్యున (నందయ్య) కుపదేశించి, త్రిపురాంతకేశ్వరుని యాజ్ఞతో సర్వజన సమక్షమున వానిని గురు పట్టాభిషిక్తుని గావించెను.

అనంతరము వేమనారాధ్యుడు త్రిపురాంతకుని యనుమతితో తన యనుచరులనుగూడి యటనుండి పాదచారమున బయల్వెడలి సిద్ధవటము మీదుగా శ్రీగిరికి తిరిగివచ్చెను. భ్రమరాంబా మల్లికార్జులను సేవించెను.

ఆరాధ్య సింహాసనము నధిష్ఠించుటకు దేశికుడు దీక్షితుడయ్యెను. దైవ సేవలు ముగిసినవి. బలిహోమపారణము లాచరింపబడినవి. సర్వదిఙ్ముఖముల నమస్సులొసర్చ బడినవి. పీఠస్థులకు వేదికోలు లర్పింపబడినవి.

నంది మంటపమున వేమనారాధ్యుడు బ్రహ్మరథము నధిష్ఠించెను. శివ కేశవాది సర్వదేవతలును, దివ్యజాతుల వారును, ఆ బ్రహ్మరథ మహోత్సవ మును తిలకించిరి.

ఆ యుత్సవానంతరము సాంప్రదాయికరీతిలో శాస్త్రమర్యాదల నాదరిం చుచు గురువర్యుడు "ఆరాధ్యసింహాసనము" నధిష్ఠించెను. భ్రమరాంబా మల్లి కార్జునులచ్చట నిలిచి, గురువర్యుని (వేమనారాధ్యుని) నిజాశీస్సులనాదరించిరి. దేవర్షి సంఘముల జయ జయ నినాదములతో దిక్కులు పిక్కటిల్లినవి.

"నిఖిలోపాస్యంబగు బ్రహ్మంబీతండు" అని సర్వ సమక్షమున ప్రక టితమయ్యెను.

నందీశ్వరారాధ్యుండు నతులొనర్చెను అతడు గురుచంద్రుని యాశీ స్సుల నందెను.

గురుదంపతులకు పరమారాధ్య మర్యాదలు సమాచరితము లయ్యెను. గురుపత్నియగు "విజయలక్ష్మి" శ్రీనగమున నిత్యత్వము నలంకరించెను.

ఈ విధముగా లోకారాధ్యమైన వేమనారాధ్య గురుదేవుల పుణ్యగాథను పరమశివుడు పార్వతికి దెలిపి, యారాధ్యుల కానందము గూర్చెను.

## వస్తు సంవిధానము

సాహిత్య వేత్తలు కావ్యవస్తువును (ఇతివృత్తమును) ప్రసిద్ధము, కల్పితము, మిశ్రమునని మూడు విధములుగా పేర్కొనిరి. అందు ప్రసిద్ధ వస్తువు కావ్యప్రశస్తికి మూలమని వారు భావించిరి. తెలుగున వెలసిన భారత రామాయణ భాగవతాది కావ్యములు మాత్రము ప్రసిద్ధ వస్తు సూత్రమును కొలబద్దగా గైకొని, రచింపబడినట్టివే. కాని సంస్కృతమున విరచితములైన శాకుంతలాది నాటకములుగాని, ఆంధ్రమున నవతరించిన మనుచరిత్రాది ప్రబంధములుగాని పురాణేతిహాసములలో ప్రసిద్ధములైన వస్తువులను నిమిత్త మాత్రముగా స్వీకరించి, దేశకాల పరిస్థితుల ననుసరించి, యా యా కవుల స్వకపోల కల్పితములైన మార్పులకును, చేర్పులకును లోనై, మిశ్ర కథా కావ్యములుగా రూపుదిద్దుకొనినట్టివే. ఈ దృష్టితో పరిశీలించినచో ములుగు పాపయారాధ్యకృతమైన ఈ "శ్రీమద్వేమ నారాధ్య చరిత్రము"ను- ఒక మిశ్ర కథా ప్రబంధముగా పేర్కొనవచ్చును.

ఆరాధ్య శైవ సంప్రదాయమున ద్వాదశారాధ్యులు[1] సుప్రసిద్ధులు. వారిలో వేమనారాధ్యుడు నొక ప్రముఖుఁడు.

ఈ మహాపురుషుని జీవిత చరిత్రములోని యొక ఘట్టమును పాల్కురికి సోమన తన పండితారాధ్య చరిత్రమునందు ప్రాస్తావికముగా పేర్కొనెను.[2] సర్పదష్టుడైన యొక రాజును వేమనారాధ్యుడు పునరుజ్జీవితుని జేయుట యందు వర్ణితము. ఆ వృత్తాంతమును పాల్కురికి సోమన మిక్కిలి రసవంతముగా ద్విపదలలో రచియించెను. పాపయారాధ్యుల "వేమనారాధ్య చరిత్రమున"కు నా సోమన రచనయే ముఖ్యాధారమని భావింపనగును.

---

1. ఈ ద్వాదశారాధ్యులను గూర్చి "శైవము - శివాద్వైతము" అను (2వ) ప్రకరణమునందు విశేష వివరణముగలదు - శ్రీ వే. ఆ. చ. 1-15.
2. పండితారాధ్య చరిత్రము - పుట. 100. (ఆంధ్రపత్రిక వారి ప్రతి)

భాషాభేదముల కతీతముగా భక్తి సూత్రమును ప్రాణముగాగొని ప్రజా జీవనము కొనసాగిన కాలమున నీశైవ ప్రముఖుల గాథలు పలుభాషా గ్రంథములలో విరివిగా చోటుచేసికొనినవి. ఆంధ్రమునందేగాక, కన్నడమునందును పెక్కురచనలలో నీవేమనారాధ్యుని కథా ప్రస్తావనలు కానవచ్చుచున్నవి. వేమనారాధ్యుని కథా ప్రస్తావన చేయుచున్న-

## కన్నడ రచనలు

1. శివతత్త్వ చింతామణి. (పద్య సంఖ్య 130 - 131.)

దీనిని "లక్కన్న దండేశ"1 యనునతడు "వార్ధక షట్పదుల"లో రచించెను. కవికాలము క్రీ.శ. 1400 - 1470. కృతికాలము. 1450.

ఇందు వేమనారాధ్యుడు త్రిపురాంతకేశ్వరునికడ శివదీక్ష నందినట్లును, సర్పదష్ట నృపతిని రక్షించినట్లును గలదు.

2. "బసవపురాణ" (సంధి - 45. పుటలు. 684 - 704)

ఇది 16వ శతాబ్ది రచన. దీనిని భీమకవి "భామినీ షట్పదుల"లో రచించెను. ఇందు వేమనారాధ్యుడు సర్పదష్టుడైన రాజును రక్షించిన గాథయే వర్ణింపబడినది. ఈ గాథ తెలుగులో పండితారాధ్య చరిత్రమున నుండగా కన్నడమున నిది బసవపురాణమున చేర్చబడినట్లు ఆ సంపాదకులే పేర్కొనిరి. తెనుగు బసవపురాణమున వేమనారాధ్యుని ప్రసక్తియే లేదు.

3. "చెన్న బసవపురాణ" (కాండ. 5. సంధి - 4. పద్య. 16.)

ఈ కృతికాలము 1586. కవి. విరూపాక్ష పండితుడు.

---

1. ఈ లక్కన్న దండేశ వీరశైవుడు. విజయనగర ప్రౌఢ దేవరాయలు కడ (దేవరాయ II కడ) మహామాత్యుడు. విష్ణువర్ధన గోత్రుడు. హొసపట్టణ వాస్తవ్యుడు. (కోలారు జిల్లాలోని "ముళబాగిల"చే యీనాడు "హొసపట్టణము" అని వ్యవహారము. ఈ రచనను 1960 లో మైసూరు ప్రాచ్య విద్యాసంశోధనాలయమువారు సంస్కరించి, ప్రకటించిరి.

4. "కథాసార" (I 95 A - B II 148 A)
దీనిని ఉత్తర దేశద బసవలింగ దేవరు రచించెను.

5. "సోమేశ్వర పురాణ" పుట. (126 - 130)
ఇది పాల్కురికి సోమన జీవిత విశేషములను దెలుపు రచన.

6. "శైరవేశ్వర కావ్యద కథామణి సూత్రరత్నాకర II." (పుటలు 289-291)

దీని సంపాదకులు 1. డా. ఆర్. సి. హిరేమఠ్ గారు.
2. డా. ఎం. ఎస్. సుంకాపూర్ గారు.

7. సిద్ధ రామేశ్వర పురాణ. (పుట. 139)

8. "అమర గణాధీశ్వర చరిత్ర" (పుట. 127)

దీనిని శ్రీ. పి. జి. హాళకట్టి రచించెను. ఇది 1954లో ముద్రితము ఇందు బసవనయు, వేమనారాధ్యుడును కల్యాణనగరమున కలిసికొనినట్లు పేర్కొనబడినది, అందులకు చారిత్రకాధారములు పేర్కొనబడలేదు.

9. "శివశరణరు చరిత్రగళు" (Part II పుట 340)
ఇది శ్రీ. పి.జి. హాళకట్టి రచన.

10. "బసవాది గణచరిత్ర మత్తు గణవచన మంజరి.[1]"
దీనిని డా॥ యస్. యమ్. హుణిశ్యాల గారు వ్రాసిరి. ఇది 1998 లో ప్రకటితము (ముద్రితము)

ఇందు బసవనయు వేమనారాధ్యుడును కలిసికొనినట్లును, బసవన వేమనారాధ్యునకు పాదాభివందన మాచరించినట్లును పేర్కొనబడినది. ఈ రచనకు 1954లో ప్రకటితమైన "అమర గణాధీశ్వర చరిత్ర" ఆధారమైనట్లు తోచును.

---

1. ఈ గ్రంథమును సంపాదించి యిచ్చిన వారు శ్రీ నాగలింగ శివయోగి, మహబూబ్‌నగర్, వారు. వారికి కృతజ్ఞతలు.

ఈ కన్నడ రచనలు[1] పేర్కొనుచున్న ముఖ్యాంశములు.

1. వేమనారాధ్యుడు సర్ప దష్టుడైన రాజును రక్షించిన గాథ.
2. వేమనారాధ్యుడును బసవేశ్వరుడును కల్యాణనగరమున కలిసికొనిరి.
3. బసవన వేమనారాధ్యునకు పాదాభివందన మాచరించెను.
4. వేమనారాధ్యుని గురువు త్రిపురాంతకేశ్వరుడు. అయన నుండి యీతడు శివదీక్షను స్వీకరించెను.

## సంస్కృతమున వేమనారాధ్య కథా ప్రస్తావన

(1) "బ్రహ్మసూత్ర భాష్య - పీఠిక" (పుట. 9.)
శివాద్వైత సిద్ధాన్త వ్యవస్థాపకుడైన శ్రీనీలకంఠాచార్య ప్రణీత మీ భాష్యము. పీఠికాకర్త శివశ్రీ ముదిగొండ వీరేశలింగశాస్త్రిగారు. 1950లో ఇది దేవనాగర లిపిలో ముద్రితము.

## తెనుగున వేమనారాధ్య గాథా రచనలు

1. "పండితారాధ్య చరిత్రము" (పుట. 100) పాల్కురికి సోమనకృతము. ముద్రితము)
2. "శ్రీమద్వేమనారాధ్య చరిత్రము."
ఇది ములుగు పాపయారాధ్య రచితము. అముద్రితము.
3. శివభక్త విజయ కథావళి" (పుటలు.229 - 233). (గద్యరచనము) దీనిని రచించిన వారు శ్రీముదిగొండ నాగవీరయ్యశాస్త్రిగారు. 1963లో నిది ముద్రితము.
4. "ద్వాదశ శైవాచార్య స్తవము" (ఆరాధ్యత్రయము-3. పుట. 21 ) పద్య కృతి. శ్రీముత్యంపేట సాంబారాధ్యుల వారిచే రచితము. 1992లో ముద్రితము.

---

1. కన్నడ రచనలలో "వేమనారాధ్య ప్రసక్తి"ని పరిశీలించుటకై నన్ను ధార్వాడ విశ్వ విద్యాలయమున కాహ్వానించి, నేనచటికి వెళ్ళగా సాదరముగా తోడ్పడి, పలనిన కన్నడ రచనా భాగములను తెనుగుచేయించి యిచ్చిన మహోదారులు సర్వశ్రీ యస్.యం. వృషభేంద్రస్వామిగారు, కన్నడ పీఠాధ్యక్షులు. వారి సహకారమున కెంతయు కృతజ్ఞుడను,

5. "శివజ్యోతి" (పుట. 32. 1982లో ముద్రితము)
ఇది శివాద్వైత సిద్ధాన్త సంఘ వార్షిక చతుర్థ సంచిక.
రచయిత—శివశ్రీ నిర్మల శంకరశాస్త్రి గారు.

6. "సర్వసిద్ధాన్త సౌరభము." (పుటలు. 220-221.)
9 వ ఖండము శైవము. దీనిని రచించినవారు శ్రీ అనుభవానంద స్వాములవారు. 1982లో నిది ద్వితీయ ముద్రణము నందినది.

ఈ విధముగా వేమనారాధ్య గాథా ప్రస్తావనలు వివిధ భాషలలో విల సిల్లి యున్నను పాపయారాధ్యుని రచన తప్ప తక్కినవెవ్వియును - ఆయన గాథను పూర్తిగా వివరించుట లేదు.

పాపయారాధ్యుని కాలమునకు (1756 - 1852)కు ముందున్న కన్నడ రచనలు మూడు. శివతత్త్వ చింతామణి. 2. బసవ పురాణ. 3. చెన్నబసవ పురాణ. ఈ మూడింటిలో గూడ పాల్కురికి వారి "పండితారాధ్య చరిత్రము" లోని గాథయే (సర్పదష్టుడై మృతి చెందిన రాజును వేమనారాధ్యుడు రక్షించిన కథయే) వివరింపబడినది. అందువలన ఆ మూడింటికిని సోమన పండితా రాధ్య చరిత్రమునందలి గాథయే మూలముగా నూహింపవచ్చును.

కనుక పాపయారాధ్యుని వేమనారాధ్య చరిత్రమునకు వస్తు స్ఫూర్తిని గూర్చినది పాల్కురికి సోమనకృత పండితారాధ్య చరిత్రమే యనుట కాదన రాని సత్యము.

కాని పాల్కురికి సోమనగూడ వేమనారాధ్య చరిత్రమును పూర్తిగా వివరింపలేదు. అందలి, యొక్క ఘట్టమును మాత్రమే యద్భుతముగా నతడు వివరించినాడు. ఆ సోమన వ్రాయబూనినది (మల్లికార్జున) పండితారాధ్య చరిత్రము. అందితరమహా పురుషుల (శివభక్తుల) గాథలన్నియును ప్రాస్తావికములు మాత్రమే. అట్టి వానిలో నిదియొకటి. కావున దీనిపూర్తి వివరణమునకు సోమనకందు సావకాశము లేదు.

పాల్కురికి సోమన బెలిదేవి వేమనారాధ్యుని మనుమని శిష్యుడు.[1] కనుక వేమనారాధ్యుని జీవిత విశేషముల నెఱుంగుటకు సోమన కవకాశము కలదు. సందర్భాను సారముగా పండితారాధ్య చరిత్రమున వేమనారాధ్యుని వర్ణించుచు సోమన ప్రయోగించిన విశేషణములను జాగ్రత్తగా పరిశీలించినచో నందు ఆ వేమనారాధ్యుని జీవిత గాథలు బీజప్రాయములుగా నున్నట్లు గమనింప వచ్చును. ఇచట ఉదాహరణ వాఙ్మయ లక్షణరీతి[2] స్మరింప దగియున్నది.

## పండితారాధ్య చరిత్రమున-వేమనారాధ్య గుణ గణ వర్ణనము

- పేరెక్కదగిన శ్రీబెలిదీవివేమ, నారాధ్యులను "పరమారాధ్యదేవు" మనుమ శిష్యుండ. (దీక్షా ప్రకరణము పుట. 3.)
- "మలహర" సద్భక్త మత్తవారణము, బెలిదేవి వేమన పెద్దయ్యగారు, శ్రీ"శైవ సమయైక దేశికోత్తముడు", "పాశవిమోచన పటు కళా విదుడు."

అకలంక "దివ్యాగమార్థ సంవేత్త" ప్రకట "చతుర్వేదపారంగతుండు"
ఖ్యాపిత "ధర్మార్థ కామమోక్షప్ర, దీపిత మార్గ ప్రతిష్ఠిత కీర్తి",
మహిత "పంచాక్షరీ మంత్ర సిద్ధుండు", సహజ "కటాక్ష వీక్షణనయాంభోధి"
వీరమాహేశ్వరాచార విస్తార, సారగుణోదార చారువర్తనుడు,
"బసవ పాదాంభోజ భాజనస్వాంతు," దసమ "శాపానుగ్రహ సమగ్ర బలుడు"
"సానతజన మృత్యుహరణ ప్రభావు" "డానతజన పునరాయుః ప్రదాత"
"సర్ప, వృశ్చిక, మృగ, వ్యసన, జలాగ్నిదర్పిత నృపచోర దర్పాపహరుడు"
నానా వికల జనానందకరమ్మ, గానిట్లు వర్తింపగా నొక్కనాడు
(దీ.ప్ర. P.100)

1. బెలిదేవి వేమనారాధ్యుల.... మనుమశిష్యుంచ.... దీ ప్ర. పుట.3.
2. ఉదాహరణ వాఙ్మయమునందలి ఒక్కొక్క విశేషణము, ఒక్కొక్క కథా ఘట్టమునకు సూక్ష్మ (బీజ) రూపమై యొప్పుచుండును.

- "పరమమాహేశ్వర పాదాబ్జరేణు, పరికల్పితలలాటు" భక్తకిరీటు," "శతపత్ర సంభవ కృతదురక్షరని, యతి నిరాసక" మహిమాఢ్య....
- అనుపమ "విఘ్నమయా వినిర్ఘశన," వినుత చిద్విద్యాప్రవీణు, నక్షీణు "పశు, పాశ మోచన పాటవధుర్య," బశువాహన సమాను" భక్తినిధాను, "నుద్ధత మృత్యుదంష్ట్రోత్పాటన"ప్ర, సిద్ధకళాకల్య శివగణ లౌల్య, నురుతర దండధరోద్దండదండ, పరనిహతిక్రియా పద్ధతు, ఖ్యాతు "విజిత కాలోరగ విషహరు" ధీరు, నిజదయా మృతపయోనిధి

నోలలార్చి (దీ. ప్ర. పుట. 103)

వేమనారాధ్య సంవిత్సుఖసాధ్య...... ... ........

పండితారాధ్య చరిత్రమునందు ప్రాస్తావికముగ సాగిన ఈ వేమనారాధ్య కథా సందర్భమునందలి దివ్యమహిమాన్విత, గుణ గుణ ప్రకటనము గమనింపదగియున్నది. అందు వేమనారాధ్య పరముగా ప్రయుక్తములైన విశేషణాంశములే తత్కథా సూత్ర నిర్మాణమున పాపయారాధ్యులకు బీజ ప్రాయములుగా తోడ్పడియున్నట్లు భావింపవచ్చును.

కనుక పాపయారాధ్యుని "వేమనాధ్య చరిత్ర"కు వస్తుప్రదానాది విషయములందు "ప్రధాన భూమిక"ను నిర్వహించినది సోమన పండితారాధ్య చరిత్రమే యనుటలో విప్రతిపత్తి లేదు.

ఈ విషయమున మఱొక్క యంశము గమనింపదగియున్నది. పాపయారాధ్యుల నాటికి వేమనారాధ్యుని గూర్చి, పలు విధములైన కథలు ప్రచారములో గలవు. ఈ విషయమును వేమనారాధ్య చరిత్రమునందు కవి ప్రకటించెను.

- గురుచంద్రుండగు వేమనార్యు చరితల్ కోటానుకోటుల్ ధరన్, బరగున్ దద్వివృతిన్ రసోల్లసిత శబ్ద ప్రక్రియల్ గూర్చి, మందర సాహాయ్యయ్యమునన్ సుధారసము చందంబొంద నీప్రేరణన్ విరచింపన్ నిగమాంత సారమయి, తద్వృత్తంబు చెంతింపదే!

(వే. చ. 1-31)

జనశ్రుతిలో బహుళ ప్రచారమునకు నోచుకొనిన యసంఖ్యాకములైన యా వేమనారాధ్య గాథలు కూడ ఈ "వేమనారాధ్య చరిత్ర" కృతికి నాకృతి నిచ్చుటలో ప్రముఖ పాత్ర వహించినట్లూహించుట సముచితమగును.

ములుగు పాపయారాధ్యుడు వేమనారాధ్య చరిత్ర రచనను ప్రారంభించు నాటికే ఆంధ్ర సంస్కృత భాషలలో కావ్యనిర్మాణ కుశలుడు.[1] అప్పటికే 1. శంతను చరిత్రమును, 2. అహల్యా సంక్రందన విలాసమును, 3. ఘూర్జర చరిత్రమును, 4. ఇంద్రాత్మజా పరిణయమును, 5. అసంఖ్యాకముగా శతక పూజా స్తవంబులను రచించి యుండెను.[2]

మఱియొక కావ్యమును వ్రాయగోరి యితడు శివభక్త గోష్ఠికి కుతూహలపడెను. ఆ గోష్ఠికి పూర్వసాహితీగురువులు, గురుపట్ట భద్రులు విచ్చేసిరి. గోష్ఠి కొనసాగినది.

గోష్ఠికి వచ్చిన శైవ గురువులు "వీరశైవ గురురాజ్య సామ్రాజ్య చక్రవర్తు"లైన ద్వాదశారాధ్యులను (ద్వాదశాచార్యులను) గూర్చి ప్రస్తుతించిరి.[3] ఆ సందర్భమున "వేమనారాధ్య పశస్తి" యొనర్చుచు వారా మహామహుని కథలను కొన్నింటిని పేర్కొనిరి. వాని మహిమలను దెల్పిరి.

ఇంకను వారు పాల్కురికి సోమన "పండితారాధ్య చరిత్రము"ను గూర్చియు, తెనాలిరామలింగని "ఉద్భటారాధ్య చరిత్రమును"ను గుఱించియు, ప్రస్తావించి, యాకవులను కొండాడిరి. ఆ గ్రంథముల వైశిష్ట్యములను బహుధా కీర్తించిరి. "వేమనారాధ్య చరిత్ర" రచనకు పాపయారాధ్యుని వారు మిక్కిలి ప్రోత్సహించిరి.

సహజముగనే పాపయారాధ్యుడొక కావ్యరచనకు నాలోచించుచుండెను. శివభక్తగోష్ఠి దానికి తోడై బలమును చేకూర్చినది.

పాల్కురికి సోమనకృత "పండితారాధ్య చరిత్రము" పాపయారాధ్యులకు నాదర్శప్రాయమై నిలిచినది. తెనాలి రామలింగకవి ప్రణీతమైన "ఉద్భటారాధ్య చరిత్రము" ఉత్తేజకమై విలసిల్లినది. ఫలితముగా నాయనలో రచనావేశము పురివిప్పుకొనినది.

---

1. వే.ఆ.చ. 1 - 13. "ఆంధ్ర సంస్కృత సత్ప్రబంధ బధుర కల్పనా నల్ప కవితా విలాసుడు.
2. వే.ఆ.చ, 1 - 25. 3. వే.ఆ.చ. 1 - 15, 16, 17.

కవి యప్పటివఱకు లోక ప్రచలితములైన వేమనారాధ్య గాథలను పరికించినాడు. బీజప్రాయముగా సోమన "పండితారాధ్య చరిత్రము"న నిక్షిప్తములైన కథాంశములను పరిశీలించినాడు. శివగోష్ఠి విశేషములను సమీక్షించినాడు. శివభక్త గోష్ఠి సభ్యులుగ్గడించిన వృత్తాంతములకు క్రమ సమన్వయ రీతులను గూర్చినాడు. వేమనారాధ్యుని గుణాతిశయంబులను సంగ్రహించినాడు. అందు ప్రధాన ఘట్టముల నెన్నుకొనినాడు. వానిలో విశేషసార పరగాథలను స్వీకరించినాడు. అనువగు బోధలను వానికి జోడించినాడు. సరసకావ్య నిర్మాణమునకు సన్నద్ధుడైనాడు.

కవి తనకేగాక, తన తమ్ములకును పుత్త్రి, పౌత్త్రి లాభములు కలిగిన యనంతరము పండిన వయస్సులో కావించిన రచన మిది (1-160)

వయః పరిపాకముతో బాటు మానసిక పరిణతియు నందిన పిమ్మట కవి చేపట్టిన కృతియిది. శివకవుల కవితాస్ఫూర్తి, శ్రీపతి పండితుని శివాద్వైతము, మల్లికార్జున పండితుని "శివతత్త్వ సార" వైభవము, పాల్కురికి సోమనలోని భవ్యావేశము, పాపయారాధ్యునిపై నొక్కుమ్మడిగా ప్రసరింపగా శ్రీకారమునకు నోచుకొనిన ప్రబంధమిది.

వస్తుగౌరవమును, శివాద్వైత సిద్ధాన్త పరమాదర్శనమును కవి కందించినది ముఖ్యముగా "పండితారాధ్య చరిత్రమే". వేమనారాధ్యచరిత్ర రచనమునకు "పండితారాధ్య చరిత్రము" పెక్కు విధముల ప్రేరణలను గూర్చినది. కనుక నీ యుభయ కృతులలోని సారూప్యము లిట గమనింపదగి యున్నవి.

| పండితారాధ్య చరిత్రము | వేమనారాధ్య చరిత్రము |
|---|---|
| 1. ఐహికాముష్మిక లాభసాధకము. | 1. ఇహపర ఫలసాధకము. |
| 2. కావ్యనామము "పండితారాధ్య చరిత్రము". | 2. కావ్యనామము "వేమనారాధ్య చరిత్రము". |
| 3. కథానాయకుడు పండితత్రయములోనొకడు. 12వ శతాబ్ది వాడు. | 3. కథానాయకుడు "ఆరాధ్య"త్రయములో నొకడు. 12వ శతాబ్ది వాడు. |

| పండితారాధ్య చరిత్రము | వేమనారాధ్య చరిత్రము |
| --- | --- |
| 4. శైవపారమ్యమును ముక్తకంఠముతో ప్రకటించుట. | 4. శైవాధిక్యమును ఎలుగెత్తి చాటుట. |
| 5. శివాద్వైత సిద్ధాన్తమును సువ్యవస్థిత మొనర్చుట. | 5. శివాద్వైత సిద్ధాన్తమును నిగమాగమ ప్రమాణములతో నిరూపించుట. |
| 6. భక్తిమీది వలపు, బ్రాహ్మ్యంబుతో పొత్తు, వైదిక సమాజములో అగ్రతాంబూలములు లక్ష్యములుగా సాగుట. | 6. భక్తిమీది వలపు, బ్రాహ్మ్యంబుతో పొత్తు, వైదిక వేదికల యందు. గురుస్థాన లాభములు గమ్యములుగా పురోగమించుట. |
| 7. బసవేశ్వరున కంకితము. | 7. షట్స్థల బ్రహ్మానందయతీంద్రునకంకితము. |
| 8. పురాతన నూతన భక్తప్రార్థన. | 8. ద్వాదశాచార్య స్తుతి. |
| 9. భక్తుల ప్రశంస. | 9. భక్తుల ప్రశంస. |
| 10. శివభక్త గోష్ఠి. | 10 శివభక్త గోష్ఠి. |
| 11. కవి రచిత పూర్వ కృతులైన బసవ పురాణాది ప్రశంస. | 11. కవి రచిత పూర్వ ప్రబంధములైన శంతను చరిత్రాది ప్రస్తుతి |
| 12. పండితారాధ్య చరిత్రమును రచింపుమని సదస్య ప్రేరణ. | 12. వేమనారాధ్య చరిత్రమును రచింపుమని గోష్ఠి సభ్యుల ప్రోత్సాహము. |
| 13. కవి చతుర్వేద పారగుడుగా పేర్కొనబడుట. | 13. కవి వేదాగమ శాస్త్ర కుశలుడుగా ప్రస్తావింపబడుట. |
| 14. నవరసములు అష్టాదశవర్ణనలు అలంకారాలు, ఈ రచనకు ప్రాణములనుట. | 14. ఇది రసానుషంగరచనగా ప్రస్తావితమై, అలంకార, వర్ణనములతో నలరారుచుండుట. |
| 15. వేద, వేదాంతేతిహాస వివిధాగమ పురాణవిహిత సూక్త ప్రమాణయుత రచన. | 15. నిగమాగమ పురాణేతిహాస ప్రమాణములతో శివ పారమ్య ప్రతిష్ఠిత మొనర్చిన రచన. |

| పండితారాధ్య చరిత్రము | వేమనారాధ్య చరిత్రము |
|---|---|
| 16. మల్లికార్జున పండితుడు వీరభద్రాంశతో భువినవతరించినట్లు పేర్కొనబడుట. | 16. వేమనారాధ్యుడు వీరభద్రుని లీలావతారమే యని వర్ణింపబడుట. |
| 17. గురుస్తుతి. | 17. గురుస్తుతి. |

ఈ విధముగ గమనించుచుపోయినచో "ఉభయత్ర" చిన్న సన్నవి పెక్కు సారూప్యములిందింకను గోచరింపగలవు. దీనినిబట్టి చూచినచో నీ"వేమనారాధ్య చరిత్ర" ప్రబంధ రచనా ప్రణాళికకు ప్రముఖముగా "పండితారాధ్య చరిత్రమే" యాధారభూమియని భావింపదగియున్నది.

కాని యాయా కవుల రచనా కాల ప్రభావములనుబట్టియు రూపు దిద్దుకొనిన యా యా కృతుల ననుసరించియు, కొన్ని వైవిధ్యములును - ఈ యుభయ రచనల మధ్య స్పష్టముగా గోచరము కాగలవు.

## పండితారాధ్య చరిత్రమునకును వేమనారాధ్య చరిత్రమునకును మధ్యగల తారతమ్యాలు

| పండితారాధ్య చరిత్రము | వేమనారాధ్య చరిత్రము |
|---|---|
| 1. ఒకే రాజసభలో - ఒకే సందర్భమున శైవేతర వేదాంతాది వాదములు పాండిత్య ప్రకర్షతో ఖండింపబడుట. | 1. కథాసూత్రములో భాగముగా వేర్వేఱు సందర్భములలో విభిన్న వేదికలపై ప్రత్యక్ష చర్చలతో మహిమాది ప్రకటనములతో పరమతములు ఖండింప బడుట. |
| 2. పెక్కుమంది భక్తుల గాథలలో నంతర్భాగముగ శైవ మహిమలు ప్రదర్శింపబడుట. | 2. వేమనారాధ్యుని యితివృత్త స్పర్శతో మహత్త్వ ప్రకటనములతో, ప్రదర్శనములతో శైవ విజయములు వెల్లడింపబడుట. |

| పండితారాధ్య చరిత్రము | వేమనారాధ్య చరిత్రము |
|---|---|
| 3. వర్ణాశ్రమ ధర్మములకు మించి శివభక్తి సింహాసన మెక్కింపబడినది. | 3. శివభక్తితో బాటు వర్ణాశ్రమ ధర్మములకును సమాన గౌరవాదరములు నెలకొల్పబడినవి. |
| 4. వీరశైవావేశము వివిధ కోణములలో కట్టలు తెంచుకొని ప్రవహించినది. | 4 వీరశైవావేశము వర్ణాశ్రమ ధర్మ పరిధులకు లోబడి యావేశపుటందల మెక్కినది. |
| 5. ద్విపద ప్రబంధ వధూటి చేలముల పై కుదురుకొనిన వీరశైవపు ముదురు రంగుల హంగుల ముందు వైదికాచారపు టంచుల కాంతులు మఱుగునబడినవి. | 5. ప్రబంధ భామిని ధరించిన దువ్వలువలపై శైవముయొక్క వన్నె చిన్నెలతో బాటు వైదికాచారపు టంచులును ధగ ధగ లాడినవి. |
| 6. వీరశైవ మహోద్యమమునకు ద్విపద సాహిత్యాకృతి యిది. | 6. సమకాలీన (చంపూ) ప్రబంధ సాహిత్య రసవద్రచనా హేలలకు శైవధర్మ లీలాకృతి యిది. |

మొత్తముమీద ఏది యెట్లున్నను వేమనారాధ్య చరిత్రముపై ప్రసరించిన పండితారాధ్య చరిత్రము యొక్క బహుముఖ ప్రభావము కాదనరానిది.

## చరిత్ర - చరిత్రము

కవి యీ రచనకు పెట్టిన పేరు "శ్రీమద్వేమనారాధ్య చరిత్రము" లోక ప్రసిద్ధమైన "చరిత్ర"కును సాహిత్యపరమైన యీ రచనయొక్క నామమునగల "చరిత్రము"నకును చాల భేదమున్నది.

ఆ "చరిత్ర" ఆయా పురుషుల జననాదికమును, జీవితఘట్టముల, తిథి, వార, నక్షత్రాదికములతో యథాతథముగ సత్యకథన మొనర్చును. ఈ "చరిత్రము" ఆ విధముగ గాక యొక మహాపురుషుని జీవిత విశేషముల నూతగా

గొని, సరసశోభితముగా చవులూరించుచు లోకమునకు ఆనందోపదేశములను పంచియిచ్చును. కావున నీ యుభయమునకును సామ్యములకంటె విభేదములే మెండు.

సాహిత్య లోకమున కృతి, కావ్యము, చరిత్రము, ప్రబంధము, మహాప్రబంధము, ఇతిహాసము, పురాణము, మహాపురాణము గ్రంథము, మున్నగు పదములకు నిర్దుష్టముగా, శాస్త్రజ్ఞులాయా సందర్భములలో అర్థ నిర్వచనములు గావించి యుండిరి. అయా పదముల వ్యుత్పత్త్యర్థములను బట్టిగాని, పండిత నిర్వచనముల ప్రకారముగాని కృతి, కావ్యము, ప్రబంధము మున్నగు పదములతో పేర్కొనబడు రచనలన్నియును విభిన్నరూప రేఖలను గలిగియే యుండి తీరవలెను.

కాని సంస్కృతాంధ్ర వాఙ్మయములందు, ముఖ్యముగా ఆంధ్రసాహిత్య రంగమున ఈ కావ్యాది పదముల మధ్యగల యర్థ తారతమ్యములంతరించి, వైవిధ్యములు, వైశిష్ట్యములు మాసిపోయి, పరస్పర సమానార్థకములైన పర్యాయ పదములుగా నవి ప్రయుక్తములగు చుండుట సర్వజన సువిదితము. నన్నయాది మహా కవులనుండి నేటి వఱకుగల కవి పండితులెల్లర విషయమునను ఇది సర్వసాధారణ విధానమైనట్లు శ్రద్ధగా పరికించిన వారికం దఱికిని స్పష్టము కాగలదు.

ఈవిషయమున ములుగు పాపయారాధ్యుల వారి రీతియు గూడ అప వాదముగాదు.

## వేమనారాధ్య చరిత్రమునందు

1. ..........నీవు పొసగించు మేలి "కావ్య" రచన (వే.అ.చ. 1-25)
2. ..........వేమారాధ్య "చారిత్ర" మా దరవృత్తిన్. వే.అ.చ. 126)
3. వేమనారాధ్య చరిత్రాభిధాన "మహాప్రబంధ" కల్పన....... (వే. అ.చ. 1-175)
4. "వేమనారాధ్య చరిత్రంబు"ను "ఇతిహాసంబు"నకు (వే.అ.చ. 1-203)
5. ఏతత్ "ప్రబంధంబు"ను తార్క్ష్యసంబునకు....... (వే.అ.చ. 1-175)

## దేవీ భాగవతము

1. "కృతి" (ఉక్త సత్కృతి) దేవీ భాగ. 1-96, 104.
2. ప్రబంధము" (దే.భాగ 1-106, 111)
3. దేవీభాగవతంబను "మహాపురాణంబు"నకు. దే. భాగ. 1-122)

## సరసహృదయానురంజనమునందు

1. "కావ్యంబు" (సర. హృద. 1-14)
2. గ్రంథము" (సర. హృద. 1-21, 23)
3. నాయొనర్పంబూనిన సరసహృదయానురంజనంబను"మహాప్రబంధము" నకు (స. హృ. 1-181)

ఈ రీతిగా సాగిన ఈ పదప్రయోగములను గమనించినచో ఈ "శ్రీమద్వేమనారాధ్య చరిత్రమును" కావ్యాది ప్రత్యేక పారిభాషిక రీతితో, సాధారణ చరిత్రగా గాక "అసందోపదేశముల" నందించు నొక రసవద్రచనగా భావింపవచ్చును

## గురువు - షట్స్థల బ్రహ్మానందయతీంద్రులు - అంకితము

ములుగు పాపయారాధ్యుని తల్లి భ్రమరాంబిక. ఆమె శ్రీపతి వందిత వంశజాదగు శంభులింగ దేశిక సుత.1 ఈ శంభులింగార్య దేశికస్వామియే పాపయారాధ్యునకు మాతామహుడు, గురువు.2 ఈ శంభులింగ దేశికుదే తురియాశ్రమమును స్వీకరించిన "షట్స్థల బ్రహ్మానంద యతీంద్రుడు"గా వ్యవహరింపబడినట్లు పరిశీలనమున విదితము కాగలదు.

మొట్ట మొదట కవి— ఘన మద్గురుదేవుఁదలఁచి కౌతుక మలరన్. (వే.ఆ.చ. 1 - 48).

1. వే.ఆ.చ. 1 - 157, 158.
2. వే.ఆ.చ, 1 - 9 & 157, 148.

వ॥ తదంకితంబుగా నేతద్గ్రంథంబు సమర్పింపఁదలంచిన వాడనై, మదీయ వంశావతారంబభివర్ణించెద. అని పేర్కొనెను. పిమ్మట (వంశ వర్ణ నానంతరము). ఏతత్ప్రబంధంబను తారహారంబునకు నాయకరత్నంబెవ్వరో కోయని, విచారించి, షట్స్థల జ్ఞాన సంపన్నుండును, నిరాభారి 1 వీరశైవ దీక్షాధురంధరండును, సమస్త వేదాంతతాత్పర్య భూత "విశేష శివాద్వైత" సూత్ర పరిజ్ఞాన కోవిదుండును, విద్వత్కంఠీరవుండును, వీరశైవమతాచార్యుండునగు షట్స్థల బ్రహ్మానంద యతీంద్రుస్ కృతీంద్రుగాఁజేయదలంచిన వాడనై యమ్మహాసుభావుని మాహాత్మ్యం బభివర్ణించెద అని ప్రస్తావించినాడు.

● షట్స్థల బ్రహ్మానంద యతీంద్ర మాహాత్మ్య వర్ణనలో

క౦॥ గురుకరుణాశీకరములు, మాకు భక్తి జీవములు సుమీ! (1 - 184).

సీ॥ ఆరాధ్య వంశాబ్ధి నావిర్భవించి వి, ద్యాకౌముదీ వ్యాప్తి నలరి, బంధు
కుముద సంతతుల కోర్కులు ఫలింప. (1 - 181)

సీ॥ ఆశ్రమ త్రయిమీటి, యారురుక్షుతనాటి, తుర్యాశ్రమారూఢ చర్యదవిలి
........సహజలింగ, మథన పరవశ సుఖగోష్ఠి మరుఁగునట్టి,
షట్స్థల బ్రహ్మయతి గురుస్వామి దిక్కు. (1 - 184).

పై యంశములను, పరస్పర సమన్వయముతో పరిశీలించినచో "శ్రీపతి పండిత శంభులింగారాధ్యుడు" మలుగు పాపయారాధ్యునకు మాతామహుడనియు, ఆతడే యాయనకు విద్యాగురువనియు, ఆతడు బ్రహ్మచర్య, గార్హస్థ్య, వానప్రస్థ (ఆశ్రమత్రయ) ధర్మములను ముగించుకొని, తురీయాశ్రమ (నాల్గవదియగు సన్న్యాసాశ్రమ)మును స్వీకరించి నిరాభారి2యైనా

1. నిరాభారి శైవుడు తురీయాశ్రమమును స్వీకరించిన శైవుడు.
2. తురీయాశ్రమసేవీతు "నిరాభారి"తి చోచ్యతే, స్వతంత్రేత్యక్తదారాది నిరాభారీతి కథ్యతే,

దనియు, యత్యాశ్రమమున నాత(శంభులింగారాధ్యు)డు షట్స్థలబ్రహ్మానంద యతీశ్వర నామముతో వ్యవహరింపబడె[1]ననియు, స్పష్టముకాగలదు.

"షట్స్థల బ్రహ్మానంద యతీంద్రున"కు సమర్పితంబుగానా యొనర్పం బూనిన - శ్రీమద్వేమనారాధ్య చరిత్రంబను "ఇతిహాసంబు"నకు కథా క్రమం బెట్టి చందంబున సంప్రవర్తిల్లెనని యడిగిన - అనుచు కవి కథా క్రమంబునకుఁ గడంగినాడు.

## ''కృతిపతి మాహాత్మ్య" వర్ణనము - వైశిష్ట్యము

కవి ముందుగా ఒక వచనములో షట్స్థల బ్రహ్మానందయతీంద్రుని గుణగణవైభవప్రాభవములను వర్ణించినాడు.[2] పిదప "అమ్మహానుభావుని మాహాత్మ్యంబభివర్ణించెద" అనుచు (షట్స్థల బ్రహ్మానందయతీంద్రుని మహిమలను) గురుమహిమలను 19 పద్యములలో (1-176 నుండి 194 వఱకు) విశిష్టముగా వర్ణించినాడు. ఈ మహిమలను వర్ణించు ప్రతి పద్యమునందును "గురు" శబ్దమునే ప్రయోగించినాడు కవి. శైవ సంప్రదాయ గ్రంథములు (ఆగమాదులు) పేర్కొనిన గురు లక్షణములకీ ఈ గురుమహిమా వర్ణనము - ఒక రసోదంచిత రచనా రూపము.

ఈ గురుమహిమా వర్ణనమున రెండు పరమార్థములను కవి యూహించినట్లు గన్పట్టును.

1. షట్స్థల బ్రహ్మానంద యతీంద్రుని "గురుస్థాన వైశిష్ట్యము" ఇట్టిది - యని పేర్కొనుట.

2. శైవ సంప్రదాయమున గురుస్థాన మెట్టిదో, తద్గుణ గణ వైభవము లెట్టివో, ఆయన నాశ్రయించి సేవించుటవలన శిష్యుల కొనగూడు - ఇహపర లాభపరంపర లెట్టివో సందర్భానుసారముగ లోకమునకు చాటుట.

---

1. ఆంధ్ర శివరహస్య ఖండ "విజ్ఞప్తి"లో "శ్రీ షట్స్థల యతీంద్రాపర నామక (శ్రీపతి పండితారాధ్యుల) శంభులింగస్వామి - అనియూ విజ్ఞప్తిని వెలయించినవారు తెల్పిరి. పుట. 3, ఇది 1933లో ముద్రితము.
2. వే. ఆ చ. 1-175.

ఉభయ తారకముగా సాగిన యీ మహిమాభి వర్ణనమును కావ్యమునకు నొక శోభాహేతువుగా భావింపవచ్చును.

అనంతరము ప్రబంధ రచనకంగముగా నడిచిన "షష్ఠ్యంతములు" శివాద్వైత సిద్ధాన్త స్రోతస్వినిలో యతీంద్రుని (కృతిపతియొక్క) గణ గణ శక్తి ప్రభావముల రూపమున వినిపించిన గళగళలు.

## సంక్షిప్త చరిత్ర కథనము - ప్రయోజనము

కథ కైలాస సభతో ప్రారంభమైనది. ఆ సభలో పార్వతీ పరమేశ్వరులును, సర్వదేవతలును, తదితరులును సముచితాసనముల నలంకరించి యుండిరి. సందర్భానుసారముగ నట వేమనారాధ్య ప్రసక్తి వచ్చినది.

అప్పుడు పరమశివుడు పార్వతికి ఈ వేమనారాధ్యుని యుదంతమును సంక్షిప్తముగను, ఆ మూలాగ్రముగను తెలిపెను.1

ఈ సంక్షిప్త కథాకథనమొక సుదీర్ఘ వచనములో వివరింపబడినది. ఇందు దక్షయజ్ఞ సభలో వీరభద్రుని వీరవిహారము మొదలుకొని, యా వీరభద్రుని లీలావతారియగు వేమనారాధ్యుని సర్వవిధ విజయ విహారముల వఱకును క్లుప్త వివరణము కావింపబడినది.

ఈ సంక్షిప్త వృత్తాంత వివరణమువలన కావ్య వస్తువుయొక్క స్థూలాకృతి పాఠకుల హృదయములలో భద్రముగా ముద్రితమగును. వారికి కావ్యధోరణియెడ నొక యవగాహనమేర్పడును. విపుల వృత్తాంత పరిజ్ఞానము నకై వారిలో పఠన కుతూహలము పెల్లుబుకును. దీనిమూలమున రసజ్ఞులలో "చక్కని యుత్కంఠ" చెలరేగును.

కావ్యోదంతమును ముందుగా సంక్షేపముగా పాఠకులకు పరిచయము చేయు సంప్రదాయమునకు" బాల రామాయణ" రూపమున శ్రీమద్రామాయణ

1. వేమనారాధ్య చరిత్రము 1 - 223. ఒక సుదీర్ఘ వచనము.

మున నాంది పలికినవాడు "ఆదికవి" వాల్మీకి. తెలుగున "ఆదికవి" నన్న య్యయు నీ మర్యాదనే గౌరవించి, తన భారత పర్వగాథలను క్లుప్తముగా ప్రకటించి, "యా రీతికి" లోక ప్రశస్తిని గూర్చెను. మహాకవి పోతనయు "ఆంధ్ర మహాభాగవతమున" ఈ పద్ధతి నాదరించెను. బహుశః తత్ప్రశస్త మార్గము ననుసరించియే కాబోలును, పాపయారాధ్యుడు తన వేమనారాధ్య చరిత్ర గాథను ముందుగా సంక్షిప్తముగా తెలిపియుండ వచ్చును.

"మహాజనోయేనగతస్సపంథాః" అనిగదా! యార్యోక్తి.

అంతేగాక ఇటు తనకును, అటు పఠితృలోకమునకును ఏతత్కావ్య ప్రధానేతివృత్తమున కేక సూత్రతనందించు వేదికగా, విషయ సూచికగా కవి ఈ సంక్షేప వృత్తాంతమును ప్రవేశపెట్టి యుండును.

కట్టలు తెంచుకొన్న యావేశమావరించినను ప్రధాన కథ విస్మరింప బడక, వస్త్వైక్య పరిపోషణమునకీ విధానము మిక్కిలి దోహదకారియే కావచ్చునని తలంపనగును.

## దక్షయజ్ఞ కథనము (వీరభద్ర విజయము)

పరమశివుని పారమ్యమును ప్రకటించుట ఈ రచనకు ఏకైక లక్ష్యము. ఆ మహాదేవు నాహ్వానింపక యజ్ఞ నిర్వహణమునకు పూనుకొనుట దక్షు డొనర్చిన శివాపచారము. అంతటితో నాగక, పిలుపు లేకున్నను చొరవ చూపి యజ్ఞమునకు విచ్చేసిన సతీదేవిని (శివపత్నిని) సముచిత రీతిగా నాదరింపక పోవుటయేగాక మీదు మిక్కిలి దక్షుడామె నవమానించుట క్షమార్హముగాని మఱియొక నేరము.

లోకములో సుకృత, దుష్కృత ఫలములకు రెండింటికిని కర్తయు, కారయితయు, (చేయించిన వాడును.) ప్రేరకుడును, అనుమోదకుడును (ఈ నలుగురును) సమాన భాగస్వాములే.1

1. కర్తా, కారయితా చైవ, ప్రేరకశ్చానుమోదకః
సుకృతేదుష్కృతే చైవ, చత్వారః సమభాగినః॥

దక్షయజ్ఞమునకు బ్రహ్మ, విష్ణువు, ఇంద్రాది దేవతలును పరివారములతో విచ్చేసిరి. దక్షకృత శివాపచారములకు వీరందఱును సాక్షిభూతులైరి.

శివశాసనము ననుసరించి, వీరభద్రుడు దక్షవేదిక కడకు నేతెంచి, యజ్ఞమును ధ్వంస మొనర్చెను. దక్షుని కుత్తుక నుత్తరించెను. "యథాపరాధ దండనీతి" ప్రకారము - అక్కడనున్న వారినందఱిని శిక్షించెను. ఇనుము నాశ్రయించిన యగ్నికిని సమ్మెట పోట్లు తప్పనట్లు తత్రత్యు లెల్లరకును వీరభద్ర పరాక్రమాహతి చవిచూడక తప్పినది గాదు. కడకు బ్రహ్మ, విష్ణువు, పురందరాదులందఱును వీరభద్రునకు విధేయులై స్వస్వ నివాసములకు జేరిరి.

ఈ రీతిగా నా పరమ శివుని ప్రతినిధి పరాక్రమమే యప్రతిహతమై చెల్లినప్పుడిక నా సర్వేశ్వరుని సామర్థ్యమును గూర్చి చెప్పవలసినదేముండును.

కనుక ఈ వీరభద్ర విజయ (దక్షయజ్ఞ ధ్వంస) ఘట్టము శివాపరాధులను శిక్షించుచు, శివపారమ్యమును ప్రకటించినది. ఆ విధముగా నిది యుభయతారకమై యొప్పారినది.

పరవాదుల యాటలు కట్టించుటకు వీరభద్రాంశతో భువినవతరించు వేమనారాధ్యుని భవిష్యద్విజయ పరంపరలకిది జయసూచికయై యలరారుచున్నది. అంతేగాక కావ్య నిర్వహణమున నిది కీలకమై ప్రబంధేతి వృత్తమునకు నాందీ వాచకమగుచున్నది. కవి యుపజ్ఞకిదియొక చక్కని తార్కాణము.

## త్రిపురాంతక - శ్రీశైలాలు - సిద్ధ విద్యాసౌభాగ్యాలు

పరవాదుల పట్టుబంధనముల సరికట్టుచు శైవవైశిష్ట్యములను లోకమునకు చాటుటకై, భువినయోనిజుడై యవతరించిన వాడు వేమనారాధ్యుడు.

శ్రీశైల మల్లికార్జునలింగము నుండి యావిర్భవించి, "విజయశర్మ, సౌభాగ్యవతి" అను దంపతుల తపః ఫలితముగ వారి కరకమలముల నలంకరించి, త్రిపురాంతకమున శైశవలీలలను నెరపిన వాడతడు. త్రిపురాంతకేశ్వరుని యనుగ్రహమున ఆయనకు సర్వ విద్యలును కరతలామలకములయ్యెను.

వేమనారాధ్యుడు త్రిపురాంతకేశ్వరునకు శిష్యుడై, గురుకర స్పర్శచే లింగధారణ దీక్షలనందెను. సర్వమహిమాన్వితుడయ్యెను. సత్యవ్రత పూర్వకముగ శైవ పరివ్యాప్తి యొనర్చుటకు నతడు ప్రతిజ్ఞను గైకొనెను. శైవానుగ్రహమున "సిద్ధ సారస్వతాది" మహా విద్యలను పొందగల్గెను.

అనంతరము వేమనారాధ్యుడు గురు పట్టభద్రుడై యలరారెను. లింగ నిరీక్షణమున శ్రీశైల దివ్యరూపమును దిలకించెను.

వేమనారాధ్యుడు మదగజారూఢుడై మహేశ్వరులతో గూడి, శ్రీ పర్వతమునకేగి, భ్రమరాంబా మల్లికార్జునులను సేవించెను. సిద్ధరూపమున దర్శనమిచ్చిన మల్లేశ్వరుని పరీక్షలలో నెగ్గి, తత్కృపకు పాత్రుడై సిద్ధవిద్యోపదేశముల నందెను. ఈ విధముగా - ఆవేమనారాధ్యునకు లక్ష్యసాధన సామగ్రి సంపూర్ణముగా సంప్రాప్తమైనది.

ఈ ఘట్టమును నిర్వహించుటలోను, వేమనారాధ్యుని బాల్య కౌమార దశలను, చిత్రించుటలోను కవి చూపిన యొడుపు ప్రశస్తము.

భవిష్యన్మహా కార్యనిర్వహణమునకు వలయు సర్వ విద్యాకౌశలములు సమకూరుట, సర్వవిధ మహిమా విలసన సమర్థములగు సిద్ధసారస్వతాది మహా విద్యలు ప్రాప్తించుట, గురు పదమును స్వీకరించుట, అన్నింటికిని మించి పరమేశ్వరానుగ్రహము నిండారుచుండుట యనునవి వేమనారాధ్యునిలో మిలమిల లాడిన వీరభద్రుని లీలా ప్రతిఫలనములు.

ఇప్పుడింక వేమనారాధ్యుడు "శివసంకల్ప కార్యసాధన"కు సర్వ సన్నద్ధుడైన యొక మహాదివ్యయోధుడు. ఇంక ఆయన మాటకు తిరుగులేదు. పట్టినదెల్ల బంగారము. మెట్టినదెల్ల కైలాసము చూచినదెల్ల శివస్వరూపము.

కనుక నిక నిక్కడనుండి వేమనారాధ్యుని విజయయాత్రల సన్నాహ సంరంభములను, తత్ప్రభావములను పరామర్శింపవలసియున్నది.

## విజయ యాత్రలు

గురు పట్టభద్రుడైన వేమనారాధ్యుడు మదగజారూఢుడై సపరివారముగా మధురకు బయలుదేరినాడు. మార్గ మధ్యమున కావలిలో శివ భక్త శిరోమణియగు సుకేతుని యింట మాహేశ్వర సపర్యలకై యాగినాడు. గురుడు శివపూజా నిమగ్నుడయ్యెను.

శివ పూజార్థము పూవులను గొనివచ్చుటకై వెళ్ళిన సుకేతుని సుతుడు మృత్యు ముఖమునకు గురియైన వార్తనువిని, గురువర్యుడాగ్రహోదగ్రుడై, లింగపసాయితమునకు పని చెప్పినాడు. పర్యవసానముగా మృత్యుదేవత గురు పాదాక్రాంతయై, యా యర్భకుని సజీవునిగా నప్పగించినది. "శివద్రోహ చింత"కు తావీయరాదని శాసించి గురుడు మృత్యువునకు సెలవొసంగినాడు. సుకేతునకు సుతుని అప్పగించినాడు.

ఈ సన్నివేశము పండితారాధ్య చరిత్రమునందలి (1) "ఒదయ నంబి మృత్యువును శిక్షించిన ఘట్టమునకు"ను (2) బసవ పురాణమునందలి "భక్త సిరియాలుని భవ్యగాథకు"ను (3) శ్రీకృష్ణుడు గురుపుత్త్రుని రక్షించిన మహిత వృత్తాంతమునకు"ను సమన్వయ రూపముగా స్ఫురించును.

1. కావేరీ తీరమున మొసలి మ్రింగగా మరణించిన బ్రాహ్మణ బాలుని పునరుజ్జీవితునొనర్చి, ఆ బాలుని తల్లి చెంత నిల్పినవాడు ఒదయనంబి. (పం.ఆ.చ. మహిమా ప్రకరణము. పుట.199.)

కొలను జలములందు మొసలివాతబడి మృతుడైన సుకేతుని సుతుని బ్రదికించి, తల్లిదండ్రుల కప్పగించినవాడు వేమనారాధ్యుడు.

2. సుతుని మృతికి వగవక చిఱుతొండనంబి దంపతులు చెంత నిలువగా, జంగమ రూపమున నున్న పరమశివుడు ఆ బాలుని సజీవునొనర్చి, వానిని రప్పించి, మాతాపిత సుతులకు తీర్థప్రసాదముల ననుగ్రహించెను. (బసవపురాణము - ఆశ్వా. 4. పుటలు. 146-150).

సుతునిమరణమునకు చింతింపక, ఆతల్లి దండ్రులు (సుకేతు దంపతులు) తీర్థ ప్రసాదములకై వేమనారాధ్యుని చెంత నిల్చిరి. గురువర్యుడా మృతబాలుని రక్షించి, యా ముప్పురకును తీర్థప్రసాదములను ప్రసాదించెను.

3. ప్రభాసతీర్థమున సముద్ర జలములందు పంచజనుడు మ్రింగగా సాందీపని సుతుడు మృతుడయ్యెను. శ్రీకృష్ణుడు మృత్యుశిక్ష యొనర్చి, యా బాలుని పునరుజ్జీవింపఁజేసి, వానిని తల్లిదండ్రుల సమక్షమున నుంచెను.

సుకేతు సుతుడు మృత్యువు యొక్క ముఖమున జేరి, యమపురికి కొనిపోబడగా, వేమనారాధ్యుడు మృత్యుశిక్ష గావించి, బాలుని బ్రదికించి వానిని తల్లిదండ్రులయెదుట నిల్పెను.

వేమనారాధ్యుని యీమృత్యు శిక్షాధ్వనులు మధురలో ప్రతిధ్వనించినవి. పరవాదుల హృదయములలో గుబులు చెలరేగినది కావలి కార్యపరమార్థము నెఱవేఱినది.

## మధురలో వాదవిజయాపలి

అనుయాయులతో వేమనార్యుడు మధురకు చేరినాడు. గురుని శివగోష్టులతో మధుర మార్మ్రోగినది. క్షణక్షణమునకును ప్రతి పౌరుని హృదయము శివప్రభావితము కాఁజొచ్చినది. శివేతర భావములు పిక్కబలము జూపసాగినవి. వైష్ణవుల వాంఛపై పాండ్యుని సమక్షమున వాదసభ ప్రారంభమైనది. సర్వేశ్వరుడైన శివుడు రాజును రక్షించునని గురుడాశీర్వదించెను. "శివుడు సర్వేశ్వరు"డనుటను వైష్ణవులాక్షేపించిరి. దానితో దైవపారమ్య విషయమున వేమనారాధ్యునకును, వైష్ణవోత్తములకును వాదోపవాదములు చెలరేగినవి.

అందు వేదవాక్యార్థములు వివరింపబడినవి. ఉపనిషదర్థములు ఉదాహరింపబడినవి. పౌరాణిక గాథలు ప్రస్తావింపబడినవి. ఇతిహాస వృత్తాంతములు పేర్కొనబడినవి. శాస్త్రప్రమాణములు ప్రదర్శింపబడినవి.

నారాయణోపనిషత్తు, వాయు సంహిత, పురుషసూక్తము, పద్మపురాణము, భాగవతము, గాయత్రీ మంత్రార్థము వ్యాసుని "వేదపాదస్తుతి", పంచ

బ్రహ్మ మంత్రములు, శివుని "యష్టమూర్తి విలాసములు," గంగాధారణము, మున్నగు వానిని ప్రస్తావించుచు వారు వారు తమ తమ కనుకూలముగా నాయావాదములను కొనసాగించిరి. ఇంకను లోక ప్రచలితములైన దైవ గాథలు కొల్లలుగా నిజ పక్షానుకూల్యములతో నిరూపింపబడినవి.

శివ పార్వతులు జపించిన "రామనామ తారక మంత్రము" విష్ణు పారమ్యమునకు ప్రబలనిదర్శనమని వైష్ణవులనిరి.

"నమస్తారాయ, నమశ్శంభవేచ" అనుచు వేద రుద్రాధ్యాయము ప్రణవ స్వరూపుడైన పరమశివునే తారక పరబ్రహ్మముగా నిరూపించుచుండ తక్కిన పౌరాణిక ప్రసక్తులకు తావెక్కడ ? అని శైవులనిరి.

"తద్విష్ణోః పరమం పదం" అను శ్రుతి వచనమును ప్రస్తావించి, ఆ విష్ణువు యొక్క పరమ పదము (వైకుంఠము పరమ పదము) అని యర్థమును దెల్పి, విష్ణువుయొక్క యాధిక్యము తిరుగులేనిదని వారు వాదించిరి.

తద్విష్ణోః = ఆ విష్ణువుకంటె, పరమం = శ్రేష్ఠమైన, పదం = స్థానమును, అనగా కైలాసమును అను నర్థమును జెప్పి "ఉభయ నిర్దేశే పంచమీ నిర్దేశో బలీయాన్" అను వ్యాకరణ సూత్రప్రమాణమును జూపి, దానియందు శివపారమ్యమే ప్రతిపాదితమైనదని వీరు నిగ్గుదేల్చిరి.

ఇట్లు యుక్తి ప్రయుక్తులు - అనంత ముఖములుగా[1] సాగినవి. శివు డనగా శుభంకరుడు విష్ణువు - అని వారనిరి. ఇక నారాయణుడగా జ్ఞాన స్వరూపుడు, కల్పాంతమున మిగిలియుండువాడు, పార్వతీపతి - అని వీరనిరి. ఇట్లు - అయాదైవనామములకు యౌగికార్థములను, రూఢ్యర్థములను వివరించుచు పరమార్థములను తమ తమ వాదముల కనుకూలముగా వారును, వీరును పేర్కొనిరి.

---

1. అనంతుడు = అంతము (మృత్యువు) లేనివాడు = శాశ్వతుడు. సర్వాధిష్ఠానము. కావున తత్పరముగా అనియును, అనంతమైన ముఖములుగా అంతులేని (పెక్కు) విధములుగా అనియును.

కడకు వీరభద్ర లీలావతారియైన వేమనారాధ్యుని వాదపటిమకు తట్టు కొనలేక వైష్ణవులు సరుత్తరులైరి. శైవపారమ్య వాదము నెగ్గెను.

ఈ వాద విజయముతో శైవపారమ్యమును రాజు సమ్మతింపలేదు. ప్రత్యక్ష నిదర్శనము కావలెననెను. అందులకై యందఱును సుందరేశ్వరుని గుడికి చేరిరి. వేమనారాధ్యుని యభ్యర్థనపై సుందరేశ్వరుడు "ఓంకారము" నుచ్చరించుచు సాక్ష్యము నిచ్చెను. స్థావర రూపమున నున్న నందీశ్వరుడు లేచివచ్చి, ఇక్షు ఖండములను భక్షించి, యా సాక్ష్యమునకు బలమును చేకూర్చెను. శివుని పారమ్యమునంతతో నందఱు నామోదించిరి. పాండ్యరాజు శివ దీక్షను స్వీకరించి, గురువర్యుని పాదములను సేవించెను.

## గార్హస్థ్యము - పూర్ణ గురుత్వము

మధురలో జయ పతాకను రెపరెపలాడించి, వేమనారాధ్యుడు పరివార ములతో బెలిదీవి చేరెను. భానుమంతుని కూతురగు "విజయలక్ష్మి"ని పెండ్లి చేసికొని, గార్హస్థ్యము నాదరించెను. ఇప్పుడతడు పూర్ణగురు ధర్మములకు కుదురయ్యెను. ఇట కవి వర్ణించిన పాంచాహ్నిక వైవాహిక దీక్షా కార్యక్రమ ములు కాలిక ధర్మదీధితులకు చక్కని నిదర్శనములు.

## పుష్పగిరిలో బ్రహ్మరథ గౌరవాలు

పుష్పగిరినుండి వచ్చిన పెద్దయ్యగారి కోరికపై నా విరూపాక్ష క్షేత్ర మున ఆరాధ్య శైవమునకు గౌరవాదరములను సమకూర్చుటకై యనుయాయు లతో గురువర్యుడచటికి చేరెను. పాండ్యుడిడిన చతురంగ బలముల సాయ ముతో తన మంత్రశక్తి ప్రభావములతో పుష్పగిరి పరివ్రాజకులను, వారికి సాయముగా వచ్చిన చోళనృపతి సేనలను, ఓడించి, యతడచట సర్వారాధ్యు డయ్యెను. వారాయనకు బ్రహ్మరథము పట్టిరి. గురుడచట సాచార్య పీఠ గౌరవములనందెను.

ఈ పుష్పగిరిలోని వేమనారాధ్య విజయమునకొక ప్రత్యేక ప్రాము ఖ్యము గలదు. ఈ పీఠము ఆదిశంకరుల యద్వైత (స్మార్త) సంప్రదాయ నకు ఆంధ్రదేశమున ఒక ప్రధానవేదిక.

ఇక్కడ వేమనారాధ్యునకు బహ్మరథ గౌరవములబ్బుటయు, ఆచార్య పీఠమర్యాదలు సమకూరుటయు, అనునీరెండును. ఆరాధ్యశైవ (శ్రౌత శైవ)ము యొక్క సముస్నతిని చాటి చెప్పును. కాని యివి చారిత్రక సత్య ములనుట కాధారములు కావలెను. 1

## శ్రీరంగమున విజయహేలలు

అనంతరము గురువర్యుడు శ్రీరంగమును జేరెను. గుహేశుని సేవిం చెను. అతడు శ్రీరంగనాథుని దర్శనమును గోరగా జియ్యరువారందుల కామో దింపరైరి. వేమనారాధ్యుడు తన మహిమలచే దేవాలయ ద్వారములు బంధింప బడునట్లొనర్చెను. సేవాకాలములు తప్పునని వైష్ణవులు తికమకలు పడసాగిరి. గురునిరాకతో తలుపులు తెరచుకొనినవి. "శివుడే పరమదైవము. నేను తదా జ్ఞచే లోకపాలనమొనర్చువాడను." అని రంగనాథుడు సాక్ష్యము పలికెను. దానితో సందడికిని వేమనారాధ్యుని మాట వేదవాక్యము య్యెను. శాతవాహన వంశజుడగు స్థానిక ప్రభువు గురుని పాదములనాశ్రయించి,యాయన నగ్రహా రాది ప్రదానముల గౌరవించెను.

మధురలో వైష్ణవులపై నచ్చిన విజయము కంటెను ఈ శ్రీరంగమున పొందిన విజయమునకొక ప్రత్యేకత కలదు. జియ్యరు వారి స్థానము వైష్ణవ మునకు మకుటాయమానము. అట్టి జియ్యరువారి సమక్షమున శ్రీరంగ (వైష్ణవ) క్షేత్రమున వేమనారాధ్యునకు విజయ-గౌరవములు లభించినవనగా శైవ పారమ్యము నిరుపమానమైనదనుటయే. కాని దీనికి చరిత్రాధారములు లభింప వలసియున్నవి.

---

1. వేమనానారాధ్యుడు పుష్పగిరిని దర్శించుట మున్నగు విషయములకు సంబంధించిన వాస్తవములను స్వయముగా, స్వప్రమాణముగా దెలిసి కొనుటకై నేను పుష్పగిరి వెళ్ళితిని. అనంతరము కడపలోనున్న యామఠము వారి కార్యాలయమునకును వెళ్ళితిని. కాని యీ రెండు చోట్లను విచారింపగా పై విషయములను గూర్చి యచటి వారేమియు జెప్పలేక పోయిరి. చారిత్రకాధారములును లభింపలేదు.

## త్రిలింగపురిలో - ఖాజీలపై విజయము

ఆ పిమ్మట గురువర్యుని పరవాద విజయయాత్ర త్రిలింగపురికి చేరినది. దీని పాలకుడు ఒక తురుష్క భూపతి. ఇక్కడ మహమ్మదీయ పురోహితు(ఖాజీ)లకును వేమనారాధ్యునకును మధ్య జరిగిన ఆధ్యాత్మిక విషయ వివాదములు వర్ణింపబడినవి.

ఖాజీ ప్రశ్న - 1. కార్యము చేయువాడు మనుష్యుడు. కార్యసాఫల్యము దైవము వలన కలుగుననుట యెట్లు ?[1]

గురుని సమాధానము : మానవుని శక్తి పరిమితము. దైవశక్తి సర్వకార్యసాధన సమర్థము. నువ్వులలో నూనెవలె మానవులలో దైవాంశ నిగూఢమైయున్నది. ఆ దైవాంశమే (దైవమే) మానవుడొనర్చు కార్యసాఫల్యమునకు మూలము.[2]

ఖాజీ ప్రశ్న - 2. ప్రత్యక్ష ప్రమాణమే సత్యము. పరోక్ష ప్రమాణము అసత్యము అనుట యుచితము గదా ![3]

గురుని యుత్తరము : అనుమానము గూడ నిశ్చయమునకు కారణము. కనుక ప్రత్యక్ష ప్రమాణమువలె ననుమానప్రమాణముగూడ నంగీకార్యమే.[4]

ఖాజీప్రశ్న 3 : పరమార్థము (పరవస్తువు) నిరుపమానమైనదని మునులుచూచిన మీదట గదా! చెప్పగల్గునది. వారు దానిని చూచిరనుటకు నిదర్శనమేమి? వారు చూడక చెప్పినదానిని నమ్ముటయెట్లు? కాన వారి పలుకులు సందేహాస్పదములే.[5]

గురుని సమాధానము : విబుధులు (మునులు) సత్యవచనులు. తపశ్శక్తి కారణముగ వారు ప్రత్యక్ష పరోక్షముల నెఱుంగ సమర్థులు. వారి వృత్తి (రీతి) గుణములకు లోబడనిదిగాన అత్యాజ్యము. అనగా తప్పక స్వీకరింపదగినది.[6]

---

1. వే.ఆ.చ. 5-159. 2. వే.ఆ.చ 5-160.
3. వే.ఆ.చ. 5-161. 4. వే.ఆ.చ. 5-162.
5. వే.ఆ.చ. 5-163. 6. వే.ఆ.చ. 5-164.

ఖాజీప్రశ్న 4: పూర్వజన్మార్జిత ఫలగతులే ఉత్తర (తరువాతి) జన్మములలో ననుభవింపబడుచు (చర్విత చర్వణముగ) లోకజీవనము సాగుచు నుండును గదా! ఇక సదసద్భేదంబులకు తావెక్కడ?[1]

గురుని సమాధానము : జన్మము కర్మహేతుకమైనను నిత్యచైతన్య స్ఫూర్తిగలచోట వివేకమునకు చోటులేదనుట తగదు. వివేకమున్నచోట సదసద్విభేదముండియే తీరును. కావున సదసత్కర్మల ప్రాధాన్యము కాదన రానిది.[2]

ఇట్లు పరంపరగాసాగిన ప్రశ్నోత్తరములకు స్వస్తిపలికి "క్రియా కేవల ముత్తరం" అనుసూక్తి ననుసరించి, వారికి గురుడు ప్రత్యక్ష నిదర్శనముతో సమాధానమీయదలచెను. వెంటనే యతడు- ఆఱునెలల ప్రాయముగల బాలుని దెప్పించెను. సభామధ్యమున వానిని (అపసిబాలుని) గురుడిట్లు ప్రశ్నించెను. భగవంతుడు (ఈశ్వరుడు) కలడా? జీవుని పుణ్యపాపములకతడు తగిన ఫలముల నొసంగునా? అని— అంత నా పసిబాలుడు సర్వాశ్చర్యకరముగా నిట్లు పలికెను. భూతభవిష్యద్వర్తమానముల కతీతుడగుచు నీశ్వరుడుగలడు. అతడు సత్యప్రభావకలితుడు. జగత్ప్రభువు. సర్వసాక్షి. అతడు జీవుని తత్తత్కర్మ ఫలముల ననుభవించువానినిగ సృజించును. అని- ఇంకను ఆ పసిబాలు డీశ్వరతత్త్వమును గూర్చి వివరించెను. ఆ పసిబాలుని పలుకులందఱికిని విశ్వసనీయములై, యామోదయోగ్యములయ్యెను. నరపతి గురుపాదముల నాశ్రయించి, విధేయుడయ్యెను. అతడు గురునకగ్రహారముల నర్పించెను.

మధురలో జరిగినది "శైవవైష్ణవ పారమ్యప్రతిపాదకచర్చ" కాగా— ఈ త్రిలింగపురమున కొనసాగినది నాస్తిక హృదయక్షేత్రాలలో భగవదస్తిత్వ బీజావాపనములతో- ఈశ్వరతత్త్వాంకురార్పణము— ఈ ఘట్టమునందు మహమ్మదీయ పురోహితుల నోట పలికించిన వాక్యములు మహమ్మదీయ సిద్ధాన్త ప్రబోధములుగాక చార్వాక సిద్ధాన్త ప్రబోధకములై యున్నట్లు గమనింపవలెను. చార్వాక మహమ్మదీయులకుగల వేదనిందకత్వసామ్యమును బురస్కరించుకొని కవి యిట్లు చేసియుండవచ్చును.

1. వే.ఆ.చ. 5-165. 2. వే.ఆ.చ. 5-166,167,168.

# కల్యాణ నగరమున - వైదికధర్మ సింహాసనము

పరివారములతో గురువర్యుడు కల్యాణ నగరమును సమీపించెను. అనుయాయులతో బసవన ఎదురేగి, వేమనారాధ్యునకు పాదాభివందన మాచరించి, వారిని బసలలో ప్రవేశపెట్టెను. వేమనార్యుడు బసవన సమక్షమున బిజ్జలుని రాజసభలో పండితమండలి మధ్య శివతత్త్వ గోష్ఠిని నెఱపి, వీరశైవ శంఖారావమును వినిపించినాడు. సందర్భానుసారముగా అరాధ్య (శ్రౌత) శైవ ప్రశస్తిని ప్రకటించినాడు. బ్రాహ్మణబ్రువులను దూసిపోసినాడు. తమ యారాధ్య శైవవైశిష్ట్యమును నిరూపించుటకై నిజయజ్ఞోపవీతములనుండి సుధాధారలు స్రవింపఁజేసినాడు.[1] (ఈ "యమృతధారలను స్రవింపజేయుట" పాల్కురికి సోమనచే పండితారాధ్య చరిత్రమున వర్ణింపబడినది. ఈ సందర్భము దానిని స్మరింప జేయుచున్నది.)

వేమనారాధ్యుని బసవేశ్వరుడు తనయింట శివపూజ కాహ్వానించినాడు. ప్రసాదము పెట్టుమనినాడు. అందులకు వేమనారాధ్యుడు "భక్తిమీఁది వలపు బ్రాహ్మ్యంబుతో పొత్తు, పాయరాదు మాకు బసవలింగ !" అని బదులు పలికినాడు. ఈ ధర్మ మీమాంస యాయుభయులను ఇరుకున బెట్టినది. వేదచోదితమైన వర్ణాశ్రమ ధర్మ వ్యవస్థాది నియమ నిమిత్తములులేని శివభక్తి మార్గమునకు బసవన ప్రాతినిధ్యము వహించెను. సనాతన ధర్మ సంశోభితమైన శైవ భక్తి పథమునకు వేమనారాధ్యుడాలంబనమై నిలిచెను. ఈ సమస్యా పరిష్కార సాధకుడుగా "అల్లమస్వామి"యే వారి యుల్లములఁదోచెను. అల్లమ స్వామి సూచనలమేరకు ఆ యుభయులును తమ దివ్యతేజో రూపములను దాల్చిరి. అల్లమ ప్రభుడు శివస్వరూపమును స్వీకరించెను. దివ్యపాకముల సమకూర్చెను. వారికి సహపంక్తి భోజనమును సమకూర్చెను. దివ్యతేజోరూపులకు

1. శివనాగమయ్య, బసవేశ్వరుడు చేతులారంగ శివపూజలొసర్చిన మహా మహితాత్ములు. దైవసేవలతో శివభక్తిని పండించుకొనిన చేతులు వారివి. ఆ యుభయుల చేతులనుండి "అమృతధారలు" స్రవించినవి.
పండితారాధ్యచరిత్రము-దీక్షా.ప్రక. పుట. ౬౭.

విధులుగాని, త్యాజ్యములుగాని లేవనిగదా! పురాణ ప్రమాణము.1 పురాణ ధర్మ మర్మజ్ఞుడైన పావయారాధ్యుడీఘట్టమును నిర్వహించిన తీరు గమనార్హము. పిదప బసవేశ్వరుని పిద్ధాని వేమారాధ్య గురువర్యుడు పాండురంగక్షేత్రమునకు ప్రయాణమయ్యెను.

## "గంధర్వ శాపవిముక్తి"

మార్గ మధ్యమున గురుపరివారములపై "ఏనుగుల గుంపు" దాడి చేసెను. గురువర్యుడు శివస్మరణమున లింగాభిషేక జలములను వానిపై చల్లెను. వెంటనే యాగజములు గంధర్వ రూపములను దాల్చెను. కౌండిన్య ముని వలన తమకు గల్గిన శాపప్రాప్తిని, ఆ మహర్షి యిచ్చిన శాపావధి మేరకు ఇప్పుడు ఈ రీతిగా లభించిన శాప విముక్తిని గురువర్యునకు ఆ గంధర్వులు దెల్పిరి.

కవి యొనర్చిన యీ గంధర్వశాప విముక్తి చిత్రణముపై పాల్కురికి సోమనకృత బసవపురాణమునందలి "ఉద్భట వృత్తాంత" ప్రభావము, రామలింగ రచిత "ఉద్భటారాధ్య చరిత్ర" ప్రభావము- ఎంతేని గలవు.2

---

1.* ధర్మవ్యతిక్రమో దృష్ట ఈశ్వరాణాంచ సాహసమ్,
తేజీయసాం నదోషాయ, వహ్నేస్సర్వ భుజోయథా॥

* నైతత్ సమాచరేజ్జాతు మనసాఽపిహ్యనీశ్వరః
వినశ్యత్యాచరన్ మౌఢ్యాద్యథారుద్రోఽబ్ధిజం విషమ్॥

సంస్కృత భాగవతము-దశమ స్కంధము. పుట. 327.

2. ఇట "గజేంద్రమోక్షగాథ"యొక్క ప్రభావముగూడ నున్నదేమో యని, అనిపించును. "హూహూ" నామ గంధర్వుడు దేవలునిచే శప్తుడై, మకరమయ్యెను. గజేంద్రుని బాధించెను. విష్ణుచక్రాహతిచే నామకరముహతమై గంధర్వరూపమును పొందెను. అట శాపోపహతి- మకరరూపప్రాప్తి- చక్రధారస్పర్శ- శాపవిముక్తి- గంధర్వరూపప్రాప్తి- ఇట- శాపాహతి- గజరూపప్రాప్తి- లింగాభిషేక జలస్పర్శ- శాపవిముక్తి- గంధర్వరూపప్రాప్తి.

## శివలింగము సర్వ(దేవతా) శిరోధార్యము

శరభసాళ్వేశ్వరుని యనుగ్రహమున నష్టంకుల నధిగమించి, పాండు రంగ నగరమున ప్రవేశించి, వేమనారాధ్యుడు పాండురంగనిని దర్శించెను. అచటి స్థానిక ముఖ్యునితో "పాండురంగని శిరమునగల శివలింగము"ను గూర్చి ప్రస్తావించి, అది యథార్థమని గురుడు నిర్ధారణ చేసికొనెను. ఈ సందర్భ నిర్వహణముతో "శివలింగము విష్ణువునకును శిరోధార్యము" అని ప్రకటించినట్లయ్యెను.

## కొలనుపాకలో - గురుమహిమలు

పిదప సపరివారముగా గురుడు కొలనుపాకకు చేరెను. ఈ కొలనుపాక రేవణసిద్ధ పాదస్పర్శచే పునీతమై శివభక్తికి భద్రభూమిగా వాసికెక్కినది. ఇచట ఉరిలింగార్యుడు గురునకు సకల సపర్యలను గావించెను. స్థానిక నరపతి గురుమహిమను గుర్తింపక, నిజాధిక్యమును ప్రకటింపబోగా గురు వర్యుడు "అఘోరేశ్వర" ప్రభావమున రాజునకు కనువిప్పు కలిగించెను. స్థానిక శివాలయమున "సోమేశ్వరుని" సాక్ష్యముతో "ఉత్తరశైవము" (ఆరాధ్య శైవము) సర్వసిద్ధి ప్రదమని నిరూపించెను.

పిమ్మట భద్రాద్రికి చేరువలోగల హయపతినగరము చేరి, యచ్చట "కలహకారిణి"యను మంత్ర విద్యాప్రయోగమొనర్చి, స్థానిక తురుష్క భూపతికి బుద్ధి చెప్పెను. తరువాత గురువర్యుడు సమీపాగ్రహారమున విడిసి, పోరంట్ల సూరసానమ్మ యొనర్చిన యతిథి సేవలను స్వీకరించెను. ఆమె కోరిక ననుసరించి, యామె తమవెంట వచ్చుటకు వేమనారాధ్యుడునామో దించెను.

పండితారాధ్య చరిత్రమున వేమనారాధ్యుడును, సూరసానమ్మయు కలిసి ద్రాక్షారామమున మల్లికార్జున పండితుని దర్శించినట్లు కలదు. దానిని అనుసరించి, వేమనారాధ్యుడు సూరసానమ్మను తనవెంట దీసికొని ద్రాక్షారామ

ప్రయాణము లొనర్చినట్లు. ఈ సందర్భమున పావయారాధ్యుడు కల్పించెనే గాని, ఇకమీదట ప్రబంధ సమాప్తివఱకును, సూరసానమ్మ ప్రసక్తియే యతడు చేయలేదు.

అనంతరమరణ్య మధ్యముగా ప్రయాణము సాగుచుండగా జైన ప్రేరితులైన యిరుపురాటవికులు సాయుధులుగావచ్చి, గురు పరివారముల నడ్డగించిరి. గురుడు నిజమంత్ర ప్రభావమున వారికి బుద్ధిచెప్పెను. వారు పాదాక్రాంతులుకాగా ఆ గురువర్యుడు "చాక్షుషీ దీక్ష"1నిచ్చి, వారిని శివభక్తి విలసితులనొనర్చెను. పండితారాధ్య చరిత్రమున మల్లికార్జున పండితుడు జైనవాదమును ఖండించెను. దాని యనుసరణముగా నిందీకవి జైనపరముగా నీలేశ మాత్రకల్పన మొనర్చినట్లూహింప వలసి యున్నది.

తదనంతరము ద్రాక్షారామమున వేమనారాధ్యుడపూర్వ గౌరవాదరములతో నలరారెను. గురునియెడ సముచితరీతిని పాటింపక గౌడ బ్రాహ్మణ ప్రోద్బలముచే గంతులువేసిన గజపతి రాజునకు వేమనారాధ్యుడు చక్కని గుణపాఠమును నేర్పి, క్షమించి, విడిచిపెట్టెను.

ఈ ఘట్టమును చిత్రించుటలో పావయారాధ్యుడు తనలో సోమన శివావేశమును ప్రస్ఫుట మొనర్చెను. తన వేమనారాధ్యునిలో మల్లికార్జున పండితారాధ్యుని వైభవ ప్రాభవములను దర్శించెను. వానికి నక్షరాకృతి నమర్చెను.

మధురలోని పాండ్యరాజసభలో వాద విజయము మొదలుకొని ద్రాక్షారామమున "త్రిలోకగురు బిరుద విరాజితుడైన మల్లికార్జున పండితుని సమక్ష

1. గురువు శిష్యులకొసంగు శైవదీక్షలలో వైదిక దీక్షయు, పురాణదీక్షయు గలవు. కాని యీ "చాక్షుషీ దీక్షా" ప్రసక్తి, యాగమాదులలో కానరాదు. ఇది యాచార సిద్ధమైనదని భావింపవచ్చును. అత్యవసర పరిస్థితులను బట్టి "ఆతుర సన్న్యాసము"ను స్వీకరించుట వంటిదిగా దీనిని నూహింపవచ్చును. దీక్షా ప్రక్రియలన్నియు నిందు యథావిధిగా కొనసాగవు.

మున స్వర్ణ కిరీట ధారణముతో నమరిన బ్రహ్మరథోత్సవ గౌరవ లాంఛ ముల వఱకు కొనసాగిన వేమనారాధ్యుని లక్ష్యములు సమున్నతములైనవి. చూపిన మహిమ లద్భుతములైనవి. సాధించిన విజయము లసాధారణము లైనవి.

నిగమాగమ పురాణేతిహాసాది ప్రమాణములతో పరమశివ పారమ్య నిరూపణము గావించుచు, దైవసాక్ష్యములతో, సాక్షాత్కారములతో వానిని ప్రజా హృదయములలో విశ్వాస మహితముల నొనర్చుట, శివదీక్షా ప్రదానము లతో శైవమత పరివ్యాప్తికై పాటుపడుట అనులక్ష్యద్వయము, పడుగుపేకల వలె విడదీయరానివై, యప్పటి వఱకును పరస్పరాశ్రయములతో నుత్సాహ ముగా నురకలు వేసినవి. ద్రాక్షారామ విజయోత్సవములతో వీరభద్ర లీలావతా రముగా వేమనారాధ్యుడు భువికే తెంచిన లక్ష్యము నెఱవేఱినది. పరమార్థము సిద్ధించినది.

దీనియనంతర ప్రయాణమున వేమనారాధ్యుడు "పట్టిసము" చేరగనే, సందర్భ వశముగా నీ పట్టిస వీరభద్రునిచే కవియే యామాటను జెప్పించి నాడు.[1] ఇట్లీవిధముగా ప్రసరించిన విజయోత్సవ పరంపరాదీధితులు వేమనా రాధ్యునిలో శివ స్వరూపమును నింపినవి. ఆయనలో నిపుడు వీరభద్ర రుద్రాంశలు భవ్యకాంతులీనుచున్నవి. విమతుల కిపుడాయనలో వీరభద్ర

1. * శివునాజ్ఞవలన ధరసం
భవ మంది తయోని ఆన! సమస్తము విమతో
త్సవమణఁగె, మానుషంబున
వ్యవహృతి సల్పితివి యిష్ట వాల్లభ్యమునన్
వే.అ.చ. 9-165 పుట.202

* ఇంక సరభావమేల ? సి విలఁబరించి,
సలుపదగు కార్యజాతంబు చక్కఁబడియె,
దైవభావంబు గొని, దేవ దానవాది
వర్ణనంబులఁదెలిసి, భవ్యంబుగనుము॥
వే.అ.చ, 9.166. పుట.202,

విజృంభణ భయదరూపమే ప్రస్ఫుటమగుచున్నది. భక్తులకాయనలో సచ్చిదానంద (శాంత) శివస్వరూపమే ప్రత్యక్షమగుచున్నది.

అది పట్టిస కానిండు, పాలకొలను కానిండు, కొవ్వూరు కానిండు, కాశీనగరము కానిండు, సరొయ్యూరు కానిండు, విజయవాటిక కానిండు, కదకనంతశయనము కానిండు, అమరావతి కానిండు, అంతటను అందఱికిని శివభావనను ప్రసరింపజేయు భద్రమూర్తిగా భాసిల్లుచు, తత్రాపి శైవక్షేత్రములందు ఆరాధ్యమూర్తిగా నీరాజనములందుచు మహోన్నతస్థితిలో క్రౌంచగిరి మీదుగా శ్రీపర్వతముచేరిన మహామహుడు వేమనారాధ్యుడు.

## గమనార్హ విషయములు

వేమనారాధ్యుడును, బసవనయు కల్యాణనగరమున కలిసికొనినట్లు ఈ ప్రబంధమునందు పాపయారాధ్యుడు పేర్కొనెను. వీరి సమాగమమును విశ్వసించుటకు వీలున్నది. పండితారాధ్య చరిత్రమునందు బసవనను గూర్చి మల్లికార్జున పండితారాధ్యునకు తెల్పినవాడు వేమనారాధ్యుడు. దీనినిబట్టి యంతకుముందు- ఆ వేమనారాధ్య- బసవేశ్వరుల సమాగమములు సంభవించినట్లూహింపవచ్చును.

వేమనారాధ్య బసవనల కలయికలను కన్నడమున "అమరగణాధీశ్వర చరిత్ర"యు1 "బసవాదిగణచరిత్రమత్తు గణవచన మంజరి"2 అనురచనయును తెలుపుచున్నవి.

రెండు సందర్భములలో బసవేశ్వరుడు వేమనారాధ్యునకు పాదాభివందనము లాచరించినట్లు - ఈ వేమనారాధ్య చరిత్రమున తెలుపబడినది. కన్నడమున శ్రీ హుణిశ్యాలగారి రచనమునందును వేమనారాధ్యునకు బసవన పాదాభివందన మొనర్చినట్లు కలదు.

---

1. దీనిని శ్రీ పి.జి. హళకట్టిగారు రచించిరి. 1956లో ముద్రితము.
2. ఇది డా॥ యస్.యం. హుణిశ్యాలగారి రచన. 1968లోముద్రితము.

కాని సోమనకృత "పండితారాధ్య చరిత్రమున మాత్రము వేమనా రాధ్యుడు" బసవన పాదాబ్జములను తన హృదయమున నిలుపుకొనినవాడు" అని వర్ణింపబడినవాడు.[1]

శైవ సంప్రదాయమున శివుని కంటెను గురుడును, గురుని కంటెను చరుడును అనగా జంగముడును (భక్తుడును) పూజ్యార్హత (గౌరవార్హత) కలిగియుండుట సువిదితము. కాన వాస్తవముగా నిది చర్చనీయాంశముకాదు. (కానక్కఱలేదు.) కాని ఆయా రచనలలోని ప్రస్తావనములయందలి విభేద ములను జూపుటయే యిందలి ప్రధాన విషయము.

సర్పదష్టుడైన రాజు పేరు "మండలేంద్రుడ"నియు, ఆయన భార్య పేరు "కుండలి" యనియు, కుండలి తండ్రి "క్షత్రవల్లభుడు" అనియు, అతని భార్య "పద్మావతి" యనియు, అక్షత్రవల్లభుని తమ్ముడు "శూర సేనుడు" అనియు, పాపయారాధ్యుడు నామకరణము చేసినాడు. పండితా రాధ్య చరిత్రమునందీ పేర్లులేవు.

కన్నడ రచనయగు "భైరవేశ్వర కావ్యద కథామణి సూత్ర రత్నాకర (2వ భాగ)ము"న[2] మాత్రము మండలేశ్వరుని పేరు "సారంగరాజు"గను అతని నగరము "పోరాండల పురము"గను పేర్కొనబడినవి.

## నాయకుడు

ఈ ప్రబంధము నందు వేమనారాధ్యుడు "ధీరశాంతుడు"[3]గన నాయకు డుగా వర్ణింపబడెను. ధీరుడును శాంతుడును ఐనవాడు ధీరశాంతుడు.

---

1. బెలిదేవి వేమయ్య పెద్దయ్యగారు...........బసవ పాదాంభోజ భాజన స్వాంతుడు. పండితారాధ్య చరిత్రము పురాతనప్రకరణము పుట.100. 1968లో ముద్రితము.
2, దీని సంపాదకులు శ్రీ డా॥ R. C. హిరేమఠ్‌గారు. ఇది శాంతలింగ దేశిక కృతము.
3. "ఆరూఢిన్ శమ ధీ ప్రసన్నుడు ద్విజుండౌ ధీరశాంతుండు" అని నరసభూపాలీయము. పుట. 457

సామాన్యగుణైర్భూయాన్ ద్విజేషు ధీర ప్రశాంతః -
సాహిత్యదర్పణము,

సీ॥ భస్మత్రిపుండ్రాంక ఫాల భాగంబుతో, సర్వాంగ రుద్రాక్ష సరులతోడ
స్ఫటిక లింగాంచిత స్వర్ణ పేటిక తోడ, పలుద నీ ర్కావి దోవతుల తోడ
స్ఫటికాక్షమాలికాంచ త్కరాబ్జము తోడ, నియత లింగధ్యాన నిష్ఠతోడ
ప్రణవ పంచాక్షరీ పఠన ప్రయుక్తితో, శివభావనా మనస్సిద్ధితోడ
తే॥గీ॥ సద్గురు కటాక్ష సంప్రాప్త సహజలింగ,
మథన పరమామృతాస్వాద మధురమైన
మూర్తితో వేమనారాధ్య మూర్తి చెలఁగె,
గీర్తి తాశేషగురుచక్ర వర్తి యగుచు

(వే ఆ.చ. 2-60)

"ధర్మ వీర ప్రధానుడు ధీర శాంతుడు".2 ఈ ప్రబంధము నందలి వేమనారాధ్యుడు ధీరుడును, శాంతుడును, ద్విజుడును- ఐ యున్నందున శాస్త్ర లక్షణములను బట్టి ధీరశాంతు డగుచున్నాడు.

## ర స ము

సంసార విషవృక్షస్య, ద్వేఫలే అమృతోపమే
కావ్యామృత రసాస్వాదః, సల్లాపః సజ్జనైస్సహ॥

సంసారము (లోకజీవితము) ఒక విషవృక్షము వంటిది. దాని ఫలములలో రెండు మాత్రమమృతతుల్యములు. 1. కావ్యామృత రసాస్వాదము. 2. సజ్జనులతోడి సల్లాపము. ఈ కావ్యపఠన శ్రవణాదుల వలన కలుగు ఆనందము "రసానందము." ఈ రసానందము బ్రహ్మానంద సహోదరమని సాహిత్య

2. "యుద్ధ వీర ప్రధానః ధీరోదాత్తః", "వీర రౌద్ర ప్రధానః ధీరోద్ధతః", "వీర శృంగార ప్రధానః ధీర లలితః", "దానధర్మ వీర ప్రధానః ధీరశాంతః"
అని హేమ చంద్రుని కావ్యానుశాసనము. కావ్యాలంకార సంగ్రహము పుట. 60.

శాస్త్రజ్ఞులు వక్కాణించిరి. బ్రహ్మానందసముద్భూతమైనది. అనుభవైకవేద్యమైనది. అట్లే రసానందముగూడ తత్తుల్యమైనదని భావము. ఈ "రస" ప్రాశస్త్యమును, ప్రాముఖ్యమును గుర్తించిన కవులు తమ కావ్యములయందు దానికొక ప్రధాన స్థానమొసంగి, తత్పరిపోషణమునకు తగిన శ్రద్ధాదరముల జూపుచు వచ్చిరి.

రసముల సంఖ్య విషయమున సాహిత్యలోకమున మతభేదము లెన్ని యున్నను, శృంగారాది రసనవకమునకు మాత్రము బహుజనామోదము లభించినది.

నవరసములు.[1] 1. శృంగారము. 2. హాస్యము. 3. కరుణము. 4. రౌద్రము. 5. వీరము. 6. భయానకము. 7. బీభత్సము. 8. అద్భుతము 9. శాంతము.

ఆరసములకు స్థాయిభావములు.[2] 1. రతి. 2. హాసము 3. శోకము. 4. క్రోధము. 5. ఉత్సాహము. 6. భయము. 7. జుగుప్స. 8. విస్మయము. 9. శమము.

ఈ నవరసములలో నొక్కటి మాత్ర మంగి (ప్రధాన) రసముగను, తక్కినవి సందర్భానుసారముగ నాయా కావ్యములలో నంగరసములుగను ఒప్పు చుండును. అంగి రసములలో "శృంగారము" రసరాజముగా ప్రసిద్ధి గాంచినది. దాని తరువాత వీర కరుణాద్భుతశాంతములు" ప్రశస్తి నంది నవి.

వీర రసమునకు "ఉత్సాహము" స్థాయి భావము. ఆ "ఉత్సాహము" యొక్క స్వరూప స్వభావములను బట్టి ఈ వీర రసము 1. యుద్ధ వీరము.

---

1. శృంగారహాస్య కరుణ రౌద్ర వీరభయానకాః,
బీభత్సాద్భుత శాంతాశ్చ నాట్యే నవరసాః స్మృతాః॥
2. రతిర్హాసశ్చ శోకశ్చ, క్రోధోత్సాహౌభయం తథా,
జుగుప్సా విస్మయశ్చేతిస్థాయి భావాః ప్రకీర్తితాః.
నాట్య శాస్త్రము

2. దాన వీరము. 3. దయా వీరము. 4. ధర్మ వీరము మున్నగు పేర్లతో పేర్కొనబడినది.

వేమనారాధ్య చరిత్రమునందలి "అంగిరసము" (ప్రధాన రసము) ధర్మవీరము. దానికి ధర్మోత్సాహము (శైవధర్మోత్సాహము) స్థాయి భావము. ఇందు వేమనారాధ్యుడును, విమత పక్షముల వారును. ఆలంబన విభావములు. నయ వినయములు, బలపరాక్రమములు, తేజః ప్రతాపములు మొదలగునవి "ఉద్దీపన విభావములు". పరధర్మముల పట్ల ఉపాలంభము, హస్త ప్రక్షేపము, ధనబల, శరీర త్యాగములు మొదలగునవి "అనుభావములు". ధృతి, మతి, గర్వము, ఆవేశము, ఔగ్ర్యము, అమర్షము మున్నగునవి వ్యభిచారి భావములు.

వేమనారాధ్య చరిత్రమునందు ప్రథమాశ్వాసమున దక్షయజ్ఞమునందు "యుద్ధవీరము" ప్రతిపాదింపబడినది. అందు వీరభద్రుడు శివాపచార మొన ర్చిన దక్షునిపై ధ్వజమెత్తెను. యజ్ఞవేదికను ధ్వంసమొనర్చెను, దక్షుని శిర మును ఖండించెను. విష్ణుమూర్తినోడించి, విధేయునిగా నొనర్చెను. శారదాపతి శరణాగతుడు కాగా వెడలి పోనిచ్చెను. యజ్ఞపురుషుని శిరమును ఛేదించెను. సూర్యుని పండ్లూడగొట్టెను. చంద్రుని త్రొక్కివైచెను. తక్కిన వారి నెల్లరను తగిన విధముగా శిక్షించెను. ఈ విధముగా వీరభద్రుని వీరవిహార మచట వర్ణితమైనది.

మూడవ యాశ్వాసమునందు సుకేతుని యొక్క సుతుని రక్షించు సందర్భమున వేమనారాధ్యుడు తన లింగ వసాయితమను ఖడ్గమును ప్రయో గించి, మృత్యుదేవతను తన పాదాక్రాంతనుగా జేసికొనెను. ఇచట ధర్మ వీరము పోషింపబడినది. మృత్యుదేవత వేమనారాధ్య పాదాక్రాంత యగుట ధర్మవీరానుకూల సంఘటనమే.

లింగ వసాయితము (ఖడ్గము) యమలోకమునకు జేరినప్పుడు వీర రసమున కంగముగా భయానక రసమలరారినది. ఆ ఖడ్గ విజృంభణమునకు యముడు భయకంపితుడయ్యెను. సుకేతుసుతుని గ్రసించిన మృత్యుదేవత ఘోరభయదస్థితికి వణకిపోయెను. కన్నీరు కార్చెను. భయకారణముగా నామె

మేను చెమర్చెను. తలకురులు వీడెను. పయ్యెద జారెను. ఆమె వెక్కి వెక్కి యేడ్చెను.

ఆ మూడవ యాశ్వాసమునందే మధురా నగరమున పాండ్యరాజసభలో శైవధర్మ వీరుడైన వేమనారాధ్యునకును వైష్ణవధర్మయోధులకును జరిగిన వాద యుద్ధమున విజయము వేమనారాధ్యుని వలచినది. ఇది యొక ధర్మ వీరానుకూల ఘట్టము.

నాల్గవ యాశ్వాసమున వేమనారాధ్యుడు సేనాపరివారములతో ధర్మ విజయ యాత్రలకు బయల్వెడలెను. పుష్పగిరి యొద్ద పురప్రవేశమున కడ్డగించిన బ్రాహ్మణ సమాజములను గురువర్యుని సేనలు పారద్రోలినవి. అనంతరము పుష్పగిరి మఠపరివ్రాజకులు స్థానిక ప్రభువగు చోళుని సేనలను బాసటగా గొని గురువర్యుని సేనల నడ్డగించిరి. ఆ యుభయ సైన్యములకును పోరు ఘోరముగా జరిగినది కడకు విజయము వేమనారాధ్యునకు దక్కినది. ఇచట నంగముగా యుద్ధవీరము ప్రతిపాదింపబడినది.

ఈ సందర్భమునందే ప్రత్యర్థులను పాఱద్రోలుటకు గురువర్యుడు రౌద్రాకారమును దాల్చెను. కన్నుల నిప్పుల గురిసెను. కాలరుద్రుడై విజృంభించిన గురుని క్రోధాగ్ని జ్వాలలకు పరబలములలో కొందరగ్ని కాహుతికాగా, హతశేషులు బ్రతుకు జీవుడా! యని పిక్కబలముల జూపిరి. ఇచట రౌద్రాద్భుత రసములు వ్యక్తములైనవి.

పంచమాశ్వాసమునందు శ్రీరంగమున వైష్ణవక్షేత్రమునకు నధిపతియైన జియ్యరు వారికిని, శైవధర్మక్షేత్ర పరిరక్షకుడైన వేమనారాధ్యునకును మధ్య దివ్యశక్తి బలపరాక్రమ ప్రదర్శన సమరము అసమముగా సాగినది. వేమనారాధ్యుడు తన దివ్యశక్తివలన శ్రీరంగనాథస్వామి దేవాలయ ద్వారములను మూయించుట, తెఱిపించుట, గణబాలకునిచే కావేరీజలములను పానము చేయించుట, మున్నుగా నొనర్చిన కృత్యములవలన నిష్పన్నమైన యద్భుతరసము, విజయమునందిన వేమనారాధ్యుని "వీరమున" పర్యవసించినది.

వేమనారాధ్యుడు నిజపరివారములతో శ్రీరంగమును వీడి, పశ్చిమ భూములకు ప్రయాణములు చేయుచుండగా మార్గమధ్యమున నడవిలో దొంగలు తారసపడిరి. మొదట వారి భావములెట్టివైనను గురువర్యుని పవిత్ర దర్శనమున వారిలో వైరాగ్యము పెల్లుబికెను. ఇచట శాంతరసమునకుఁ జోటు చిక్కినది.1

ఈ యాశ్వాసమునందే త్రిలింగ పురమునందు తురుష్క భూపతి యొక్క భౌతిక శక్తులకును వేమనారాధ్యుని శైవధర్మ దివ్య శక్తులకును జరిగిన పోరులో గురువర్యుడు నెగ్గగా, మహమ్మదీయ భూపతి గురుపాదములపై వ్రాలెను. ధర్మవీర మిచట సుప్రతిష్ఠితము. అఱువ యాశ్వాసమున స్మార్త బ్రాహ్మణ పండితులపై వేమనారాధ్యుడు నిండు సభలో తనయారాధ్య శైవవైశిష్ట్య వైభవములను ప్రదర్శించి, తాను విజయి యైనాడు. ధర్మ వీరవిజయ పతాక మిచట రెప రెప లాడినది.

సప్తమాశ్వాసమున పాండురంగ క్షేత్రమునకు వెళ్ళుచు మార్గమధ్యము నందొక ప్రదేశమున ప్రవాహములుపొంగగా జలదేవత గురుపరివారములపై విజృంభించినది. వేమనారాధ్యుడునిజమంత్ర మహిమలచే దాని విజృంభణము నరికట్టి, యదుపుచేసినాడు. పాండురంగ పురప్రవేశమునకు ప్రతిబంధకములుగా వైష్ణవస్వాములు వేమనారాధ్యున కడ్డంకులు గల్గించిరి. గురువర్యుడు తన శరభ సాళ్వేశ్వరుని పురమాయించి, తాను విజయియై, తత్పురమున సగౌరవముగఁ బ్రవేశించెను. ఈ సందర్భములలోని శివశక్తి విజయములు ధర్మ వీర రస పరిప్లుతములే.

ఈ సన్నివేశమున రోగములకు గుఱియైన పాండురంగ నగర పౌరుల దుర్భరావస్థలు మిక్కిలి జుగుప్సావహముగ వర్ణితములైనవి. కనుక నిట బీభత్స రసము "అంగరసము"గా చోటు చేసికొనినది.

క్షత్ర వల్లభుని కూతురగు "కుండలి" యొక్క యవయవ సౌభాగ్య వర్ణనమునందు "శృంగారము" వ్యక్తమైనది.స్వయంవర సందర్భమున వివా

---

1. వేమనారాధ్య చరిత్రము - 5.71, 72.

హామునకు ముందే వనమున మండలేంద్రుడు కుండలిని చేరదీసి గాఢ పరి రంభణ, బింబాధర చుంబన, కరక్షత దశనక్షతాదులచే నామెను చొక్కింప జేసినట్లు వర్ణింపబడినది. కుండలి మండలేంద్రుల వివాహానంతరము ఆ దంపతుల సంభోగ శృంగారము పోషింప బడినది. ఇట శృంగార రసము "అంగభావమును" భజించినది.

సర్పదష్టుడైన మండలేంద్రుడు మరణింపగా తత్పత్నియగు కుండ లియు, బంధుమిత్రాదులును కన్నీరు మున్నీరుగా విలపించిన సన్నివేశమున "కరుణము" రమణీయాంగముగా నొప్పారినది.

అష్టమాశ్వాసములో భద్రాద్రి సమీపమునగల "హయపతినగరము" నందు తురుష్క భూపతిని దారికి దెచ్చుటకై వేమనారాధ్యుడు కలహకారిణీ శక్తిని ప్రయోగించెను. పౌరులెల్లరును వికృతాకారములతో వింత వింత చేష్ట లతో ప్రవర్తించిరి. ఈ సందర్భమున "హాస్యము" అంగరసముగా శోభించినది.

నవమాశ్వాసమునందు కటకపురాధియగు జరాసంధుడు సాగర సంగమ తీర్థమున పుష్కర పర్వస్నానములకై వచ్చిన గుడిగొండ పెద్దరసు భార్య యొక్క యందచందములనుగాంచి, మరులుగొనెను. మంచి చెడ్డల మాట మఱచి యా జరాసంధుడామె వెంటబడెను. మానసంరక్షణమునకై యామె తీర్థస్నానములకు విచ్చేసిన పండితుల పజ్జను జేరి, ఆ ప్రమాదమునుండి బయటపడెను.

స్త్రీ పురుషులలో నొక్కరియందే యనురాగము వర్ణితమైనచో దానిని "శృంగార రసాభాసము"గా సాహిత్య శాస్త్రము తెలుపుచున్నది. కావున నిట "శృంగార రసాభాసము" అంగముగా వ్యక్తమైనది.

మొత్తము మీద వేమనారాధ్య చరిత్రమునందు ధర్మవీరము" "అంగి రసము"గా చక్కగా పోషింపబడినది. తక్కిన శృంగారాది రసములు "అంగ రసములు"గా నిందుతగు స్థానముల నాక్రమించినవి.

వేమనారాధ్య చరిత్రమునందు

# ఆరాధ్య (ఉత్తర) శైవ సంప్రదాయము

ఆరాధ్య శైవమునకు 1. ఉత్తర శైవము. 2. శ్రౌత శైవము 3. మార్గ శైవము మున్నగు నామాంతరములు గలవు. ఈ యారాధ్య (ఉత్తర) శైవ సముద్ధరణమునకే వేమనారాధ్యు డవతరించినట్లు వేమనారాధ్య చరిత్ర మునందు కవి పేర్కొనెను. ఈ కవి కొన్ని సన్నివేశములలో ఆరాధ్య (ఉత్తర) శైవ వైశిష్ట్యమును సూటిగా ప్రకటించుచు వర్ణించెను. వేమనా రాధ్యుడు పుష్పగిరి చేరిన సందర్భమున ఆరాధ్య శైవము యొక్క ప్రత్యేకత ప్రస్తావింపబడినది. కల్యాణ నగరమునందు బిజ్జలుని సభలో ఆరాధ్య శైవ బ్రాహ్మణుల మహిమలు, వైశిష్ట్యములు వర్ణింపబడినవి. వేమనారాధ్యుడు కాలను పాకలోనున్నప్పుడు పూర్వ (స్మార్త) శైవ—ఉత్తర (ఆరాధ్య) శైవ ములలో నేది శ్రేష్ఠమైనది? అను సమస్య తలయెత్తగా - సోమేశ్వరదేవాలయ ములో సర్వజన సమక్షమున ఉత్తర (ఆరాధ్య) శైవము - ఉత్కృష్టమైనదని యా పరమశివుడే నిరూపించినట్లు వివరింపబడినది.

వేమనారాధ్యుడు ద్రాక్షారామములో నున్న సందర్భమున ఆ గురువర్యు డందిన బ్రహ్మరథ మర్యాదల వలనను, రాజలాంఛనమైన స్వర్ణకిరీటమును ధరించుట ద్వారాను, ఆరాధ్య శైవముయొక్క యౌన్నత్యము ప్రకటింప బడినది. వేమనారాధ్యుడు "గురుపీఠమునలంకరించిన యనంతరము" ఆ గురు వర్యుని కదలిక లన్నియును మదగజముపైననే నిర్వహింపబడినవి. ఈ విధ ముగా ఆ గజారోహణ మర్యాదల మూలమున ఈ సంప్రదాయముయొక్క గురుస్థానమునకు బాటపడినది.

ఆరాధ్య శైవము నిగమాగములను ప్రమాణములుగా గ్రహించుచు, నిత్యనైమిత్తికములైన యాచార వ్యవహారములయెడ దీనికాగమములాయువు పట్టులు. అందువలన వేమనారాధ్యుని కథాకృతిలో సమలంకృతమైన (ఇంధలి) యారాధ్యశైవమును గూర్చి తెలిసికొనుటకు నా శివాగమములకు

సంబంధించిన పారిభాషిక పదముల పరిజ్ఞాన పరిశీలనములెంతేని యావశ్యక ములై యున్నవి.

కనుక నా శివాగమ పరిభాషలును, సందర్భానుసారముగా నవియిందు చోటు చేసికొనిన తీరుతెన్నులును, పరామర్శింప బడుచున్నవి.

1. లింగత్రయము : ఇష్టలింగము, ప్రాణలింగము, భావలింగము. (వే.అ చ. 1-74. త్రివిధ లింగార్చనము)

2. త్రివిధ శివకర్మలు : శివలింగధారణము - శివదీక్ష - శివపూజ. (వే.అ.చ. 2-67)

3. మలత్రయము : ఆణవమలము, మాయామలము, కార్మిక మలము

4. దీక్షాత్రయము : (వే.అ.చ. 1-20, 175, 3-206, 206.) వేధాదీక్ష మనుదీక్ష (మంత్రదీక్ష) క్రియాదీక్ష.

5. జంగముడు : (వే.అ.చ. 1-14, 2-51- 8-15, 9-64, 130,-) శివ దీక్షితుడైన భక్తుడు. మాహేశ్వరుడు, చరుడు, భక్తుడు, జంగముడు, శివ యోగి మొదలగునవి పర్యాయపదములు.

6. మాహేశ్వర త్రయము : బ్రహ్మచారి, గృహస్థుడు, నిరాభారి, వీరిలో ఉత్తరోత్తరులధిక పూజ్యులు.

7. పాదోదక త్రయము : శివ (లింగ) పాదోదకము, (దీక్షా పాదోద కము.) గురు పాదోదకము. (శిక్షా పాదోదకము.) మాహేశ్వర పాదోదకము (జ్ఞాన పాదోదకము.)

8. ప్రసాద త్రయము : శివ ప్రసాదము. (శుద్ధము) గురుప్రసాదము (సిద్ధము.) చరప్రసాదము. (ప్రసిద్ధము.)

9. పంచాక్షరి : న, మః, శి, వా, యః, దీనికే మూలవిద్య, శివము, సూత్రము, పంచాక్షరము, అనియు నామాంతరములు. దీనికి ముందు "ఓం కారము" చేరినచో నిదియే "షడక్షరి" యనబడును. కేవలము "ఓంకారము" నకు "సూక్ష్మ పంచాక్షరి" అను వ్యవహారముగలదు.

10. అష్టావరణములు : గురువు, లింగము, జంగముడు, భూతి (భస్మము) రుద్రాక్ష, మంత్రము తీర్థము, ప్రసాదము.

11. పంచాచారములు : (వే. అ. చ. 8-363) 1. లింగాచారము, 2. సదాచారము, 3. శివాచారము, 4. గణాచారము, 5. భృత్యాచారము. ఇవి మనోబుద్ధి చిత్తాహంకారములను గుదుర్చు మహిత మార్గములు.

12. శివగంగ[1] : శివాలయ సమీపమున నున్న జలమునకు "శివ గంగ"యని పేరు.

13. శివతీర్థము[2] : శివమంత్ర పరిపూత జలము.

14. షట్కాలములు[3] : (వే.అ చ. 1-175.) 1. అరుణోదయము. 2. సూర్యోదయము. 3. సంగవము. 4. మధ్యాహ్నము. 5. సాయంకాలము. 6. అర్ధరాత్రము.

15. త్రివిధ భస్మధారణములు : 1. ఉద్ధూళనము. 2. అవకుంఠనము. 3. త్రిపుండ్రము.

16. నిరాభారి : తురీయాశ్రమమును స్వీకరించిన వీరశైవుడు.

---

1. శివాలయ సమీపేతు యత్తోయం పరితిష్ఠతే
శివగంగేతి విజ్ఞేయా తత్రస్నాత్వాలభేతమాం॥
కారణోత్తరాగమము పుట - 43. 3-24.

2. తద్దోషశమనార్థంతు శివతీర్థం ప్రకల్పయేత్
హస్త మాత్ర ప్రమాణేన పరితశ్చతురస్రకమ్॥
కారణోత్తరాగమము పుట - 43. 3-23.

3. అరుణస్యోదయే భానోరుదయే సంగవే తథా
మధ్యాహ్నేచ, తథా సాయమర్ధరాత్రే బృహస్పతే।
షట్కాల మర్చనీయం స్యాత్ శివలింగమనామయం॥
చం.జ్ఞా. అగమము. పుట. 167. 12-73.

17. శివయోగి త్రయము.[1] : (వే.అ.చ. 2-51.) 1. క్రియాయోగి. 2. తపోయోగి. 3. జపయోగి.

18. జప త్రయము : 1. వాచికము. 2. ఉపాంశువు. 3. మానసికము. ఇతరులకు వినబడునట్లు మంత్రమునుచ్చరించుట వాచికము. పరులకు వినబడకుండ పెదవులను గదలించుచు మంత్రము నావర్తించుట "ఉపాంశువు". మంత్రార్థమును భావించుచు మనస్సులోనే మంత్రమును జపించుట మానసికము. జపత్రయములో ఉత్తరోత్తరము శ్రేష్ఠము.

19. అత్యాశ్రమి.[2] : శివదీక్షితుడు, లింగధారి, అత్యాశ్రమి.

20. ప్రసాద నియమము : శివ(లింగ) నివేదిత పదార్థమును భుజించు నియమము.

21. "భరితము" : (వే.అ.చ. 1-141) భోజనమును ప్రారంభించిన పిమ్మట మరల వడ్డించుకొనక మొదట వడ్డించిన పదార్థములతోడనే భోజనమును పూర్తిచేయు నియమము. ఈ ప్రసాద, భరిత, నియమములు స్మార్తులతో గూడ గలవు. ఇంద్రియ నిగ్రహము కొఱకును, నియమ జీవితము కొఱకును నిష్ఠగలవారు వీనిని పాటింతురు.

22. సర్వాంగలింగ సాహిత్యము : (వే. అ. చ. 1-111) లింగధారణ దీక్షను స్వీకరించి, తదాచార విజ్ఞానములు కల్గియుండుట.

23. లింగ నిమజ్జనము : (వే.అ.చ. 7-107) లింగధారి సూర్యోదయమునకు ముందేలేచి, కాలకృత్యములను దీర్చుకొని, స్నానానంతరము భస్మధారణ మొనర్చుకొని, కరపీఠమున ఇష్టలింగము నభిషేకించి, ఆ తీర్థమును

1. క్రియా, తపో, జపై ర్యుక్తాః త్రివిధాః శివయోగినః॥

2. లింగం శివోభవేత్, క్షేత్రం అంగం, సంయోగ ఆశ్రమః
తస్మాత్ లింగాంగ సంయుక్తో సఏవాత్యాశ్రమీ భవేత్.॥

బ్రహ్మచారీ గృహస్థోవా వానప్రస్థోయతిస్తువా
యస్తు లింగాంగ సంయుక్తః, సఏవాత్యాశ్రమీ భవేత్॥

లింగధారణ చంద్రిక.

౦చి, ఇష్టలింగమును పేటికలో భద్రపఱచుటను "లింగ నిమజ్జనము" అని హరింతురు.

24. శైవ సమయాచారములు1 : (వే. అ. చ. 2-1) సాలోక్యము, ప్యము, సారూప్యము, సాయుజ్యము - అనునవి చతుర్విధ ముక్తులు. శివానుగ్రహమువలన లభ్యములు. శివానుగ్రహము చర్యా, క్రియా యోగ, సాధనలచేత సంపాద్యము. శివానుగ్రహ ప్రాప్తికి, దాస, సత్పుత్ర, , సన్మార్గ (సత్ + మార్గ)ములుపాదేయములు. చతుర్విధ ముక్తుల ౦టకు క్రమముగా శీవుడధిరోహింపవలసిన సోపానములివి.

దాస మార్గమున నొనర్చిన శివసేవలకు సాలోక్యము లభించును. త్ర మార్గమున క్రియా సాధనమున శివోపాసన మొనర్చినచో "సామీప్య" ు కలుగును. సఖా (మిత్ర) మార్గమున శివధ్యాన మొనరించినచో లభించు ు "సారూప్యము". సన్మార్గమున (సత్ + మార్గమున) జ్ఞానియై శివుని ౦చినచో సాయుజ్యము (శివసాయుజ్యము) ప్రాప్తించును.

25. షట్స్థలములు : (వే.అ.చ. 1-175,176, 202.)

1. భక్తస్థలము, 2. మాహేశ్వర స్థలము, 3. ప్రసాది స్థలము, ప్రాణలింగి స్థలము, 5. శరణస్థలము, 6. ఐక్యస్థలము. ఇవి శివపూజా వమున తదారాధన క్రమ సోపానములు— ఈ షట్ స్థలాత్మక శివపూజా వమున పూజానంతరము దీక్షితుడు "బ్రహ్మానందము" ననుభవించును. పవలననే యీ షట్స్థలములను శివ (పరబ్రహ్మ) స్వరూపములుగ ౦చి, తుదిని "షట్స్థల బ్రహ్మార్పణమస్తు" అని పూజాఫలము శివార్పణము ౦పబడును.

---

శైవమహాపీఠ (యువజన) సంచిక. ఫిబ్రవరి - 1984 - ఇందు శైవ సమయాచారములను గూర్చి శివశ్రీ - ముదిగొండ ఈశ్వరచరణ్ గారు విపులముగా వివరించిరి, వలసినవారందు చూడనగును.

26. "లింగనిరీక్షణము" : దీక్షితుడు శివపూజ చేయునపుడు "ప్రసాది స్థలము"నందు దశావధాన విధానమున తదేకదృష్టితో "లింగమూర్తి"ని గాంచుటను లింగ నిరీక్షణమని యందురు. ఈ లింగ దర్పణమునందు శివస్వరూపమును దర్శించుచు భక్తుడు షడక్షరిని (ఓంకార పూర్వక పంచాక్షరిని) జపించును. ఈ లింగ దర్పణమునందే (లింగ నిరీక్షణమునందే) వేమనారాధ్యుడు "శ్రీపర్వత- శివస్వరూపములను"దర్శించెను. ఇందే బసవేశ్వరుడు పరివారములతో కల్యాణ నగరమునకు వేంచేయుచున్న వేమనారాధ్యుని గాంచెను. చిత్త పరిపాకమును గూర్చుచు, దివ్యదర్శనముల నొడగూర్చు (దివ్య) పవిత్ర ప్రక్రియ యిది.

27. దశావధానములు : 1. దృక్పటుత్వము, 2. దృక్పూజనము, 3. దృగ్వ్యాప్తి, 4. స్తుతి, 5. మనోవ్యాప్తి, 6. సానురాగమనోఽర్చనము, 7. గణప్రణామము, 8. గణస్తుతి, 9. గణలీలానందమగ్నత, 10. లింగ నిమగ్నత—అనునవి. ఇవి లింగనిరీక్షణమునందు లింగమూర్తిపైబఱపు వీక్షణ క్రమ విధానములు. ఇవి భక్తుని శివైకచిత్తుని గావించును.

28. గణార్చనము : (వే.ఆ.చ. 1-101). భక్తుడు దీక్షబూని గురు. లింగ, జంగ మార్చనలను భక్తిప్రపత్తులతో నొనర్చు ప్రకృష్ట కార్యము.

29. గురువందనము : (పదముపట్టుట) వే.ఆ.చ. 1-121. గురు పాదములచెంత శిరమునుంచి, తన లింగపేటికను (లింగకాయను) గురు పాదములకు తాకునట్లుగ జేయుచు శిష్యుడు గురువునకు నమస్కరించుట.

30. శైవపంచకము : వీని వివరణము 9వ పుటలో గలదు. ఇవి యారాధ్య శైవసంప్రదాయమునకు ప్రమాణ గ్రంథములు. ములుగు పావయారాధ్యుని పితామహుండగు "సంగమేశ్వరారాధ్యుడు" "శైవపంచక బోధనావధాని"గా వర్ణింపబడెను. (వే.ఆ.చ. 1-141).

31. ఇష్ట లింగము : ఇష్టి యనగా పూజ. గురు ప్రసాదితమైన లింగమును పేటికయందు భద్రపఱచుకొని, దానినెల్లప్పుడును శివసూత్రమున

శైవుడు మెడలో ధరించుచుండును. ఆయా సమయములందు ఈ లింగము నకు భక్తుడు "ఇష్టి" (పూజ) యొనర్చుచుండును. అందువలన దీనికి "ఇష్ట లింగము" అను వ్యవహార మేర్పడినది.

32. దివ్య (మహా) ప్రసాదము : (9-88) గురుచరేశ్వరులకు అర్పిత మైన పదార్థములలో తదుచ్ఛిష్ట శేషము శిష్యాదుల కనుగ్రహింపబడును. దానిని దివ్యప్రసాద మనియు, మహాప్రసాదమనియు వ్యవహరింతురు.

## ప్రబంధమున శివాద్వైతము

విష్ణువు మొదలగు దేవతలకంటెను శివుడే యధికుడనియు, అతడే జగదధిష్ఠానమనియు, నిగమాగమ ప్రమాణములతో శివాద్వైత సిద్ధాంతము నిరూపించును. ఆ విధముగా నది పరమశివుని పారమ్యమును ప్రకటించును. అనగా శైవ పారమ్యముల విషయమున ఇది వైష్ణవాది మత సిద్ధాంతములను త్రోసిపుచ్చును.

జగద్గురు శంకరాచార్యుల "అద్వైత సిద్ధాంతము"ను ఇది యంగీక రింపదు. జగన్మిథ్యా వాదమును ఖండించును. ఈశ్వరునివలె జీవ జగత్తులును సత్యమని యిది ప్రతిపాదించును. జ్ఞానమార్గమునకు తోడుగా కర్మ మార్గము గూడ "ముక్తిప్రాప్తి"కి ముఖ్యమని యిది నొక్కి చెప్పును. శివపూజాది కర్మల నాచరించుచు, శివోపాసనా రూపమైన జ్ఞానమువలన మోక్షమును పొందదగు నని యిది పేర్కొనును. అద్వైతమునంతలి "కైవల్య" ముక్తినిగాక "సాలోక్య," "సామీప్య," "సారూప్య," "సాయుజ్య" రూప చతుర్విధ ముక్తు లను ఈ సిద్ధాంతము సమ్మతించును. జీవేశ్వరులకు సర్వాత్మనా సంపూర్ణముగా "అద్వైత" స్థితి నిది యామోదింపదు. శివ జీవులయెడ నిది సేవ్య సేవక భావమును, పూజ్య పూజక స్థితిని, ఉపాస్య ఉపాసక భేదమును పాటించును. పూజాదిక విషయములందిది గురుచరేశ్వరులకు సమాన ప్రతిపత్తిని నెరపును. ఈ ప్రధాన సిద్ధాంతముల పరివ్యాప్తికై రూపుదిద్దుకొనిన సాహిత్యాకృతియే శ్రీ వేమనారాధ్య చరిత్రము.

తాత్త్విక సిద్ధాన్తరీతి ననుసరించి "శివాద్వైతము"గాను, సంప్రదాయములను బట్టి ఆరాధ్య (ఉత్తర/శ్రౌత) శైవముగను భావింపబడిన శైవశాఖా సముద్ధరణమునకై వేమనారాధ్యుని యవతారమీభువియందు జరిగినట్లుపాపయారాధ్యుడు వేమనారాధ్య చరిత్రమునందు పేర్కొనెను.

దక్షయజ్ఞ సందర్భముగా వీరభద్రుడు విష్ణువు మొదలగు సర్వదేవతలను మించి, వీర విహార మొనర్చెను. వీరభద్రుని లీలావతారియైన వేమనారాధ్యుడు కావలిలో సుకేతుసుతుని పునరుజ్జీవితు నొనర్చుటకై తనలింగ పసాయితమునకు (ఖడ్గమునకు) పనిచెప్పి, యముని భయకంపితునొనర్చి, మృత్యుదేవతను శిక్షించెను. ఇట్లే యీతడు పెక్కు సందర్భములలో తన దివ్యశక్తి ప్రభావములచే పెక్కు విజయములను పొందెను.

అచట వీరభద్రుడును, ఇచట వీరభద్రుని యంశావతారమైన వేమనారాధ్యుడును శివుని పరివారములోని వారు. పరివారముల విజయములు స్వామికే చెందును గనుక ఈ విధముగ శివ పారమ్యమిందు ప్రకటితమైనది.

వేమనారాధ్యుడు మధురానగరమున విడిసినప్పుడు పాండ్య రాజసభలో నతడు దైవపారమ్య విషయమున జరిగిన వాదమున నిగమాగమ పురాణేతిహాస ప్రమాణములతో వైష్ణవ స్వాములనోడించి, సుందరేశ్వరుని సాక్ష్యముతో "శివాధిక్యము"ను నిరూపించెను. వైష్ణవాధిక్యమును త్రోసిపుచ్చెను. అట్లే యతడు శ్రీరంగమున వైష్ణవ పీఠాధిపతియగు జియ్యరువారి సమక్షమున శ్రీరంగనాథునిచే శివాధిక్యమును ప్రకటింపజేసెను. ఈ వేమనారాధ్యుడే పాండురంగ క్షేత్రమునకు వెళ్ళినప్పుడు పాండురంగని శిరమున శివలింగ మున్న విషయమును ప్రస్తావించెను. అతడచట వైష్ణవ ప్రముఖులచే గౌరవాదరములనందెను.

మధురలో వైష్ణవ పండితుల నోడించుట, శ్రీరంగమున వైష్ణవ సమాజమునకే తలమానికమైన జియ్యరువారి సమక్షమున శివాధిక్యమును నిరూపించుట, పాండురంగమున పాండురంగ స్వామి (విష్ణువున)కే శివలింగము

శిరోధార్యమై యున్నట్లు వర్ణించుట మున్నగు సన్నివేశముల మూలమున వైష్ణవమును మించి శైవపారమ్యమును ప్రకటించుట జరిగినది.

ఇంక పుష్పగిరిలో అద్వైత మత పరివ్రాజకులపై విజయము సాధించి, యచట వేమనారాధ్యుడు బ్రహ్మరథ మర్యాదల నందుట, కల్యాణనగరమున అద్వైత సంప్రదాయ పండితుడైన అనంతశాస్త్రికి నీ గురువర్యుడు గుణపాఠ ముచెప్పుట, అచటి రాజసభలో నతడు తన యజ్ఞోపవీతము నుండి, యమృత ధారలు స్రవింపజేసి, నిజశ్రేష్ఠత్వమును బ్రకటించుట, కొలను పాకలో శివా లయమున సోమేశ్వరుని సమక్షమున పూర్వశైవము (స్మార్త సంప్రదాయము. అద్వైత సంప్రదాయము) కంటె ఉత్తరశైవము (ఆరాధ్య శైవము) (శివా ద్వైత సంప్రదాయము) గొప్పదియని నిరూపితమైనట్లు వర్ణించుట, ద్రాక్షారామ మున అద్వైత పండితులను వేమనారాధ్యుడు జయించినట్లు పేర్కొనుట మున్నగు వానివలన శివాద్వైత సిద్ధాంతమే సర్వోత్కృష్టమైనదని చాటి నట్లైనది.

కాని పైన పేర్కొనబడిన యాయా సన్నివేశములలో సిద్ధాంతపరముగా వైష్ణవమును వలె అద్వైతమును ఖండించినట్లు ఎచ్చటను వర్ణింపలేదు.

ఐనను ప్రథమాశ్వాసమున షష్ఠ్యంతములలో షట్స్థల బ్రహ్మానంద యతీంద్రుని (గురుని) వర్ణించుచు.

కం॥ ఖండితమాయావాది వి
తండాఖండ ప్రభావతత్పర మహిమో
ద్దండునకు..............అని ప్రస్తావించి, కవి యిందు మాయా వాదమును (అద్వైతమును) ఖండించినాడు.

మఱియును- ఇందు చతుర్విధముక్తులను బేర్కొనినాడు.

1.• ఇమ్మడయ్యకృపాకటాక్షేక్షణముల
శంభు "సాయుజ్య" మొందిన జనులలోను వే.ఆ.చ. 1-72.

ఇది కవి వంశచరిత్రమును వర్ణించు సందర్భములోనిది.

2.* అట్టి శ్రీపర్వతంబునందనుదినంబు,
మోక్షవాంఛాభిరతిని ముముక్షుజనులు
నిలిచి, నిత్యత్వమొంది, నిర్నిద్రులగుచు,
శంభు "సాయుజ్యమందని జనులు"గలరె? (వే.అ.చ. 2-110)

3.* గురు "చతుర్విధముక్తికూటంబు" గరుణించు
గురుచరేశ్వరభక్తి గొననివారు.. (వే.అ.చ. 1-211)

4.* "ముక్తిచాతుర్విధ్యము" పొసంగనందించి
పనిదీరి, యలసి, తాఁబ్రాలుమాలి (వే.చ.అ. 5-20)

ఈ విధముగా వర్ణించుటనుబట్టి, కైవల్యముక్తిని ప్రతిపాదించు అద్వైత సిద్ధాన్తమునుగాదని, చతుర్విధముక్తులను ప్రతిపాదించిన శివాద్వైత సిద్ధాన్తమునిందు వ్యక్తమొనర్చినట్లైనది.

భక్తిప్రధానమైన శివాద్వైత సంప్రదాయమునందు "శివజీవుల" మధ్య గల, "పూజ్య-పూజక"' "ఉపాస్య-ఉపాసక", స్థితులు మిక్కిలి ముఖ్యములు. అవి వేమనారాధ్య చరిత్రమునందలి తొమ్మిది యాశ్వాసములలోను మొదటి నుండి తుదివఱకు కథాంతర్భాగములుగా వర్ణింపబడినవి. ఈ పాపయారాధ్యుఁడే స్వయముగా ఉపాసకుడు. తద్వంశీయులెల్లరున, మహాశివోపాసకులుగా వర్ణింప బడిరి.

ఈ వేమనారాధ్యుఁడే త్రిపురాంతకేశ్వర గురువునుండి శివదీక్షనంది, శివపూజలొనర్చి, శివానుగ్రహములను పొందెను.

ఈ వేమనారాధ్యుఁడు కావలిలో సుకేతుని సుతునకును, మధురలో పాండ్యరాజునకును, పెక్కుమంది భక్తులకును, పుష్పగిరిలో చోళనృపతికిని, అడవిలో తన్నాశ్రయించిన దొంగలకును, భద్రాచలమున "అశ్వపతి"కిని, మండలేంద్ర భూపతికిని, ఇట్లే పెక్కుమందికి "శివదీక్ష"లను ప్రసాదించి, వారిని శివోపాసకులుగ గావించెను.

1. * ఇమ్మడి దేశికేంద్రుడు మహిస్థలి దీక్షలొసంగ, నూర్ధ్వలో
కమ్ములలోన సందడి పికాపికలొక్కగిరీంద్రధన్విలోకమ్మునయ్యె
(వే.అ.చ. 1-70.)

ఇమ్మడయ్యనుండి శివదీక్షలనందిన యా యుపాసకుల రాకతో కైలాసములోని సందడి పెఱిగినదట–

2.* చిన్నవారికి ముందు రానున్న వారి
కున్నవారికి దురితముల్ సున్నఁజేసి
కులమువారికి కైలాసకుధరమెల్ల
శిబిరమొనరించె, నప్పయ్యసిరులమించి వే.ఆ.చ. 1-135.

శివదీక్షితులకు కైలాసమే శిబిరమై పోయినదట–

3.* కన్నవారును వారినాడున్నవారు
విన్నవారును తనకథల్ కన్నవారు
చన్నవారును శివునొద్ద నున్నవారు

పరమశివుని పారమ్యప్రతిష్ఠాపనముతో, జీవజగదీశ్వరుల సత్యత్వ నిరూపణముతో, సాలోక్య, సామీప్య, సారూప్య, సాయుజ్యరూప చతుర్విధ ముక్తుల ప్రతిపాదనముతో, శివజీవుల మధ్యనుపాస్యోపాసక సంబంధ వివరణములతో, విశిష్టాద్వైతరీతిలో విలసిల్లుచు "శివాద్వైత సిద్ధాంతము" వాస్తవముగా[1] వేమనారాధ్య చరిత్రమున నిండారి యున్నది.

---

1. వాస్తవముగా : వస్తు (కథా) రూపమున.

# ఐదవ ప్రకరణము

## "రచనా శిల్పము"

భారతీయ భాషలన్నియును సాహిత్య సౌభాగ్య లాభములకై సంస్కృత భాషా సాహిత్యోద్యాన విహారములు సాగించినట్టివే. అట్లే భారతీయ కవి, పండితులెల్లరును గీర్వాణ భారతీ మాతృస్తన్యముల గ్రోలి, ప్రజ్ఞా పాటవములను, ప్రతిభావ్యుత్పత్తులను, కళాకౌశలములను, శిల్ప[1]వైభవములను సంతరించు కొన్నట్టివారే. సురభారతీ జనని యుత్సంగపు జోలలకు నోచుకొనిన యదృష్టవంతుని సాహిత్యమూర్తి సుమనో మనోహరమై శోభిల్లుట సహజవిషయము. ఆ యదృష్టము పట్టినవారిలో పాపయారాధ్యులొకరు.

అను వంశిక ప్రభావమునను, ఆంధ్ర గీర్వాణ భాషల సంతతాధ్యయన మూలమునను, వివిధ శాస్త్ర సాహిత్య విశారదుడైన శంభులింగ దేశికుల యంతేవాసి యగుట చేతను, పాపయారాధ్యునకు సంస్కృతాంధ్ర భాషా వైదుష్యములు పట్టువడినవి. వివిధశాస్త్ర వైదగ్ధ్యములు సమకూరినవి. కవితా కౌశలములబ్బినవి. కవి పండిత ప్రశంసల నందిన పాపయారాధ్యుని, సంస్థాన ప్రభువుల గౌరవాదరములు వరించినవి. ఆయన లేఖినినుండి ఆంధ్ర గీర్వాణ భాషలలో కావ్యపరంపర రూపు దిద్దుకొనినది. ఫలితముగా వాఙ్మయ రంగము అదనపుసొంపుల నింపుకొనినది.

వాస్తవముగా పాపయారాధ్యుడు ఛందః ప్రపంచమును స్వచ్ఛందముగనేలిన మహాకవి. ఆయన కరస్పర్శకు నోచుకొనినంతనే వృత్తములు సర్వమనోజ్ఞములై ప్రవర్తిల్లును. కందములందములను చిందించును. గీతములు సంగీతముల నాలపించును. సీసములుయ్యాలల సవ్వడుల సందడింప జేయును. లయగ్రాహులు లయలహాయులు గుల్కును. రగడలు పొగడల పోడుముల విరజిమ్మును. వచనములు నయవినయముల నాదిగిపోవును.

1. శిల్పం విజ్ఞాన, శాస్త్రయోః. నిఘంటువు.

దండకములఖండములై యలరారును. ఈ కవి పద్యమును పట్టినను, గద్యమును తాకినను పట్టిన దానిని బంగారము చేయగల దిట్ట. అవి సంస్కృత శబ్దములు కావచ్చును, లేక యచ్చ తెలుగు పదములు కావచ్చును, ఈ కవి చేయి పడినంతనే యవి మధురిమలు చిలుక వలసినదే. ఈయన చేతి చలువ లట్టివి.

కావ్య వస్తువుల వైవిధ్యములను బట్టియు, కథా సందర్భముల ననుసరించియు, వివిధ గతుల నొప్పారినను, సర్వసాధారణముగ ఈయన కవిత సరస ధారారుచిరమైనది. మృదుల శయ్యామహితమైనది. శబలిత భావాల సంపుటియైనది. సహృదయ హృదయ రంజకమైనది.

అది చిఱుకబ్బమైనను. బృహత్ప్రబంధమైనను తారతమ్యములు చూపక, యందు వీలైనన్ని యెక్కువ వర్ణనలు చేయుట యీ కవికి పరిపాటి. స్తుతి సందర్భములలో దండకములల్లుటయందీయనకు మక్కువ యెక్కువ. సర్వమధురమునను, అహల్యా సంక్రందనవిలాసమునందును, దండకరచన కావింపబడినది. దేవీభాగవతములో నాలుగు దండకములల్లబడినవి. ఈ మహాకవిచే రచితమైన పద్యమైనను, గద్యమైనను, దండకమైనను తదితరమైనను, అది సమాసబంధురముగా సాగినను, లేక అలతి యలతి పదములతో సరళరీతుల నలరారినను. ఆ రచన మధురధారా విలసితమై సర్వమనోజ్ఞమై యొప్పుచుండును.

## వర్ణనలు

ప్రబంధములలో "వర్ణనలు" అనల్ప కల్పనల కాటపట్టులు. కవి సహజ ప్రతిభా ప్రాభవములకు నికషోపలములు. పఠితృలోకమునకు పరమాకర్షక భూములు. భాషావైదుష్య చమత్కార హేలా ప్రదర్శనములకు రంగస్థలములు. కథాకథనములో (ఇతివృత్తమును కొనసాగించుటలో) కవికిని, పఠనమున పఠితలకును. అవి అలసటలను తొలగించు విరామారామములు. కనుకనివి సందర్భానుసారముగా సముచిత పరిధిలో కొనసాగినంతవఱకు ప్రబంధ వస్తు పరిపోషకములే.

ఇక పాపయారాధ్యుని రచనలయందలి వర్ణనా విశేషములనించుక పరిశీలింతము. (గ్రంథ విస్తరభీతిచే కొన్ని వర్ణనలే ఇందు ముద్రింపబడుచున్నవి).

పురవర్ణనము :— (స. హ్రు. ర. 1-185. పుట. 42.)

సీ॥ శ్రీభారతీ సమాశ్లేష దీక్షాసిద్ధి, కేపురంబు తిరంబు కాపురంబు
కమల సంభవ మనఃకల్పనాశక్తికి, నేపురంబభిరామనూపురంబు
భువన సప్తద్వయాద్భుత మణిరాసుల, కేపురంబెడలేని దాపురంబు
పురుషార్థవితరణాభోగయంత్రోద్భూతి, కేపురంబనవద్యభూపురంబు

తే॥గీ॥ రజితగిరిచెంత వసుధాధరంబుపొంత,
మలచిరపరంజిచేఁగొంత మణులఁగొంత
అదిరసరాజరాజ్య సింహాసనమ్ము,
తనరునుత్తరదిశ "శాంతి" యనుపురమ్ము.

లక్ష్మీసరస్వతుల సామరస్య భూమిగా, బ్రహ్మసృష్టి సౌందర్యమునకు మచ్చుతునకగా, పురుషార్థ ఫలప్రదాయకముగ, రత్నమణి ఖచిత హేమ భూమిగ, స్మరరాజ్య సింహాసనముగ, నొప్పారుశాంతిపురము—అంత్యప్రాసల విలాసములతో హాయిని గూర్చుచు చక్కఁగా వర్ణింపబడినది.

ఉత్సవ వర్ణన :— (వే.అ.చ. 5-310.)

సీ॥ జయ ఘంటికలు ఝణం ఝణిత కింకిణులతో,
జతగూడి మంజుల స్వనములొలయ,
ఘన ధణంధణ భేరికా కాహళారావ, మఖిల దిక్కోణంబు లావహింప
కంఠగీతి క్వణ క్వణిత వీణానాద, విభ్రమంబెలమిమై వింతగొలుప
భ్రమ దుపాంగము ధిమిం ధిమిత మర్దళనాద,
సంరంభమునకు నుత్సాహ మొసఁగ

తే॥గీ॥ ప్రమథ కోలాహలములు సద్భక్త హస్త,
తాళముల పెన్ ఝళం ఝళ ధ్వానములును
బెరయ జగమెచ్చు వేడుక ప్రథుల రవము
సాగె శ్రీమల్లికార్జునస్వామి శిఖరి.

అంతరిక్షమును అనంత ధ్వనులతో ప్రతిధ్వనింపజేసిన ప్రమథుల కోలాహలములిందు చక్కగా వర్ణింపబడినవి. ఆ ప్రమథుల జయ ఘంటికల ఘనారావములు, చిఱుగజ్జెల మంజుల స్వనములు, భేరీ ధణం ధణలు, కాహళముల క్రమ ధ్వనులు, కంఠ గీతికలస్వరాలు, వీణా నిక్వాణాలు, ధిమింధిమిత మర్దళ నాదాలు, కరతాళముల ఝళం ఝళలు, ఉత్సవ వైభవమును కనులకు గట్టించుచు, ఉత్సవోత్సాహమును ద్విగుణీకృత మొనర్చుచున్నవి.

జంగముల వర్ణన :— (వే.అ.చ. 6-46).

సీ॥ రుచిరత్రిరేఖికారూఢ కంఠంబులు,
నాకర్ణదీర్ఘనేత్రాంచలములు,
ఆజానులంబి బాహావిలాసంబులు,
కటిమండలాలంబిఘన కచములు
ధరణీధరములపై ధట్టించుభుజములు,
సంపూర్ణ చంద్రవిస్ఫారముఖము
లుత్తుంగతర విశాలోరస్థలంబులు,
సమధికారుణ హస్తచరణతలము
తే॥గీ॥ లమరనతిసుకుమార విహారులగుచు,
నెండకన్నునునీడ కన్నెఱుంగకిష్ట
లింగముల కర్చలిడుచునభీష్టభోగ,
జంగమములుందురమ్మంత్రి సవిధమునను॥

కల్యాణ నగరమున బిజ్జలుని మంత్రియగు బసవేశ్వరుని సన్నిధానమునగల జంగముల వర్ణించు సందర్భమిది.—

ఈ జంగముల రూపరేఖా విలాస చిత్రణమునందు మణి, రత్న, ఖచిత సువర్ణ, శిల్ప శోభలు చిందు చున్నవి. మధురభక్తి కేదారములాజంగములు, మధుర రచనకాలవాలములీయక్షర పంక్తులు. ఇందొక ప్రక్కన రూపసౌభాగ్యములు వర్ణింపబడినవి. మఱొక ప్రక్కన శివభక్తుల చిహ్నములు, వారిదీక్షా దక్షతలు, ఇష్టలింగార్చనా విభవములు పరమాకర్షకముగా వర్ణితములు. ఈ యుభయ వర్ణనముల వైవిధ్య వైభవములు జంగమ శివస్వరూపముల యేకాకృతిలో మిఱుమిట్లు గొల్పుచు హాయిని గూర్చుచున్నవి.

సంధ్యా సమయ వర్ణన (వే.ఆ.చ. 4-79.)

సీ॥ గట్టు కొమ్మలనిండ గట్టు తత్రస్థమౌ,నిర్వాత కాషాయ నివహమనఁగ,
సంధ్యావసర నీడ సంవర్ధరుదసద్వి, జానీకపక్షరు గ్వ్యాప్తియనఁగ,
చైత్రయాత్రోత్సాహ సన్నద్ధ మదనవీ, నిర్గత,....మాన నిచయమనఁగ,
సంధ్యాంగనా ఘన స్తన లిప్తకుంకుమ క్షోదకర్దమ సరిద్భంభ మనఁగ,

తే॥గీ॥ వరుణ శుద్ధాన్త శుద్ధాన్తవరనితాంత,
కాంత సౌధాంత సంతతాక్రాంత పద్మ
రాగ కలశ ప్రభావళీ రాగమనఁగ,
సంజరంజిల్లె వారుణాశాముఖమున.

ఈ సంధ్యా వర్ణన మత్యంత మనోహరము. ఇందలి సంజకెంజాయలు మౌనిర్వాత కాషాయాంబర దీధితులను, గారుడ పక్ష కాంతుల లీలలను, సంధ్యాంగనా కుచలిప్త కుంకుమలతో గూడిన సరిత్కాంతిపుంజములను, వరుణ శుద్ధాన్తకాంత పద్మరాగ ప్రభాపటలి హేలలను స్ఫురింపజేయుచున్నట్లు ఊహింపబడిన యుత్ప్రేక్షలు మధుర మంజులములు.

సీసపాద చతుష్టయమునందుచిందిన సంజకెంజాయల పతాకముల సౌరులలో నెత్తుగీతిలోని సరస పదప్రయుక్త వృత్త్యనుప్రాసల ప్రభావమున పద్మరాగముల రెపరెపలు తరంగితమగుచున్నవి.

చుక్కల వర్ణనము :— (వే.ఆ.చ 4-85)

చ॥ హరి హరి దంబుజాక్షి, సరసాగ్రణి యౌ శశిఁగౌగలించి, యెం
హరిఁబెనగంగ నంత మణిహారము వేఁదెగి, జారనంబరాం
తరవరతల్పమందుఁబడి దట్టములై ఁదగు ముత్తియాలనన్
బరువడితారకావితతి పర్వసితచ్ఛవులుల్లసిల్లగన్॥

ప్రాగ్దిశాభామిని నిశానాథుని నిండుకౌగిలింతలలో సిగ్గుదేలుచు పెన గొనుచుండ, మణిహారము పెటిగి, జారిన ముత్తియములు — అంబర

వరతల్పమందు మిలమిలలాడుచున్న వాయసు రీతి చుక్కలు సితచ్ఛవుల విరజిమ్ముచున్నవట- వాస్తవముగా నిందలి "ఉత్ప్రేక్ష" వేయివరహాల జోల. లోకానుభవముల కద్దముపట్టుచున్న మధురోహాలివి.

జాబిల్లి వర్ణనము :— (వే.ఆ.చ. 4-85)

ఈ వర్ణనమునందు తేటతెనుగు మాటలలో వెన్నెల చలువలు వెద జల్లుచు, అంత్యప్రాసల సయ్యాటలతో హాయిని గూర్చుచు, చల్లని జాబిల్లి పరిఢవిల్లిన రీతి మిక్కిలి మనోహరముగా వర్ణితమైనది.

మెత్తని పదములలో సుతిమెత్తని సురుచిర భావపరంపరలు పరిమ ళించినవి. పఠితల హృదయ కేదారములలో పన్నీటి జల్లులు చల్లినవి.

వేగుఁజుక్క వర్ణనము :— (సర.హృ.రం. 3-209.పుట.178)

మ॥ సమయారాధ్యుడు పుష్కరాభ్ర తటినీ సంస్నాతుడై, ప్రాక్ప్రభా
విమలాచ్ఛాదనముల్ ధరించి, కుముద ప్రేంఖద్రజః పాళిభ
స్మము, భృగాక్ష సరుల్ వహించి, శివ పూజంజేయఁబూర్వాద్రిహ
స్తమునన్ స్ఫాటిక లింగరీతిఁదగె నంతన్ వేగుఁజుక్కయ్యెడన్॥

శిర పరంపరలుగా సాగిన యీ పరంపరితరూపకములలో వేగుఁజుక్క వర్ణితమైన రీతి మిక్కిలి మనోజ్ఞము. వేగుఁజుక్క వెలుగులలో ఇష్టలింగ (స్ఫటికలింగ) దీధితులను స్ఫురింపజేయుట కమ్మని కవియూహలకు చక్కని తార్కాణము. ఇది కేవలము సాహిత్య ప్రియులకు మాత్రమేగాక సాంప్ర దాయిక వీధులలో సాగిపోయెడి వారికిని ప్రీతిపాత్రమై యొప్పుచున్నది.

ఆరాధ్యుడు (ఆరాధ్యశైవ బ్రాహ్మణుడు) ఉషఃకాలమున స్నాతుడ గుటయు, విమలాచ్ఛాదనములు (మడిపత్రములు) ధరించుటయు, భస్మమున లదు కొనుటయు, రుద్రాక్షలను పూసుటయు, కరపీఠమున శివ (ఇష్ట)-లింగ మును పూజించుట మొదలగునవియు సాధారణ విషయములు.

ఇచట కాల పురుషుడు (సమయారాధ్యుడు) ఆకాశగంగలో స్నాతుడై, తూరుపుకాంతులనెడి విమలాచ్ఛాదనములను ధరించి, పుప్పొడియనెడి భస్మము

నలది, భృంగపంక్తులనెడి రుద్రాక్ష సరులనుదాల్చి, పూర్వాద్రియనెడి హస్తమున, వేగుజుక్కయనెడి శివ (స్ఫాటిక) లింగము నర్చించు చున్నట్లు ఊహించుట నిజముగా నొక సుందరభావహేల. ఈ పరంపరిత రూపకము చమత్కార పరంపరా విలసితము.

దూతీ వర్ణనము :— (అ.స.వి. 3-66)

సీ॥ నాయికా నాయకానంద సంధాయకా, తిస్నే హసీను దూతీలలామ
రాగపరాగానుయోగ సంయోగానుకూల, వాగ్రామ దూతీలలామ
కారణా కారణాగ్రహాయువోత్తారణా, ధికమనః ప్రేమ దూతీలలామ
రంజనా సంజనా నంజనవ్యంజన, స్థిరగుణస్తేమ దూతీలలామ
తే॥గీ॥ కామ నిష్కామ మదన సంగ్రామభూమ,
భూమహిత హితజనతానుభూష్యభాష్య
పక్కకాకుంత కలకంఠ పాఠ్యమాన, దివ్యవైవ్యైకధామదూతీలలామ.॥

అహల్యా సంక్రందన విలాసమునందలి దూతికయగు "మనోరంజని"ని వర్ణించు సందర్భములో నీదీపద్యము.

"దూతీలలామ" యను "పంచాక్షర" మహిత ప్రాసల యొయ్యారపు టుయ్యాలలో "దూతిక"యగు "మనోరంజని" యొక్క సరసస్ఫూర్తి విలసిత చాకచక్యములు, కార్యసాధన కౌశలములు, వైభవోత్సాహములు, వెల్లివిరియుచున్నవి. పాదరచనా పథములతో నామె యోర్పులు నేర్పులు శక్తిసామర్థ్యములు వెల్లడియగుచున్నవి. "కామ నిష్కామ మదన సంగ్రామ భూమ" అని యామె వర్ణింపబడుటచే - ఆమె వ్యక్తిత్వ వివేకములు ప్రకటితములగుచున్నవి.

ఈ పద్యము - ఇచటి మనోరంజని స్వరూపస్వభావములను, వైభవ ప్రాభవములను పట్టియిచ్చుటయేగాక లోకమున "అసలు సిసలైన" దూతిక యెట్టి లక్షణములు కలిగియుండవలెనో నిగ్గుదేల్చి "నిర్వచించుచున్నది." ఇందు - ఓజః, ప్రసాద, సమతా, మాధుర్య గుణములు సరసముగా నలరారుచున్నవి. ఈ పద్యరచనమున "యమకముల నియామకములు" అలవోకగా జరిగినవి. అంత్యప్రాసల విలాసములు క్రమతలో క్రమములైనవి. ముక్తపదగ్రస్తములు ముంగిళ్ళల్లో ముత్యాలముగ్గులు సల్పినవి.

చంద్రోపాలంభము :—(సరసహృదయానురంజనము.3-47.P.102)

సీ॥ ఘన పరంపరలలో గనరాని నీకెట్లు,
ద్విజరాజనామంబు తేజరిల్లె,
దిన దిన క్షయముచే దిగ నశించెడి నీకు,
జైవాతృక[1]త్వమేదేవుడిచ్చె,
తమ్ములమీఁద పాదమ్ములెత్తెడినీకు,
సత్పురుషత్వమే చాయనలరె,
దోషాకరత్వంబు తొలఁగఁజాలనినీకు,
విష పదావాప్తి యెవ్విధి ఘటించె,
తే॥గీ॥ కర గతంబైన నీదుశంబర విలాస,
మదియు మారీచ నీచ చర్యాతి శయమొ
పొంది యావిద్య యెందభ్యసించినావొ,
తేనెఁబూసిన కత్తివైతివి మృగాంక !

సరసహృదయానురంజనములోని నాయికలు అమృతవల్లి, సౌందర్య వల్లి. ఆ యిరువురును కుమారస్వామిపై మరులుగొని విరహములకు లోనైరి. వలచిన వరుడు చెలి సరసనఁజేరినపుడు చంద్రుడు సంతోషకారకుడు. దానికి భిన్నముగా విప్రలంభమునకు గుఱియైనపుడు ఆ చంద్రుడే సంతాపకారకుడు.

విహరమునకు గుఱియైన నాయికలు చంద్రుని నిందించు సందర్భమిది. విరహ దోదూయ మాన మానసలైన యా యిరువురును చంద్రుని తెగతిట్టి పోసిరి. ఘనుల మధ్య కనరాని నీవొక ద్విజరాజువా? అనిరి. అను దిన క్షయములతో కృశించు నీదు జైవాతృకత్వ మేపాటిది? అని నిలదీసిరి. తమ్ములమీద పాదములెత్తెడి నీవెట్టి సత్పురుషుడవు? అని ప్రశ్నించిరి. ఈ విధముగా పరి పరివిధముల నిందించి, పేరునకు మాత్రమే సుధాకరదవుగాని, నిజముగా నీవు "తేనెపూసిన కత్తివి" సుమా ! అని తూలనాడిరి.

---

1. జీవతి చిరకాలమితి జైవాతృకః :- దీర్ఘాయుష్మంతుడు. గు.బా.ప్ర
ఓషధీః జీవయతీతి జైవాతృకః :- పైరులను బ్రతికించువాడు. గు.బా.ప్ర

క్షణికావేశముతో చంద్రుని వారెంతగా తిట్టి పోసినను, కవి విరోధా భాసల నూతగాగొని. యా తిట్టుల గుట్టులను రట్టు గావించి, యా కళానిధి యౌన్నత్యమును నిష్కళంక మొనర్చినాడు. ఆ చంద్రునకు ద్విజరాజ పద విని నిల్పినాడు. జైవాతృకత్వమునకు జీవము పోసినాడు. సత్పురుషత్వమును సార్థక పఱచినాడు. సందర్భపోషక మైన యాలంకారిక రచనా రీతియందు కవి చూపిన యొడుపున కిదియొక మంచి నిదర్శనము.

మలయానిల దూషణము :— (స. హృ. రం. 3-56. పుట. 103)

ఉ॥ వచ్చితివీ వటన్న తలవంపులు కొమ్మలకెల్ల లోకమం
దెచ్చటనైనఁబుష్పిణుల నీడిచి పుష్పరసంబుదుల్పగా
వచ్చునె యీ యమానుషపు వర్తనలెల్లను జెట్లపాలుగా
మచ్చిక లింకఁజాలు పవమాన! "తొలంగు కృతాంతమార్గముల్"
విరహిణులు మలయానిలుని దూషించు సందర్భమునందలిదీపద్యము.

ఓ మలయానిలుడా! నీవు వచ్చినచో" "కొమ్మలకెల్లను తలవంపులు" తప్పవు. కొమ్మలు = స్త్రీలు, చెట్లకొమ్మలు, తలవంపులు = దైన్యముతో తల వంచుకొనవలసిన పరిస్థితులు, కొమ్మలయొక్క చివరిబాగములు వంగుటలు, గాలితాకిడిచే కొమ్మలకొనలు వంగుచుండుట లోకసామాన్య విషయము-మలయా నిలములు విరహిణులకు పరితాపములను గూర్చునవి. మాకు తలవంపులను గూర్చునీముఖమును జూపక తొలగిపొమ్ము. అందువలన మాకునీవలని బాధ తప్పును-

ఇందు పదప్రయోగ వైచిత్రిచే, శ్లేషసౌకర్యముల మూలమున మలయా నిలములను దూషించినతీరు సురుచిరము. "కృతాంతమార్గముల్ తొలంగుము" అనుటలో యమయాతనలు గూర్చు విధానములు వీడుము - అని సాభిప్రాయ ప్రకటనముగలదు. ఇందలి పదములు సాభిప్రాయ విలసితములు, భావములు సారస్య శోభితములు. పద్యమనవద్యము. హృద్యము.

**అనువాదరీతులు**

మూలము జోలికి పోనంతవఱకు దేవీభాగవతమునందలి పాపయా రాధ్యుని స్వతంత్ర రచనారీతి తిరుగులేనిది. ఓపికతో సంస్కృత రచన

ముతో తారతమ్య పరిశీలనమొనర్చునప్పుడును దీని ధారాధళ్యములు మిక్కిలి మనోహరములు.

వ్యాసమహామునిది పురాణవాణి. పాపయారాధ్య మహాకవిది ప్రబంధ భారతి. వ్యాసుని రచన సమతలమున సాగిపోవు మధురమందాకిని. ఎచ్చటను తొణకక బెణకక దరిజేరినవారి దాహములను దీర్చుచు గమ్యము చేరుట వానిరీతి. పాపయారాధ్య భారతి ప్రబంధవధూటి. సమకాలీన సరసుల యభి రుచులను గమనించి, అది కలికితనము చూపును. ఒక్కచో ముగ్ధయై తన మందచందాలతో ఆబాలగోపాలము నానందింప జేయును. మఱొక్కచో ప్రౌఢయై పండితుల డెందములను కందళింపజేయును.

ఈ కవి రచన కొన్నిచోట్ల మూలవిధేయముగా నుండియు తెనుగు దనమును ముద్రించుచుండును. కొన్నితావుల రసస్ఫూర్తితో మూలాతిశాయియై వినూత్నదీధితులను వెలార్చుచుండును. మఱికొన్ని సమయములందు మూల మును కుదించియు సారస్యములను సంతరించుచుండును. అనువాదరచనలో యథాతథముగ సాగుట, కుదించుట, పెంచి పోషించుట, యనునవి సర్వ సమర్థులైన సరసకవుల యుదాత్త లక్షణములు.

యథాతథానువాదరీతి :

శ్లో॥ మానుష్యం దుర్లభం ప్రాప్యవేదశాస్త్రాణ్యధీత్యచ
బధ్యతేయది సంసారే కోవిముచ్యేత మానవః॥

సం.దే.భాగ. పుట. 84. 1.14-49. సం. అధ్యా. శ్లో.

కం॥ వేదంబులు శాస్త్రార్థవి
వాదంబులు నెన్నియేనిఁ బఠికించినన
య్యాదివిఁడు సంసృతి నెడఁ
బోఁదలపక మోక్షపదముఁ బొందునె తండ్రీ!

తెనుగు దేవీభాగవతము. 1-597. పుట. 77.

శ్లో॥ బ్రహ్మా సృజతి లోకాన్వై, విష్ణుః పాత్యఖిలంజగత్
రుద్రః సంహరతే కాలే త్రయ ఏతేఽత్ర కారణమ్॥

సం.దే.భాగ 1-8-3. పుట. 59

కం॥ వరుసన్ సృజింపగా విధి,
భరణంబున నచ్యుతుండు, ప్రళయంబుల సం
హరణ మొనర్పగ రుద్రుడు
వరులెవ్వరు వేఱె లేరు పరతత్త్వంబుల్॥ తె.దే.భాగ.1-350 పుట.48.

శ్లో॥ సగుణా నిర్గుణాసాతు ద్వివిధా ప్రోక్తా మనీషిభిః
సగుణా రాగిభిస్సేవ్యా, నిర్గుణాతు విరాగిభిః॥ సం.దే.భాగ1-840పు82

తే॥గీ॥ అమ్మహాశక్తి ద్విగుణమై యలరు సగుణ
నిర్గుణయనంగ, వారిలో నిర్గుణార్చ
నము విరాగులు చేయుదురమల భోగ
చిత్తులగువారు సగుణ నర్చింతు రెలమి॥ తె.దే.భాగ

మూలమునకు మెఱుగులు

శ్లో॥ మనస్తు సుఖదుఃఖానాం మహతాం కారణం ద్విజ!
జాతేతు నిర్మలేహ్యస్మిన్ సర్వంభవతి నిర్మలమ్॥
సం.దే.భాగ 1-18-37 పుట.102.

తే॥గీ॥ మనసు సుఖదుఃఖ మూలంబు మర్మమిదియె
నిర్మల మొనర్చి, యాత్మపై నిల్పితేని
సర్వమును నిర్మలంబగు సంయమీంద్ర!
బంధమోక్షంబులకు నది పట్టుగొమ్మ.
తె.దే.భాగ. 1-781 పుట. 94.

ఈ యనువాద (పద్య)మున మొదటి మూడు పాదములలో మూల భావమును ప్రకటించి, నాల్గవ పాదమున అర్థాంతర న్యాసముతో కవితానికి మెఱుగులు దిద్దెను.

పెంచి పోషింపబడిన సందర్భాలు :

శ్లో॥ బ్రహ్మస్వసుతాం దృష్ట్వా, పంచబాణ ప్రపీడితః,
ధావమానశ్చ రుద్రేణ మారితశ్చనివారితః॥
సం. దే. భా. 1-14-69, 70 పుట, 86,

శ్లో॥ తస్మాత్ త్వమసి కల్యాణకురుమే వచనమ్ హితమ్,
కులజాం కన్యకాం వృత్వా, వేదమార్గం సమాశ్రయ॥ పుట. 88

ఆ. వె॥ తమ్మిచూలి తనదుతనయపైమరులొంది, పంచబాణ తీవ్రబాణఘాతికి,
గాళలేకతుదకు తలగోలుపదెహరుఁ, దఁడగె, కామబాధనణచునెవడు?
(1-164 - పుట. 79)

ఉ॥ కావున సత్కుల ప్రభవఁగన్నియఁదెచ్చెదఁబెండ్లియై సదా
భావభవ ప్రదీపసుఖ పారణలన్ దనివొంది, పుత్రపౌ
త్రావళిఁగాంచి, తాపస జనాశ్రయ సీమలఁదోడి వారితో
నీవు సుఖింపుమయ్య సుత! నిన్గని నిచ్చలు నూఱడిల్లెడిన్॥

సీ॥ చతురాశ్రమాధార సార్వభౌమతఁదెచ్చు,
నద్వితీయము ద్వితీయాశ్రమంబు,
ప్రకృతి పూరుషభేద భావప్రభంజకం,
బద్వితీయము, ద్వితీయాశ్రమంబు,
దేహేంద్రియాయాస దీర్ఘాటవీ వహ్ని,
యద్వితీయము ద్వితీయాశ్రమంబు,
అనులాపవిరహితంబయి సర్వమొనగూర్చు,
నద్వితీయము ద్వితీయాశ్రమంబు

తే॥గీ॥ నిరవధిక నిత్యనిరుపమనిర్వికార,
భోగసామ్రాజ్య సమరసస్ఫూర్తినొసఁగి,
యేదికోరిన నెడలేకయిచ్చుసిద్ధి,
నద్వితీయము శ్రీద్వితీయాశ్రమంబు॥ (1-616 - పుట 79.)

ఇందు మొదటి యొకటిన్నర పద్యములలోనే మూలభావము ప్రకటిత తము కాగా తక్కిన భాగమంతయును తత్పరిపోషకమే. ముఖ్యముగా సీస పద్య రచన మంతయును అమూలకమే. ఇది తెలుగు ప్రబంధ రచనల ప్రభావము—

## పూర్వ (ఆసుంగు) కవుల - రచనల అనుసరణములు

ప్రతి సాహితీ వేత్తయు ననంతముగా నిరంతరాధ్యయన మొనర్చి, తనకు ముందున్న మహాకవుల గ్రంథములను రసనాగ్రమున నిల్పుకొనుట సహజ

విషయము. అందులోను అనుంగు కవుల కృతులలోని రసవద్ఘట్టముల నాపో శనము పట్టుట జగమెరిగిన సత్యము. కనుక కవి పండితులెల్లరును ఈ సత్య పథమున సాగిపోయిన వారేయనుటలో సందియము నేకీభవింతురు. ఈ సత్య సూత్రమును మానదండముగా గైకొని పరిశీలించినచో పుంభావసరస్వతిగా, అభినవ కాళిదాసుగా, వాసికెక్కిన పాపయారాధ్య మహాకవియొక్క రచనల లోని అనుంగు (పూర్వ) కవుల రచనల యనుసరణములు సుస్పష్టములై పరమప్రీతి దాయకములు కాగలవు.

గంగాశంతనుల సమాగమ ఘట్టము. నన్నయ - ఆదిపర్వము.4-145

* కని వనకన్యయో! దనుజ కన్యకయో! భుజగేంద్ర కన్యయో!
యనిమిష కన్యయో! యిది వియచ్చర కన్యకయో! య పూర్వ మీ
వనమున నిట్టులేకతమ వచ్చునె మానవకన్య? యంచున
య్యనఘుడు దానిఁ జిత్తమున నాదట వొవక చూచెఁబ్రీతితోన్॥

పాపయారాధ్యుని - దేవీభాగవతము - 2-122 -పుట.122.

సీ॥ నలినాక్షి! నీవు మానవకన్యకవొ కాక,
గంధర్వ కన్యవో కాక యక్ష
కన్యవో దేవతాకన్యవో ఫణి రాజ
కన్యవో కిన్నర కన్యవొక్కొ?

నన్నెచోడ - కుమార సంభవము - 1-94. పుట. 17.

కం॥ పుష్కర షండములోఁగల
పుష్కరమూలములు గలశములఁగొనుమన్ సత్
పుష్కర తలముల మునుమిడి
పుష్కరములఁదెటికి వైచెఁబుష్కరమునకున్-

వేమనారాధ్య చరిత్రము 9-285.

ఉ॥ పుష్కరపుణ్య కాలములనఁబూర్వజనుః కృతమెల్ల బ్రోదియై
పుష్కర కేశుబోలిన యపూర్వమహాత్ముఁడవీవు నాదుహృత్
పుష్కరమూరడన్ దురితభావము మాయగ విందువైతివే
పుష్కరజాత జాతకులభూషణ! నన్ను గృతార్థుజేయుఁగన్॥

నాచన సోచన - ఉత్తర హరివంశము-విష్ణుస్తుతి 2.2217. పుట. 89.

సీ॥ ప్రణుతింతు "నోన్నమో భగవతే వాసుదే, వాయనమో భక్తవత్సలాయ
సూర్యాత్మనే నమస్సోమాత్మనేనమః, ప్రణవాత్మనే నమోబ్రహ్మణే న
మో రుద్రనామ్నే నమోవిష్ణవేనమో, మూలప్రకృతయేనమో వసుంధ
రాదిభూతగణాను భావభాసేనమో, మాయామయాయ నమస్సహస్ర.

తే॥ బాహునేత్ర శిరఃపాద వక్త్రిణే, న
మో,వషట్ స్వధాస్వాహాత్మమూర్తయే,న
మః,స్వలావశుద్ధాయ నమఃప్రహరణ,
ధారిణేనమో" యనుచునుదాహరింతు॥

వేమనారాధ్య చరిత్రము 2-70. (త్రిపురాంతక(శివ)స్తుతి).

సీ॥ రాజేపరస్మై విరాజేగిరీశాయ,
శాంతాయకవచినే శాంతిదాయ,
విష్ణవే బ్రహ్మణేవిభవే తపస్వినే,
దిగ్వాససేచ నందిధ్వజాయ
పురుషాయమానయే స్మరహరాయోగ్రాయ,
పశుపతయేఽజాయ పాశహాయ
భీమాయ రుద్రాయ పృథవేమహేశాయ,
చేశేమనోభువేఽభీష్టదాయ,

తే॥గీ॥ పాలినేశూలినేభక్త పాయభూత, పాయగిరిధన్వినేఽగ్ర్యాయవర్మిణేవ
రూధినేదృష్టవేఽంత్యాయవేధసేచ, త్రిపురసంహారిణేదేవ! తేనమోఽస్తు

శ్రీనాథ భీమఖండము 2-83. పుట. 32.

సీ॥ భస్మత్రిపుండ్రాంక ఫాలప్రదేశుని, రుద్రాక్షమాలికారూఢవక్షు
ము. పా. వేమనారాధ్య చరిత్రము 2-60.

సీ॥ భస్మత్రి పుండ్రాంక ఫాలభాగంబుతో, సర్వాంగరుద్రాక్షసరులతోడ.
శ్రీనాథ. భీమఖండము. 5 193. పుట. 115.

సీ॥ ఓ మహాదేవుండ! ఓ మహాలింగంబ! ఓ మహాత్ముడ! దేవ! ఓమహేశ!
పావయారాధ్య వేమనారాధ్య చరిత్రము 7.326.

సీ॥ ఓ భక్తమందార! ఓ భవసంహార! ఓ భక్తి సంధాన! ఓ నిధాన!

దివ్యకవిగా భువినుండి దివి కేగిన కవిసార్వభౌముడు - శ్రీనాథుడు
భవ్య కవిగా దివినుండి భువికి దిగిన బృహస్పతి - పాపయారాధ్యుడు

* దివిజ కవి వరు గుండియల్ దిగ్గురనగ,
అరుగు చున్నాడు శ్రీనాథుఁడమరపురికి. (శ్రీనాథుని చాటువు.)

* సుర గురుత్వ మటుంచి నర గురుత్వ మునేయ,
ఆగతిడిగ్గిన "బృహస్పతి" యనంగదగి నవారలటుంచు రసననను
ముల్గు పాపయారాధ్యుడంద్రదు - వే.ఆ.చ. 1 172.

పోతన ఆంధ్ర.మ.భాగ. 10. 1601.పుట.399.........

కం॥ శ్రీకరములు జనహృదయ వ
శీకరములు, మంద పవన శీర్ణ మహాంభ
శ్శీకరములు హంస విహం
గాకరములు నగరి కువలయాబ్జా కరముల్.

పాపయారాధ్య వేమనారాధ్య చరిత్రము. 1. 76.పుట.29.........

కం॥ శ్రీకరములు భక్తజనవ
శీకరములు దురిత హరణ చిల్లహరీ వా
రాకరములు గురు కరుణా
శీకరములు మాకుభక్తి జీవములు సుమీ!

పోతన—ఆం.మ.భాగ 10. 153.పుట.445.......

సీ॥ సమద పుష్పంధయ ఝుంకారములు గావు,
భీషణ కుంభీంద్ర బృంహితములు
వాయు నిర్గత పద్మ వనరేణువులు గావు,
తురగరింఖా ముఖోద్ధూత రజము.

పాపయారాధ్య దే. భాగ. 5. 263. పుట. 431........

సీ॥ సరస రంభానాట్య సంరంభములు గావు,
చండికా రణరంగ తాండవములు,
విద్యాధరీ తల్ప విహరణంబులు గావు,
ధూమావతీ పదోద్ధూపనములు.

పోతన. భాగవతము 7. 167. పుట. 714.........

సీ॥ కమలాక్షు నర్చించు కరములు కరములు, శ్రీనాథువర్ణించు జిహ్వజిహ్వ

పాపయారాధ్య. దే. భాగ. 3. 783, పుట. 275.... ....

సీ॥ చిచ్ఛక్తి భజియించు చిత్తంబు చిత్తంబు,
మాహేశ్వరిఁదలంచు మనము మనము.

అనంతుని భోజరాజీయము. 4. 132. పుట. 98.........

ఉ॥ ఎవ్వరిదానవీవు? కులమెయ్యది? యెయ్యదినీదు పేరు? నీ
కెవ్వఁడుభర్త? యొంటినిటు............

పాపయారాధ్య దే. భాగ. 3. 892. పుట. 290.

ఉ॥ ఎవ్వనికూతురీవు? కమలేక్షణ? యెవ్వనియింతి వైతివీ
వివ్వనసీమ నొంటిఁ జరియింపఁగనేమికతంబు?

అయ్యలరాజు రామభద్రకవి రామాభ్యుదయము. 356. 80.........

సంస్కృతకందము :

కం॥ హరయే జితమదురయే
భరయే భవవారిధేశ్చ ధన్యజనానాం
సురతరవే స్మరగురవే
స్థిరవేదమయాయ దేవదేవాయనమః

వేమనారాధ్య చరిత్రము 6. 28.... ...

కం॥ పావన చారిత్ర! నమో
భావాతీతాంతరానుభవప్రథిత! నమో
భావజగుణదూర! నమో
భావప్రాణేష్టలింగ భవచరిత! నమో

పెద్దన మనుచరిత్రము 6. 104 పుట. 781... ....

కవిరాజ విరాజితము 1

● జయజయదానవదారణ కారణశార్ఙ్గరథాంగ గదాసిధరా!
జయజయ చంద్రదినేంద్రశతాయుతసాంద్ర శరీర మహఃప్రసరా!
జయజయ తామరసోదరసోదర చారుపదోజ్ఝితగాంగఝరా!
జయజయ కేశవ! కేశినిషూదన! శౌరి! హరీ! దురితాపహరా!

---

1. ఈ కవిరాజ విరాజిత లక్షణాది పరామర్శ పక్కపుటలో చూడనగును.

పాపయారాధ్య దే.భాగ. 6 780. పుట. 107........

* జయజయ సూర్యశశాంక ధనంజయ చారువిలోచన చంద్రకమణా!
జయజయ దానవశాసన దుర్దమ శాశ్వతవిక్రమ చంద్రకమణా!
జయజయ తాపససంస్తుతి భాజన! శాంతజనావన! శైలశయా!
జయజయ భూధరదాపనివర్తిత సర్వచరాచర జాలభయా!

షోడశోపచారముల — పూజాసీసము (వసు. 3-170)

సీ॥ ధ్యానంబు హృదయ వాస్తవ్య కుటుంబికి,
నావాహనము జగద్వ్యాపకునకు,
నర్ఘ్య పాద్యములు నారాయణ ప్రియసూతి,
కభిషేకమబ్ధి కన్యాంక శాయికి....

సరసహృదయాను రంజనము4. 21.పుట.179........
సీ॥ ధ్యానమానంద కంద స్ఫుర జ్జ్యోతికి,
నా వాహనము గుహానంతమణికి
సింహాసనమ్ము సాక్షిస్వరూపిణికిని,
నర్ఘ్యపాద్యములు బ్రహ్మాది జననికి........

---

* కవిరాజ విరాజిత లక్షణాదికము :—

మనుచరిత్రమునందును, దేవీభాగవతము నందును కవి రాజ విరాజిత ములకు అనంతుడు మున్నగు ఛందః కర్తలు చెప్పిన గణములు (క్రమముగా 1 నగణము, 6 జగణములు, 1 వ గణము (లగము)) సరిపోవుచున్నవి. కాని మను చరిత్రమునందు మాత్రము 1 — 14. అక్షరములకు యతి మైత్రి చూపబడినది. పాపయారాధ్యుడు మాత్రము. అనంతాదుల లక్షణముల ననుస రించి 1—8—14—20. అక్షరములకు యతిమైత్రిని నిలిపినాడు. యతిమైత్రి విషయమున పెద్దన్న నన్నయ్య మార్గము ననుసరించెను. నన్నయ్య తన కవి రాజ విరాజితములందు (ఆది, 4. 2, అరణ్య 2, 91.) 1. 14 అక్షరములకే యతిమైత్రిని పాటించెను,

కవితా స్రవంతిలో ''సంగీత భంగిములు''

లలిత కళాకుశలుడైన పాపయారాధ్యుని కవితారామమున విరబూసిన సంగీత సుమసౌరభాల గుబాళింపులు సరసమనోహరములు. ఈ కవి తన సంగీత కళాకౌశలములను స్వయముగ ప్రకటించుకొనెను.1 అంతేగాక ఈ కవిని గూర్చి బాగుగా నెఱిగిన కవి, పండితులును - ఈయనకుగల సంగీత ప్రీతిని ప్రస్తుతించిరి. ఈ ప్రస్తావనలను, ప్రస్తుతులను ప్రక్కనబెట్టి, ఈ కవి రచనలను శ్రద్ధగా నించుక పరిశీలించినచో నాయా రచనలలోని పెక్కుపుటలలో నీయనలోగల సంగీతాభిరుచులు తేటతెల్లము కాగలవు.

అహల్యా సంక్రందన విలాసమున :

- సర్వ, పదబంధ గీతములు సంపూర్ణ "రాగ" ప్రౌఢి బొదలి మెఱయ (2.11)

వేమనారాధ్య చరిత్రమునందు :

- పంచాక్షరి "నటికి"........... అత్మరసజ్ఞ శాల. (1.150)
- తుంబుర నారదాదులు "వైణికధ్వాన" రుచిరంబుగా "రాగ" రూఢి నెరప (1.263)
- పెండ్లివారి కెదురుగ "వాద్య నిస్వనము" "పుణ్యవతుల" "సంగీత గోష్ఠి"యు పణ్యసతుల లాస్య సంరంభము............(4.43)
- "నాటక శాల" యందలికి నాయకురాలగుటన్ వినోదముల్ ............వీణియల్ మీటిన............ (9.202)
- పంతు రంతులు "భేరిణీ గంతు" మించు ....... ... ఎంచి, గురుచంద్రునెదుట "నటించె"నంత. (9.203)

"పంచమహావాద్య" పటల భేరీమృదంగాది నిస్వనములొయ్యనరచింప (4.41)

1. శ్రీమత్ సంస్కృతాంధ్ర కవితా సాహిత్య"గాన విద్యాప్తి భవ ప్రౌఢ వేస" ............పాపయారాధ్య శాస్త్రిణా....కృతపద్యమాలికేయం.

నరస హృదయానురంజనమున

వీణావేణు మృదంగ వాదములు పృథ్వీవ్యోమ మధ్యంబునన్ శ్రేణుల్
గట్టగ........గాణిక్యమ్ము నటింప....... (1-190 పుట 43)

- వీణె పాటకు మేళ వింతమే........ (2-177 పుట 85)
- ఒక యొర వేణువైణిక పరిచయ్య మా
  నస్వర గ్రంథ గాన ప్రసక్తి........ (3-105 పుట 110)

దేవీభాగవతమున

- గానాస్వాద కుతూహలమ్ముమది "రాగ"వ్యాప్తి సేయంగ.
- జనని "సప్త స్వరో"ల్లాసజనిత "గానమాధురీ" మహిత
  నయ విశారదుండైన యట్టి యీనారదునకు. (6-682 పుట 94)
- "గాన విద్య" యొసంగిన గతి, వరంబు
  గంగయు నొసంగలేదను ఘనత వినవె. (6-684 - పుట 94)

నక్షత్ర మాలికలో

- ధిక్తాంధింధిమి ధిక్త ధెయ్యనుచు నద్దేవాంగనాసంఘముల్
  ముక్తాన స్వర మేళనంబులుగ నిమ్ముల్ వెంచి నర్తింప........
  (చాముండీ స్తవము-28 పుట 11)
- ....... ... "నీవు మధు వాస్వాదించుచో గ్రమ్మి
  జంఝుక్ తాళంబులు ప్రేయగంతులిడునాస్థన్ జెందియున్నాద"

ఈ కవి కావ్యమును రచించినను, ప్రబంధమును నిర్మించినను, పురాణములను పలికినను, శతకముల నల్లినను, సందర్భానుసారముగ సంగీత ప్రస్తావనలు కావించుట, ఈయన కిష్టమైన విషయము. ఆ ప్రస్తావన లొనర్చుటయు ఏదో పేరునకు మాత్రమేగాక తనివితీర వానిని గూర్చి ముచ్చటించును.

ఈ కవిచే ఆయా రచనలలో లోత్రైన సంగీతశాస్త్ర పరిజ్ఞానముతో బహుధా చేయబడిన పై ప్రస్తావన లన్నియును పాపయారాధ్యుల సంగీత కళా ప్రావిణ్య ప్రాభవములకు ప్రబల నిదర్శనములు.

ఈయన కేవలము గాత్ర సంగీతమునందేగాక వీణా వాదనమునందును విశేష ప్రతిభాశాలియై యుండునని పై ప్రస్తావనలను బట్టి యూహింపవలసి యున్నది.

## అలంకార రీతులు

ఈకవి రచితములైన గద్యపద్యములేగాక గ్రంథాతములందున్న (ఆశ్వాసాంత) గద్యలుగూడ నీయనకుగల యలంకార శాస్త్రపాటవమును ప్రకటించు చున్నవి. ఈయన రచనలలోని శబ్దార్థాలంకారము లన్నియును సహజ రామణీయకములను సంతరించుకొన్నట్టివేగాని, పట్టుబట్టి కవిచే పొదుగబడినట్టివి గావు.

శబ్దాలంకారములు - వృత్త్యనుప్రాసము : దే.భా.గ. 1.5 పుట. 2.

- తల్లికిఁదల్లియైన తనతల్లికి దానును దల్లియై ధరన్
  దల్లులకెల్లఁదల్లియయి తల్లి! ననున్ గరుణింపుమన్నచో
  దల్లులుగాననీని మరుతల్లిని సజ్జన కల్పవల్లి మా
  తల్లిని సన్నుతింతు జనతాఫలదస్మిత మల్లినెంతయున్॥

ఇందు ద్వితత్వలవర్ణము(ల్ల)పలు పర్యాయములావృత్తమైనది. కావున నిది వృత్త్యను ప్రాసశోభితము. సరస విలసితము.

చేకానుప్రాసము :

- నిరంతర నిరంతరాయ సౌమనస్యాభిసస్యమాన గరిమంబున విబుధులగు విబుధులును, భవ్యకావ్య సమాఖ్యాను బంధబంధురతా రామణీయకంబునఁ గవులగు కవులును, మంత్రాంగ మచర్చితా చర్చాసమారూఢ మనో వ్యాపారపారీణతల గురువులగు గురువులును, స.హృ.రం.

అధోరేఖాంకితములైన పై ప్రయోగములలో చేకానుప్రాస, యమకములు దోబూచులాడుచున్నవి.

అంత్యానుప్రాసము : (దేవీ. భాగవతము - 4.673. పుట. 393)

- కరవిధృత కురంగా! కాలలీలా విభంగా!
  శరధివర నిషంగా! శాంతిపూర్ణాంతరంగా
  తరణి కిరణభంగా! ధర్మదారార్థ సంగా!
  భరితకరుణ లీలాపాంగ! విశ్వేశలింగా!

పాదాంత స్థితబిందు పూర్వక "గ" వర్ణము అన్ని పాదములకును - అంతమందలరారుచున్నది గాన నిది "అంత్యానుప్రాసాలంకృతము."

లాటాను ప్రాసము (దే. భాగ. 3.783. పుట. 257)

* చిచ్ఛక్తి భజయించు చిత్తంబు చిత్తంబు,
మాహేశ్వరిదలంచు మనము మనము
కాత్యాయనినిబూన్చు కరములు, కరములు,
భువనేశిఁగాంక్షించు బుద్ధిబుద్ధి
విమల విద్యలు విను వీనులు వీనులు,
పరమేశ్వరి నుతించు పలుకు పలుకు
బ్రహ్మాణి వలగొను పదములు పదములు,
శ్రీదుర్గ నుతియించు జిహ్వ జిహ్వ
* ఇష్టకామేశ్వరిని గను దృష్టి దృష్టి,
చిన్మయీశక్తికిని మ్రొక్కు శిరము శిరము
మాటలేటికిఁబరదేవి మహిమగఁనని
నరుడునరుడౌనె? కుటిల వానరుడుగాక॥

ఇందు "క్రిగీతలు"గల చోట్ల శబ్దార్థముల పునరుక్తియున్నను తాత్పర్యభేదము ప్రభవించుచున్నదిగాన నిది లాటానుప్రాసలాలితము. "నరుడు నరుడౌనె? కుటిల వానరుఁడు గాక— అని ప్రయోగించుటచే అంత వఱకు సాగిన "లాటానుప్రాస సంగీత సభ"కు యమకముతో "ముక్తాయింపు" ఇచ్చినట్లైనది.

ముక్తపదగ్రస్తము (అహల్యా సంక్రందన విలాసము. 3.4)

సీ॥ అయ్యయో నాబుద్ధి యూరడిబోవసి, వేశవాహ్యాళికై వెడలనేల?
వెడలితి గాకేమి వెట్టినై చతురాస్య, భువనంబునకు నేను బోవనేల?
పోయితిగాకేమి భువనైక మోహినిఁగన్నులుచల్లగాఁ గాంచనేల?
గాంచితిగాకేమి కడువేడ్కపడతిపై విదరాని మోహంబు పొదమనేల?

తే॥గీ॥ పొదమగానేమి యంతటఁబోఁకిట్లు,
పంచశర వేదనాహతిఁప్రలలనేల?
ఏమిసేయుదు?విధిసేత కేమనందు?,
తలవనితలంపు పుట్టెగదా! గణింప॥

పూర్వపూర్వపాదాంతముల యందు ముక్తములైన పదములు ఉత్తరోత్తరపాదాదిగ్రస్తములగుటచే నిదిముక్తపదగ్రస్తాలంకృతి కలితమై పాఠకులకు చవులూరించుచున్నది.

యమకము (అహల్యా సంక్రందనవిలాసము 3-33)

మధుర మధురస ధోరణీ మహిత మహిత
లములగములగు నళులరాగముల గతుల
మలయ నిలయానిల చలత్కిసలయ సలయ
రటన నటనలఁజెలఁగె నారామసీమ॥

సమానార్థకములుగాని సమాన వర్ణముల జంటయొక్కగాని, పెక్కింటియొక్కగాని యావృత్తియమకము - కావున నిందు యమక నియామక పద సౌందర్యము పరమ రమణీయమై విలసిల్లుచున్నది.

ఉత్ప్రేక్ష (వే.అ.చ. 2-50)

సీ॥ సర్వాంగభస్మ సంఛన్న దీధితులతో ఆగతికిదిగు పూర్ణచంద్రుఁడనఁగ,
సరసకాషాయ వస్త్రనిచోళ కాంతిచే, ధరఁజరింపఁగవచ్చుతరణియనఁగ
అరుణ జటాజూటభరిత ద్యుతివ్యాప్తి క్ష్మాచరించుహిరణ్యశైలమనఁగ
భస్మత్రిపుండ్రాంక పటలిచేభూచర, ద్విరసనేడ్బద్ధమందరమనంగ
తే॥గీ॥ పదములను రత్నపాదుకల్, పంకజముల
కరుణరుచి గూర్పనక్షమాలాభియుక్తి
సరణిపొలుపొందనొక పీరశైవుఁడగుచు,
తివిరి త్రిపురాంత కేశుడేతెంచెనటకు

ఉపనీతుడగుచున్న వేమనారాధ్యవటువునకు శివదీక్ష ననుగ్రహింపదలచిన త్రిపురాంతకేశ్వరుడు. ఒక వీరశైవుని రూపమునుదాల్చి యటకేతెంచినట్లు వర్ణించు సందర్భములోని దీయుత్ప్రేక్ష—

పూర్ణచంద్రునిగా నూహించుటచే హాయిని గూర్చెడి స్వచ్ఛమైన రూప సౌభాగ్యలక్షణము, సూర్యునిగానుత్ప్రేక్షించుటచే సర్వవిజ్ఞాన నిధానమైన వేద స్వరూప లక్షణము, మేరుపర్వతముగా భావించుటనుబట్టి సర్వైశ్వర్యములకు సన్నిధియన్న విషయము, మందరగిరిగానుత్ప్రేక్షించుటచే సుధలను జిందించు శుభలక్షణము త్రిపురాంతకేశ్వరునిలో ద్యోతకములగు చున్నవి.

ఇందు మొదటి మూడు "ఉత్ప్రేక్షలు" ఒక యెత్తు. నాల్గవదియగు "భస్మత్రిపుండ్రాంక (తిర్యక్పుండ్ర)ములను దాల్చిన వీరశైవుడు వాసుకిచే చుట్టబడిన మందరగిరిగానూహింపబడిన" ఉత్ప్రేక్ష ఒక్కటియు ఒక యెత్తు. అది వినూత్నమైనది. అద్భుతమైనది. కవికి స్ఫురించిన యీ "మధురోహ" సరస సాహిత్య పథమున తేజఃపుంజముగా వెలుంగుచు, సారస్వతప్రియులకు చక్కని గిలిగింతలు పెట్టుచున్నది. సత్కవుల రచనలకు గౌరవములను సంతరింపజేయు నలంకారములనగా నిట్టివే. ఇట్టి యద్భుతములైన కమ్మని యుత్ప్రేక్షలు - ఈ కవి రచనలలో కోకొల్లలు.

క్రమాలంకారము : దేవీభాగవతము. 1-3 పుట - 2)

సీ॥ ఒకచెంత చిలువలై యొకచెంత కలువలై,
సలలితాభరణముల్ సందడింప,
ఒకదండ (జర్మమై యొకదండ భర్మమై,
పరిధాన సంవ్యాప్తి పరిఢవిల్ల,
ఒకయొర (గన్నుగా నొకయొర (జన్నుగా (,
దరుణాగ్ని శిఖధగద్ధగలెసంగ,
ఒకవంక తెల్లనై యొకవంక నల్లనై,
తనురుచి ప్రచయముల్ తాండవింప॥

తే॥గీ॥ బాహ్యవేదలకు గలిగియు భక్తపసర
కుశలసంధానమున నేకగుణము (జూప,
నాది దంపతులఖిలలోకైక జనకు
లంబికాశంకరులు ప్రోతురనుదినంబు॥

ఆదిదంపతులైన యా శివపార్వతులు లోకముల ననుదినము కాపాడు చుందురుగాక- అని చేయునాశీర్వచనమిది. దేవీభాగవతము నందలి యిష్టదేవతా ప్రార్థనా సందర్భములోనిదీపద్యము-

క్రమము తప్పెన క్రమాలంకార కలితముగా నిదిముద్రితము. పద్యాంతమున "అంబికా శంకరులు" అని యాయాదిదంపతుల పేర్లు తెలుపబడినవి. క్రమముగా వారి యాభరణములు చిలువలు - కలువలు- వారి వస్త్రములు చర్మము, వర్మము - వారొకయొర కన్ను, ఒకయొర చన్ను కలవారు-వారు తెల్లగా, నల్లగా విలసిల్లుచుండిరి. ఈ లక్షణములలో మొదటివి, క్రమముగా శంకరునకును, తరువాతివి అంబికకును చెందును. కాని చివర - వారి పేర్లను కూర్చుటలో క్రమము తప్పినది. వ్యాకరణశాస్త్ర నియమానుసారము ముందుగా స్త్రీ నామము ఆ పిమ్మట పురుషనామము, ప్రయోగించుటయే యుక్తము. ఈ లక్షణములలో ముందు వెనుక మార్చినను పద్యము చెడదు. కాననిది ముద్రాపకుల పొరపాటో?- లేక కవియొక్క భ్రమప్రమాద ఫలితమో? దీని ముద్రణా పర్యవేక్షకులు "శతావధాని" శ్రీ చెళ్ళపిళ్ళ వేంకట శాస్త్రిగారు. వారి దృష్టికిని నిదిరాకుండుట యాశ్చర్య జనకము-

పరిణామాలంకారము : (వే.అ.చ. 8-222)

- గురుబోధంబను వింట, చిత్తశరమున్ గూర్పంగ సాధించి, య
  ద్దురుతన్ కామముఖారి వర్గమృగ సందోహంబులన్ జించి సు
  స్థిరమౌ సాధనదేటి, లక్ష్యముదులన్ జేకొంచు నానాటికిన్
  పరిపూర్ణాంతరభోగ సిద్ధిగని రొప్పన్ భిల్లశైవోత్తముల్॥

గురూపదేశమనెడి ధనుస్సునందు, చిత్తమనెడి బాణమును సంధించి, కామాదులైన (కామ, క్రోధ, లోభాది) అరిషడ్వర్గములనెడి మృగములను రూపుమాపి, భిల్లశైవోత్తములు లక్ష్య సిద్ధినందిరి.

ఇందున్న రూపకము ప్రకృతోపయోగియగుచున్నందున ఈ పద్యము పరిణామాలంకార కలితము.

విషమాలంకారము :

* అస్మదీయ విలాస చేష్టానుభవము,
మానసానందదాయియై మసలునొక్కొ ?
హరి హయుండేడ ? అడవుల నాకలములు,
మెసవుతపసుల చెలులేడ ? మెచ్చువచ్చె ?

విరుద్ధములగు రెండు వస్తువులనొకచోట సమకూర్చుటవలన నిందు విషమాలంకార మలరారుచున్నది. సురరాజగు దేవేంద్రునకును, అడవులలో నాకు లలములు మెసవుచు జీవించు తపసుల చెలులకును ఒక్కచో కలయిక కూర్చుట యన విరుద్ధములగు రెండు వస్తువుల నొకచో సమకూర్చుయత్నమే. కావున నిదియొక విషమభేద విలసితము.

శ్లేషోపమలు - విరోధాభాసము :

అయ్యంగనా లలామల యుద్దామ విప్రలంభము అపాస్తరుచిరాలంకారంబును, అనిర్దిష్ట పదబంధ మధురంబును, సుఖంకర శయ్యావిరహితంబును, అనుదాత్త గుణబంధురంబును, అసార వృత్తి సంశోభితంబును, అపరిస్ఫుట వ్యంజనాలోకంబును, అగుటవలన కుకవి కవితా వితానానుమితంబయ్యును, అనర్గళ రసధారాసారప్రత్యక్ష వర్తనంబును, చిరంతన రాజశేఖరోద్భూత కథా విధానంబును, అనుచ్చరిత దోషాకర ప్రసంగంబును, వయస్యాను రంజిత శీతల పదార్థ పరిష్కృతంబును, అతిశయిత లబ్ధ వర్ణాంతర మోహనంబును, సముచితైక రీతికంబును గావున విద్వదాకల్ప కల్పనానల్పంబగు మహా ప్రబంధంబునుంబోలి నిస్సీమంబై ప్రవర్తిల్లె.

ఆ నాయికల విప్రలంభము శ్లేష వైశిష్ట్యములచే కుకవి కవితా వితానముల రీతులవెలార్చుచునే విద్వదాకల్ప కల్పనానల్ప మహాప్రబంధంబునుంబోలి యొప్పారినది. ఇట శ్లేషోపమలలరారుచున్నవి.

ఆ నాయికల విప్రలంభము కుకవి కవితా వితానమును బోలి యున్నప్పుడు విద్వత్కవి కల్పిత మహా ప్రబంధంబును బోలియుండుట కుదురదు.

అట్లు పోలియున్నట్లు వర్ణించుట లోకానుభవ విరుద్ధము. కాని శ్లేష వైభవము లచే నావైరుధ్యము పరిహారమగుచున్నది. కావున శ్లేషోపమలతో, అనుప్రాణిత ములై, ఇట "విరోధాభాసాలంకారములు" మిక్కిలి చమత్కారజనకముగా విలసిల్లుచున్నవి.

## భాషా విశేషాలు

ఈ సందర్భమునందీమహాకవి సంస్కృతాంధ్ర భాషా విశారదుడను విషయము స్మరింపదగియున్నది. అంతియగాక ఈతడు తర్కవ్యాకరణాది వివిధ శాస్త్ర పారంగతుడను విషయముగూడ విస్మరింపరానిది. కనుక ఈ విద్వత్కవి ఘంటమునుండి జాలువారిన గద్యపద్యములలో పాండిత్య ప్రకర్ష పరవళ్ళు త్రొక్కుటగాని, శాస్త్ర వాసనలు గుబాళించుటగాని సహజములు. కాని మధురధారకు మనికిపట్టయిన ఈయన కవితలో దీర్ఘ దీర్ఘ సమాసములు సైతము సరసార్థ సౌకుమార్యములకే తావలములై ప్రసాద గుణ శోభిత ములై హాయిని గూర్చుచుండును. ఈ కవి కరస్పర్శా ప్రభావిత పద సంపద హేళ్ళలట్టివి.

సంస్కృత రచనము - సీసము :

సీ॥ ధాత్రే, పరస్మై, విరాజే, గిరీశాయ,
శాంతాయ కవచినే శాంతిదాయ
విష్ణవే, బ్రహ్మణే, విభవే, తపస్వినే,
దిగ్వాససేచ సందీధ్వజాయ
పురుషాయ, మౌనయే, స్మరహరాయోగ్రాయ,
పశుపతయేఽజాయ, పాశహాయ,
భీమాయ, రుద్రాయ, పృథవే, మహేశాయ,
దేశే, మునోభువేఽభీష్టదాయ

గీ॥ పాలినే, శూలినే, భక్తపాయ, భూత
పాయ, గిరిధన్వినేఽగ్ర్యాయ పర్మిణేచ
రూథినే ధృష్ణవేఽంత్యాయ వేధసేచ,
త్రిపురసంహారిణే, దేవ! తేనమోఽస్తు॥ (వే. చ. 270)

వేమనారాధ్యుడు త్రిపురాంతకేశ్వరుని స్తుతించిన సందర్భమున కావిం పబడిన సంస్కృత రచనమిది. సీసరూపమున ఛందస్సునుబట్టి యిది తెనుగు దనమును నింపుకొన్నది. భాషననుసరించి, యిది సంస్కృతాకృతిని సంత రించుకొన్నది.

గీర్వాణ దండకము

నమస్తే నమస్తే నమోదేవి! విశ్వేశ్వరి!... ....
........పాహినః పాహినః పాహిదేవి! (దే.భా. 5-602. P. 481-82)

దేవతలు పరాశక్తిని నుతించు ఘట్టమున కొనసాగిన రచనమిది. ఇందు బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులకు (త్రిమూర్తులకు) అతీతముగా శక్తితత్త్వము వర్ణితమైనది.

పాండిత్య స్ఫోరక పదావళి :

సీ॥ భయద........అబ్బజేసె. (దేవీభాగవతము. 5-686.పుట. 493.)

అను సీసమునందు ప్రయుక్తములైన "బాణా బాణి" "ఖడ్గా ఖడ్గి" "కుంతా కుంతి" "రథా రథి" "గదా గది" "కచా కచి" "ముద్గరా ముద్గరి" "ముసలా ముసలి" "కృపాణా కృపాణి" "శూలా శూలి" "చక్రా చక్రి" "దండా దండి" వంటి పదములు కేవలము రాటుదేలిన ఘటి వైయాకరణులైన సరస కవీశ్వరుల కరములనుండి మాత్రమే జాలువారగలవు. అందునా పట్టు బట్టి కూర్పబడినట్లుగా గాక సందర్భోచితముగా అలవోకగా సరస ధారలో రుచిరములై యటరాదుట కవియొక్క రచనాధికారమునకు తిరుగులేని తార్కాణము.

ఇట్లే యీ క్రింది పద ప్రయోగములును ఈ కవి శాస్త్ర విజ్ఞానములను ప్రతిబింబింప జేయును.

నరక ప్రతియోగి, సర్వానవచ్ఛిన్న సరణి, అనుభవ సూత్రావళి, సోమనాథాది శైవభాష్యవేత్త, రురుసుత, ప్రధ్వంసనము, భుజిష్య, భుజిష్యులు,

గంధర్వ నగరము, నరక ప్రధ్వంసి, మద్యే కాననము, జహద జహత్క్రియా సరణి, భాసాం నిద్యుపమాన తేజాలు, పంచష పదాభిముఖంబుగ, వసితా యుతము, రుచీ విరంజితము, మణీ మయము, మణీ ముఖ, సౌధాశన పీఠము, (దివ్య పీఠము.). జిమృక్ష, "అధ్యాస"ంబనుచునెంచి, బాహూ బాహవి, "కుండోధ్ని" గాత్రంబున, నీరేరుహాత్రవ్యధా ముద్రాముద్రిత-, "అర్వతన" "ఇదానీంతన" "ఐదంయుగీన", "వ్యంజనా వృత్తి", "శేషంబున"కు "శేషి", ఠిఠంస, అదుంతుద, పరిచియ్యమాన.

## విశేష ప్రయోగాలు

ఈ మహాకవి యనర్గళధారలో అక్షరాకృతి దాల్చిన వేలకొలది గద్య పద్యములలో అటనట వ్యాకరణ నియమములకు లొంగని పదములును కొన్ని ప్రయుక్తములైనవి. వానిలో కొన్ని లక్షణలక్షితములైనను ప్రయోగ సార్థక్యము కలవిగా గన్పట్టవు. జాయాచ పతిశ్చ "జంపతీ" "దంపతీ" అని సంస్కృతమున ప్రయోగింపబడుట సువిదితము. తెనుగున "దంపతులు" అని ప్రయుక్త మగుచుండుట సర్వసాధారణము. కాని యీ కవి "దంపతి" యనియు, "దంపతులు" అనియు (రెండు రూపములతో) ప్రయోగించినాడు.

"దంపతి"— అమ్మహిపాలక "దంపతి"

మమ్ముం జేరంగఁ బిలిచి॥ దే.భా. (19-7 పుట 14)

రాజదంపతులు కవినాహ్వానించి, దేవీభాగవతమును తెనుగున రచింపుడని యర్థించు సందర్భమిది-

- దంపతులఁజూచి వ్యాసుఁడత్యాదరమున-

"యౌవనాశ్వుడు" అనుటకు మారుగా "యవనాశ్వుడు"

- యవనాశ్వుండనపత్యుడై ........ ..... (దే.భా. 7-229. పుట. 139.)
- యౌవనాశ్వుడనిదిద్దినచో గణభంగమగును.

జాణవు, జాణుడవు— అని ప్రయోగద్వైవిధ్యము —

- సంశయముల్ దెరల్పఁగల జాణుడవీవని దే.భా. 1-720.పుట.9½.

- ద్వంద్వసం, అనితమహాపదల్ దొలఁగు, జాణవుదెల్పుమ ధాతశేఖరా!
(దే. భాగ. 1-749. పుట. 79.)

"యతి వియును-అగుచు - అనుటకు - యతి వినగుచు

- వ్రతముల శుష్కించి యతివినగుచు - (దే. భా. 1-609. పుట. 79)

తాంబూలము - అనుటకు "తాంబులము"

- ఎవ్వడేని ద్విజుల యిండ్లను గుళ్ళను, ధాన్యతల్పపీఠ తాంబూలము లు
ముచ్చిలించి.... (దేవీ.భాగ. 9-710. పుట. 315).

సిద్ధ సమాస మధ్యస్థమైయున్నందున "తమ్ములము" అని దిద్దరాదు.
"జనయిత్రి" అనుటకు "జనిత్రి" అని ప్రయుక్తము.

- అద్వైత సైపనోపక హృదంబుజ పీఠి జగజ్జనిత్రి! నిన్
మవ్యముగాఁదలఁచి,....... (దే.భాగ. 6-121. పుట. 17.).

ప్రసాదపడు (ప్రసాదము పుచ్చుకొను; భుజించు.) అనుటకు
ప్రసాపడు అని ప్రయోగము.

- పతి ప్రసాపడు మీద పరమనిష్ఠాయుక్తి, దనరారఁదాఁబ్రసాదంబు
గొనును. (అ.సం విలా. 2-62.)

అహల్యయొక్క పతిభక్తిని వర్ణించు ఘట్టమిది.

గద్గద స్వరముతో (గాద్గద్యముతో) నొప్పు వాదనుటకు "గద్గదుండు"
అని ప్రయుక్తము.

బాష్పములుకు గనుల "గద్గదుండ"యి గురుపదాగ్రములఁబడియె"
(వే.అ.చ. 5-94)

మీరు మదగజంబులుగా నగుచు. అనుటకు మదగజంబులరగుచు

- మమ్మునేచుచుంట మదగజంబులరౌచు, నటవిదిరుగుచుండుడనియె
మౌని. (వే.అ.చ. 7-56.)

"తోడ్కొని" అనుటకు "తోడ్క" "తోడుకొని" అనుటకు "తోడుక"
అని ప్రయోగములు.

- సా! ధనుడై యొప్పుచు మంధశైలేంద్రముదమందందోడ్కొరా నేగగన్.
(వే.అ.చ. 7-223.)

• తోడుక వచ్చి రత్నములు, దూర్వహ తుంగ తురంగ రత్నముల్.
గూడ నొసంగి, (దేవీ.భాగ 6-613. పుట. 84.)
"సూదక"కు మాఱుగా "సూద" ప్రయోగము.

కం॥ సముచితముగ లింగార్చన
సమయము..........ధరించి, స్నానవిధులువే
గమమీరు సేయుదని, సూ
దముఱుల్ వలుకంగ, పండితయ్యయుగడిమిన్॥ (వే.అ.చ. 8-290.)
ఆరాధ్యము - గీ రాధ్యము (వే.అ.చ. 4-141)
తామసములు - గీ మసములు (వే.అ.చ. 1-277)

ఇవి లోక సహజరీతిలో నిందయందా మ్రేడితములకు చేయబడిన గిగీలు—

కాని లక్షణవేత్తలు స్పృశింపని రీతిలో నీకవి చేసిన యీ క్రింది ప్రయోగము గమనింప దగియున్నది.

బా, హ్యేంద్రియ గింద్రియాదులకు నించుకయైన వికాసముండునే॥

ఇది సమాసమనదగియులేదు. వ్యస్తమనదగియు లేదు. ఈ యామ్రేడిత లక్షణమే విలక్షణముగా నున్నది.

లడాగమాచ్చునకు ధారాళముగా సంధి చేయుట గమనార్హము. నేడాదిగా భక్త నివహంబు లిండ్లలో భక్తి నెనరు మిగుల.
(నివహంబుల (యొక్క) ఇండ్లలో) (వే. అ. చ. 3-54)
భక్తులెద (భక్తుల (యొక్క) ఎద) వే.అ.చ. 5-58
తల్లిదండ్రులెద (తల్లి దండ్రుల యెద) వే.అ.చ. 4-2.
"ఏవగించుకొనుచు" అనుటకు మాఱుగా "ఏవగించుచు"
(వే. అ. చ. 7-23)
అస్మద్దురితంబులు (మా దురితంబులు) అనుటకు - మద్దురితంబులు.
(వే. అ. చ. 7-23)
అస్మద్వాంఛాభిరతులు (మావాంఛాభిరతులు) అనుటకు
• అట్టులయ్యె మదీయ వాంఛాభిరతులు (వే. అ. చ. 7-45)

దుర్వాదములు పెక్కు సేయు అనుటకు మాఱుగా

- దు,ర్వాదము పెక్కు సేయు స్మృతి పద్ధతులన్ నిరసించు (వే.ఆ,చ. 8-108)

వ్యసనములకు "మరగి" అనురీతిలో శివభక్తికి "మరగి" అని ప్రయోగించుట

- మనము వశ మొనర్చి, మనసిజ సంహరు.
"మరగి", త్రిపుటి దెలిసి మనుదు రెలమి. (వే.ఆ.చ. 8-179)

చరణ సేవా కాంక్ష అనుటకు మాఱుగా చరణ కాంక్ష(వే.ఆ.చ8-991)

* కన్నారన్ గనుగొంచు మీ చరణ కాంక్షన్ వెంటరాఁగోరితిన్ ,,

"సన్నాహము" మీద ఇంచుక్ ప్రయోగము.

* సన్నాహింపక సూరమాంబ గురుపార్శ్వం బొయ్యనన్ జేరి (వే.ఆ.చ.8-119)

నగర నివాసులు అనుటకు "నగరాలయులు" (వే.ఆ.చ.7-169)

ధానుష్కులరీరు అనుటకు "ధానుష్కులీరు (వే.ఆ.చ.8-215)

గజి బిజిపై ఇంచుక్ ప్రయోగము.

* అంగ సంసంగ భస్మాంగరాగ ద్యుతుల్ నిజ కళా స్ఫూర్తితో
గజి బిజింప. (స.హ్బా.రం. 3. 124. పేజీ.112)

గుహుచేన్ గుహునికొరకు, గుహునకు సంప్రదానార్థక తృతీయ.

- కన్యే కుల శీలాఢ్యాం, ధన్యే తుభ్యందదామి ధర్మేచార్థే
దాన్యోన్యే మస్తు శుభమని ధన్యత హరి ధారవోసెఁదనయల గుహుచేన్ (స.హ్బా.రం. 5. 89.పేజీ.215)

హరిగుహుని కొఱకు (గుహునకు) తన తనయల ధారవోసెను.

ఇచటి ఈ మణి ప్రవాళశైలి మిక్కిలి చమత్కారజనకము.

"నిర్పృతి" అనుటకు మాఱుగా నిఋతి ప్రయోగము.

* నిఋతి దిశకేగి తృణగుల్మ విరహితముగ (దే.భాగ.11, 15, పుట.391).

చతురంగ బలములు అనుటకు చతురంగ బలము అని ప్రయుక్తము

* ఘాంధ్యుదర్పించు చతురంగ బలము వెంట నరుగుదేరంగ,

(వే.అ.చ.4.138.)

## ఛందో విశేషాలు

"విద్యలలోపల నుత్తమ విద్య కవిత్వమ్ము
తత్కవిత్వము ఛందో వేద్యము" అని

ఛందోలక్షణ వేత్తలు నుడివిరి. తెలుగు కవులెల్లరును ఈ యభిప్రాయమును గౌరవించిరి. ఛందశ్శాస్త్రము నెడ తెలుగు కవులకుగల యాదరాభిమానము లపారములు. నన్నయనుండి చిన్నయవఱకుగల కవి వతంసుల రచనలన్నియును ఛందోబద్ధముగనే విలసిల్లి యుండుట యిందులకు ప్రబల నిదర్శనము.

ఛందశ్శాస్త్రము యొక్క విశ్వరూపము బహుముఖమైనది. అది యొక యద్భుత భాషావిశేష రత్నాకరము. రచనా జీవలక్షణ పరిరక్షణమున నది యొక పరమ సాధనము. ఎట్టి రచనయైనను - ఏదో యొక రూపమున చందోబద్ధమై విలసిల్లుచుండునని, ఛందశ్శాస్త్ర పారంగతులైన సహృదయ విమర్శకుల భావము. అందువలన ఛందశ్శాస్త్రము సార్వకాలికము.

ఈ కవి రచనలలో ఉత్పలమాలాది ప్రసిద్ధ వృత్తములు, మత్తకోకిలాది విశేష వృత్తములు, కందములు, సీసములు, ఆట వెలందులు, తేటగీతులు, రగడలు, లయ విభాతులు, లయగ్రాహులు, చౌపదులు, ఆర్యాగీతులు, అనుష్టుప్పులు, కవిరాజ విరాజితములు, దండకములు, మున్నగాగల పెక్కు ఛందోరీతులు యథావకాశముగా, సందర్భానుసారముగా చోటు చేసికొనినవి.

ఈ కవి యొనర్చిన విశేష ప్రయోగములు మాత్రమే యిట వివరింపబడుచున్నవి.

వృత్తప్రాససీసము : సీసముయొక్క పెద్దపాదములలో నాల్గింటను (పూర్వార్ధములందు) ఆదిలో వృత్తమునకువలె ప్రాసముగల్గి,

సీ॥ కట్టించె గజఘటల్ ఘనకల్పపాద ప్రోజ్జ్వలవిశంకట పటుస్కంధములను
బట్టించెఁజెలులు రంభామేనకాఘృతాచీ వరూథిన్యాదిరో వెలఁదులఁ
బెట్టించె సుధకొల్లఁబృథులరక్షస్సైన్య సేనాపరీవృథ శ్రేణికెల్ల
మట్టించె దేవతాషంధిరంబులుయో ధఘన కఠోరాంఘ్రిఘట్టనలచేత

## అక్కిలి ప్రాససీసము

సీ॥ కట్టించె నూరూరఁగళివేల్పుకోవెలల్
ధట్టించె నోర్వని కట్టడులను
పెట్టించె నోరెంబు పేర్మిఁబాలుల కెల్లఁ
దట్టించె నెమ్మదిఁ దాల్మియూట
మట్టించె దోసమున్ మాట పుట్టగనీక
గొట్టించె నానఁగైకొనని వారి
నెట్టించె పెటవేల్పు బెట్టుఁదెల్పెడివారి
జెట్టించెఁదొల్లిటిజేంట్ల సిరుల

గీ॥ మట్టుమీఱిన బత్తిచే గట్టుదాది
గుట్టుమదిఁగాంచి, తములచేఁ గట్టువడక
పట్టుసడలంగనీక లోఁబుట్టునెఱిక
పుట్టువుల మట్టుమల్లాదెబుడమిఱేఁడు (స. మ. 1-85. పుట. 20.)

సీసముయొక్క నాల్గు పాదములలోను పూర్వార్థములందును, ఉత్తరార్థములందును, గీతము (ఎత్తుగీతి) యొక్క నాల్గు పాదములయందును (12 చోట్లను) ప్రాస నియమము (ద్విత్వటకార ప్రాసము) పాటింపబడినది గనుక నిది అక్కిలి ప్రాససీసము. (అనంతుని ఛందస్సు - 330)

దీనిని అనంతుడు— "అక్కిలిప్రాససీసము" అని నుడువగా, లక్షణ శిరోమణికర్త (పొత్తపి వేంకటరమణ కవి) (18వ శతాబ్దివాడు) అవకలి ప్రాససీసము"గా పేర్కొనెను. (ల. శి. 3-334. పుటలు. 213-214).

<u>చౌపది</u>

సురతరు జాలము సుమములు గురియన్
సురదుందుభులచ్చోఁగడు మొరయన్
సురవార వధూస్తోమములాడన్
సురపతి హరసుతు సుముఖతఁగూడెన్.॥

సర. హృ. రం. 1-273 పుట - 55.

ఈ "చౌపది"ని లాక్షణికులు "చతుష్పద" "చతుష్పది" "చౌపద" "చౌపది" అనునామములతో వ్యవహరించిరి.

ఈ చౌపది 1. శుద్ధచౌపదము, 2. విటాళ చౌపదము, 3. కర్నాట చౌపదము. అని త్రివిధములుగా గలదు.

సరసహృదయానురంజనము నందలి "చౌపది" "శుద్ధచౌపద" లక్షణములు గలిగియున్నది.

<u>"లక్షణము"</u> (లక్షణ శిరోమణి. పుట. 217)

* నల, గగ, భ, స, లగణమ్ములఁ జెందున్
సలలితముగ నొక చరణమునందున్
విరమము రెంటన్ వెసఁద్రాలొందున్
ధరఁజౌపదములఁ దగకృతులందున్.

ఇందు ప్రతిపాదమునందును, గగ, నల, భగణ, సగణములుండును. పాదముయొక్క చివరి గణము గగముగాని, సగణముగాని (గుర్వంత గణము) ఐయుండును. 8 మాత్రల మీద అనగా 9వ మాత్రాక్షరముతో యతి మైత్రియుండును.

<u>గమనిక</u> : లక్షణ వేత్తలలో దీనిలక్షణ విషయమున మతభేదములు గలవు. పై లక్షణమునందే మొదటి రెండు పాదములందును "ల" ప్రాసము, తరువాతి రెండు పాదములందును "ర" ప్రాసము - ఉంచబడినది.

దండకములు1 :

ఈ కవి తన కృతులలో నాఱు (6) దండకములను విరచించెను.

అహల్యా సంక్రందన విలాసమున నొకటి. (2-31.)

శ్రీ మన్మహాభారతీ !........తుభ్యం నమస్తే నమస్తే నమః. ఇది పూర్తిగా తగణములతో నడిచి, గుర్వంతముగా సాగినది.

సర్వ మధురమున మఱియొకటి. (2-126.)

ఇది యచ్చతెలుఁగు దండకము.

"జేజేలవేడా ! పరా కేల? జేజేలఁజేకొమ్ము........దువ్వల్వ వేల్పా !

ఇది మొత్తము తగణములతోడనే కొనసాగి గురుద్వయముతో ముగిసినది.

మిగిలిన నాలుగు దండకములును దేవీభాగవతమున రచింపబడినవి.

1. ప్రథమ స్కంధము 261. పుట. 35.
2. పంచమ స్కంధము 535. పుట. 469.
3. ,, ,, 601. పుట. 481.
4. నవమస్కంధము. 877. పుట. 337.

ప్రథమ స్కంధమునందలి దండకము "లలితాస్తోత్రము"గా పూర్తిగా తగణములతో నడిచి, గురు ద్వయాంతముగా ముగిసినది. హేమచంద్రుని" ఛందోఽనుశాసనము ననుసరించి-దీనిని "కామబాణము"గా పేర్కొన వచ్చును.

పంచమాంకమునందలి మొదటి దండకము (సంఖ్య 535) తగణాదిగా ప్రారంభమై, పూర్తిగా తగణములతో సాగి, ఏక గర్వంతముగా ముగిసినది.

---

1. దండక విషములను గూర్చి :—

i. స, స, హ, గణములపై నిచ్చ వచ్చినన్ని తగణములనుంచి, తుదకు గురుపును నిలిపి, యేక పాదముగా, యతిప్రాసనియమరహితముగా రచింపబడినచో అది "దండకము" అనబడును :- మఱియు

ii. ఆదినుండి తుది పఱకు వలసినన్ని తగణముల నుంచి, తుదినొక గురువును నిల్పినచో అది "దండకము" అనబడును.

దీనికి పాదనియమము లేదు. అనంతుని ఛందస్సు. 2.135.

నన్నయ రచించిన దండకముగూడ నిట్టి లక్షణములే గలిగియున్నది. పాటిబండ మాధవశర్మగారు దీనినిగూడ "కామబాణము" అనియే - తమ "ఆంధ్ర మహాభారతము - ఛంద్రశ్శిల్పము" అను సిద్ధాన్త గ్రంథమున పేర్కొనిరి.

ఇది "తాఃగో" లక్షణము గల్గి యున్నది. హేమచంద్రుడు "కామ బాణము"నకు చెప్పిన లక్షణము "తాఃగో"

ఈ రెంటి మధ్యగల భేదము "ఒక్క గురువే" గదా! అనియోయేమో మాధవశర్మ గారు దీనిని సైతము "కామ బాణము"గా పేర్కొనుట జరిగినది.

ఇంక పంచమాశ్వాసములోని రెండవ దండకము (601) యగణాదిగా ప్రారంభమై, పూర్తిగా యగణములతో కొనసాగి, జగణాంతము (యాఃజో)గా సమాప్తమైనది.

ఇది పూర్తిగా సంస్కృత దండకము

నవమాశ్వాసములో రచితమైన "లక్ష్మీ దండకము" పూర్తిగా తగణ ములతో నడిచి, ఏక గుర్వంతముగా సమాప్తమైనది. మాధవశర్మగారి యభి ప్రాయముననుసరించి దీనిని (తాఃగో" లక్షణములు గల దానిని) గూడ "కామ బాణము" అనియే పేర్కొనవచ్చును.

## వృత్తభేదములు

షష్ఠస్కంధమున (పుటలు 21, 22, 23 లతో) "వృత్త భేదములు" అను శీర్షిక క్రింద 12 పద్యములు గలవు. ప్రతి పద్యపాదమునందును చతుర్మాత్రాగణము (నల, భ, స, గణము)లలో నేడు (7) గణములనుంచి, యా పిమ్మట నొక గురువును ప్రయోగించుట జరిగినది. సామాన్యముగా ప్రతిపాదమునందును, 1-9-17, లఘువులకు యతిమైత్రి చూపబడినది. కొన్ని కొన్ని పద్యములలో ఆయాపాదములందు 1, 9, 17, 25, లఘువు లకు యతిమైత్రి కన్పించుచున్నది. ఎక్కువ పాదములలో 1, 9, 17 లఘు

వులకు మాత్రమే యతిమైత్రి చూపట్టు చున్నది. కొన్ని పద్య పాదములలో ఒక యతి స్థానమున యతిమైత్రియు, మఱియొక యతిస్థానమున ప్రాసమైత్రి (ప్రాసయతి)యును చూపుట జరిగినది. ప్రతి పద్యమునందును నాలుగు పాదములలోను ఒకే ప్రాసాక్షర నియమము పాటింపబడియున్నందున ఇది రగడ భేదముగా గూడ గన్పట్టుటలేదు.

పండ్రెండు (12) పద్యములలో, ప్రతిపాదమునందును మొదటి గణము "నలము" ప్రయుక్తమై, యనంతరము మిగిలిన యాఱు (6) గణములలో యథానుకూలముగా నల, భ, స, గణములు ప్రయుక్తములై, తుదకు గురువు ప్రయోగింపబడినది. కవి పెట్టిన పేరును బట్టి వీనిని "వృత్తములు" అనవలసి యున్నది. కాని ప్రతి పద్య పాదమునందును 26 అక్షరములకు మించియున్నవి. కావున ఛందశ్శాస్త్రానుసారము ఈ పద్యముల పేరు ఏమై యుండునో తెలియరాదు.

## వృత్త నృత్యములు

నాల్గవ స్కంధములో, (పుట 355) 414 పద్య సంఖ్యతో పాదములు చెప్పబడినవి.

ఛందఃకర్త లెవ్వరును "వృత్తనృత్యములు" అను పేరుతో పద్యములను గూర్చి వివరించినట్లు గన్పట్టుటలేదు. ఆ వృత్తభేదముల[1]ను గూర్చియు ఈ వృత్త నృత్యముల[1]ను గుఱించియు కవి, పండిత, విమర్శకులెల్లరును, ఆలోచింపవలసి యున్నది.

## పారిజాతము (సుగంధి)

ఇది (పాదమునకు 15 అక్షరములుగల) "అతిశక్వరి" యను ఛందస్సునుండి యేర్పడిన వృత్తము. ఇందు ప్రతిపాదమునందును ర, జ, ర, జ, ర,

---

1. ఈ విషయములను శతావధాని శ్రీ చెళ్ళపిళ్ళ వేంకట శాస్త్రిగారు కొంత చర్చించియు, ఇదమిత్థమని తేల్పకయే వీనిని పండిత లోకమునకు విడిచిపెట్టి యున్నారు. దేవీ భా. పుట.23 (6వ స్కంధము)

అనుగణములుండును. ప్రతిపాదమునందును 1.9 అక్షరములకు యతిమైత్రి యుండును. దీని పేరు విషయమున ఛందశాస్త్రజ్ఞులలో మతభేదములుగలవు. లక్షణ శిరోమణికర్తయగు పొత్తపి వేంకటరమణకవి దీనికి "పారిజాతము" అని నామకరణము చేయగా - కాకునూరి అప్పకవి దీనిని "సుగంధి" వృత్త మనినాడు.1

- మూలనాడి కాంతముగ్ధ ముక్తికన్యకామహో
  ద్వేల సముద్రాబ్ధిమధ్య జాలపాశిబేలనా
  లాలిత త్రికోణచంద్ర కీలితాగ్రకుండలీ
  స్థూలసూక్ష్మ కారణత్రిశూలిలీల పాలనా! వే.అ.చ. 7-332.

పావయారాధ్యుడు మాత్రము ఈ వృత్తమున, 1,4 పాదములందు యతులను, 2,3, పాదములయందు ప్రాసయతులను ప్రయోగించినాడు. వ్రాత ప్రతిలో ఈ వృత్తమునకు పేరు వ్రాయబడలేదు. నాల్గు పాదములయందును ప్రాసనియమము పాటింపబడినది.

పంచపాది పద్యములు :

పం.పా.శార్దూలము - (వేమనారాధ్య చరిత్రము - 6-64)

పం.పా. సీసము (వే.అ.చ. 6-206)

సీస మాలిక. (సరస హృదయానురంజనము 1-229. పుట. 34)

రగడ : ద్వితీయాశ్వాసము నందలి (వే. అ. చ. 2-77) రగడ గణముల కూర్పునుబట్టి హరిగతి రగడను బోలియున్నది. కాని ప్రాసాది నియమములు సరిపడుటలేదు. 8వ ఆశ్వాసమునందలి రగడ (వే. అ. చ. 8-354) కవిరాజ విరాజితమునకు సమీచీనముగా నున్నది. ఏ రగడ లక్షణములును

1. "లక్షణశిరోమణి" పీఠిక. పుట. 38. అంశము. 22.
   లక్షణశిరోమణియందలి నూతన కల్పిత వృత్తములు-అను సామాంతరముతో జేర్కొనిన యితర లక్షణ గ్రంథములు. అను శీర్షిక క్రిందనుదాహృతము. మరియు వృత్తాధికారము (లక్షణశిరోమణి) పుట. 116. పద్య సంఖ్య. 63.

దీనియందు పట్టుటలేదు. వ్రాతపతి యందు మాత్రము దీనిపేరు "రగడ" యని వ్రాయబడియున్నది.

ప్రాస ప్రయోగాలు :

- క్రుమ్మరి యొక్కఁ బోభువన కూటములందగ స్వైరవృత్తిచే
  గ్రుమ్మరుచుండెలంగు నయకోవిదు భక్తకుమారుగాంచి, నీ
  వమ్మకరంబుచే హతుడవై దివినొందుట వింటి మిద్దవే
  గమ్మహినుండఁ బోవలయుఁ గమ్మ ప్రయాణ మటంచుఁ బల్కుచున్॥
  (వే.అ.చ. 3-47)

వేగన్ + మహినుండ : వేగమ్మహినుండ

- అమ్మలునాడుషస్సనె యశ్వపతింగను వేడ్కరామశా
  స్త్రిమ్మతిమంతుఁగాంచి, మముఁ జెప్పిధరాపతిఁ గూర్చుదన్నస్వాం
  తమ్మున సంతసించి గురునాథుని గాంచి, బుధుండు వల్కమీ
  రిమ్మను జేంద్రు దుర్భ్రిమలనేటికిఁ బెందెదరయ్య మేదినిన్.
  (వేమనారాధ్య చరిత్రము 8-106)

శాస్త్రిన్ + మతిమంతున్ = శాస్త్రిమ్మతిమంతున్

వీనిని అప్పకవి "అనునాసిక ప్రాసములు" అని పేర్కొనెను. ప్రౌఢ వ్యాక ర్త ఇట్టి ప్రయోగముల కొఱకు సూ॥ ప్రాసంబున మకారంబు పరం బగుచో ద్రుతంబునకు మకారాదేశంబగు— (ప్రౌ.వ్యా.సంధి. 24.)

అను సూత్రమును రచించెను.

థ—ధలకు ప్రాస : (స్వవర్గజ ప్రాసము.)

- మిథ్యావాదుల ప్రేరణంబులను స్వామీ! ద్రోహముసల్పి పృ
  స్సాధ్య స్ఫారధనుర్విశారదులు సత్సంగ్రామపారీణులీ
  మధ్యేకానన మందఁ జేసికొని, దుర్మంత్రంబులన్ నొంచిరీ
  బాధాంశంబు తలంచి, చూతుమనుచున్ దాత్పర్యమూహించుచున్॥

* ఉద్ధూళనత్రిపుండ్రము
లిద్దర ధర్మోత్తరంబు తెలి(గి ద్విజాళుల్
శుద్ధమతిదాల్చుటయె వే
దోక్తంబగు విధియటంచునూహింపఁదగున్.

దే.భా. 11-1051[1] పుట. 404.

కొన్ని పద్యములతో ప్రాసమైత్రి భంగములు వాటిల్లినవి.

ఈ క్రింది పద్యమున "త", "న"లకు ప్రాసమైత్రి చూపబడినది.

* హతశేషుల్ గతశేషులైన నృపులుద్యత్ప్రీతితో నమ్రులై
సతురంగంబులు భూషలున్ మణులు నిస్సంఖ్యాకమౌనట్టులు
న్నతిసర్పించి, భయంబువాసి, చనిరంతన్ మందరేంద్రుండుజీ
వనదాంతర్గతశీతలాంగుచంద్రుగతి నుద్భాసించె దివ్యప్రభన్॥

వే.ఆ.చ. 7-250.

"ర" "మ" లకు ప్రాసమైత్రి - ఈ క్రింది పద్యమున గమనార్హము.

కం॥ ఆరాధ్య వర్యులందొక
యారాధ్యుడు వేమనయ్యయను పెద్ద పటు
స్థేమమున సకల విద్యా
భూమమునన్ భూసుహితుడు భూపలలామా!

ఈ క్రింది పద్యమున "య" - "మ" లకు ప్రాసమైత్రి కూర్పబడినది.

శా॥ మీ యాశీర్వచన ప్రభావమున నెమ్మిన్గాంచి, సద్వృత్తినే
మాయా పాశము(బాసి, మాదృశులు భూమాన్యత్వముంగాంచి సు
స్థేమం బొందుట గూడదే పలుమరున్ శ్రేయంబపేక్షించి, ని
ష్కాముల్ మీరని మ్రొక్కినన్ గనరు శంకాపంకమున్ బాపవే॥

(వే. ఆ. చ. 7 - 278)

---

1. ఈ కందమున ప్రయుక్తమైన "ప్రాస" రీతి ప్రాస ప్రయోగములు భారతేతర మహాకవులు వాడిరని యెఱుంగఁదగు—

శతావధాని శ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు.

దే.భా. ఏకాదశస్కంధము. పుట. 404. టిప్పణి.

ప్రాసమైత్రి భంగమగునని ద్రుతప్రకృతికముపై సరళాదేశము చేయకుండుట - ఈ క్రింది కందమునఁ గననగును.

- శ్రీపతి పండిత వంశో
  ద్దీపిత మల్లమ్మయన్ ద్వితీయను సరిఁగాఁ
  జేపట్టి సౌఖ్యలోలత
  చేపట్టింగనియె లింగ సేవానిపుణున్॥ (వే.అ.చ. 1-165)
  సౌఖ్యలోలతచేన్ సుఖానుభవముల తోడ
  పట్టిన్ = సంతానమును, కనియెన్ = పొందెను.
  యతుల గతులు (యతి భంగములు)
- ముక్తికి దీవియై చిరభివృద్ధికి నెల్లను (వే.అ.చ. 2-144)
- ఏము నారాధ్య గురుకృపాన్వితుల మయ్యు. (3-96)
- నిండి తండోపతండమై నిట్టులనియె
  తెచ్చి యర్పించుచుంట నందిని కతన
  ఏ, మానతియీక యుంటిరది యేమి గురూత్తమ! (7-273)
  అం, చారూఢస్థితి వానిగొంచు జనముల్ ప్రాగ్ద్వారదేశంబునన్.
  ప్రాసాదస్థలిఁ జెందిమానస సరస్యావాసు సోమేశ్వరున్.
  క్షుద్ర మంత్రక్రియాదుల కోహటించి. (8-115)
  ఇ, వే మని పోరాడి విసువుజనులు. (8-123)[1]

## కవి, పండితుల - అభిప్రాయములు

1. ములుగు పాపయారాధ్యుడు "విద్వత్కవి"గాని, కేవలకవుంతరగతిలోనివాడుగాడు. దేవీభాగవతముననున్న మూలములోని యనేకాంశములకు సియన యనువాదము భాష్యప్రాయముగా నుండును. తెనుగున భక్తిరచనలో సికవిని "రెండవ పోతరాజు"గా సంభావింపనగును—

—"శతావధాని" శ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి.

---

1. కవియొక్క భ్రమ ప్రమాదమువలననో లేక లేఖక దోషముల వలననో గాని - అటనట కొన్ని యతిభంగములు వాటిల్లినవి.

2. కవులలో పోతరాజులుండవచ్చును. తిక్కన సోమయాజులుండ వచ్చును. ఇద్దఱి యంశము లొక్కటనే యుండుట దుర్లభము. అట్టి విశేషము- ఈ పాపయ్యభట్టారకున కందినది.

—"శతావధాని" శ్రీ భమిడిపాటి అప్పయ్యశాస్త్రి.

3. "శ్రీమదుభయభాషాభూషణ" ములుగు పాపయారాధ్యుల పాండిత్య కవిత్వములను నేను సంపూర్ణముగా నెఱుగుదును. వీరి కవిత మనోహరము.

—"కళాప్రపూర్ణులు", "కవి సార్వభౌములు" శ్రీ శ్రీపాద కృష్ణమూర్తి.

4. శ్రీ ములుగు పాపయారాధ్యుల కవిత ధారాళము ప్రసాదగుణ విశిష్టము. నిర్దుష్టము. శైలిమృదుమధురము.

"ముల్గుపాపయా, రాధ్యుని కైతయౌర! కడుశ్రావ్యము, భావ్యము సర్వసేవ్యమున్".

—"అవధాని శిరోమణి" కాశీ కృష్ణాచార్యులు.

5. శ్రీ ముల్గు పాపయారాధ్యకవిచూడామణుల శైలి, ధార, ప్రయోగవైచిత్రి, మహాకవులును కొండాడదగియున్నవి. ఈ మహాకవిని గూర్చి యెంత వ్రాసినను స్వభావోక్తియే.

—"శతావధానులు" కొప్పరపు సోదరకవులు.

6. ఈ ముల్గుపాపయారాధ్యుడు "పాత్ర చిత్రణములో తిక్కనవలె తోచును. సీస పద్య రచనలో శ్రీనాథునివలె గన్పట్టును. "జిగి-బిగి" కవిత లల్లుటలో పెద్దన్నవలె గాన్పించును. ముద్దుముద్దుగా మధుర కవితను బ్రకటించుటలో ముక్కుతిమ్మనను మఱపించును.

—"శతావధాని" చల్లా పిచ్చయ్య శాస్త్రి.

7. శ్రీ ములుగు పాపయారాధ్య కవి సార్వభౌముని దేవీభాగవతము ప్రసాదగుణ భూయిష్ఠమగుటచే - పండితులకేగాక సామాన్యులకు గూడ విశేషోపకారకమని తలంచుచున్నాను.

—"మహామహోపాధ్యాయ" "కళాప్రపూర్ణ" తాతా సుబ్బరాయశాస్త్రి.

8. శ్రీ ములుగు పాపయారాధ్య మహాకవిశేఖరుని కవిత్వము ద్రాక్షాపాకమున నొప్పుచు చదువంబడువ నింపునింపుచుండును.

భాష సలక్షణమై హృదయంగమముగా నుండును.

—"శతావధాని" సంపన్మూడుంబ సింగరాచార్యులు, జగ్గయ్యపేట.

9. శ్రీపాపయారాధ్యుఁడు సంస్కృతాంధ్ర భాషలయందు సమాన సాహితీ కలనగలవాడు. మఱియు నుభయ వ్యాకరణ శాస్త్రవేత్త, రెండుబాసల కైతయందును గండుమీఱిన వాడు.

—"రామకర్ణామృత ప్రబంధ నిర్మాత" "వివిధ శాస్త్ర విశారదుడు" శ్రీతాదేపల్లి వేంకటప్పయ్య శాస్త్రి - చందవోలు.

ఇంకను "శతావధాని" ముదిగొండ జ్వాలాపతి లింగశాస్త్రి, "అవధాని" అబ్బరాజు హనుమంతరాయశర్మ, "పండిత కవి" ములుగు చంద్రమౌళిశాస్త్రి, మొదలగువారు ఈ మహాకవిని గూర్చియు, ఈయన కవితా వైభవములను గుఱించియు బహుధా ప్రశంసించిరి.

## భరత వాక్యము

ఆంధ్ర గీర్వాణ భాషలలో అల్లారుముద్దుగా కమ్మని కవితల్లి మహాకవిగా వాసిగాంచిన వాడు ములుగు పాపయారాధ్యుడు.

సరస రుచిరార్థ రచనలను వెలయించుటలో నన్నయ కితడంతేవాసి. రసాభ్యుచిత బంధరీతులను ప్రసరింపజేయుటలో నితడు తిక్కనకనుయాయి. రసవత్ప్రబంధ నిర్మాణములో ప్రబంధ పరమేశ్వరుని స్మరింపజేయు వాడితడు. భవ్యావేశముతో కవితను కదనుద్రొక్కించు శివకవుల యడుగుజాడలు ఈయనకు పరమాదర్శములు. శ్రీనాథుని సీసరచన ఈయనకు కొట్టిన పిండి. పోతన కమ్మని శ్లోకడలు - ఈయనకు వెన్నతో బెట్టిన విద్యలు; పెద్దనాదుల

మధుర ప్రబంధ రచనా రీతులన్నియును — ఈయనకు కరతలామలకములు. వివిధ రచనా ప్రక్రియలను నవనవోన్మేషముగా నడిపి, పతితల డెందములను కందళింపజేసిన కవివతంసుడితడు.

సంస్కృతాంధ్ర భాషలలో సరస కృతుల నిర్మించి అమరావతి సంస్థాన విద్వాంసుడుగా వాసికెక్కి, తనకమ్మని కవితలతో లోకమునకు ఆనందోప దేశములనందించిన పాపయారాధ్యుని కవితా భారతికి నిండు గుండెతో నివాళు లెత్తుచు, సహృదయ లోకమునకంజలి ఘటించుచున్నాను.

నా పరిశోధన రచనలోని దోషములన్నియును నావి. అందలి గుణ ములు రసజ్ఞులవి. ఆయా విశేషములను నీరక్షీర న్యాయమున గ్రహించి నన్నాశీర్వదింప ప్రార్థన.

* గచ్ఛతః స్ఖలనం క్వాపి, భవత్యేవ ప్రమాదతః
హసన్తి దుర్జనాస్తత్ర, సమాదధతి సజ్జనాః॥

—: నమో మహద్భ్యః :—

# ఉపయుక్త గ్రంథసూచిక

## తెలుగు గ్రంథములు :


| | |
|---|---|
| అప్పకవీయము | అప్పకవి |
| అహల్యా సంక్రందనము | సముఖము వేంకటకృష్ణప్ప నాయకుడు |
| ఆంధ్ర కవుల చరిత్ర | కందుకూరి వీరేశలింగం పంతులు |
| ఆంధ్ర మహాభారతము | కవిత్రయము |
| ఆంధ్ర మహాభాగవతము | పోతన |
| ఆంధ్ర మహాభారతము-ఛందశ్శిల్పము | డా॥ పాటిబండ మాధవశర్మ |
| ఆంధ్ర వాఙ్మయ చరిత్ర సంగ్రహము | కె. వి. నారాయణరావు |
| ఆముక్తమాల్యద | శ్రీకృష్ణదేవరాయలు — వేదంవారి వ్యాఖ్య |
| ఆస్తికత్వము-2 (రెండు భాగములు) | వారణాసి సుబ్రహ్మణ్య శాస్త్రి |
| ఉద్భటారాధ్య చరిత్రము | తెనాలి రామలింగ కవి |
| కళ్యాణ విజయము | డా॥ ముదిగొండ శివప్రసాద్ |
| కావ్యాలంకార సంగ్రహము (నరస భూపాలీయము) | భట్టుమూర్తి<br>సన్నిధానం సూర్యనారాయణశాస్త్రి వ్యాఖ్య |
| గురుశిష్య సంవాదము | నిర్మల శంకర శాస్త్రి |
| ఛందోదర్పణము | అనంతామాత్యుడు |
| జగద్గురు సాహిత్య లహరి | యువభారతి ప్రచురణ |
| తెలుగుభాషలో ఛందోరీతులు | రావూరి దొరస్వామి శర్మ |
| దశావతార చరిత్రము | ధరణిదేవుల రామయ మంత్రి |
| ద్వాదశ మణి మంజరి | డా॥ ఎల్. విజయగోపాలరావు |

| | |
|---|---|
| ద్వాదశ శైవాచార్య స్తవము | ముత్యంపేట సాంబారాధ్యులు |
| దీక్షా కౌముది | ముదిగొండ కోటయ్య శాస్త్రి |
| పండితారాధ్య చరిత్రము | పాల్కురికి సోమన |
| ప్రౌఢ వ్యాకరణము | బహుజనపల్లి సీతారామాచార్య |
| ప్రాచ్యపశ్చిమ తత్త్వశాస్త్రము | పరిపెల్లి విశ్వనాథ శాస్త్రి (అనువాదకులు) |
| పురాణ వాఙ్మయము | డా॥ జి. వి. సుబ్రహ్మణ్యం |
| బసవ పురాణము | పాల్కురికి సోమన |
| బాల వ్యాకరణము | చిన్నయసూరి (పరవస్తు) |
| భారతీయ తత్త్వశాస్త్రము (1) | నిర్వికల్పానంద స్వామి |
| భారతీయ దర్శనము | తెలుగు అకాడమీ |
| భీమ ఖండము | శ్రీనాథుడు |
| మనుచరిత్రము | అల్లసాని పెద్దన |
| మహాదేవ మననము | శ్రీమతి పండితారాధ్య స్వామి |
| రస సిద్ధాంతము - ఆంధ్రుల పరివస్య | డా॥ తిప్పాభట్ల రామకృష్ణమూర్తి |
| రాజా వాసిరెడ్డి వేంకటాద్రి నాయుడు | కొడాలి లక్ష్మీనారాయణ |
| లక్షణ శిరోమణి | పొత్తపి వేంకట రమణ కవి (దొరస్వామి శర్మ వివరణము) |
| లింగధారణ ఎందుకు ? | శ్రీ శైవ మహాపీఠము |
| లింగధారణ సిద్ధాంతము | చిదిరె మఠం వీరభద్ర శర్మ |
| వసుచరిత్రము | రామరాజ భూషణుడు |
| విజ్ఞాన సర్వస్వము-7వ సంపుటము | తెలుగు భాషా సమితి |
| వీరశైవ దీక్షాబోధ (మోక్షోపాయము) | శైవ ప్రచారిణీ సభ-వరంగల్లు |
| విజయ విలాసము | చేమకూర వేంకట కవి |
| వీరశైవ సిద్ధాంత శిరోమణి | డా॥ జె. ఎం. రుద్రప్ప |
| వేదాంత తత్త్వ పరిశోధనము | వి. ఎం. కృష్ణమాచార్యులు |
| వేదాంతార్థ సంగ్రహ ఉపహారము | ముప్పంగి పుప్పయ్య పంతులు (అనువాదకులు) |

| | |
|---|---|
| వేదాంత సర్వస్వము | ముదిగొండ వేంకటరామశాస్త్రి |
| వేదపాద స్తుతి | వేదవ్యాస మహర్షి |
| వైదిక మహేశ్వర ప్రబోధము | శివలెంక సుబ్రహ్మణ్యారాధ్య (ప్రచురణ) |
| శాంభవ దీక్షా విధానము | శ్రీ పం. శరభారాధ్యులు |
| వైదిక మత సామరస్యము | నిర్మల శంకరశాస్త్రి |
| శివజ్ఞాన శేఖరము (సంస్కృతము) | ఘంటనామాత్యుడు |
| శివపూజా విధి | శైవమహా పీఠము |
| శైవాచార సంగ్రహము | తిరుమల నాథుడు |
| శివభక్త విజయ కథావళి | ముదిగొండ నాగవీరయ్య శాస్త్రి |
| శివతత్త్వ రహస్యము | నిర్మల శంకరశాస్త్రి |
| శివరహస్య ఖండము (ఆంధ్రానువాదము) | కోడూరు వేంకటాచల కవి |
| శివయోగము | ముదిగొండ కోటయ్యశాస్త్రి |
| శివయోగ సారము 1, 2, 3 భాగములు | కొలని ఆదిగణపతి దేవుడు |
| శివతత్త్వ సారము | మల్లికార్జున పండితుడు |
| శ్రీ జగద్గురు చంద్రశేఖర భారతీ మహాస్వామి వారితో సంభాషణలు | శారదా పీఠము-శృంగేరి |
| శ్రీ మద్రామాయణ తత్త్వ కథనము | వారణాసి సుబ్రహ్మణ్య శాస్త్రి |
| శ్రీ మదాంధ్ర లింగపురాణము | ములుగు చంద్రమౌళి శాస్త్రి |
| శ్రీ మచ్ఛాంకర శారీరక మీమాంసా సూత్రభాష్యసార సంగ్రహము 1, 2 భాగములు | శ్రీ మండలీక అన్నాజీరావు |
| శ్రీ మద్రామాయణ విమర్శామృతము | పొన్నాడ సుబ్రహ్మణ్య శర్మ |
| శ్రీ లాలిత్యము | దోర్బల విశ్వనాథ శర్మ |
| శ్రీ శివపూజా మంత్రార్థము | నిర్మల శంకరశాస్త్రి |
| శృంగార నైషధము | శ్రీనాథుడు |
| శైవ సరస్వము | ముదిగొండ కోటయ్యశాస్త్రి |
| శైవాగమములు-వాని విశిష్టత | మల్లంపల్లి జ్వాలా వీరభద్రశాస్త్రి |

| | |
|---|---|
| శైవ సిద్ధాంత దర్శిని | ముదిగొండ వీరేశలింగశాస్త్రి |
| సర్వసిద్ధాంత సౌరభము 5, 7, 9, 10 సంపుటములు | శ్రీ అనుభవానంద స్వామి |
| సిద్ధాంత కిరణములు | ముదిగొండ కోటయ్య శాస్త్రి |
| సూత సంహిత | పట్టమెట్ట సోమనాథ సోమయాజి |

సంస్కృత గ్రంథములు :

| | |
|---|---|
| కారణోత్త రాగమము | ముదిగొండ నాగలింగ శాస్త్రి— సంపాదకుడు |
| కేనోపనిషత్తు | శైవ సాహిత్య పరిషత్తు |
| కాదంబరి | బాణ మహాకవి |
| గురుబాల ప్రబోధిక | వావిళ్ళ రామస్వామి శాస్త్రులు — ప్రచురణ |
| చంద్రజ్ఞానోత్తరాగమము | ము. నాగలింగశాస్త్రి-సంపాదకుడు |
| దేవీ భాగవతము | వేదవ్యాస మహర్షి |
| ప్రతాపరుద్ర యశోభూషణము | విద్యానాథుడు |
| బ్రహ్మసూత్ర భాష్యము | నీలకంఠాచార్యులు |
| భగవద్గీత | శ్రీ రామకృష్ణ మఠము |
| భర్తృహరి సుభాషితములు | భర్తృహరి |
| మకుటోత్త రాగమము | ముదిగొండ నాగలింగ శాస్త్రి |
| ముండకోపనిషత్తు | శ్రీ రామకృష్ణ మఠము |
| రఘువంశము | కాళిదాసు |
| లింగధారణ దీపికా | భవానీ శంకరారాధ్య |
| శ్రీ కాళహస్తీశ విలాసః | కాళహస్తి దీక్షితులు |
| వివేక చూడామణి | శ్రీ శంకరాచార్య |
| శివానందలహరి | శంకరాచార్య |
| శ్రీ శంకర విజయము | విద్యారణ్య స్వామి |
| సర్వ వేదాంత సిద్ధాంత సంగ్రహము | శ్రీ శంకరాచార్య స్వామి |

| | |
|---|---|
| సాహిత్య దర్పణమ్ | విశ్వనాథుడు |
| సిద్ధాంత శిఖామణి | సాధన గ్రంథమండలి — తెనాలి ప్రచురణ |

కన్నడ రచనలు :

| | |
|---|---|
| అమర గణాదీశ్వర చరిత్ర | పి. జి. హళకట్టి |
| కథాసార | ఉత్తర దేశద బసవలింగదేవరు |
| చెన్నబసవ పురాణ | విరూపాక్ష పండితుడు |
| బసవపురాణ | భీమకవి |
| బసవ వచన సుధ | విశ్వకళ్యాణ మిషన్ బెంగుళూరు |
| బసవాది గణచరిత్ర మత్తు గణవచన మంజరి | డా॥ ఎస్. ఎం. హుణశ్యాల |
| భైరవేశ్వర కావ్యద కథా మణిసూత్ర రత్నాకర | సంపాదకులుడా॥ ఆర్.సి.హిరేమఠ్ డా॥ ఎం. ఎస్. సుంకాపూర్ |
| శివతత్త్వ చింతామణి | లక్కన్న దండేశ |
| శివశరణరు చరిత్ర గళు | పి. జి. హళకట్టి |
| సిద్ధ రామేశ్వర పురాణ | |
| సోమేశ్వర పురాణ | |

పత్రికలు :

| | |
|---|---|
| జ్ఞానవాహిని | ముదిగొండ నాగలింగ శాస్త్రి-సంపాదకుడు |
| 'భారతి' సంచికలు | |
| విభూతి | చిదిరె మఠం వీరభద్ర శర్మ-సంపాదకులు |
| వీరశైవధ | పెద్దమఠం రాచవీర దేవర-సంపాదకులు |
| శివజ్యోతి | శివాద్వైత సిద్ధాంత సంఘ వారి సంచికలు 1-4 (1973-74) |
| శైవతత్త్వ ప్రకాశిక | విజయవాడ |

